# అరుణతార

సాహిత్య సాంస్కృతిక మాసపత్రిక



అప్పారావుకు జోహార్లు

## గ్రీన్ హంట్‌కు వ్యతిరేకంగా పోరాడుదాం








2010
జనవరి - మార్చి
279

సంపాదకుడు
**సి.ప్రసాద్**

మేనేజర్
**ఎస్. రవికుమార్**
5-1307,
దొరసానిపల్లె రోడ్,
ప్రొద్దుటూరు,
కడప జిల్లా - 516 360.
సెల్ : 9866021257

రచనలు పంపవలసిన చిరునామా :
**టి. కృష్ణాబాయి**
9-19-3
CBM కాంపౌండ్
విశాఖపట్నం - 530 003.

# సంపాదక లేఖ

విప్లవోద్యమం ప్రజాయుద్ధంగానే రాజకీయ, సామాజిక, ఆర్థిక రంగాల్లో ప్రారంభమైంది. విప్లవపార్టీ నేతృత్వంలో పీడిత వర్గం అన్నిరంగాల్లో ప్రత్యామ్నాయ రూపకల్పన ద్వారా ప్రజాయుద్ధం నడుస్తుందని, అంతిమ విజయం ప్రజాప్రత్యామ్నాయానిదేననీ విశ్లేషించింది. శ్రీకాకుళ సాయుధ పోరాటానికి పూర్వ రంగంలో సత్యం, కైలాసాలు చేసిన విప్లవ సన్నాహంలోనే ప్రజాప్రత్యామ్నాయ ఆకాంక్ష కనిపిస్తుంది. అది ఉత్తర తెలంగాణలో విస్తరించి, భవిష్యత్తులో దండకారణ్యం గెరిల్లాజోన్ అవుతుందనే 1980ల నాటి వాస్తవిక ఊహ ఒక రాజకీయ, ఆర్థిక పంథాగా రూపొందింది.

తెలుగునేల నుండి సువిశాల ఆదివాసీ ప్రాంతాలకు, అనేక రాష్ట్రాలకు విప్లవోద్యమం వ్యాపించిన వైనమంతా కేవలం ఉద్యమ విస్తరణగానేగాక ప్రజాప్రత్యామ్నాయ నిర్మాణమనే కార్యకలాపంగా సాగింది.

నలభై ఏళ్ళలో విప్లవోద్యమం సైద్ధాంతికంగానేగాక రాజకీయార్థిక రంగాల్లో నిక్కమైన ప్రత్యామ్నాయం కావడంతో పాలకులు యిక యుద్ధమే పరిష్కారం అనుకున్నారు. సకల నిర్బంధాల నుండి, నిషేధాల నుండి ఎదిగిన ప్రజా ప్రత్యామ్నాయం మీద, ప్రజల మహోద్భుత సామాజిక ప్రయోగం మీద యిక యుద్ధమే మార్గమనుకున్నారు.

అదే ఆపరేషన్ గ్రీన్‌హంట్. అణిచివేతల నుండి వెనుకబడిన ఆదివాసీ ప్రాంతాలు వ్యూహాత్మకంగా విప్లవ స్థావరాలు అయినట్టే గనుల ఆర్థికానికి దేశ విదేశాల బడా కంపెనీలకు అరణ్య ప్రాంతాలు ఇప్పుడు అత్యవసరమయ్యాయి.

ఆదివాసులు నిర్మిస్తున్న సామాజిక ప్రత్యామ్నాయ ప్రయోగాన్ని వమ్ము చేయకుండా అటవీ ప్రాంతాల సంపద దోచుకోవడం సాధ్యంకాదు.

అందుకే ఆపరేషన్ గ్రీన్‌హంట్

అడవుల నుండి ఆదివాసులను నిర్వాసితులను చేసి వారితో ఉన్న విప్లవోద్యమాన్ని నిర్మూలించడానికే ఈ యుద్ధం

విప్లవోద్యమ నాయకులు శాఖమూరి అప్పారావు లాంటి వాళ్ళు బూటకపు ఎన్‌కౌంటర్లు ఈ వేటలో భాగమే

గ్రీన్‌హంట్ ఆదివాసుల సమస్య కాదు
నక్సలైట్ల సమస్య మాత్రమే గాదు
మనందరి సమస్య
యుద్ధాన్ని ఆపమని నినదించడం మనందరి బాధ్యత.




ఈ సంచిక వెల : 25 రూ.
సంవత్సర చందా : 100 రూ.
జీవితచందా : 1000 రూ.

చందాలు, బకాయిలు మనియార్డర్, డి.డి.ల రూపంలో మేనేజర్‌కు పంపించండి. డి.డి.లను ఎస్. రవికుమార్, ప్రొద్దుటూరు పేర తీయండి.

## ఈ సంచికలో...



**ముఖ చిత్రం :**

శాఖమూరి అప్పారావు

గ్రీన్ హంట్ వ్యతిరేక దృశ్యాలు

నివాళి

# శాఖమూరి సిద్ధార్థుడు

**కె.జి. కన్నబిరాన్**



రాకుమారుడిగా సిద్ధార్థుడు జన్మించాడు. బాధాసర్పదష్టులను చూసే అవకాశం లేకుండా సుద్ధోధనుడు ఆయనను పెంచి పెద్ద చేశాడు. ఇవాళ్టిలాగానే, నాటి ప్రపంచం కూడా బాధామయమే. అన్యాయాలు, రోగాలు, మరణాలు ఉన్నాయి. దుఃఖమయ బాహ్య ప్రపంచంతో సంబంధం లేకుండా ఆయనను పెంచగలిగిన సామర్థ్యం వనరులూ మహారాజుకు ఉన్నాయి. కానీ తుదికంటా అది సాధ్యం కాలేదు. విలాసవంతమైన రాజ ప్రసాదం వెనుక వీధుల్లో సిద్ధార్థుడు తన రథసారథితో కలిసి ఒకనాడు సంచరించాడు. అంతటా పేదరికం. అన్నిటా అన్యాయాలు చూసి అవాక్కయ్యాడు. సుదీర్ఘ అంతరంగ మథనం తర్వాత రాచరికపు వైభవాలను, సంపదలను పరిత్యజించి రాజ్యాన్ని, ఆస్తిని, కుటుంబాన్ని వీడి కోట దాటి సత్యాన్వేషితుడయ్యాడు. జన్మ పునర్జన్మల రహస్యాన్ని ఛేదించాలని సంకల్పించి తపోధనుడయ్యాడు. బుద్ధుడయ్యాడు.

ఈ బౌద్ధ గాథను తరతరాలుగా మనం వింటూనే ఉన్నాం. కానీ ప్రపంచ పోకడ ఏ మాత్రం మారలేదు. పేదరికం, హక్కులలేమి ప్రజలను వెంటాడటం మానలేదు. ఇప్పటికీ ప్రపంచం దుఃఖితురాలే, శోకమూర్తే అనాదిగా బౌద్ధ తాత్విక ధోరణులు పలు రూపాల్లో వివిధ రకాలుగా భాసిల్లినప్పటికీ ఒక వ్యక్తిని మరొక వ్యక్తీ, ఒక జాతిని వేరొక జాతీ పీడించే సాంఘిక ధర్మం ఇంకానూ సాగుతూనే ఉంది. సాటి మనుషుల పట్ల అమానుష ధోరణులు అనంతంగా కొనసాగుతూనే ఉన్నాయి.

అతను సిద్ధార్థుడిలా రాజకుమారుడు కాదు. దుఃఖితుల గాలి సోకకుండా పెంచబడినవాడు కాదు. అతనిది దుఃఖితుల కుటుంబం. సిద్ధార్థుడు సంచరించిన రాజమహల్ వెనుక వీధి - నిరుపేద జనవాడ ఆయన చిరునామా. వడ్డించిన విస్తరిగానే కాదు చింపిన విస్తరిగా జీవితమున్న మనుషుల మధ్య ఆయన బాల్యం గడిచింది. సిద్ధార్థుడి మనసు ఎవరి దుఃఖాన్ని చూసి వికలమైందో ఆ జాతి జనులలో అతనొకడు. దుఃఖ రహస్యాన్ని కనుగొనేందుకు సిద్ధార్థుడు రాజ ప్రసాదం వీడితే దుఃఖ రహస్యం రాజమహల్‌లోనే ఉందని రాజ్యాధికారం లక్ష్యంగా రాజకోటపై ఆయుధం ఎక్కుపెట్టాడు.

అతని మరణం నన్ను దుఃఖింపజేస్తోంది. కాళహస్తిలో పట్టుబడి కాళరాత్రివేళ నల్లమల అటవీ గర్భంలో కాల్చి చంపబడ్డ వెయ్యిన్నొక్కటోవాడు. వాడి తలపు నా నేత్రాలను జలమయం చేస్తోంది. న్యాయవాదులతో నేను అతన్ని జైలు నుంచి విడిపించినప్పుడు పోలీసు ముష్కరుల బుల్లెట్లకు నిస్సహాయంగా నేలకొరుగుతాడని నేననుకోలేదు.

మార్క్సిజం బాగా ప్రాచుర్యంలో ఉన్న కాలంలో శాఖమూరి పెరిగి పెద్దవాడయ్యాడు. 'తత్వవేత్తలు ప్రపంచాన్ని పలు విధాలుగా నిర్వచించారు. కానీ అసలు విషయం దానిని మార్చడం' అని చెప్పిన కమ్యూనిస్టు మేనిఫెస్టో అతనికి పారాయణ గ్రంథం. ప్రపంచాన్ని మార్చగలిగేదే సరైన జ్ఞానం అని నమ్మాడు. మెరుగైన ప్రపంచం కోసం పోరాడాలని సంకల్పించాడు. ఇల్లు వదిలి ఖానాపూర్ వెళ్లాడు. అప్పటికి సిపిఐ ఎం-ఎల్ (పీపుల్స్‌వార్) అని పిలువబడుతున్న మావోయిస్టు పార్టీ స్థానిక బృందంలో సభ్యుడయ్యాడు. చదువు నేర్చుకొని కమ్యూనిస్టు తత్వాన్ని ప్రవచించగలిగే శక్తి సామర్థ్యాలు సంపాయించాడు. తిరుగుబాట్లు, విప్లవాలూ అతనికి కరతలామలకం. చర్యకి చర్యకి మధ్య అతని దినచర్య పేదల మధ్య వినమ్రుడై సంచరించడం. ఆశ్రయమిచ్చిన పేదల్లో నిరుపేదగా మెలగడం. వారి నుంచి విద్యార్థిలా నేర్చుకోవడం. వారికి సమానత్వ సిద్ధాంతాన్ని బోధించడం. అతను అడుగుపెట్టిన ప్రతిచోటా సమూహ జీవన సౌందర్యం గుబాళించేలా చేశాడు.

ఇప్పుడు శాఖమూరి చంపబడ్డాడు. అతను బేవార్సు కాదు. రౌడీ కాదు. కోట్ల కోట్ల నల్లధనాన్ని మింగి శిఖరం నుంచి నేలకొరిగిన రాజుకాదు. స్టాంపుల కుంభకోణపు తెల్గీ కాదు. బోఫోర్స్ కేసులో దళారీ కాదు. అతను ఖత్రోచీ కాదు. హర్షద్ మెహతా కాదు. దేశాన్ని ప్రపంచబ్యాంకు చెంత తాకట్టు పెడుతున్న కింగ్ ఈజ్ సింగ్ కాదు. విచ్చలవిడిగా మర తుపాకులు పేల్చి ఆఫ్ఘనిస్తాన్‌లోనో, ఇరాక్‌లోనో పౌరులను పొట్టన పెట్టుకున్న అమెరికా సైనికుడూ కాదు. వందల ఎన్‌కౌంటర్ కట్టుకథలల్లిన రాక్షసారవిందుడు కాడు. అతడు అప్పారావు. శాఖమూరి అప్పారావు. సిపిఐ మావోయిస్టు పార్టీ నేతల్లో ఒకడు. అతడు అనంతుడు.

మారువేషంలో తిరిగేందుకు అతను రాజు కాదు. అతడు ప్రజ. రహస్య జీవితం రొమాన్స్ కాదు. తను అవినీతి, అత్యాచారాలు, అన్యాయాలు, అకృత్యాలు - వీటన్నిటివల్ల ప్రాణం మీదికి తెచ్చుకొని సాయుధ కాపలాలో తిరిగే గౌరవనీయ దుశ్శాసన సభ్యుడు కానీ కాదు. సరిగ్గా వారికి ఎదురునిల్చి పోరాడిన యోధుడు. హింస అతనికి అప్రియం. అయితే హింసను ప్రపంచం నుంచి పారద్రోలేందుకు అతనికి అది ఒక పనిముట్టు. దాన్ని మనం అంగీకరించలేకపోవచ్చు. కానీ అతని సుసంకల్పాన్ని మనం ప్రశ్నించలేం. ప్రభుత్వ, ప్రైవేట్ గుండాలబారి నుంచి ఎందరినో అతను రక్షించాడు. కుత్తుకను వుత్తరించే కత్తి సదా తన మెడపై వేలాడుతుందని అతనికి తెలుసు. తన గుండెను చీల్చేందుకు తుపాకీ పేలడానికి సిద్ధమనీ - అతనికి ఎరుకే. మృత్యువు తనకు మిల్లీమీటర్ల దూరంలో నిరంతరం పొంచి ఉందనే స్పృహ అతనికి ఉంది. కానీ దేహానికి కోట్ల ఖరీదైన బుల్లెట్ ప్రూఫ్ కవచం లేదు. చుట్టూ గోడకట్టే నల్లపిల్లి రక్షక యంత్రాంగమూ లేదు. క్షణకాలపు ఏమరుపాటు అయినా ప్రాణాలు హరిస్తుందని తెలుసు. అయినా అతను తన మార్గంలో తుదికంటా ప్రయాణించాడు. మెరుగైన సమాజం కోసం జరిగే యుద్ధంలో సమిధ అయ్యాడు.

1992లో అరెస్టయ్యి బందీగా ఉన్న కాలంలో రెండు కేసుల్లో ముద్దాయి. బెంగళూరు కుట్రకేసు, హైదరాబాద్‌లో మారణాయుధాల స్వాధీనం కేసు. నేను అతని డిఫెన్స్ లాయర్‌ను. రెండు కేసుల్లోనూ అతను నిర్దోషి అని తీర్పులు వచ్చాయి. అప్పట్లో కోర్టుకు హాజరైనప్పుడు అతన్ని చూసేందుకు జనం ఎగబడేవారు. అజ్ఞాతవాసంలో ఎంత ప్రజోపకర జీవితం గడపకపోతే ఇలాంటి ప్రజాదరణ లభిస్తుంది అని అనిపించేది. మంచి రాజ్యాంగం ఉన్న రాజ్యంలో నలభై ఏళ్లకు పైగా ఈ సుజనుల హత్యలు జరుగుతున్నాయి. ఏలిన వారు రాజ్యాంగబద్ధంగా పాలించడం లేదు. రాజ్యాంగం వారికి ప్రమాణం కాదు. వారిది రాజ్యాంగ సంస్కృతి కాదు. అందువల్ల శాఖమూరి లాంటి సుజనుల ద్వారా సమాజాన్ని మానవీకరించే యత్నం జరుగుతూనే ఉంది. శాఖమూరిలు శాఖోపశాఖలుగా ఉద్భవిస్తూనే ఉంటారు. వారికి మరణం లేదు. జన్మ, పునర్జన్మల చింతలేదు. వారు నిత్యం. సత్యం.

*(21, మార్చి 2010 ఆంధ్రజ్యోతి సౌజన్యంతో...)*

**సంపాదకీయం బదులుగా**

# దండకారణ్య మహిళలపై, ప్రజాసంఘాలపై తలపెట్టిన ఫాసిస్టు దాడిని సమైక్యంగా తిప్పికొడదాం!

*సోదర ప్రజాసంఘాలు, ప్రగతిశీల ప్రజాస్వామ్య మహిళలు, మేధావులు, విద్యార్థినీ - విద్యార్థులు, ప్రజాస్వామికవాదులందరికీ కెఎఎంఎస్ విజ్ఞప్తి.*

ప్రియమైన మిత్రులారా!

క్రాంతికారీ ఆదివాసీ మహిళా సంఘం (కెఎఎంఎస్) మహారాష్ట్ర, ఛత్తీస్‌గఢ్‌లలోని 7 జిల్లాలలో 40 లక్షల జనాభా కల్గిన దండకారణ్యం (డికె) ప్రాంతంలో పనిచేస్తున్నది. ఈ ప్రాంతంలో 19 లక్షల 88వేల మంది మహిళలున్నారు. మాడియా, మురియా, దొర్ల, రాజగోండు, హల్బ, బతర తెగల, పలు జాతుల ప్రజలు నివశిస్తున్న ప్రాంతంలో పనిచేస్తున్నది. ఇక్కడి స్త్రీలు వ్యవసాయపు పనులు, ఇంటి పనులు, కూలి పనులు, అటవీ ఉత్పత్తుల సేకరణ మొదలైన అన్ని పనులలో తామే అయి రోజుకు 16 గంటలు శ్రమ చేస్తారు. ఆరుగాలం కష్టం చేసినా ఎలాంటి హక్కులకు నోచుకోక పోపిడికి గురవుతున్నారు. భూస్వామ్య పితృస్వామ్యం ఆమె శ్రమను దోచుకోవడమే గాకుండా అన్ని హక్కులకు దూరంగా ఉంచింది. ఆమెను రెండవ శ్రేణి పౌరురాలిగా వెనక్కి నెట్టేసింది. ఇలాంటి సామాజిక నేపథ్యంలో 1980ల లో దండకారణ్యంలో విప్లవోద్యమం అడుగిడింది.

క్రాంతికారీ ఆదివాసీ మహిళా సంఘం అంతిమంగా మహిళల విముక్తి లక్ష్యంగా గత మూడు దశాబ్దాలుగా దండకారణ్యంలో పనిచేస్తున్నది. అటవీ అధికారులు, పేపరు మిల్లు యాజమాన్యం, తునికాకు కాంట్రాక్టర్లు, మైదాన ప్రాంతాల నుండి వచ్చిన వ్యాపారస్థులు కొనసాగించే శ్రమదోపిడీ, జులుం-అత్యాచారాలకు వ్యతిరేకంగా మహిళలను కూడగట్టింది. పోరాటాలలో సంఘటితపరచింది, ముందుండి నడిచింది. మహిళలకు పీడగా మారిన తెగ పితృస్వామ్యాన్ని ఎదిరించి నిలిచిన యువతులకు చేయూతనిచ్చింది. మహిళా సంఘం నాయకత్వంలో ఆదివాసీ మహిళలకు పిడికిలి బిగించి మహిళా విముక్తికై పోరాడమని పిలుపునిచ్చింది. తన సోదర సంఘమైన దండకారణ్య ఆదివాసీ కిసాన్ మజ్దూర్ సంఘానికి అండగా నిలిచింది. మహిళలను సమైక్యపరచి గ్రామాలపై దాడులకు వచ్చే పోలీసు మూకలను అడ్డుకున్నది, తరిమికొట్టింది.

'దున్నేవారికే భూమి', 'అడవిపై ఆదివాసులకే హక్కు', 'పీడిత ప్రజలకు రాజ్యాధికారం', 'మహిళలకు విముక్తి'- లక్ష్యంగా కొనసాగే దండకారణ్య విప్లవోద్యంలో క్రియాశీల పాత్ర పోషిస్తున్నది. దోపిడీ ప్రభుత్వానికి, దాని సైన్యానికి వ్యతిరేకంగా సాగే సాయుధ పోరాటంలో, రాజకీయ ప్రచారంలో సహ ప్రజా సంఘాలతో భుజం భుజం కలిపి నడుస్తోంది. తమకు విశ్వాసం లేని పార్టీలకు, నాయకులకు ఓటు వేయకుండా ఉండే హక్కును పూర్తిగా వినియోగించుకుంటూ ప్రజా రాజ్యాధికార స్థాపన ప్రత్యామ్నాయంతో సాగే ఎన్నికల బహిష్కరణలో చురుకుగా పాల్గొంటున్నది. దీన్ని సహించలేని పాలకవర్గాలు చెప్పనలవి కాని అమానుష హింసను ఆదివాసీ మహిళలపై ప్రయోగిస్తున్నాయి.

క్రాంతికారీ ఆదివాసీ మహిళా సంఘం దోపిడీ పాలకవర్గాలకు వ్యతిరేకంగా దండకారణ్యంలోనే గాకుండా దేశంలోనూ, విదేశాల్లోనూ అణగారిన, పీడిత ప్రజలు చేసే పోరాటాలన్నింటినీ సమర్థిస్తుంది. జాతి విముక్తి పోరాటాలకు మద్దతునిస్తుంది. మణిపూర్‌లో మనోరమ హత్య సందర్భంగా వెల్లుబికిన ఉద్యమానికి సంఘీభావం తెలిపింది. సింగూరులో తపసి మాలిక్‌ను హత్యచేసిన సోషల్ ఫాసిస్టు వామపక్ష కమ్యూనిస్టులను ఎండగట్టింది. నందిగ్రాం, లాల్‌గఢ్ ప్రజాపోరాటాలలో మహిళల మిలిటెంట్ భాగస్వామ్యాన్ని ఎత్తిపట్టింది.జమ్ము- కాశ్మీరులో సైన్యం అకృత్యాలను నిరసిస్తూ ఆజాద్ కాశ్మీర్ కోసం నినదించిన కాశ్మీర్ మహిళను అభినందించింది.'ఆంధ్ర పోరాట ప్రజలకు అండగా నిలబడదాం' అంటూ పిలుపునిచ్చింది. మహిళా విముక్తి కోసం అహర్నిశలూ పాటుపడి జైలుపాలైన 'నారీ ముక్తి సంఘటన్' సంస్థాపక అధ్యక్షురాలు బుదిని ముండా (షీలా దీదీ) అరెస్టును ఖండిస్తూ ఆమె విడుదలను డిమాండ్ చేస్తూ సంతకాల సేకరణ ద్వారా ప్రజాభిప్రాయాన్ని కూడగట్టింది.

మహారాష్ట్రలో కెఎఎంఎస్ పై 1991 నుండి అప్రకటిత నిషేధం అమలవుతున్నది. 1991 నుండి 1993 వరకు టాడాను ప్రయోగిస్తూ సంస్థ కార్యకలాపాలను అడ్డుకున్నారు. 2002లో పోటా చట్టాన్ని తెచ్చారు. ఆ కాలంనుండి మహారాష్ట్రలో సంఘటిత నేరాల నిరోధక చట్టం (మకోకా) పేరుతో అప్రకటిత నిషేధాన్ని అమలు జరుపుతూ వస్తున్నది. ఛత్తీస్‌గఢ్ రాష్ట్రం విడిపోక ముందు అప్పటి మధ్యప్రదేశ్ ప్రభుత్వం 1992 మే నుండి టెర్రరిస్టు వ్యతిరేక దినం పాటిస్తూ అప్పటినుండీ అన్ని విప్లవ ప్రజాసంఘాల మీద అప్రకటిత నిషేధాన్ని కొనసాగిస్తూనే వచ్చింది. 2005 ఏప్రిల్ నెల 19న తేదీన కేంద్ర ప్రభుత్వ చట్ట వ్యతిరేక కార్యకలాపాల నిరోధక చట్టం ప్రకారం విప్లవ ప్రజాసంఘాలైన కెఎఎంఎస్, డిఎకెఎంఎస్, బాల సంఘాలను నిషేధించింది.

కేంద్ర ప్రభుత్వం కొత్తగా పదవీ స్వీకార ప్రమాణ చేసి నెల తిరక్కుండానే నూతన ఫాసిస్టు చట్టం 'చట్ట వ్యతిరేక కార్యకలాపాల నిరోధక చట్టం' (యుఎపిఎ) కింద 2009 జూన్ 20న మావోయిస్టు పార్టీని నిషేధించింది. ఆ పార్టీ చెప్పుతున్న రాజకీయాలను నమ్ముతున్న మా లాంటి విప్లవ మహిళా సంఘం కూడా ఆ నిషేధాన్నుండి తప్పించుకోలేదు. ఆ నిషేధం మా సంస్థపై కూడా అమలవుతూంది.

1990 నుండి రాజ్యం మాపై విరుచుక పడ్డది. 1990-1995ల నడుమ టాడా నిర్బంధాన్ని అనుభవించిన వేలమంది ఆదివాసులలో మహిళలున్నారు. 1991లో టాడా కేసు మోపబడిన సాధారణ గృహిణి చైతిపల్లో 2004 అక్టోబరు నుండి యావజ్జీవ కారాగార శిక్ష అనుభవిస్తున్నది. తమ గ్రామ పొలిమేరలు దాటి ఎరగని ఆదివాసీ మహిళలు టాడా కేసుల వాయిదాల కోసం రాజనందగాం నుండి నాగపూర్, చంద్రపూర్‌ల వరకు తిరిగారు. జైలు శిక్షలు అనుభవించారు. జగదల్‌పూర్, దంతెవాడ, అమరావతి, చంద్రపూర్, నాగపూర్ జైళ్లల్లో చెప్పనలవి కాని బాధలను అనుభవించారు. 1993 నాటికి కెఎఎంఎస్ కార్యకర్తలను మాయం చెయ్యటం మొదలయింది. ఇలా మాయం చేయబడిన కెఎంఎస్ కార్యకర్తలు తార, ప్రమీల, సుక్‌బత్తి, జయవంతల జాడ ఇప్పటికీ తెలియలేదు.

తమ తెగ భూస్వామ్య అధికారానికి, పితృస్వామిక అధికారానికి సవాలుగా నిలిచిన కెఎఎంఎస్‌ను చూసి సహించలేని కర్మ మాసాలు (మహేంద్ర కర్మ)లాంటి భూస్వామ్య ప్రతినిధులు రాజ్యంతో చేయి కలిపి జన జాగరణ్ పేరుతో కాలు కింద అణగదొక్కాలని చూశారు. 1990లోనూ, 1997లోనూ తెచ్చిన జనజాగరణ్‌ను మహిళలు ఎదుర్కొని నిలదొక్కుకున్నారు. 2005 జూన్ నుండి జనజాగరణ్ వేషం మార్చుకున్నది. 'సల్వాజుడుం' పేరుతో రక్తం రుచి మరిగిన పులిలా మమ్మల్ని వెంటాడి చంపుతున్నది. 2005 నుండి దంతెవాడ, బస్తర్, బీజాపూర్‌లో నిలువనీడ లేకుండా చేసింది. ఇల్లు, పొలం,




◆ వెంకటకృష్ణ

# ఆ... దినాలు

పొద్దుపుట్టి బారెడెక్కింది.

విశ్వనాథమయ్యా, శంకరూ, సుబ్బయ్యా రేమటి దిక్కు నుంచి సెల్‌టవర్ దగ్గరికొచ్చారు. మూడు రోజులుగా సెల్ టవర్ ఎక్కి ఒకటే దృశ్యం చూస్తున్నారు. ఎదురుగా వూర్లను మింగిన ఏరూ, చుట్టూ బురదనీళ్ళు. మునిగిన వూరు ఎప్పుడు తేలుతుందా అని వాళ్ళ ఎదురుచూపు.

బురదకొట్టుకుపోయిన బట్టలు, స్నానం లేదు, తిండి తిప్పలు చెప్పనలవికాదు. జీవితంలో యిట్లాంటి స్థితిని యిప్పటిదాకా ఎరుగరు. రాత్రుళ్ళు పెళ్ళాం బిడ్డలతో రేమటగుళ్ళో వుండటం,పొద్దుపొడుస్తూనే పెళ్ళాం బిడ్డల్ని గుళ్ళోనే వుండమని తాము మాత్రం యిట్లా సెల్ టవర్ ఎక్కి చూడ్డం.

"బావా ఇంత బతుకూ బతికి యింటెనక చచ్చినట్టయ్యింది యీ వరదతోని మనూరోల్ల పరిస్థితి. అన్నము, నీళ్ళప్యాకెట్లతో వ్యాన్లొస్తే దాన్లకోసం జనాలు కుక్కల్లా ఎగబడి తన్నుకుంటుంటే, చెప్పుకోలేము ఆ బాధ. బిక్షగాళ్ళయిపోయినారు గదా జనాలు. ఎంతపని జేసా వరదా... గబ్బునాకొడుకు వరదా... థూ దీనెమ్మా బతుకు.... అట్లే అందరమూ కొట్టకపోయిన్నా బాగుండు. వేరే వూరోల్ల ముందర ఎంత హీనమైపాయ బతుకు... వేరే వూర్లో వాల్ల పంచలకాడ అడక్కతినే వాళ్ళ కన్నా అధ్వాన్నంగా థూ.... థూ.... థూ..." శంకర్ విశ్వనాథమయ్యతో అంటున్నాడో, తనలోతానే అనుకుంటున్నాడో తెలియడం లేదు.

అక్కడున్న అందరి మనసుల్లోనూ యివే బాధలే యివే మాటలే మూడురోజులుగా సుడులు తిరుగుతున్నాయి.

"అవురా శంకరూ.. ఎన్ననుకొని ఏం లాభంరా... అయిపోయింది అంతా మునిగిపోయింది. నీళ్ళలో కొట్టుకుపోతామేమోనని, వురికి వురికి, ఎనకల నీళ్ళూ ముందర మనమూ అయి గట్టుకొస్తిమి, అబ్బుడేమో ప్రాణం తీపి యిబ్బుడేమో యీ బాధలు..."

"అయ్యా కట్టుబట్టలతో మిగిలితిమి గదయ్యా, యింగేముందయ్యా అన్నీ పాయా, ఏమాధారంతో బతకాలయ్యా, కండ్ల ముందరే మా కొట్టం కొట్టకపాయ, నాలుగు మూటలు బియ్యంపాయా, బీరవాలో లెక్క అంతా పాయ"

"అరే సుబ్బయ్యా... ఎంత చెట్టుకు అంత గాలిలేరా... పదిలక్షల పంట వున్నెంటెరా నారాయణ రెడ్డి యింట్లో... రెడ్డి గతేందిరా... ఎద్దులూ, ట్రాక్టర్లూ, పంటా.... అంతాపాయగదరా..."

"మనం బతికి చచ్చినట్టేనయ్యా... ఎవడాదుకుంటాడు... మనల్ని... కన్నెగ నాశనమైతిమి"

"ఒర్యా సుబ్బయ్యా నీకొచ్చిన కష్టం యీ సుట్టుపక్కల ఏటెంబడున్న పల్లెల్లో అందరికీ వొచ్చిందే గదరా.... ఆ గబ్బువానలు పట్టుకునా, గవర్నమెంటు ఆఫీసర్లని గేట్లు ఎత్తమని కాళ్ళు పట్టుకున్నా ఎత్తకపోయిరి. వాళ్ళ పుణ్యాన మన బతుకులు బజారుపాలాయా, వూరు ఎప్పుడు తేలుతుందో... మనూర్లోకి మనం పోతామో లేదో, యిట్లనే బిక్షగాళ్ళ మాదిరి గాలికి తిరుగుతామో...."

"అవు బావా మళ్ళీ నీళ్ళొస్తాయంట బావా... అందరూ అనుకుంటుండారు..."

"ఎండలు కాస్తాండాయి.... మోడాలు లేవు, వానలాగితే యింగ నీళ్ళెక్కడ్నుంచి వొస్తాయిరా... మొదులు యిబ్బుడున్న నీళ్ళు పోవల్లగదా.... ఎప్పుడు తేలుతుందిరా వూరు... మా అయ్య ఏమైనాడో ఏమోరా... దొరుకుతాధారా శవము..."

"కష్టమే సూడయ్యా... వూరు మీద పదడుగులు ఎత్తులో నీళ్ళు వొచ్చినాయి. మసీదు గుమ్మటమే కనబడ్లా. మూడు పూటలాయ... యింగేమి

---

గుడిసె, కాలిబాట, ఇప్పచెట్టు, ఈతపొద ఎక్కడా మాకు రక్షణ లేకుండా చేసింది. జుడుంమూకలు తోడేళ్ల గుంపులా మీద పడి మహిళలను నెత్తురోడే మాంసపు ముద్దలుగా చేశారు. నాగా, మిజో, సిఆర్‌పిఎఫ్ బలగాలు పశుత్వపు కోరలతో మా శరీరాల్ని ముక్కలుగా చేశాయి. లైంగిక అత్యాచారాలకు బలికాని మహిళలేని గడప ఒక్కటి కూడ మిగల లేదంటే ఆ లైంగిక హింస స్థాయిని తేలిగ్గానే ఊహించవచ్చు. మాశరీరాలను ముక్కలుగా నరికారు. స్థనాలను కోశారు, జననాంగాల్ని బాకులతో చీల్చారు. గర్భాలను బాయొనెట్లతో చీల్చారు. ఈ హింస చాలదంటూ రాజ్యం మాపై భారీ దాడులకు సన్నాహాలు చేసుకుంటున్నది.

దోపిడీ పాలకవర్గాలు మాపై తలపెట్టిన ఫాసిస్టు సల్వాజుడుం దాడిని ఓడించడంలో ఎంతోమంది మేధావులు, ప్రజాస్వామికవాదులు మాకు అండగా నిలిచారు. 'మహిళలపై హింస వ్యతిరేక కమిటీ' మరికొందరు మహిళలతో కలిసి ఏర్పడిన 'అఖిల భారత మహిళా బృందం' దంతెవాడకు వచ్చి మాపై జరుగుతున్న ఫాసిస్టు హింసను ఖండిస్తూ పత్రికా ప్రకటనలు ఇచ్చారు. జాతీయ మహిళా కమీషన్ సభ్యురాళ్ళు రాహిత శిబిరాలకో మహిళలపై జరుగుతున్న లైంగిక అత్యాచారాలనూ, హింసనూ ఖండించారు. ఆ కష్టకాలంలో మాకు అండగా నిలిచిన ఏ చిన్న నీడ అయినా మాకు కొండంత గుండె బలాన్నిచ్చింది.

అణచివేత, ప్రతిఘటనకు దారితీస్తుంది అని అంటారు. మా అస్తిత్వాన్ని సవాలు చేస్తున్న సల్వాజుడుంను ఓడించకపోతే మాకు మనుగడే లేదు. అట్లానే గత 25 సంవత్సరాలుగా పోరాడి సాధించుకున్న హక్కులన్నీ బూడిద పాలు కాకుండా కాపాడుకోవాలంటే యుద్ధం చేయటం తప్పనిసరి అయింది. యుద్ధం మధ్యనే యుద్ధం చేయటం నేర్చుకున్నాం.

2008 నవంబరులో జరిగిన ఛత్తీస్‌గడ్ విధానసభ ఎన్నికల నుండి ఏప్రిల్ - మే నెలల్లో జరిగిన పార్లమెంటరీ ఎన్నికల వరకు దండకారణ్యంలో సుమారు 500 కంపెనీలకు పైగా అర్ధ సైనిక బలగాను మోహరించింది. ప్రస్తుతం మహారాష్ట్రలో విధానసభ ఎన్నికలు జరగబోతున్నాయి. కేంద్రం నుండి 8 బెటాలియన్ల సైన్యం కావాలని ముఖ్యమంత్రి అశోక్ చవాన్, గృహమంత్రి జయంత్ పాటిల్‌లు కేంద్రాన్ని అడుగుతున్నారు. ఇవి కాక ఆదివాసీ బెటాలియన్లు, కోయ బెటాలియన్లు నిర్మిస్తామని ప్రకటనలు చేస్తున్నారు. మహారాష్ట్రలో సి -60 లాంటి బలగాలు, ఛత్తీస్‌గడ్‌లో ఎస్‌టిఎఫ్ బలగాలు ఉండనే ఉన్నాయి. పొరుగు రాష్ట్రం నుండి గ్రేహౌండ్స్ బలగాలు వేట జాగిలాల్లా నిరంతరం ఊళ్లపై పడి చంపుకు తింటున్నాయి. విప్లవోద్యమ నిర్మూలన కోసం ప్రత్యేకంగా తయారుచేసిన కోబ్రా బెటాలియన్లు రంగంలోకి దిగుతున్నాయి. దంతెవాడ, ఆంధ్ర సరిహద్దు ప్రాంతంలో 2 గ్రేహౌండ్స్ బెటాలియన్ల బలగాలు మోహరించబడ్డాయి. సోనియా - మన్‌మోహన్-చిదంబరం త్రయం ఈ దాడికి ముఖ్యమైన సూత్రధారి.

దీపావళి తర్వాత దాడి ప్రారంభిస్తామని దేశ, రాష్ట్ర పాలకులు ప్రకటనలు చేస్తున్నారు. విప్లవోద్యమ నిర్మూలన లక్ష్యంగా పోలీసు - పారా మిలిటరీ బలగాలు మాపై ఎన్నో అఘాయిత్యాలకు పాల్పడుతున్నాయి. కోయజాతి అస్థిత్వాన్ని రూపుమాపే దుష్ట సంకల్పంతో సామూహిక నరమేధానికి తలపడుతున్నాయి.

దోపిడి ప్రభుత్వాలు మాపై తలపెట్టిన అన్యాయమైన అమానుషమైన, అప్రజాస్వామికమైన, క్రూరమైన ఈ దాడిని ఖండిస్తూ మాకు అన్ని విధాలుగా అండగా నిలవమని మహిళలందరికీ, ప్రజా సంఘాలన్నింటికీ, ప్రజలందరికీ విజ్ఞప్తి చేస్తున్నాం.

ఉద్యమాభినందనలతో,
క్రాంతికారి ఆదివాసీ మహిళా సంఘం
దండకారణ్యం

మిగులుతుందయ్యా.."

"ఏమిరా సుబ్బా అంతేనంటావా... మా అయ్యను యింగజూడనా... అయ్యా.... అయ్యా..." గట్టిగా ఏడుస్తున్నాడు విశ్వనాథమయ్య.

"ఎంత అన్యాయమైన కాలమొచ్చా... బావా..."

"చూడ్రా శంకరూ... రేపటికి ఐదో దినం... మా అయ్యకు దినాలు జేయనీకె గూడా నా ౕదృష్టం లేదు. అయ్య ఎంత దురదృష్టవంతుడో, శవసంస్కారానిగ్గూడా నోచుకోకపాయ... ఏం బతుకురా నాది. తండ్రికి శవ సంస్కారం చేయలేని బతుకు.

"వూరు తేలితే... దొరకొచ్చులే బావా... ఎతుకుదాం..."

చాలాసేపు నిశ్శబ్దం ఆవరించింది. విశ్వనాథమయ్య ఏడుపు నిశ్శబ్దంగా సాగుతోంది.

ఆ బురదనీళ్ళకింద తండ్రి శవమెక్కడుందోనని అనంతమైన నీటి మీద చూపు నిలిపిన కళ్ళు సుడులు తిరుగుతున్నవి. కంటినీరు కారి కారి చారికలు కట్టింది మొహం... కళ్ళముందు గతనాలుగురోజులుగా దొర్లిపోయిన సంఘటనలూ మళ్ళీ మళ్ళీ దొర్లి దొర్లి నలిపేస్తున్నాయి. వైకుంఠపాళి ఆటలో పామునోట చిక్కి మళ్ళీ మొదటికొచ్చిన స్థితి. నాలుగురోజుల ముందు అంతో యింతో స్థితిమంతుడు యిప్పుడు కట్టుబట్టలతో మిగిలిన దీనుడు. అతనొక్కడి పరిస్థితే కాదు అది ఆ మొత్తం వూరి వాళ్ళందరిదీ.

"అయ్యా నీళ్ళు తగ్గుతున్నాయి... అదిగో మసీదు గుమ్మటం అగుపడ్తావుంది..." గట్టిగా అరిచాడు సుబ్బయ్య.

"అవురా... సుబ్బా... నీళ్ళుపోతున్నాయి... బావా చూడు చూడు నీళ్ళు తగ్గుతాండాయి..."

"అవురా శంకరూ... నీళ్ళు తగ్గినట్లే... యీ పక్క కరెంటు స్తంబాలుగూడా తేలినాయి... ఓయబ్బా... మూడు దినాలకు తగ్గుతాండాయ..."

మూడు దినాల కిందట వొక్కసారిగా ముంచుకొచ్చిన నీళ్ళు యిప్పుడు యించుయించుగా తగ్గడం కళ్ళకు కనిపిస్తూ వుంది. మూడు దినాలకు ముందురోజు పొంగి పొంగి పారిన వంకలూ వాగులూ తల్లకిందులైన బతుకులూ అన్నీ వొక్కసారిగా కళ్ళముందు మెదిలాయి.

* * *

మధ్యాహ్నంపూట. మోడాలు కమ్ముకొని చీకటి చీకటిగుంది.

తుంపర రాలుతూనే వుంది. చిత్తడి చిత్తడిగున్ననేలను యింగా చిత్తడి చేస్తావుంది.

గూడూరు నుంచి ఆటో వచ్చి వాగు ముందు ఆగింది. నక్కల వాగు నిండుగా పారుతాంది. వాగు ముందు అప్పటికే నాలుగైదు వాహనాలు నిలబడి వున్నాయి. వాగు దాటితే వూరు. ఆటోలో నుంచి దిగిన విశ్వనాథమయ్య, వాగువంక తేరిపార జూసి, నెత్తిమీదికి తువాలు వేసుకొంటూ జేబులోంచి రింగవుతున్న సెల్‌ఫోన్ తీసి మాట్లాడిన తర్వాత.

"ఏందబ్బా యిది. వాగు బ్రిడ్జి ఎక్కి పారతాందే", అనుకొని పక్కనే వున్న వూరివాళ్ళతో

"ఏరా రాముడు... ఎంచేపాయరా బ్రిడ్జి ఎక్కి పారబట్టి" అనడిగాడు.

"అర్ధగంటాయ చూడయ్యా... కొంచెం ముందొచ్చింటే ఆటో వూర్లోకే పోయుండు"

"ఏం పోయేదో లేరా... నాలుగు పూట్లాయ తెరిపీకుండా వాస్తానే వుంది..." వంక దిక్కు చూసి గొణుక్కుంటూ ప్యాంటును తొడలదాకా మడుచుకున్నాడు.

ఆటోల్లోంచి దిగిన వాళ్ళు, కొందరు ధైర్యం చేసి దాటుతున్నారు. ఇంకొందరు దాటడానికి చూస్తున్నారు.

యిప్పట్లో వాగు తగ్గేట్టు కన్పించట్లేదని, చుట్టుపక్కల పొలాల మీదనుంచీ వొచ్చే నీళ్ళతో యింకా రాను రాను పెరుగుతుందనీ అనుమానపడుతూ, వాళ్ళలో వాళ్ళు మాట్లాడుకుంటూ, నీళ్ళు దాటడానికి ధైర్యం చేస్తున్నారు.

వూరి ముందర దిక్కు, వయసుపిల్లలు నిలబడి తడుస్తూనే బ్రిడ్జి ఎక్కి పారుతున్న వాగు అంచుల్లో ఆడుకుంటున్నారు. నేస్తగాళ్ళ మీదికి బురదనీళ్ళు చల్లుకుంటూ, అల్లరి చిల్లరగా దుంకులాడుతున్నారు.

"ఏంవానలు ఏంవానలు... నాలుగు పొద్దులాయ వొగటే మొయిన పడబట్టి... యిచ్చిత్రంగా పడతాండాయి. మొన్న మొన్నటిదంకా వానలే పడ్లా. పంటలు యేసుకోల్యాక యెన్నగచాట్లు పడ్తిమి. యిబ్బుడు సూడు, టయంగాని టయంలో కురిసి కురిసి సంపుతాండాయి."

వాగు అంచుల్లో నిలబడ్డ జనాలు, ఎర్రనీళ్ళనూ, అందులో కొట్టుకుపోతున్న చెట్లూ చేమల్నీ వింతగా చూస్తూ మాట్లాడుకుంటున్నారు.

"ఓ యబ్బా సేన్ల మీద సూడల్లా, నీళ్ళు సేన్లు సెరువుల్లెక్క అయి వున్న అంతో యింతో పంట గూడా మునిగిపోయింది."

"కర్ణాటకలో గూడా యిట్టనే వానలు పట్టుకొని కురుస్తాన్నాయంట మామా... బళ్ళారినుంచీ నా బామ్మర్ది సుంకన్నగాడు సెల్లుఫోన్లో చెప్పినాడు. టీబీ డ్యాం గేట్లు ఎత్తుతున్నారంట... యింగ చూడూ మన సుంకేసుల డ్యాం ఎక్కిపారుతుంది."

విశ్వనాథమయ్య జోబిలోని సెల్‌ఫోన్‌ను జిప్‌బ్యాగ్‌లో భద్రం చేసుకొని, బ్యాగును మెడనుంచి వీపు మీదికి వేసుకొని, ఆటోలోంచి దించుకున్న అంగడి సరుకుల గోనెసంచిని బురద మీద పెట్టడం యిష్టం లేక భుజం మీదకి ఎత్తుకొని నీళ్ళలోకి ఎట్ల దిగాలా అని దిక్కులు చూస్తున్నాడు.

ఆటోలోంచి దిగిన మగవాళ్ళు నెత్తి మీదికి తువ్వాళ్ళు వేసుకొని బీడీలూ, సిగరెట్లూ ముట్టిచ్చి నాలుగు దమ్ములు గుప్పుగుప్పుమని ఎగబీకి, పంచెలు ఎగచెక్కి నీళ్ళలోకి దిగుతున్నారు.

వాళ్ళతోపాటు తెల్ల బుర్ఖా కప్పుకున్న బువ్వమ్మ గువ్వలాగా మెడ తిప్పుతూ భయం భయంగా

"అన్నో... నన్నూ దాటీయండన్నా..." అడుక్కుంటూ చేయిసంచిని ఎత్తి పట్టుకొని దాని ముడులు బిగించి నెత్తిమీద పెట్టుకుంది. ఆమెకు వెనుకగా ముగ్గురాడోల్లు చీరలు గోసిపోసుకొని నీళ్ళలోకి దిగుతున్నారు. వాళ్ళను చూస్తానే బువ్వమ్మకు కొంచెం ధైర్యమొచ్చినట్లుంది. తానూ చీరను బుర్ఖాతోపాటు ఎగచెక్కుకొని వాళ్ళవెంటనే నీళ్ళలోకి దిగింది.

"యారా సుబ్బిగా సూడనట్టు మొగం దిప్పుకొని అట్లపోతాండావు... నిలబడవోయ్..." విశ్వనాథమయ్య, దుబ్బన్న గారి సుబ్బన్నను పలకరించినాడు.

"ఏమయ్యా... అట్లంటివి, ఏంగావల్లా చెప్పు.." సుబ్బన్న.

"దాటుతామారా... చానా జోరుగా పారతావుంది...."

"అయ్యా దాటితే యిప్పుడే దాటాలయ్యా... పొద్దుతిరిగేయాల్కి నీళ్ళు పెరిగేట్టున్నాయి..."

"అవునారా... నన్ను దాటియ్యావా మల్లా" సాయం అడిగి సరుకుల సంచి అందించాడు.

"అంగడి సరుకులాయ్యా సరేలేయ్యా.. యింటికి పోయినాక రెండు టీ పొట్లాలూ, అర్ధసేరు బెల్లమూ యియ్యాల్ల చూడయ్యా..."

"సర్లేప్పె, దొరా... పదా... నీ సుంకం నీకు కట్టాల గదా..."

బ్రిడ్జి మీద నీళ్ళు మోకాళ్లు ఎక్కి తొడలకు తగుల్తాన్నాయి. బ్రిడ్జిమీద గుంతలు పడ్డచోట అడుగులు పడి నడిచే వాళ్ళు పట్టుదప్పి పోతున్నారు. జారిపడితే ప్రవాహంలో కలసిపోతామనే భయాన్ని వెంటబెట్టుకునే నడుస్తున్నారు.

"ఓయమ్మో... ఓయన్నో పట్టుకోండన్నా నా సంచి జారిపాయ కదన్నా" బువ్వమ్మ అరుస్తాంటే అందరూ నిలబడి ఆమె దిక్కు చూసినారు. బువ్వమ్మ నీళ్ళలో జారిపోయిన చేయిసంచిని పట్టుకోవడానికి నీళ్లలో వొంగి పట్టుదప్పి జారిపోయింది. పక్కనున్నామె చేయి అందించేలోపు తూలిపోయి అరుస్తోంది.

వాళ్ళ వెనకాలే విశ్వనాథమయ్య వస్తున్నాడు.

"అరెర్రే.. రేయ్... ఆయమ్మ నీళ్ళలో పడిపాయ సూడ్రా సుబ్బిగా..."

విశ్వనాథమయ్య అరిచేంతలో బువ్వమ్మ ఎర్రనీళ్ళలో దొర్లుతా వుంది. చేయి సంచి ప్రవాహంలో కలిసిపోయింది. ఎదురుగా బ్రిడ్జి ఆ కొసన వున్న వాళ్ళు అది చూస్తూ "య్యో... య్యో.... బువ్వమ్మ పడిపాయ... పడిపాయా..." కేకలు అరుపులూ.

విశ్వనాథమయ్య మొండి ధైర్యం చేసి నాలుగు అడుగులు నీళ్ళలో గబగబా వేసి దొర్లిపోతున్న బువ్వమ్మ రెక్క పట్టుకున్నాడు. కానీ, కాళ్ళుపట్టుతప్పి తనూ నీళ్ళలో పడ్డాడు. ఇద్దరూ దొర్లి బ్రిడ్జి అంచుల్లో వున్న కడ్డీ పట్టుకున్నారు. ఎర్రనీళ్లు తోస్తున్నాయి. బువ్వమ్మ గువ్వలాగా భయంతో విశ్వనాథమయ్యను చుట్టుకుంటా వుంది.

"అమ్మో నువ్వు నిలవడూ, నన్ను తొయ్యొద్దు... యిద్దరం బోతాం" అరుస్తూ

"ఇట్లరాండయ్యా యాయమ్మను పట్టుకుందురు. యిద్దరం బోతామయ్యో..." అరుస్తున్నాడు విశ్వనాథమయ్య.

వాగు దాటుతున్న మగవాళ్ళు వీళ్ళవైపు రావడానికి, ప్రవాహం తోసేస్తా వుంది. ఇంతలోపల నెత్తిమీద సంచి దగ్గరున్న ఆడవాళ్ళకు అందించి సుబ్బడు వీళ్ళను చేరి, బువ్వమ్మను పట్టుకున్నాడు. నీళ్ళలో ఆడుకుంటున్న వయసుపిల్లలు యిదంతా చూసి వీళ్ళకు సహాయంగా వచ్చి ఇద్దర్నీ గట్టు చేర్చినారు.

"ఆ కడ్డీ అందకుంటే నాకత అంతేరా సుబ్బా, బువ్వమ్మ నన్ను గుంజుకపోతాండా..." బ్యాగ్ జారిపోనందుకు సంబరపడుతూ అన్నాడు విశ్వనాథమయ్య.

"అవ్వయ్యా... యిద్దరూ ఏట్లో మునిగి డ్యాంగేట్లు ముందు తేలుతావుందురు."

"అమ్మా బువ్వమ్మా... యా వూరమ్మా తల్లీ... ఎవురింటికి వొచ్చినావు..." విశ్వనాథమయ్య రెండు చేతులా మొక్కుతూ అడిగినాడు బువ్వమ్మను.

బువ్వమ్మ తడిసిపోయిన బుర్ఖా వొడిసిపట్టుకొని గజగజా వొణుకుతూ, బొంగురుపోయిన గొంతుతో.

"మె..మె...మెహ్..మెహబూబ్ బాషా వాళ్ళింటికన్నా... అల్లాసాబ్ మాయన్న"

"ఓ మొన్న సచ్చిపోయిన అల్లాసాబ్ చెల్లెలివా..."

"అవ్.. అన్నా... మాయన్న దినాలకొస్తి... కర్నూల్నుంచీ మాయన్న సావుదినాల కొస్తి..."

"మీయన్న దినాలకొస్తివి... నా దినాలు చేస్తాంటివి గద తల్లీ..." మళ్ళీ రెండు చేతులా మొక్కినాడు విశ్వనాథమయ్య.

"అన్నా నువ్వు రాకుంటే నేనూ కొట్టుకు పోతాంటిని... శానా మేలు చేస్తివన్నా..." బువ్వమ్మ రెండు చేతులా మొక్కింది, విశ్వనాథమయ్యకూ, సుబ్బడికీ.

"అరే రేయ్... మాబూసాబ్‌గానికి చెప్పిరాపోంద్రా... బువ్వమ్మను తోలుకుపోనీకె రమ్మనీ..." విశ్వనాథమయ్య గుంపులో వున్న వొకరిని పంపించాడు.

"లేదులేన్నా నేనే పోతాన్లే గానీ..." తడిసిన బట్టల్ని పిండుకుంటూ అల్లుని యింటిదారి పట్టింది బువ్వమ్మ వుత్తసేతులతో.

అంగడి సరుకుల సంచి మోయించుకొని యింటికి పోయేటప్పటికి తుంపర రాలడం తెరిపి యిచ్చింది. కురిసేందుకు పైన నల్లమేఘాలు మాత్రం సిద్ధంగానే వున్నాయి.

బట్టలు మార్చుకుంటుంటే లోపల మంచమ్మీద బుస విన్పిస్తా వుంది. భరించలేని వేదనతో ఒక గొంతు మూల్గుతా వుంది.

"మామ పరిస్థితి చూస్తివా చానా అధ్వాన్నంగా వుందే... యీ వానలకు వుబ్బసం ఎక్కువైపాయ... కర్నూలుకి తీసకపోయిన్నా బాగుండు..." అంటూ భార్య పలకరించింది.

విశ్వనాథమయ్య ఏమీ మాట్లాడలేదు.

నాయన మంచంలో పడి రెండేండ్లాయా... వయసయిపోయిన మనిషి, నానా రకాల పొలమాలికలు ఆయన్ను చుట్టుకుండాయి. ఆసుపత్రులకు సుమారుగా ఖర్చుగూడా అయ్యింది. పరిస్థితి యింతేననీ, బాగుపడదనీ డాక్టర్లు తేల్చేసినారు. అయినా ఆయన్ను తలుచుకుంటే విశ్వనాథమయ్యకు ప్రాణం పీకుతుంది. తండ్రిని యింకొన్ని సంవత్సరాలు కాపాడుకోవాలని ఆశ వుంది.

విశ్వనాథమయ్యకు వూర్లో చిల్లర అంగడుంది. ఇంటర్మీడియేట్ చదువూ, వున్న కలుపుగోలుతనమూ కలగలపి పొదుపు సంఘాల ఆడోళ్ళకు పుస్తకాలు రాసిస్తుంటాడు. వెలుగువాళ్ళ కార్యక్రమాల్లో కలసి మెలసి తిరుగుతుంటాడు. వూర్లో వున్న గ్రామీణ బ్యాంకు వాళ్ళకు యీయన తలలో నాలుక, ఎంతమంది మేనేజర్లు మారినా, మారిపోయే మేనేజర్ వచ్చే కొత్త మేనేజర్‌కు విశ్వనాథమయ్యను పరిచయం చేసి పోవాల్సిందే. పొదుపు సంఘాల ఆడోళ్ళకు లోన్లు యిచ్చేప్పుడూ, వసూళ్ళప్పుడూ యీయన వుండాల్సిందేనంటారు బ్యాంకు వాళ్ళు. ఏ పొదుపు గ్రూపు వాళ్ళయినా బ్యాంకుకు వచ్చి లోను యివ్వమంటే, మేనేజర్ తడుముకోకుండా "మీ గ్రూపు సంగతి నాకేం తెలుసు, మీ శెట్టి సార్‌ను పిలచకరాపోండమ్మా మాట్లాడి చూస్తాం గానీ..." అంటాడు.

సెల్‌ఫోన్ ఛార్జింగ్‌కు పెట్టి, కాళ్ళు కడుక్కొని తుడుచుకుంటా భోజనానికి కూర్చున్నాడు.

"నాయికంటి నర్సమ్మ నాలుగైదు సార్లు తిరిగిపాయ, అయ్య ఎక్కడమ్మా, అయ్య ఎప్పుడొస్తాడమ్మా అని. కట్టమీదికి కలెక్టర్ వొస్తాన్నాడంటనే యియ్యాల, పొదుపు గ్రూపులోల్లంతా పోయి యేందో అడుగుదామనుకుంటా వుండారంట, నీ కోసమే చూస్తాన్నెట్లుంది"

భోజనం వడ్డిస్తా సమాచారమందించింది శకుంతలమ్మ.

"ఏందడుగుతారంటా, ఆ బ్యాంకు సారు లోన్లు యియ్యట్లేదు సార్ అని చెప్పుకోనీకెగాకుంటే... ఎప్పుడు జూడు లోన్లు, లోన్లు అంటారు గానీ కంతులు కట్టేది మాత్రం లేదు, యా రాజకీయ నాయకుడో కూసే కూతలు నమ్మేది, ఎగిరిపోతాయంటా గదయ్యా, అని మొండికి తిరుక్కునేది. యీ లెక్కన వానలొచ్చి డ్యాం నిండి కేసీ కెనాలుకు గండ్లు పడతాయేమోనని వూర్లో రైతులంతా భయపడి చస్తావుంటే వీళ్ళకు లోన్లు కావాల్లంటనా..."

"డ్యాం నిండేన్ని నీళ్ళు వొస్తాయంటావా.."

"ఒర్నీ తిక్కదానా, యేందనుకుండావే టీ.బీ డ్యాం గేట్లు ఎత్తినారంట. ఎన్ని నీళ్ళు వొస్తాయనుకుండావ్, సుంకేసుల డ్యాంగేట్లు ఎత్తేస్తే యిప్పట్నుంచీ నీళ్ళు పోతాంటాయి. ల్యాకుంటే ఎన్ని నీళ్ళని నిలుస్తాయ్. కలెక్టరొస్తే అడుక్కొని డ్యాంగేట్లు ఎత్తిపియ్యాలని వూర్ల అనుకుంటున్నారు.

"ఓ యబ్బా యిచ్చిత్రం గాకపోతే అన్ని నీళ్ళు ఎప్పుడు రావాల్లలే... కలెక్టర్ వొస్తే పొదుపు ఆడోళ్ళ సంగతి అడగండి. ఈ మేనేజర్ వుత్త పనికి మాలినోడంటనే. లోన్లు యీడంట, యీసారి మన గ్రూపుక్కూడా లోను రావల్లా... మా గ్రూపు లీడర్ బైరెడ్డి సునందమ్మ నీకు చెప్పమనింది..."

"నువ్వు గూడా తయారైతివా... రెడ్డెమ్మ గార్లతోని"

"ఆ మేం.. మేం... తీసుకోగూడదా... మేము... ఆడోల్లం గాదా... మావి గ్రూపులు కాదా..."

"రెడ్డెమ్మగార్లకోసం గాదే పొదుపు సంఘాలుండేది. బీదా బిక్కి జనాలకోసం. రెడ్డెమ్మ గార్లు తమపని కోసం నిన్ను కూడా గ్రూపుల్లోకి ఏసుకొండారు, అట్లన్నా నేను లోనిమ్మని మేనేజర్ను అడుగుతానని ఎత్తు ఏసినారు..."

"అవులే లోన్లు తీసుకొని ఎగ్గొట్టే వాళ్ళకేలే మీరిప్పిచ్చేది... మాక్యాడ యిప్పిస్తార్లే...

"అది గాదే తిక్కదానా... రెడ్డెమ్మ గార్లతోని నీకేమిటికే... మనకొచ్చేది మనకు వస్తానే వుంది గదా..." భార్యకు విషయం అర్థం చేయిస్తుండగా, వీధిలోనుంచి "బావా... బావా..." అంటూ శంకర్ లోపలికొచ్చాడు.

మూతి తుడుచుకుంటూ బయటికొస్తున్న విశ్వనాథమయ్యను చూసి

"బావా... కట్టమీదికి కలెక్టర్ వొచ్చినాడంట వూర్లో రెడ్డోల్లతో పాటు పెద్ద మనుషులంతా పోయినారు... అట్లపోయొద్దామా..."

సమాచారమందించాడు. అంతలో లోపల్నుంచి "విశ్వా... విశ్వా..." దగ్గు ఆయాసంతో పాటు విశ్వనాథమయ్య తండ్రి స్వరం...
"అయ్యా" అంటూ లోనికి పోయినాడు. ఆయనేదో చెప్పాలని విశ్వప్రయత్నం చేస్తూ చెప్పలేకపోతున్నాడు. మంచమ్మీదనుంచి లేస్తూ అలాగే వొరిగిపోయాడు. ఆత్రంగా తండ్రిని పట్టుకున్నాడు విశ్వనాథమయ్య.
"చూడ్రా మా అయ్య పరిస్థితి ఎంత అధ్వాన్నంగా వుందో, భయమేస్తా వుందిరా, కర్నూలుకి తీసకపోయింటే బాగుణ్ణు..."
"యిప్పుడాడ అయితాది బావా వూరు దాటనీకే... ఎక్కడ జూడు నీళ్ళే... వాగులూ, వంకలే... బస్సులే తిరగడం లేదు."
"అవురా ఏం జెయ్యనీకెల్యాకుండా, యీ గబ్బువానలు పట్టుకునా. అయ్యకు వొగదిక్కు ఆయాసం పెరిగిపాయ, యింకొకదిక్కు జరమూ, పరిస్థితి జూస్తేనేమో వూరుదాటనీకే లేదు... ఏంజేయాలబ్బా...." గొంతులో దుఃఖం.
"ఆరెంపీ డాక్టర్ వుండాడేమో సూసొస్తా బావా"
"చూసిరాపోరా... నేను కట్టమీదికి పోయొస్తా", అని భార్యవైపు తిరిగి
"వేడి వేడిగా కాఫీ పెట్టియ్యే అయ్యకు, అంతలోగా అట్ల తిరుక్కొని వస్తా..." వొణికిపోతున్న తండ్రికి రగ్గు కప్పి వీధిలోకొచ్చాడు విశ్వనాథమయ్య. కట్టమీదికి వచ్చేటప్పటికి, వూరివాళ్ళు చాలామంది జమైనారు.
''సారూ నీ కాళ్ళు పట్టుకుంటాం. డ్యాంగేట్లు ఎత్తిచ్చండి...'' ప్రాధేయపడుతున్నారు వూర్లో వాళ్ళు. కళప్పాచారి అనే ముసలాయన కలెక్టర్ కాళ్లపైనే పడ్డాడు.
"గేట్లు మొత్తంగా ఎత్తిచ్చండి సార్ మాకు భయంగుంది..." అడుక్కున్నాడు.
"అరే, అరే ఏమిటండీ యిదీ... నారాయణ రెడ్డి గారు మీలాంటి పెద్దవాళ్ళు వుండీ యిట్లా చేస్తే ఎట్లా, మాకు తెలుసు గదా ఎప్పుడు గేట్లు ఎత్తాలో, మీరేమీ వర్రీ అవకండి. అన్ని జాగ్రత్తలూ తీసుకుంటాం, మీకు ఎలాంటి డేంజరూ లేదు...." కాళ్ళమీద పడబోతున్న ఆచారిని అడ్డుకుంటూ, గుంపుకు నాయకత్వం వహిస్తున్న వూరిపెద్ద నారాయణ రెడ్డితో అన్నాడు కలెక్టర్.
అందుకు నారాయణరెడ్డి
"అది కాదు సార్... సూడండి ఎట్లుందో సముద్రంలాగా... నిముష నిముషానికి పెరుగుతాండాయే గానీ, నిలబడ్డంలేదు. యిన్ని నీళ్ళు ఎన్నడు రాలా, నాకు డెబ్బైఏండ్లు. నా వయసు దినాల్నుంచీ యీ కట్టమీదే తిరుగులాడుతుండా, ఎప్పుడూ సూడ్లా యిన్నోటునీళ్ళు, పక్కనే గుండ్రేవుల దగ్గర వూరి దగ్గరికొచ్చి నాయంట నీళ్లు, యింగొగ వాన పడిందంటే ఆ వూరు మునుగుతుంది. టీబీ డ్యాం గేట్లు ఎత్తినారంటే యింగిన్నీ నీళ్ళు వొస్తాయి, అబ్బుడింగ ఆ నీళ్ళన్నీ ఎక్కడికి పోవల్లా.... అందుకే గేట్లు ఎత్తేయమంటున్నాం సార్, యీ నీళ్ళన్నీ పోయినా వొచ్చే నీళ్ళు నిలబడతాయి గానీ...." అంటూ కలెక్టర్‌కు బదులిచ్చాడు.
"ఇన్ని నీళ్ళు వదిలేస్తే, ఎప్పుడొస్తాయండీ, డ్యాం నిండాలి అంటే ఎన్ని రైన్స్ రావాలి. ఏదో అదృష్టం బాగుండి, యిప్పుడొచ్చాయి రైన్స్, మొన్నటి దాకా మన జిల్లాను కరువు జిల్లాగా డిక్లేర్ చేయమని సెంట్రల్ నుండి వొచ్చిన కమిటీకి మనం రిక్వెస్ట్ చేసినాం. ఇప్పుడు యీ కొంచెం రైన్‌కే నీళ్ళు వొదిలేయమంటున్నారు. ఇది ఎట్లా సాధ్యం చెప్పండి. యిప్పుడు చూడండి రైన్ ఆగిపోయింది. యిన్‌ఫ్లో తగ్గిపోతుంది. భయపడకండి..." వచ్చీరాని తెలుగులో భరోసా యిచ్చాడు కలెక్టర్.
"వాన ఎక్కడ ఆగుతుంది సార్, పైన చూడండి ఎట్ల కమ్ముకొని వుందో, రెడీగుంది పడ్డీకే, పైన్నుంచీ నీళ్ళొస్తే మాగతేంగాను సార్..."
"పై నుంచి నీళ్ళొస్తాయి, పై నుంచి నీళ్ళొస్తాయంటాండారు, ఏందయ్యా మీరు. ఆ నీళ్ళు మాకు తెలీకుండా వొస్తాయా... అట్లొస్తే మేమే గేట్లు ఎత్తేస్తాం... మీరెందుకు భయపడతారు. యిన్నిదినాలు నీళ్ళులేక కేసీ కెనాల్‌కు నీళ్ళు వదల్లేదు. ఈ నీళ్ళు యిట్లే నిలబడితే యీసారి సుభిక్షంగా గడుస్తుంది. కలెక్టర్ గారు యిన్ని రోజులు కరువు జిల్లాగా మారిందే అని చానా బాధపడినారు. యిప్పుడు వర్షాలు వొచ్చి డ్యాంలన్నీ నిండి సార్ చాలా హ్యాపీగా వున్నారు. అయినా యీ భయం ఏందబ్బా వూర్లు మునిగే వరకూ వూరికే వుంటామా, అంతవరకూ రానిస్తామా... అయినా యింతపెద్ద పెద్ద కరకట్టలు తెగి మీ వూర్లోకి నీళ్ళు ఎట్లా వొస్తాయనుకుంటున్నారు దీని కెపాసిటీ ఎంతనుకున్నారు ఐదు లక్షల క్యూసెక్కులు, ఎప్పుడు రాలా ఇప్పుడు వచ్చినాయి..."
ఆర్డీవో మాటలకు చాలా మంది నిశ్శబ్దమయినారు. అయినా అనుమానం పీడిస్తూనే వుంది. ముసలివాళ్ళు పెదవి విరిచారు. "యింతకు ముందు కూడా యిట్లే చెప్పింటిరి. అప్పుడు ఈర్లదిన్నె, గుండ్రేవులా మునిగిపోయిండా, మీరు చెప్పునట్లు కరకట్టలు అంత భద్రంగా ఏమీలేవు. శానా చోట్ల గండ్లు పడినాయి. యింగొగ మూడడుగులు నిండితే కరకట్టల మీదికి పొర్లేట్లున్నాయి. అట్ల సూడండి ఎంత అల్లకల్లోలంగా ఎర్రనీళ్ళు సుడులు తిరుగుతాండాయో, ఎన్ని గొర్రెలు, ఎన్ని చెట్లు గేట్ల ముందు తేలుతాండాయో... అన్ని గేట్లూ సగం ఎత్తండి యీ నీళ్ళు పోయినా మళ్ళా పైనుంచీ నీళ్ళు వొస్తాయి..." మెత్తగానే అడిగినాడు నారాయణరెడ్డి. ఆయనిల్లు వుండేది కట్టకిందనే.
"బాగా మాట్లాడుతారండీ మీరు రెడ్డి గారు. యిప్పుడేమన్నా గేట్లు ఎత్తకుండా వున్నామా నాలుగు గేట్లు ఎత్తే వున్నాయి గదా... యిప్పటికే కర్నూల్‌లో తుంగభద్ర వూర్లోకి వచ్చింది. హంద్రీ కూడా అంతే, యింక యిన్ని నీళ్ళు వొకేసారి వదిలితే కర్నూలు మునిగిపోవాల్నా... మీరు చెప్పేది..."
అరచినట్లు మాట్లాడినాడు ఆర్డీవో..
"అట్లయితే శ్రీశైలం గేట్లు మొదట ఎత్తండి.. అప్పుడు కర్నూల్నుంచీ నీళ్ళు ఖాళీ అయితాయి" వెనుక నిలబడిన విశ్వనాథమయ్య మనిషి కన్పించకున్నా గొంతు స్పష్టంగా విన్పించింది.
"ఎవరయ్యా ఆ మాట అంటున్నది ఎవరూ. అంతా మీ యిష్టమేనా, మీరు ఏ డ్యాంగేట్లు ఎత్తమంటే అవి ఎత్తాల్నా, యిక మేముండేది ఏమిటికి, అట్లయితే మీరే గేట్లు ఎత్తేసుకొండీ.. బుద్ధుండి మాట్లాడాలయ్యా, మాకే అధికారాలూ లేవు డ్యాం గేట్లు ఎత్తడానికి, రాక రాక నీళ్ళొస్తే, విచిత్రంగా మాట్లాడుతున్నారు. చానా దౌర్జన్యంగా వుందయ్యా మీ కథ అంటే శ్రీశైలంలో గేట్లు ఎత్తేస్తే గుంటూరూ, విజయవాడా మునిగిపోవాల్నా..."
రంకెలేసినాడు ఆర్డీవో.
అది గమనించి కలెక్టర్.
"వాట్ దే ఆర్ ఆస్కింగ్" ఆర్డీవోను అడిగాడు.
ఇంగ్లీషులోనే ఆర్డీవో కలెక్టర్‌కు విషయం చెప్పాడు.
"నో... నో... దటీజ్ నాట్ పాసిబుల్ దటీజ్ నాట్ ఎటాల్ పాస్సిబుల్..." అంటూ కలెక్టర్ డ్యాంలో పరవళ్ళు తొక్కుతున్న ఎర్రనీళ్ళను సంతృప్తిగా చూసుకుంటూ కారెక్కాడు.
వాహనాలు కదలిపోతూంటే, రోడ్ల మీద పొంగిపొర్లుతున్న నీళ్ళలో అవి పడవల్లా తేలిపోతున్నట్లు కన్పించినాయి.
"యీ నాకొడుకులు మనల్ని ముంచనీకే చూస్తాండారు రెడ్డీ" కాళప్పాచారి.
"అవుచూడి ఆచారి మనదే దౌర్జన్యం అంటాండారు" నారాయణరెడ్డి
"ప్రళయంలాగా వుందన్నా యిన్ని నీళ్ళు ఎన్నడూ చూడ్లా"
వూరి వాళ్ళందరూ నిరాశగా అడుగులేస్తున్నారు.
పెద్దమనుషులు వాళ్ళలో వాళ్ళు మాట్లాడుకుంటూ కట్టదిగుతున్నారు.
అంతలో డ్యాంగేట్లముందు రెండు శవాలు తేలుతున్నాయని ఎవరో అరచినారు, అంతా మళ్ళీ గేట్ల దగ్గరకు పరిగెత్తినారు. గేట్ల ముందు అల్లకల్లోలంగా వుంది. ఎటు చూసినా ఎర్రసముద్రమొకటి వుబికి వుబికి ఎగసి పడుతున్నట్లుంది, నీళ్ళ మీద ఎన్నెన్నో గొర్రెలూ, మేకలు, కంపలూ, ఏదేదో సామాన్లూ తేలియాడుతున్నాయి. అన్నిటి మధ్యా రెండు శవాలు గేట్ల ముందు

నీళ్ళతోపాటు సుడులు తిరుగుతున్నాయి.

"ఎవరో దురదృష్టవంతులు నీళ్ళపాలయినారే" కాళప్పాచారి అంటూంటే గ్రామస్తులంతా భయంతో వణికిపోయినారు.

"రెడ్డీ యీ సార్లతోని మనకేంగానీ, మనమే గేట్లు ఎత్తేద్దాం, నువ్వు వూ అను..." బోయోళ్ళ మనుషులు నారాయణ రెడ్డిని అడిగారు.

అంతలో గసబోసుకుంటూ విశ్వనాథమయ్య బావమరిది శంకర్ వురుక్కుంటూ వస్తున్నాడు.

"బావాబావా మామకు ఎచ్చు తక్కువగా వుంది. అక్క భయపడతావుంది జల్దిరా...." అంటున్నాడు.

"ఏమయ్యా శెట్టి మీ అయ్యకు బాగలేదా..." నారాయణరెడ్డి పరామర్శించాడు.

"అవు రెడ్డీ..." అంటూ విశ్వనాథమయ్య ఆత్రంగా కట్ట దిగినాడు.

వీధిలోకి అడుగుపెడుతూంటే "టపా టపా" చినుకులతో వర్షం మొదలై క్షణాల్లో పెద్దగా అయ్యింది.

విశ్వనాథమయ్యతో పాటు పాదుపు సంఘాల ఆడోళ్ళంతా యింటిలోనికొచ్చి నిలబడ్డారు. విశ్వనాథమయ్య తండ్రి వూపిరితిత్తులు ఎగిరెగిరి పడుతున్నాయి. ఆయాసంతో శరీరం వొణుకుతూ వుంది, నోటి నుండి గళ్ళా రక్తం కలగలసి బయటికొస్తావుంది, దాన్ని తుడవడానికి శకుంతలమ్మ యిబ్బందిపడుతావుంది. లోపలున్న మంచం గాలికోసమేమో పడశాల్లోకి వేశారు. వాన వొలిపిరి లోపలికొస్తా వుంది. వాన శబ్దం, తండ్రి శరీరం చేస్తున్న గస శబ్దం కలగలసి పోతున్నాయి.

"ఆరెంపీ డాక్టరు రాలేదారా శంకరూ..." అనడిగాడు.

"ఆయనొచ్చి యిప్పుడే చూసిపాయ, ఏం చేయనీకే లేదంటా... చేతులెత్తేసి, కర్నూలుకు పొమ్మనా...."

"అయ్యా చలిపెడ్తుందేమో లోనికి ఎయ్యండి మంచం" గుంపులోంచి ఒకామె అనింది.

"అవు లోపలికెయ్యండి మంచం..." అన్నారు యిద్దరు ముగ్గురు. మంచం ఎత్తుకుంటుంటే... వొద్దొద్దు... అన్నట్లు సైగలు చేశాడు ముసలాయన.

"గాలి కావాల్నేమో..." అనుకుంటుంటే.

కొడుకువైపు కళ్ళు తిప్పి చేయితో ఏవేవో సైగలు జేసినాడు. కళ్ళు చక్రాల్లా తిప్పాడు. ఏమర్థం కాలేదు ఎవరికీ, తండ్రి దగ్గరకు పోవడానికే విశ్వనాథమయ్యకు భయంగా వుంది. ఏమీ చేయలేకపోతున్నానని తన మీద తనకే కోపం వస్తూ వుంది. తండ్రి గొంతు గరగరమంటా వుంది. ఆయన ఏదేదో మాట్లాడాలనుకుంటున్నాడని విశ్వనాథమయ్యకు అర్థమవుతూ వుంది. దగ్గరకు పోయి తలనిమురుతూ కాసేపు తండ్రి పక్కనే కూర్చున్నాడు.

ఈ గండం నుంచి బయటపడితే బాగుండు పొద్దున్నే కర్నూలుకు తీసుకొని పోవచ్చు. పదిరోజులుగా పాలమాలికగున్నా మామూలే అనుకున్నాడు. రెండేండ్లుగా అప్పుడప్పుడు యిట్లా అయితానే వుంది. మందులు వాడుతూ కాలం దొబ్బుకొస్తున్నాడు. తల్లి చనిపోయి చానా ఏండ్లాయ. తండ్రి కొంచెం గట్టి పిండమే. మొన్న మొన్నటి దాకా అంగడి మీద అతనే కూచునేవాడు. ప్రాణానికి బాగల్యాకుండా అయినాక కోడల్ను కూచోబెట్టి తాను మంచం మీద నుండే అజమాయిషీ చేసేవాడు. యింటి ముందర పోయేవాళ్ళను మంచం మీద నుండే పేరు పేరునా అరచి అరచి మాట్లాడించేవాడు. వాళ్ళేమన్నా అప్పు తీసుకున్న వాళ్ళయితే ఎప్పుడిస్తావని నిలబెట్టి సతాయించేవాడు. అప్పులు ముక్కుపిండి వసూలు చేసుకొనే రకం. పరంధామయ్యను ఆ వూర్లో పీనాసి పరంధామయ్య అనే అంటారు. అందుకు విరుద్ధంగా విశ్వనాథమయ్య వుదారంగా వుంటాడనీ అనుకుంటారు. సన్నా బన్నా జనాలకు ఆయన అండదండగా వుంటాడని అంటారు గానీ విమర్శించేవాళ్ళు మాత్రం తండ్రికి తగ్గ కొడుకేలే అనంటారు. బ్యాంకు లోన్లు యిప్పిస్తాననీ, పుస్తకాలు రాస్తాననీ పొదుపు సంఘం ఆడోళ్ళతో విశ్వనాథమయ్య లెక్క గుంజుతాడనీ అంటారు. అంతా వొయినంగా, నొప్పి తెలీకుండా యింజక్షన్ వేసే ఆరెంపీ డాక్టర్‌లాగా చేస్తాడని చెవులు కొరుక్కుంటారు.

వీధి వరండాలో నిలబడి తండ్రిని చూస్తున్న విశ్వనాథమయ్యకు అయోమయంగా వుంది. బయట హోరుమని వర్షం. లోపల అంతా చీకటి, మనసులో నిస్సహాయత... ఎదురుగా ఆకులా వొణికిపోతున్న తండ్రి శరీరాన్ని చూస్తుంటే డ్యాం గేట్ల ముందు సుడులు తిరుగుతున్న నీళ్ళలోని గొర్రెలు, మానవ శవాలూ గుర్తొచ్చాయి. వొక్కసారిగా వులిక్కిపడి తల విదుల్చుకొని మళ్ళీ తండ్రిని చూశాడు, కొంకర్లు పోతున్న చేతివేళ్ళు, కట్టెల్లా పైకి లేచిన చేతులూ, చిన్నప్పుడు ఏటి నీళ్ళలో యీత నేర్పించిన నాటి వాత్సల్యాన్ని గుర్తుకు చేశాయి. తండ్రితో వున్న అనుబంధాలు గుర్తుకు వస్తుంటే దుఃఖం కమ్ముకోసాగింది. పొలంలేదూ పుట్రాలేదు. సంపాదించిందంతా వంశపారంపర్యంగా నమ్ముకున్న వ్యాపారమే. ఎన్నెన్ని చిన్నాబన్నా వ్యాపారాలు చేసి ఏ సంవత్సరానికి ఆ సంవత్సరం సంపాదించుకుంటూ అంతో యింతో మిగిలించుకుంటూ ఇద్దరాడపిల్లల్నీ తననూ పెంచుకున్నాడు. మనుషులతో డబ్బుకాడ కఠినంగానే వుంటాడు గానీ, ఇంట్లో వాళ్ళకి మాత్రం బయటి వాళ్ళ గురించి మంచిగనే చెప్పి, 'యీసారి గాకుంటే మళ్ళీసారి యిస్తార్లే నేను అడిగినట్లు మీరు అడక్కండి' అని సర్దిచెప్పేవాడు. 'వూరు కన్నతల్లి లాంటిది. వూరుమీంద బతికేటోల్లం. వూర్ని పోగొట్టుకోగూడదు' అనేవాడు. 'మనం బతకాలంటే వూరు బాగుండాల అది మరచిపోగూడ'దనేవాడు.

"మామా... మామా..." అంటున్న శకుంతలమ్మ అరుపులకు యీ లోకంలోకొచ్చాడు విశ్వనాథమయ్య.

నీలక్కపోతున్న తండ్రి శరీరం కట్టెలా నిశ్చలమైపోవటం, పెడుతున్న గొంతు గరగర నిశ్శబ్దమై పోవటం, అరమోడ్పు కనులు పడటం కన్పించింది.

"అయ్యా...." అంటూ విశ్వనాథమయ్య తండ్రి చేతిని పట్టుకున్నాడు. చుట్టూ వున్న మనుషులు భయంతో చూస్తుంటే గొడుగు తీసుకొని ఆరెంపీ డాక్టర్ కోసం పరిగెత్తిన శంకర్ డాక్టర్‌తో యింటికొచ్చాడు.

"అయ్యో రా సారూ... అయ్య వాళ్ళ నాయనకు యా గతి పట్టా చూడు సారూ...." ఆడవాళ్ళు గొల్లుమన్నారు.

"నువ్వే దిక్కు సారూ..."

చుట్టూ మూగిన వాళ్ళు దుఃఖంతో ఆరెంపీ డాక్టర్ ఏం చెప్తాడోనని చూస్తున్నారు.

నిశ్చలమై పోయిన పరంధామయ్య శరీరాన్ని పరీక్షించిన ఆరెంపీ డాక్టర్,

"అయ్యలేడు.... విశ్వనాథ్...." అన్నాడు.

మంచపుకోడు మీద తల ఆన్చి విశ్వనాథమయ్య "అయ్యా...." అంటూ ఏడుస్తూంటే...

శకుంతలమ్మ పిల్లలూ రాగాలు అందుకున్నారు.

"జేజయ్యా.... జేజయ్యా...." అంటూ

"ఈ వానలకు దూందగలా మాసావుకొచ్చెగదా సామీ..." పొదుపు సంఘాల ఆడవాళ్ళు ఏడుస్తూ అంటున్నారు.

అప్పటికి సాయంత్రం ఆరు దాటింటుంది. వర్షం వస్తూనే వుంది.

విశ్వనాథమయ్య దుఃఖం లాగానే ఆ చీకటి రాత్రి వర్షం వుధృతమైంది. ఈదురుగాలులు 'హోరు'మని వీస్తుంటే, పాములా మెలికలు తిరిగిన కరకట్ట మీద సీమజాలి పొదలు భయంకరంగా వూగిపోతున్నాయి. కరకట్ట వెంబడి ఏవేవో చిత్రవిచిత్ర శబ్దాలు వినిపిస్తున్నాయి. శబ్దాలు వింటున్న పశువులూ పక్షులూ కలకలమని అలజడి చేస్తున్నాయి. కరకట్ట దగ్గరున్న యిండ్ల వాళ్ళు టార్చిలైట్లతో కరకట్ట ఎక్కి నీళ్ళు ఎంత పెరిగిందీ గడియగడియకు చూసి వస్తున్నారు.

విశ్వనాథమయ్య యింట్లో శవం ముందు శవజాగరణ జరుగుతూవుంది.

తెలిసిన వాళ్ళు ఆరేడుమంది భజనాబృందంగా పేరుపడ్డవాళ్ళు తత్వాలు ఎత్తుకున్నారు.

"ఎందుబోయేవో చిలుకా
బొందె వొదిలీ యెందు బోయేవో చిలుకా
నీ చూడచక్కని గూడు వొదిలీ
చెదిరిపోయే గూడూ వొదిలీ
ఎందుబోయేవో చిలుకా
తూకమూ రాళ్ళతోని
తూచి తూచీ మూటగట్టివి
తక్కెడా చేతబట్టి
మోహో మోహో నాతూచుకుంటివి
మూటగట్టిన మురికెనెల్లా
వెంటబెట్టుకుపోతానంటివి.
ఎందు బోతివో చిలకా
బొందె వొదిలీ
గొందె వొదిలీ
ఎందుబోయేవో చిలుకా.
నామాల నా రామచిలకా
రామానామాలెన్ని పలికినా
ఎగనామాలు నేర్చినా చిలుక
ఎందుబోయేవో చిలుకా....

రాత్రి వొంటిగంటదాకా తత్వాలు పాడుతూ పాడుతూ వున్నోల్లు, కొందరు వెళ్ళిపోయినారు. విశ్వనాథమయ్యకు ముఖ్యమైనవాళ్ళు కొందరు మిగిలారు. విశ్వనాథమయ్య తత్వాలు వినే స్థితిలో లేడు. అతని దృష్టంతా రేపు తండ్రినెట్లా దహనం చేయాలా అని ఆలోచిస్తున్నాడు. తడవని స్థలమే లేదు, తడవని కట్టెపుల్లలు లేవు. ఎట్లా యీ యిక్కట్టు నుండి బయటపడాల అని ఆలోచిస్తున్నాడు. ఇక కర్నూలు మంచి ఆటో మాట్లాడుకోని కట్టెలు తెచ్చుకోవడమే మిగిలింది అనుకున్నాడు. మామూలు పరిస్థితుల్లో వూర్లో వాళ్ళు తలా ఒక చేయి వేస్తే వుద్దరగా ధర్మంగా జరిగిపోయే ఆసడ్డం, యిప్పుడు తనను ఎంతకు ముంచుతుందో అర్థం కావట్లేదు. దినాలకు డబ్బులు అందుబాటు చేసుకోవాల, చేయిబదుల్లు యిప్పించుకున్నోళ్ళను పొద్దున్నే ఎంటబడాల అనుకున్నాడు.

ఇంతల్లో సెల్ రింగైంది. మధ్యాహ్నం నుంచీ మూగబోయిన సెల్ తరంగాలు అంత పొద్దుకాడ విచిత్రంగా ధ్వనిస్తుంటే ఫోన్ ఎత్తాడు.

"అరే విశ్వనాథ్ మా వూర్లోకి నీళ్ళొస్తున్నాయిరా... మావూరు మునిగిపోయేట్లుంది...." గుండ్రేవుల నుంచి మిత్రుడు రామాంజనేయులు ఫోన్లో చెప్తున్నాడు.

"అవునా... నిజమా... అన్నోటు నీళ్ళొచ్చినాయా తుంగభద్రకు. మళ్ళా యెట్లా... యేం చేస్తాన్నారు..."

"వూరుడిస్తున్నారు, వున్నవి సర్దుకొని మిట్టమీదికి అందరం వురుకుతాన్నాము రా... దీనెమ్మా యీ ఏర్లుయెంత మోసం చేస్తాందో సూడ్రా.... ఏమొస్తాయిలే అనుకొంటిమి... అయిపాయ మా వూరు కథ... మీకెట్లుంది... అయినా మీకేమీ కాదులే.... కట్ట అడ్డముంది గదా"

"నా కత యేంచెప్పాలులే... యీయ్యాల మా అయ్య పోయినాడ్రా... యీ వాన, యీ చావూ... దిక్కు తెలీడంల్యా... నువ్వేమో యీ వార్త చెప్తివి, కాళ్ళూ, చేతులూ ఆడ్డంలేదన్నా..."

"అయ్యో అట్లనా... ఎంత పనైందిరా..."

ఫోన్ కట్టయింది.

"ఏందయ్యా.... ఏమంటా..." తూగుతున్న భజనజనం ఆత్రంగా అడిగినారు.

"గుండ్రేవుల మునుగుతాందంటా..."

"ఆఁ అట్లనా మా అక్కావాళ్ళు ఏం గతి పట్టినారో..." అనుకుంటూ ఆ వూర్లో బంధువులున్న భజనబృందంలోని వాళ్ళు ఆందోళనతో లేచిపోయినారు.

"అయ్యా ఈర్లదిన్నెలో మా అక్కోళ్ళకి ఫోన్ జేయ్యాయ్యా" అంటూ ఒకామె సెల్ నెంబర్ యిచ్చింది. ఆ నంబర్‌కు చేసి కనుక్కుంటే, వూర్లోకి నీళ్ళు వస్తున్నాయని తెలిసింది. వార్త విన్నామె భయంతో లేచిపోయింది. విశ్వనాథమయ్య యింట్లో చేరినవాళ్ళు వొక్కక్కరూ వెళ్ళిపోయారు.

చాలారాత్రి గడిచింది. తెల్లవారురుఝాము అవుతూ వుంది.

రాత్రంతా వర్షపు నీళ్ళు వీధుల్లో చిన్న వంకలై పారుతున్నాయి. వీధిలైట్ల పల్చటి వెలుగుల్లో మెరుస్తున్న నీళ్ళను చూస్తూ విశ్వనాథమయ్య దిగులుగున్నాడు. భార్యాపిల్లలు ఏడ్చి ఏడ్చి మగత నిద్రలో వున్నారు. రాత్రి గడిచింది. సరే వుదయం సంగతేమిటి, వర్షాలు, వంకలూ, తడిసిన భూమి, తండ్రిని ఎట్లా సాగనంపుతావని అంతరాత్మ అడుగుతోంది. ఎంతో ప్రేమించిన తండ్రికి ఆఖరి సంస్కారానికి వొచ్చిన తిప్పలు అతన్ని యిబ్బంది పెడుతున్నాయి. శంకర్ తడుస్తూ లోపలికొచ్చాడు.

"బావా వూరంతా జాగరణ చేస్తా వుంది. ఈర్లదిన్నె పూర్తిగా మునిగి పోయిందంట. వూరుమీద నీళ్ళు పారుతున్నాయంట. మనూర్లోకీ కట్టకింద నుంచీనే యీర్లదిన్నె దిక్కు నుంచీ నీళ్ళు వొస్తాయని జనాలు భయపడి వూర్లో అంతా ఎగువ దిక్కు వురుకుతాండారు. యట్లా మల్లా నీ సంగతేంది, ముఖ్యమైనవి సర్దు. ఎగువన శూద్దరోల్ల యిండ్లలో పెట్టుకోవచ్చు. అట్లగాకుంటే మసీదులోనన్నా పెట్టుకోవచ్చు, వూరు వూరంతా పైకి పోతాండారు"

"అర్యా శంకరూ.... మొదలు డ్యాంగేట్లు ఎత్తేయాలరా, పెద్దరెడ్డితోని మాట్లాడి మనుషుల్ని అంపమనాలా... మీ అక్కను లేపు... సర్దనీ..."

"బావా గేట్లు ఎత్తనీకే జనాలు రాత్రి ఎప్పుడో పోయినారు. రెడ్డోల్లు చెప్పకనే పోయి ఎత్తేసినారంట, ఇంజనీర్లు అడ్డొస్తే, వాళ్ళని తన్ని ఇరవై గేట్లు ఎత్తినారు. ఆరు గేట్లు ఎత్తనీకె రాలేదంట, అయినా నీళ్ళు యించుగూడా తగ్గల్యా. ఇంకా పెరుగుతానే వుండాయి. కట్టల అంచులకాడికి ఎక్కినాయంట నీళ్లు. చెప్పనీకేలేదంట ఆడ జరుగుతున్న అల్లకల్లోలము. కట్టమీదికి పోనీకే జనాలు భయపడతాండారు...."

"అట్లనారా.... వాయబ్బా, అన్ని గేట్లు ఎత్తినా, నీళ్ళు తగ్గలేదంటే కష్టమేనే యీనెమ్మా యీ వానొకటి పట్టుకొంది... తెరిపీ కుండా, మనల్ని ముంచేట్లుందిరా... ఏయ్ లేయ్... యింగేమి నిద్రపోతావు గానీ... అయినకాడికి సర్దు... లెయ్యి..."

బయట వీధుల్లో జనాల అరుపులూ, కేకలూ వినిపిస్తున్నాయి. కుక్కలు వున్నట్టుండి పెద్దగా మొరుగుతున్నాయి. పరిగెత్తుతున్నాయి. మద్దిలేటి రెడ్డి పశుల గాట్లో ఎద్దులు తొక్కులాడుతున్నాయి. ఏమా శబ్దాలని విశ్వనాథమయ్య బయటికొచ్చి చూసాడు. మద్దిలేటి రెడ్డి బండిమీద సామాన్లు వేసుకొని వెల్తున్నాడు.

విశ్వనాథమయ్యను చూసి

"ఏమయ్యా విశ్వనాథమయ్యా ఎట్లా ఆసడ్డమొచ్చా నీకు.... వూరు వూరంతా మిట్టకు పోతాన్నాం, ఎట్లా టయంలా కాలమాయ మీ అయ్య, యింట్ల వుందామంటే భయంగుంది, యిల్లిడిసి పోవాలంటేనేమో దిగులుగుంది, మాకే యింత కష్టంగుంటే నీ గతేంది అర్థం అయితాలేదు... ఎందుకయినా మంచిది ముఖ్యమైనవి సర్ది తెచ్చుకో..." మాటలు పూర్తయ్యేలోపు దూరం నుంచి అరుపులూ, కేకలూ.

"అరే రేయ్ బజారీ.... కట్టమీదికి ఎక్కి పొర్లుతాండాయిరా నీళ్ళు..." కాళాచారి గొంతు ఆందోళనగా విన్పించింది. మనుషులు పెడుతున్న పరుగులూ కన్పిస్తున్నాయి.

విశ్వనాథమయ్య గుండెల్లో రాళ్ళు పడ్డాయి, కట్టమీద పొర్లుతున్నాయి, కట్ట

కింద నుంచీ ఈర్లదిన్నెను ముంచిన నీళ్ళు కట్టపక్కనుంచీ తమ వూర్లోకి వచ్చేస్తాయి దాంట్లో అనుమానం లేదు, అయితే రెండు దిక్కుల్నుంచీ వచ్చే నీళ్ళతో వూరు మునిగిపోతుంది. తమగతేం కాను అనుకుంటూ యింట్లోకి పోయి ఏమన్నా సర్దుదాం అనుకుంటుంటే బియ్యం మూటలు, అంగడిసరుకులూ, బీరువాలూ, ఎన్నని లెక్కేసుకోవాలి, వేటిని కాపాడుకోవాలి... పెద్ద బండితో నాలుగైదు సార్లు తిరిగినా సాధ్యంకాదు, అయినా యిన్ని సామాన్లను యాడ పెట్టుకోవాలి... యాడ స్థలముంది. ఎవురింట్లో జాగా వుంది. వూరు వూరందరికీ యిదే కష్టం. ఇల్లు యిల్లు గుంజుకుపోయే శక్తి వుంటే ఎంత బాగుండు. ఎట్లా కాపాడుకోవాలో అర్థం కాలేదు.

భార్యాపిల్లల్ని శంకర్‌తో మొదట పంపించేద్దాం అనుకొని శంకర్‌కు ఆ పని వొప్పజెప్పినాడు.

"అరే శంకరూ మీ అక్క, పిల్లల్ని మిట్టా సుబ్రమణ్యం యింట్లోకి వొదిలి రాపోరా... ఏయ్ మీరు వెళ్ళిపోండి... యాడుంటే కాదు యీర్లదిన్నె నీళ్ళు మనకే తగుల్తాయి".

మద్దిలేటిరెడ్డి బండిలో స్థలముంటే సరుకులూ, బియ్యమూ పంపిస్తామని అడిగేందుకు బయటికొచ్చాడు.

వీధి నిండా నీళ్ళు, పెద్ద అలలతో తోసుకొస్తున్నాయి, చూస్తుండగానే వీధి అరుగును తాకి, గడప పైనుండి లోపలికి పోతున్నాయి.

"వాయబ్బా... యింగేంగతిరా నాయనా.... అరే శంకరూ.... నీళ్ళురా యింట్లోకొస్తున్నాయి...." అంటూ లోపలికి పరిగెత్తినాడు.

"ఏంది బావా.... ఏమంటివి...." శంకర్ తేరుకునేలోగా నీళ్ళు అతని పాదాలను తడిపి యింకా నిద్రమత్తు వొదిలించుకోని శకుంతలమ్మను తాకినాయి. ఆమె వులిక్కిపడి లేచి, ఏం జరుగుతోందో చూసేలోపు, పెద్ద పెద్ద అలలు గడపను ఢీ కొడుతున్నాయి. వూర్లో అరుపులూ, పెడబొబ్బలూ.... బయట పక్కింటి మద్దిలేటిరెడ్డి అరుపులు వినిపిస్తున్నాయి.

"వూర్లోకి నీళ్ళొచ్చెనయ్యో... నీళ్ళు... కట్ట తెగింది.. ఓరి రాముడ్డూ...."

యింతలో "ఢాం" అంటూ పిడుగులాంటి చప్పుడు. ఫెళఫెళమంటూ ఏదో దూసుకొస్తున్న శబ్దం... హోరుమని సవ్వడి. వూరంతా కాకర బీకర... చెప్పనలవి కాని అపశృతులు. విశ్వనాథమయ్య ఎదురుగా ఎగసిపడుతున్న నీళ్ళు కన్పిస్తున్నాయి. సరిగ్గా టయానికి కరెంట్‌పోయింది.

"ఏయ్ పిల్లల్ని పట్టుకోయే... అర్యా శంకరూ మీ అక్క చేయి పట్టుకోరా... అయ్యా... ఏం దిక్కురా.... దేవుడా.... నీళ్ళు, నీళ్ళు" నిముషాల మీద మోకాళ్ళలోతు నీళ్ళు ఇంట్లో. శంకర్, శకుంతలమ్మ నోట్లో మాట నోట్లోనే కుక్కుకొని "అమ్మా అమ్మా ఓర్నాయనో ఓరిదేవుడా" అనుకుంటూ ప్రాణభయం వెంటాడుతుంటే యింట్లోంచి బయటపడ్డారు. వీధి నీళ్ళలో యీదుతున్నారు.

విశ్వనాథమయ్య బట్టలన్నా బ్యాగులో సర్దుకుందాం అనుకుంటుండగా... తండ్రి శవం నీళ్ల మీద తేలుతోంది. ఇక వేరే ఆలోచన లేక "అయ్యా..." అంటూ తండ్రిని భుజమ్మీద వేసుకున్నాడు. అప్పటికి నీళ్ళు యింటి గోడలకు తాకి ఎగబాకుతున్నాయి. కళ్ళనీళ్ళు కారిపోతూండగా, తండ్రి శరీరాన్ని మోస్తూ వీధి నీళ్ళలోకి వచ్చేశాడు.

అక్కడక్కడా మనుషులు నీళ్ళలో తేలుతూ, యీదుతూ వెళ్తున్నారు. మొలలోతు నీళ్ళలో నడిచినా తేలినట్లే వుంది. సగం వీధి దాటుతూనే ఎదురుగా నీళ్ళు ఎక్కి వస్తున్నాయి. "బావా...వొచ్చేయ్ బావా.... నీళ్ళు ఎక్కువయితాండాయి" శంకర్ గొంతు వినిపించింది.

విశ్వనాథమయ్య నీళ్ళలో మునిగిపోతున్నాడు, తండ్రి శవాన్ని భుజం మీద వేసుకొని నడవలేక, ఎదురుగా కొత్తగా కట్టిన మసీదు గోడమీదికి తండ్రి శవంతో పాటు యీదినాడు. మసీదు గోడ అంచు మీద నుండే మెట్ల మీదికి అటునుండి పై అంతస్తు మీదికి చేరినాడు, తండ్రి శవాన్ని దించి...

"యేరా శంకరూ... యాడున్నార్రా..." అని అరచినాడు.

నాలుగైదు సార్లు అరచినాడు.

దగ్గర్లో నుండీ "అయ్యా యిక్కడే వున్నా నీళ్ళలోకి దుంకు" అని మహబూబ్ బాష గొంతు వినిపించింది.

"నేను రాలేన్రా మా అయ్యను యాడ బెట్నాల్రా" ఏడుస్తూ సమాధానమిచ్చాడు.

"అయ్యా నేనొస్తాండా..." అంటూ మహబూబ్ మసీదు మెట్లమీదికి యీదుకుంటూ వచ్చి పైకి చేరినాడు.

"అయ్యా... నీళ్ళు ఎక్కువయిపోతుండాయి వొచ్చేయి" అని అరుస్తున్నాడు..

విశ్వనాథమయ్య చుట్టూ చూశాడు. ఎటు చూసినా మసకచీకటిలో అలలు అలలుగా నీళ్ళు, కరకట్టలు చీల్చుకొని డ్యాం నీళ్ళు ఎగసి పడుతున్న శబ్దాలు. "వూరు మునిగిపోవడం గ్యారెంటీ, యాడుంటే నేను మిగలను" అనుకున్నాడు

"అయ్యా మీ నాయన్ను అక్కడ అరుగు మీద పెట్టు నీళ్ళు అంతెత్తు రావులే..." మహబూబ్ బాష సహాయంతో తండ్రి శవాన్ని ఎత్తి పైఅంతస్తుకు ఆనుకొని కట్టిన అరుగు మీదకి చేర్చినాడు.

యింక దేవుని దయ వుంటే యీడే వుంటాడు, లేకుంటే నీళ్ళలో కలిసి పోతాడనుకొని, ఎక్కి వస్తున్ననీళ్ళలోకి జారి యిద్దరూ యీదుకుంటూ వస్తుంటే నలుగురు వూరివాళ్ళు ఎదురొచ్చారు. రాబ్బా శెట్టేంట... శకుంతలమ్మ ఒకటే ఏడుస్తావుందీ అంటూ సాయం చేశారు. అందరూ వూరి ఎగదాలకు వెళ్ళిపోయినారు, నేలకు కాళ్ళు తగలగానే కాళ్ళీడిస్తూ పొలాల మీదకు చేరినారు.

"బాషా... చానా సాయం చేస్తివబ్బా..." అంటూ మహబూబ్‌బాషను కౌగిలించుకున్నాడు విశ్వనాథమయ్య.

పొద్దున విశ్వనాథమయ్య రక్షించిన బువమ్మ విశ్వనాథమయ్య పిల్లల్ని ఎత్తుకొని నడుస్తూ వుంది.

శకుంతలమ్మ భర్తను పట్టుకొని ఏడుస్తూ "మామ సంగతెట్లా..." అంటోంది.

విశ్వనాథమయ్య పైకి చేతులు చూపించి ఏడ్చాడు.

చాలామంది అటువైపుకే వస్తున్నారు.

ఒకర్నొకరు అరుపులతో, వుద్రిక్తతలతో పలకరించుకుంటున్నారు. భయంభయంగా వొణికిపోతున్నారు "వాయబ్బా... వాయబ్బా.... ఎన్నడు చూల్లేదు కదరా" అనుకుంటున్నారు.

వూరు వూరంతా కట్టుబట్టలతోఎగువన పొలాల్లోకి చేరింది..

పిల్లా పాపల్ని సంకన బెట్టుకొని ఏడుస్తూ, పడుతూ, లేస్తూ చేరింది..

తడిసిన ఒంటి మీది బట్టలు తప్ప యింగేమీ లేకుండా చేరింది.

అంత నిద్రరాత్రిలో అందరికీ అంతా కలలో జరుగుతోందా అనిపిస్తూ వుంది. వాస్తవం ఎదురుగా బురదనీళ్ళలా సుడులు తిరుగుతూ వుంది.

కొందరు వూరి బయట సెల్‌టవర్ దగ్గరికి చేరుకొని రాలుతున్న తుంపరలోనే చెట్లకిందా, సెల్‌టవర్ మీదికెక్కి జాగరణ చేశారు.

ఆ రాత్రి అందరికీ పొలాల మీద రాలుతున్న తుంపరల్లోనే తెల్లారిపోయింది. వూరి జనమంతా పొలాల మీద పడి నల్లరేగడి నేలలో కాళ్ళు దిగబడుతూంటే రేమట గ్రామానికి చేరుకున్నారు. బంధువులు వున్నవాళ్ళు కొందరు బంధువుల యిండ్లకు పోయినా చాలామంది దేవాలయంలోనూ, దేవాలయం బయటా వుండిపోయారు.

విశ్వనాథమయ్య భార్యా బిడ్డల్ని శంకర్‌తో రేమట పంపించి, తను సెల్‌టవర్ ఎక్కి వూరు మునిగిపోవడాన్ని చూస్తుండిపోయాడు. విశ్వనాథమయ్యతోపాటు యింకొంతమంది సెల్‌టవర్ ఎక్కి కూర్చుని గంటలో వూరు మునిగిన వైనం సినిమా మాదిరి చూశారు. వూరిమీద సుడులు తిరిగిన బురద నీళ్ళలో తేలిన కంప, చెట్టు, చేమ, గడ్డివాములు అన్నీ చూశారు.

జ జ జ జ జ

మధ్యాహ్నం రెండున్నరకు వూరు కన్పించింది. బురదనీళ్ళు వెనక్కుపోవడం

సెల్‌టవర్ మీద నుంచి చూస్తూవుండి సెల్‌టవర్ దిగి వూరి ముందరికొచ్చాడు విశ్వనాథమయ్య. అతనితోపాటు వూరివాళ్ళు చాలా మంది ఆ దృశ్యాన్ని ఆత్రంగా చూసారు. బురదనీళ్ళు వెళ్లిపోయాయి గానీ వూరు మోకాలు లోతు బురదలో మిగిలిపోయింది. అడుగుతీసి అడుగువేస్తే కాళ్ళు కూరుకుపోతున్నాయి. దానికి తోడు కంపు వాసన, ఎవరికీ నిలబడ్డానికి చేతకాలేదు. ఎదురుగా కనిపిస్తున్న యిండ్లన్నీ కూలిపోయి వున్నాయి. మట్టిమిద్దెలు కావడంతో మూడు రోజుల నీళ్ళలో నాని నాని కరిగి వొరిగిపోయాయి. కుప్పకూలిన మట్టిమిద్దెలూ, గోడలు వొరిగిపోయిన పెద్ద పెద్ద యిండ్లూ వూరువూరంతా శిథిలంగా కన్పించింది. వూరు వూరంతా కొట్టుకు వచ్చిన కంపలూ, చెట్లూ, గుట్టలు గుట్టలుగా బురదా... వూరు మురికి కూపంలా కనిపించింది.

వురికురికి వూరు ముందరికొచ్చిన వాళ్ళు ఆ వాసనకు ఆ బురదలోతుకూ ఒక్కడుగూ ముందుకెయ్యలేకపోయారు. విశ్వనాథమయ్య తెగించి ఆ బురదలోనే మసీదు దాకా కాళ్ళీడ్చుకుంటూ పోయినాడు. మసీదు నిండా బురదే. మసీదు నిండా పెట్టుకున్న వూరివాళ్ళ మూటలన్నీ బురదలోనే, వాటిని దాటుకొని మెట్లెక్కి, బురదకు జారిపడుతూ లేస్తూ పైకి పోయి చూస్తే తండ్రి శవం లేదు.

మసీదు బురదంతా వెతికాడు, వూర్లో నిండుకున్న బురద అతన్ని భయపెట్టింది. ఇంత బురదలో ఎక్కడ కూరుకుపోయిందో ఎట్లా వెతకాలో అర్థంకాలేదు. యింత హీనమైన స్థితి వొస్తుందనీ, దాన్ని భరించగలననీ వూహించలేదు. వూరి బురదలో తండ్రి కూరుకుపోవడమనే వూహకే దుఃఖం పొంగుకు వస్తోంది. మూడు రోజులుగా బిగబట్టుకున్న ఏడుపు వూరి బురదను చూస్తుంటే ఎగదన్నుకు వచ్చింది.

"ఓ..... అయ్యా...." ఎలుగెత్తి ఏడుస్తున్నాడు విశ్వనాథమయ్య.

"బావా.... బావా... దొరుకుతుందిలే బావా... ఎతుకుదాంలే బావా, ధైర్యంగుండు..."

"యింగాడరా.... యాడని ఎతకాల్రా.... ఎంత ఎతకాలరా.... ఎంత అన్యాయమైన చావు చచ్చెరా.... అయ్యా.... ఎంత మంది యిండ్ల ముందు బురద ఎత్తిపోయాలరా..."

ఆ తర్వాత రెండురోజుల్లో వూరి జనాలంతా వూర్లోకొచ్చి ఎవరింట్లో వాళ్ళు బురద ఎత్తిపోసుకున్నారు. వూరినిండా పేరుకుపోయిన చచ్చిన జంతువులూ, కంపా ఎత్తేసి కాల్చేసినారు. ప్రతి యింటి ముందరా బురదలో విశ్వనాథమయ్య తండ్రి శవం కోసం వెతుకుతూనే వున్నాడు.

"మనమంతా మన యిండ్లల్లో బురద ఎత్తేసుకోల్యాక ఏడుస్తాంటే, శెట్టికేం గతి పట్టిందబ్బా, వూర్లో వున్న బురదనంతా ఎతికే ఖర్మ పట్టా...."

"రెండు లక్షలొస్తాయని బురదలో పూడుబాముల్ని ఎతికే తిక్కనాకొడుకులకంటే మన శెట్టి మేలుగదన్నా, తండ్రి శవం కోసం బురదను దేవులాడుతున్నాడు."

"శెట్టి ఆశ కాకపోతే.... యింగాడ దొరుకుతాదబ్బా శవం, ఎప్పుడో కొట్టుకు పోయింటుంది. యాడ జలస్థాపితం అయ్యింటుందో..."

"ఏం చేస్తామన్నా, తండ్రిగదా... పాశం అట్లాంటిది... కొడుకు తండ్రికి తలకొరివి పెట్టి సాగనంపాల గదా... అందుకే అయ్య తాపత్రయ పడుతున్నాడు...."

యిట్లా వూర్లో విశ్వనాథమయ్య గురించి నానా రకాలుగా అనుకుంటున్నారు.

"శెట్టి శవం కోసం వెతుకులాట, జనం పూడుబాములకోసం బుడకడం రెండు వింతలైతే సావిడికాడ బూరుగ శెట్టు మింద యింగొక వింత వుందిరా.... ఆడికి వొగసారిపోయి సూడండి ఆ శెట్టు మింద ఎన్ని పాములుండాయో...." గొల్ల లచ్చుమయ్య అంటున్నాడు. జనాలు వూర్లోకొచ్చిన మొదటి రోజే యీ వార్త వూరందరికీ పాకింది.

వూర్లో అందరూ ఆ వింతను చూసి వొచ్చిన వాళ్ళే.

గ్రామచావడికి ఆనుకొని వున్న బూరుగ చెట్టు కొమ్మలకు కొన్ని వందల పాములు చుట్టుకొని వున్నాయి. వరదలో వాటి పుట్టలు కరిగిపోగా అవన్నీ నిరాశ్రయమై చెట్టు మీదకొచ్చి చుట్టుకున్నాయి. దానికి తోడు చెట్టుమీద పెద్ద గడ్డివాము చెట్టుకొమ్మలకు తగులుకొని నిలబడింది.

గడ్డివాము నుంచి భయంకరంగా కుళ్ళిన వాసనొస్తా వుంది. పాములు కిందికి దిగాలని చూస్తున్నాయి గానీ మనుషుల అలికిడికి మళ్ళీ పైకి ఎగబాకుతున్నాయి.

గడ్డివాము మీదా చెట్టు కొమ్మలకూ కలయ తిరుగుతున్నాయి.

"రాడ్డీ యీ పాములతోని భయంగా వుంది, అవన్నీ కిందికి దిగినాయంటే యీ సుట్టుపక్కల యిండ్లల్లోకి చేరుతాయి.... యీ బురదకుతోడు అవీ సేరినాయంటే మాకత అంతే...."

వూరి పెద్దమనుషులతో ఆ వీధిలోని వాళ్ళంతా వొకటే మొత్తుకున్నారు.

"అయితే ఆ చెట్టుకు అగ్గిబెట్టండి.... చెట్టుకున్న బురద కొట్టుకున్న గడ్డివామూ పాములూ అన్నీ పీడ విరగడయితాయి...." వూర్లో పెద్దమనుషులన్నారు.

"విశ్వనాథమయ్యకు సెప్పండ్రా యీ గడ్డివామ్మీద ఎతకమని, వాల్లయ్య శవమేమన్నా వుండొచ్చు..." ఎవరో ఎగతాళిగా అన్నారు.

అది విన్న విశ్వనాథమయ్య

"నా బాధ మీకేం తెలుస్తుందయ్యా... మీ అమ్మో నాయనో యిట్లే కొట్టకపోతే ఆ బాధ అర్థమయితాండా...."

"నిజమేలెయ్యా.... నీకెంత బాధుందో మాకూ అంతే బాధుంది. మా యిండ్లల్లో మాత్రం ఏం మిగిలిందయ్యా... అందరమూ ఒగతాన్లో పొగులమేలే..."

నారాయణరెడ్డి వోదార్చినాడు.

విశ్వనాథమయ్యకు ఆ గడ్డివాము ఎక్కి చూడాలనుంది గానీ, చెట్టు మీద పాములకు భయపడి ఆపని చేయలేకపోయాడు.

తర్వాత కిరోసిన్ డబ్బా తెచ్చి చెట్టు కొమ్మలకూ చెట్టు బోదెకూ చల్లి నిప్పు పెట్టాడు గ్రామ తలారి.

పచ్చని చెట్టు ధగధగా మండి కొమ్మలకు అడ్డుకొని నిలబడి వున్న గడ్డివాము కూడా అంటుకుంది. మొత్తం గడ్డివాము మండిపోవడానికి రెండు గంటలు పట్టింది.

వేడికి కిందికి దిగుతున్న పాముల్ని

"ఈ పాములు చూడండ్రా ఎంత దౌర్జన్యంగా కిందికి దిగుతున్నాయో" అంటూ, వూర్లో వాళ్ళు నిర్దాక్షిణ్యంగా కొట్టి చంపారు. గడ్డివాము మండగా లేచిన పొగ దట్టమైన మేఘంలాగా వూరి మీద అలుముకుంది. చెట్టు నల్లగా మోడు వారిపోయింది.

చెట్టుమీద నుండి కాలిన గడ్డినుసి తెప్పతెప్పలు కిందికి రాలుతున్నది. రాలుతున్న నుసితో పాటు అప్పుడప్పుడు ఎముకలు కూడా రాలిపడ్డాయి. అది చూసిన వాళ్ళు.

"పరంధామయ్య శెట్టి శవం గడ్డివాములో యిరక్కపోయి కాలి బూడిదైపోయింది" అనుకున్నారు.

విశ్వనాథమయ్యకు విషయం తెలిసి వురికురికి వచ్చి గడ్డినుసిలో రాలిపడ్డ ఎముకల్ని కెలుకుతుంటే, యీసారి ఏకంగా కపాలం "తప్" మని రాలిపడింది. అంతే.

"అయ్యా... యింతన్యాయంగా కాలిపోతివా.... అయ్యో... నేనన్నా నిప్పుపెట్టకపోతిని గదయ్యా.... తలారితో పెట్టిస్తిని గదయ్యా"

శెట్టి ఏడుస్తుంటే వూర్లో అందరూ కళ్ళనీళ్ళు పెట్టారు.

నిజానికి ఆ అస్తికలు పరంధామయ్యవో లేక గడ్డివాము మీద కొట్టుకొని వచ్చి దుర్మరణం పొందిన ఏ అభాగ్యుడివో అనే ఆలోచనే లేకుండా

దినాలు చేసి అస్తికల్ని ఏట్లో కలపడానికి ఏరి మూట కట్టుకున్నాడు విశ్వనాథమయ్య.

*



# పుత్రికోత్సాహం

◆ ఎన్.డి.

రెండు పెద్ద స్టీలు క్యారియర్లు పట్టుకొని బస్సు దిగి ఆటోస్టాండ్ వైపుకు వస్తున్న ఆ వృద్ధ జంటనూ, జీన్స్ ప్యాంటు, షర్ట్, బూట్లు వేసుకుని భుజానికి కిట్టులాంటి పెద్ద బ్యాగుని వేసుకున్న టీనేజీ అమ్మాయినీ చూసి ఆటో వెంకటేశ్ ముసిముసిగా నవ్వుకున్నాడు.

ఎదురెళ్ళి, 'ఎక్కడికమ్మా, రండి, రండి' అంటూ పెద్దాయన చేతిలో క్యారియర్ తీసుకోబోయాడు.

పెద్దాయన ఒక్క క్షణం ఆగిపోయి 'ఆఁ' అన్నాడు ఏం చెప్పాలో మర్చిపోయినట్లుగా.

టీనేజీ అమ్మాయి కూడా కొంచెం బెరుకుగా బస్టాండ్‌లాగా ఏ మాత్రం కనబడని ఆ బయలు ప్రదేశం, నాలుగైదు ఆటోలు, చుట్టూ పచ్చని చెట్లు అన్నిటినీ చూస్తోంది.

పెద్దావిడే ఇక కల్పించుకుని, 'పెదవలస తీసుకుపోతావా బాబూ' అంది.

'రండమ్మా, ఇప్పుడన్నీ పెదవలస బేరాలే' అన్నాడు వెంకటేశ్.

పెద్దవాళ్ళిద్దరూ మొహాలు చూసుకున్నారు. చొరవగా వాళ్ల చేతుల్లోని క్యారియర్లు తీసుకుని ఆటోకేసి నడిచాడు వెంకటేశ్. సామాన్లు కాళ్లకడ్డం లేకుండా గబగబ సర్ది, పెద్దవాళ్లను సౌకర్యంగా కూచోబెట్టాక వెంకటేశ్ సన్నగా ఈలపాట పాడుతూ ఆటో స్టార్ట్ చేశాడు.

ఆటో పరుగుమొదలయ్యిందో లేదో బొంయ్యిమని 'జననాట్యమండలి డప్పుల చప్పుడు' అంటూ క్యాసెట్‌నుండి ధనధన డప్పుల చప్పుడు మొదలయ్యింది. ఒక్కసారిగా ముగ్గురూ ఉలిక్కిపడ్డారు. అంత శబ్దం వాళ్లకు భరించడం కష్టమై, 'బాబూ, కొంచెం సౌండ్ తగ్గిస్తావా?' అంది పెద్దావిడ.

వెంకటేశ్ వారికేసి అద్దంలోంచి చూసి నవ్వి సౌండ్ తగ్గించేశాడు. అప్పటికే వర్షాలు పడ్డంతో కొండలన్నీ పచ్చగా వున్నాయి. చెట్లు ఆహ్లాదంగా కొమ్మలూపుతున్నాయి. అమ్మాయి ఆ పచ్చని ప్రకృతి అందాల్ని కళ్లు విప్పార్చుకుని ఆశ్చర్యంగా చూస్తోంది. తనకి బాగా నచ్చిన దృశ్యం కనిపించినప్పుడు 'నానమ్మా చూడు' 'తాతయ్యా, చూడు' అంటూ సంబరపడ్తోంది. పెద్దవాళ్లిద్దరూ ముచ్చటగా మనవరాలికేసీ, ఆమె చూపించిన దృశ్యాలకేసీ చూస్తున్నారు.

హఠాత్తుగా 'ఆటో.ఆపు, ఆపు' అంది అమ్మాయి.

ఎందుకు అన్నట్లు అద్దంలోంచి చూస్తూ వేగం తగ్గించాడు వెంకటేశ్.

'ఆపంటే' అంది అమ్మాయి అసహనంగా.

ఆపాడు. అమ్మాయి డిజిటల్ కెమెరాతో అక్కడి అందమైన దృశ్యాల్ని ఎన్నో ఫోటోలు తీసుకుంది. నానమ్మనీ, తాతయ్యనీ కూడా లోయ నేపథ్యంగా నుంచోబెట్టి ఫోటోలు తీసింది. కొద్దిసేపు విడియో కూడా తీసుకుంది. మళ్లీ అందరూ ఆటో ఎక్కారు.

వెంకటేశ్ ఈసారి క్యాసెట్ పెట్టలేదు. 'హమ్మయ్య' అనుకుంది అమ్మాయి. అద్దంలోంచి పెద్దామెను చూస్తూ వెంకటేశ్ మెల్లగా, 'ఎవరున్నారమ్మా లోపల? మీ అమ్మాయా? అబ్బాయా?' అనడిగాడు.

పెద్దవాళ్లిద్దరూ గతుక్కుమన్నారు. అమ్మాయి కూడా అనుమానంగా చూసింది వెంకటేశ్‌కేసి.

'చర్చలు కదమ్మా, చాలామంది కుటుంబాల్ని పిలుచుకుని కలుస్తున్నారు. మేమే వాళ్లందర్నీ రోజూ తీసుకువెళ్తున్నాం' అన్నాడు వెంకటేశ్ వాళ్ల అనుమానాల్ని నివృత్తి చేయాలన్నట్లుగా.

పెద్దామె ఊపిరి పీల్చుకుని, 'వెంకటే....ఆహ..సాగర్ అంటారట, తెలుసా బాబూ' అనడిగింది.

వెంకటేశ్ ఒక్కసారిగా ఉత్సాహంగా గొంతు పెంచుతూ, 'సాగరన్నా? ఆయన తెలవకపోవడమేంటమ్మా, ఇక్కడంతా ఆయనొచ్చాకే మొదలయ్యిందంటారు. అందరికంటే ఇక్కడ పెద్ద నాయకుడు ఆయనే, ఆయన మీ కొడుకా?'

పెద్దామె కళ్లు మెరిశాయి. అవునన్నట్లు తలూపింది. అమ్మాయి ఇదంతా ఆశ్చర్యంగా చూస్తోంది. పెద్దాయన మొహం భావరహితంగా వుంది.

ఒకసారి చూశాడు వెంకటేశ్ సాగర్‌ను- తమ యూనియన్ గురించి మాట్లాడ్డానికి యూనియన్ నాయకులు ముగ్గుర్నీ ఆయన పిలిపించినప్పుడు. అప్పటికి కొత్తగా ఆటో నడుపుతున్నా, నమ్మకస్తుడని వెంకటేశ్ ఆటోలోనే కలిసే జాగా దాకా వెళ్లారు వాళ్లు. తననూ వాళ్లతోపాటు తీసుకువెళ్లి సాగరన్నకు పరిచయం చేశారు. వాళ్లతో మీటింగ్ అయ్యాక అన్న తననూ పిలుచుకుని అన్ని వివరాలూ తెలుసుకున్నాడు. తను ఏ విధంగా పార్టీకి సహాయపడగలడో చెప్పాడు. తనూ అందుకు ఒప్పుకున్నాడు. అప్పటినుండీ సాగరన్న కలవలేదు గానీ అవసరమైనప్పుడు ఎవరో ఒకరు కలిసి తనతో పని తీసుకుంటూ వున్నారు. కానీ వెంకటేశ్ తనకి సాగర్ పరిచయం అని ఆటోలో వాళ్లకి చెప్పలేదు.

ఊరి పేరున్న బోర్డు చూసి, 'వచ్చేశాం' అంది అమ్మాయి. వెంకటేశ్ ఆటోని ఒక పక్కగా ఆపాడు. ఆటోలోంచి పెద్దవాళ్లు దిగుతూనే దూరంగా చెట్టు కింద నిల్చున్న ఒకతను వచ్చి పలకరించాడు. వెంకటేశ్‌కి అతను పరిచయం అయినా ఇద్దరూ పరిచయం లేనట్లే మెసులుకున్నారు. ఆటో డబ్బులు ఇచ్చేసి 'వెళ్తున్నాం' అనే చూపును కూడా అతనికేసి సారించి పెద్దవాళ్లిద్దరూ ఆ వచ్చినతనితో ముందుకు కదిలారు. వెనకాలే అమ్మాయీ.

'ఎన్ని సంవత్సరాలు అయ్యి వుంటుందో సాగరన్న వీళ్లను కలవక. అడవిలో అడుగుపెట్టాక మళ్లీ ఎన్నడూ వాళ్ల వూరు పోలేదు అంటారు మరి, ఈ అమ్మాయి ఎవరో?'

వెళ్తున్నవాళ్లకేసి కనుమరుగు అయ్యేవరకూ చూసి వెంకటేశ్ ఆటో ఎక్కాడు.

* * *

చర్చల సమయం కావడం, అలాగే పెద్దవాళ్లను ఎక్కువ నడిపించడం అనవసరం అనేదాంతో సాగర్‌వాళ్లు రోడ్డుకు దగ్గరగా 7,8 గుడిసెలున్న ఒక గూడెంలోనే మకాం వేశారు. అప్పటికి జిల్లా కమిటీ సభ్యురాలు సాధన వాళ్ల అమ్మా వాళ్లు, బంధువులు కొందరు వచ్చి వున్నారు. రెండు రోజులుండి ఆ రోజే ప్రయాణమౌతున్నారు ఇక వాళ్లు.

సాధన వచ్చి 'ఇక వెళ్తారు సాగర్' అంది. ఆమె ముఖంలో ఒక కొత్త వెలుగు కనిపించింది సాగర్‌కు.

'సరే, మనం అనుకున్న 'పని' కూడా చెప్పావు కదా మీ బావతో?'

'మర్చిపోతానా?'

సాగర్ నవ్వుతూ లేచాడు. సాధన విజిల్ వేసింది. సాధన అమ్మా, నాన్నా, అక్కా, బావ, వాళ్ల పిల్లలిద్దరూ, మేనమామ కొడుకూ అందరూ దళం వాళ్లతోపాటు వచ్చి నిల్చున్నారు. అందరూ చేతులు కలిపి లాల్‌సలాం చెప్పారు. కూతురు ఇన్నాళ్లకు కలిసిందనే సంతోషం వున్నా, మళ్లీ ఈ రోజులు ఎంతకాలం వుంటాయి, మళ్లీ ఏమౌతుందో అనే ఆందోళనా సాధన వాళ్ల అమ్మ ముఖంలో సాగర్‌కి స్పష్టంగా కనిపిస్తోంది. చివరి క్షణం వరకూ అమ్మ ఏవో జాగ్రత్తలు చెప్తూ ఉంటే 'వూ, వూ' అంటూ సాధనా చాలాదూరం వాళ్లతో పాటే వెళ్లింది.

తిరిగొస్తున్న సాధన కేసి సాగర్ తదేకంగా చూశాడు. కానీ సాధన ముఖం ఏ ఉద్వేగాల్నీ చూపడం లేదు.

'చర్చలు ఎలా తేల్తాయో ఏమో గానీ సంవత్సరాల తరబడి కలవని వాళ్లను కలుపుతున్నాయి కదా' అంది సాధన బండ మీద కూచుంటూ.

'ఎలా తేల్తాయో తెలీనిది ఏముంది? వాడు మరింతగా మన మీద విరుచుకుపడ్తాడు. మనం ఎంతగా దానికి తగిన సన్నాహాలు చేసుకుంటామనేది మన మీద ఆధారపడి వుంది, కాదా'

'అంతేలే, కానీ ప్రజల కదలిక మళ్లా అప్పట్లాగే వుంది కదా'

'మనకు ఆ విషయంలో ఎప్పుడూ సమస్య లేదు, కదుల్తున్న ప్రజల్ని సంఘటితం చేసుకోడంలోనే రకరకాల సమస్యలు, ఈ సారైనా మనందరం గట్టి కృషి చేయాలి సాధనా, ముఖ్యంగా నీలాంటి చొరవగల కామ్రేడ్స్'

సాధన సాలోచనగా తలూపుతూ, 'చేస్తాం గానీ నువ్వు సరిగ్గా ఇప్పుడే బదిలీ అయి వెళిపోతున్నావు కదా, నీ సహాయం వుంటుందని ఎంతో విశ్వాసంతో బాధ్యతలు తీసుకున్నా, పోనీ భవానీ అన్నా వుంటుందనుకుంటే వుండలేని స్థితి కదా' అంది సాధన. ఆమె గొంతులో ఎంత వద్దనుకున్నా దిగులు తొంగిచూసింది.

'మన కామ్రేడ్స్ అందరూ నీకు సహాయం చేస్తారు, దిగులు పడద్దు, చాలా త్వరలోనే నువ్వు ఇంకా పెద్ద బాధ్యతలు ఎత్తుకునేలా ఎదుగుతావని మేమంతా ఆశిస్తున్నాం మరి' అన్నాడు సాగర్ అనునయంగా.

సాధన ఏమనకుండా తలొంచుకుని కూచుంది.

సాగరే ఇక విషయం మారుస్తూ, 'వెసులుబాటు వున్నప్పుడే చేసుకోవాల్సిన కొన్ని డంపులకు సంబంధించి నిన్న సమావేశంలో అనుకున్నాం కదా, వాటిలో ఇవీ చేర్చాలి, రాసుకుంటావా?' అన్నాడు జేబులోంచి చిన్న డైరీ తీస్తూ.

సాధన తన బ్యాక్‌పోచ్‌లోంచి లిస్టు తీసి సాగర్ చెప్పిన వివరాలు రాసుకుంది. వాచీకేసి చూస్తూ,

'మీ అమ్మావాళ్లు రావల్సిన టైం అయినట్లుంది కదా' అని సాధన అంటూనే వుంది, ఇంతలోనే దూరంనుండి వస్తున్నవాళ్లను చూసి సాగర్ లేచి నుంచున్నాడు. సాధనా లేచింది.

'సరిగ్గా పదహారు సంవత్సరాలు' సాగర్ మనసులోనే లెక్కించుకున్నాడు ఏ పదోసారో.

సాధన 'భవానీ' అని పిలిచింది.

టెంట్‌లో తూటాల లెక్కలు, పంపకాలూ చూస్తున్న భవాని అవన్నీ రాజును పూర్తి చేయమని చెప్పి గబగబా బైటకొచ్చింది. భవాని సాగర్‌కేసి చూసింది. సాగర్ చూపు మాత్రం వచ్చేవాళ్ల మీదే ఉంది. భవాని కూడా అటు చూసింది. ఒక్కసారిగా ఉద్వేగానికి లోనయ్యింది.

చేతులు కలిపి లాల్‌సలాం చెప్పడం అవ్వగానే సాగర్, భవాని అమ్మ దగ్గరకు వెళ్లారు. 'బాగున్నావామ్మా' అంటూ అమ్మ భవానిని దగ్గరకు తీసుకుంది. భవాని తలూపింది. వెనక సిగ్గుగా నుంచుని వున్న మానసని అమ్మ చేయి పట్టుకుని ముందుకు లాగి,

'ఇదుగో, మీ మానస' అంది.

సాగర్, భవానీ మానసని దగ్గరకి తీసుకున్నారు.

అప్పటివరకూ వాళ్లనే చిరునవ్వుతో చూస్తూ అక్కడే నుంచుని వున్న సాధన టైం చూసుకుని కిచెన్‌కేసి నడిచింది.

భవాని అందర్నీ టెంట్‌లోకి తీసుకెళ్లి కూచోమని జాగా చేసి మంచినీళ్లందించింది. కుశల ప్రశ్నలు నడుస్తున్నాయి గానీ సాగర్, భవానీల చూపులు అటూ ఇటూ తిరిగి పదేపదే మానస మీదే నిలుస్తున్నాయి. మానస పెద్దవాళ్ల మాటలు వింటూ తల వంచుకుని కూచుంది.

'నాన్న దగ్గర కూచో మానసా' అంది అమ్మ. మానస తలెత్తి చూసింది గానీ కదలలేదు.

'వుండనీలే అమ్మా, అంతా కొత్తగా వుంటుంది తనకి' అన్నాడు సాగర్.

పదహారు సంవత్సరాల క్రితం ఏడాది పాపను అప్పగించడానికి కలిశారిలాగే అమ్మావాళ్లని. సాగర్‌తో పాటు చిన్నప్పుడు కలిసి పెరిగిన మేనత్త కూతురు లలిత పాపను పెంచుకుంటానని ముందుకొచ్చింది. తనకిద్దరూ మగపిల్లలే. ఆడపిల్ల కావాలని లలిత కోరిక కానీ భర్త అకాలమరణం పాలవడంతో ఒంటరిదైంది. జరుగుబాటుకు ఏం ఢోకా లేదు, పొలం, తోటా వున్నాయి. సాగర్ పార్టీలోకి పోకుంటే నిజానికి వారిద్దరి పాపే అయ్యేది కదా అని కూడా లలితకు అనిపించింది. పాప ఆగమనం లలితకు ఏమిచ్చిందో బహుశా ఎవరికీ అర్థం కాదేమో. ఇద్దరు కొడుకులూ 7, 9 తరగతులకు వచ్చారప్పటికే. పాప ఏడుస్తోందని ఇక ఏం చేయాలో అర్థం కాక రొమ్మునిచ్చినప్పుడు మళ్లీ తనకు పాలు రావడం అనేది కుటుంబంలో అందర్నే కాదు లలితనూ విభ్రమపరిచింది. అప్పటినుండి పాప పట్ల అలవికాని మమకారం పెంచుకుంది లలిత. మధ్యలో వచ్చిన ఒకటి, రెండు ఉత్తరాల ద్వారా ఇవన్నీ సాగర్, భవానీలకు తెలిసిన విషయాలే. ఎన్నోసార్లు తాము కన్న తల్లిదండ్రులమే కానీ నిజంగా తల్లీ, తండ్రీ అన్నీ పాపకు లలితే అని వాళ్లిద్దరూ అనుకునేవారు కూడా.

'లలిత కూడా రాగల్గితే ఎంత బాగుండేది' భవానీ మళ్లీ అంది.

'ఒళ్లు తెలీని జ్వరం. పిలిపించింది మీరు కాకుంటే అసలు తనని వదిలి ఇలా రావల్సిన స్థితి కాదు' అన్నాడు నాన్న.

'మాకూ ఇక కుదరదు నాన్నా, వేరే ప్రాంతానికి మారుతున్నాం ఇక్కడినుండి'

అమ్మా, నాన్నా తలూపారు.

సాధన, రాజు వాళ్లు అక్కడికే నాస్తా, ప్లేట్లు పట్టుకొచ్చారు. భవాని అమ్మావాళ్లు తెచ్చిన రెండు క్యారియర్లనూ బరువుగా ఎత్తి సాధనకు అప్పగించింది.

'అమ్మా, ఈ నెలరోజుల్లో మేమంతా ఒక్కొకరం కనీసం రెండు కిలోల బరువు పెరిగి ఉంటామేమో' అంది సాధన నవ్వుతూ.

'చాల్లేమ్మా, దీనికే లావు అవుతారా, ఏదో మనసు వుండబట్టలేక తెస్తాం గానీ మీకేమూలాలకూ ఇవి, ఎన్నడు రుచి చూశారో, కడుపునిండా ఎప్పుడు తిన్నారో, మీరు తినడంకంటే కావల్సింది ఏముంది' సాధన చెంపలు నిమురుతూ అంది అమ్మ.

'సగం బరువు పెరిగింది సంతోషంతో ఉబ్బిపోయి కూడాలేమ్మా' అన్నాడు సాగర్ సాధనకేసి నవ్వుతూ చూస్తో.

అందరూ నవ్వుకున్నారు. నాస్తా తర్వాత చాయ్ కూడా అక్కడికే రప్పించింది సాధన. అమ్మా, నాన్నల ప్లేట్లు, గ్లాసులు కూడా సాగర్ తీసుకెళ్లి కడుగుతూ వుంటే మానస కన్నార్పకుండా చూసింది.

భవాని మానస దగ్గర కూచుంది. పదహారు సంవత్సరాల్లో జరిగిపోయిన ఎన్నో సంఘటనలు, బంధువుల్లో ఎవరు ఏం చేస్తున్నారు, మధ్యలో మానస, లలిత, వంశీ, వికాస్‌ల విషయాలు అన్నీ దొర్లిపోతున్నాయి కబుర్లలో. మానస అన్నీ శ్రద్ధగా వింటోంది. తననేమైనా అడిగితే పొడిపొడిగా జవాబు చెప్తోంది గానీ కల్పించుకుని ఒక్క మాట కూడా మాట్లాడ్డం లేదు.

ఎన్ని మాట్లాడ్తున్నా, ఎన్ని వింటున్నా సాగర్, భవానీల ఆలోచనలూ, చూపులూ అన్నీ మానస చుట్టూనే తిరుగుతున్నాయి.

'ఎంత ఎదిగిపోయింది, చిన్నారి పసిపాపగా ఎన్ని ముద్దులు మూటగట్టేది మానస. తనని వదలడానికి ఎంత ఘర్షణపడింది తను! కనేటప్పుడే పెంచడానికి ఇవ్వాల్సి ఉంటుందని తెలిసినా, ఇవ్వాల్సి వచ్చినప్పుడు అనుభవించిన క్షోభ పగవాళ్లక్కూడా వద్దనిపించేసింది. ఈ పదహారు ఏండ్లలో ఎన్నిసార్లు ఏ అర్ధరాత్రో పసిపాప తన పక్కనే తారాడినట్లే అనిపించి నిద్రలేచిందో. పద్మ కలిసినప్పుడైతే దాపరికాల్లేవు కనక కళ్లల్లో నీళ్లు కూడా తీసేది గుర్తు చేసుకుని. పాప కోసం తన పార్టీ బాధ్యతల్ని వదిలే ప్రసక్తే లేదు, తనలా జీవించలేదు ఒక క్షణం కూడా. అలాగని ఈ మమతని మరవడమూ తనవల్ల కాలేదు. సాగర్ మనసులో ఏమున్నా గానీ తనలా బైటపడేవాడు కాదు. తను పాప గురించి మాట్లాడ్తుంటే ఏమీ అనేవాడు కాదు, ఓపిగ్గా ఎన్నిసార్లయినా ఆ ఏడాది పాప కబుర్లు చెప్తుంటే వినేవాడంతే. తనకే అనిపించేది ఎన్నిసార్లు అవే అవే చెప్తున్నా అని. ఇన్నాళ్లకు కనిపిస్తోంది దాచుకున్న ఆ ప్రేమంతా...' సాగర్‌కేసి చూస్తూ భవాని మనసులో సుళ్లు తిరుగుతున్న ఎన్నెన్నో జ్ఞాపకాల గుర్తులు.

'చిట్టితల్లి ఎంత చక్కగా ఎదిగింది. ఏడాది పాపగా తను ఎత్తుకుని ముద్దాడిన పాపేనా ఈ మానస? నిజంగానా? ఎంత దగ్గరగా అనిపిస్తోంది, మళ్లీ అంతే దూరంగా అనిపిస్తోందేంటి? పదహారు సంవత్సరాల ఎడబాటు..చెట్టంత నాన్నని వుండి కూడా నాన్న ప్రేమకు దూరమై పెరిగింది బుజ్జితల్లి....' సాగర్ కళ్లు చెమర్చాయి. వెంటనే చూపు మరల్చుకున్నాడు, భవాని తనని గమనించిందని అర్థమై చిన్నగా నవ్వాడు.

ప్రయాణపు బడలిక తీరితే తిరిగ్గా మాట్లాడుకోవచ్చంటూ సాధన అమ్మనీ, మానసనీ స్నానాలకు తీసుకుపోయింది. నాన్నని కూడా తన గార్డు రమేష్‌తో స్నానానికి పంపించాడు సాగర్.

'లలితకు బాలేదు కదా, ముందు మనం కబురు చేసినట్లుగా రెండు రోజులుండడం కష్టమే అంటున్నారుగా అమ్మావాళ్లు'

'అదే, మనమేమో అలా అనుకుని మన అపాయింట్‌మెంట్లు కూడా మార్చుకుంటిమి, పోనీ మానసను వుంచమందామా?' భవానీ గొంతులో ఆశ.

సాగర్ నవ్వాడు, 'తను వుండద్దూ, చూశావుగా ఎంత బెదురుగా వుందో'

'నువ్వు మరీలే, కొత్తగా వుండంతే తనకి' భవానీ సమర్థిస్తూ.

'సరేలే, దానికంటే కూడా లలితకు బాలేదంటే తనూ వెళ్లాలనే కోరుకుంటుంది కదా, ముద్దుల కూతురు, ఆందోళనా వుంటుందిగా'

'అంతేలే, మనమూ ఆపకపోవడమే మంచిదేమో'

'అనుకోని పరిస్థితి కదా, ఏం చేస్తాం. రేపు వెళ్తామంటే పంపిద్దాం మరి, అసలు లలితకేమౌతుందో అని కూడా భయంగా వుంది నాకైతే. మంచి ఆసుపత్రి అని అంటారు గానీ ఇవ్వాళ్రేపు అవే ప్రాణాల్ని తీస్తున్నాయి'

'లలితకేమైనా అయితే మానస..?'

' '

' నాన్న లేకుండా పెరిగి అమ్మ కూడా లేకుండా అవుతుందేమో.....'

'ఎందుకు భవానీ మనకీ కొత్త సెంటిమెంట్లు? ఏం చేస్తాం, ఏం చేయగలం? ఇక్కడ మన పిల్లలతో అసలు పోల్చగలమా? ఎంత బాగా పెరుగుతున్నట్లు లెక్క, రాజకీయంగా ఎదుగుదలని వదిలేస్తే'

'ఏం చేస్తాం, ఏమీ చేయలేం, ఏం చేయం కూడా. రేపట్నుంచి వాళ్ల ప్రపంచంలో వాళ్లు, మన ప్రపంచంలో మనం' నిట్టూర్చింది భవాని.

'అదే, ఈ రెండు ప్రపంచాల్నీ కలిపే లింకుని ఇన్ని రోజుల అడవి జీవితంలో ఏర్పర్చుకోలేకపోయాం కదూ'

'పార్టీ అంటేనే ఎన్‌కౌంటర్లనీ, నిర్బంధం అనీ భయపడే లలితకు పెంచుకోడానికి ఇవ్వడం వల్ల మనకు నష్టం జరిగిందని అనిపించడం లేదా?'

'జరక్కేం, అమ్మావాళ్లు లేకుంటే మానసకి కనీసం మన ఉనికి కూడా తెలీకుండా పెంచేదే పిచ్చిది. వ్యక్తిగతంగా ఎంత అనురాగంగా వుంటుందో అంత పిరికిది. మానసకి మన గురించి సరే అసలు జీవితం గురించి ఏం భయాలు నూరిపోసిందో ఏంటో పల్లెటూరి పిల్ల'

'ఇప్పుడెలా రానిచ్చిందో'

'వాతావరణ మార్పుల్ని ఇలాంటి వాళ్లు బాగానే పసిగడ్తారు సుమా, ఏం జరగదని అర్థమై వుంటుంది. లలిత సంగతి మనకి అప్పుడే తెలిసినా అప్పుడు మన ముందు వేరే మార్గం కూడా లేకుండింది కదా, ఏ సానుభూతిపరుల్నో చూసి ఇద్దామంటే కాకపోయె, ఇంకా ఎక్కువ రోజులంచుకునే స్థితీ మనకు లేకుండె...'

'అదీ ఏం గ్యారంటీ లేదులే. పద్మా వాళ్ల కృష్ణని సానుభూతిపరులని చెప్పే ఇచ్చారు కదా. వాళ్లు ఆయింత పార్టీ గురించీ, ఉద్యమాల గురించీ ఏం తెలీకుండా పెంచారు వాడిని. తెలిస్తే ఎక్కడ విప్లవకారుడ్ని అవుతానంటాడో అని వాళ్ల భయం. వాడి కెరీర్ గురించి ఏవేవో వ్యూహారచనలు. తెల్వని వాళ్లది అజ్ఞానం అనుకోవచ్చు, తెలిసినవాళ్ల అతితెలివిని ఎలా ఎదుర్కోవాలి?'

'అందరూ అలా లేరనుకో'

'అందరూ అని కాదు. కనీసం కృష్ణకి పార్టీ గురించి తెలీకుండా, అదంటేనే ఏదో భయం వేసేట్లుగా పెంచడం ఎంత ఘోరం. పెద్దయ్యాక ఏ జీవితం కావాలో వాడు తేల్చుకుంటాడు కదా. పార్టీ గురించి తెలీనివ్వకపోవడం అంటే జీవితం గురించీ సరియైన ఆలోచన లేకుండా చేయడమే అని వాళ్లకెందుకు అర్థం కాదు? పార్టీ గురించి తెలీడం అంటే పూర్తికాలం కార్యకర్త కావడానికేనా? మార్క్సిజం అంటే ప్రపంచాన్ని అర్థం చేసుకోవడానికి జీవితానికవసరమైనది కాదూ? వాళ్లకి స్వయంగా తమ జీవితాల్లో అది తెచ్చిన మార్పు ఏంటనేది తెలిసి కూడానా?' భవాని గొంతులో లేశమాత్రంగా ఆవేశం.

'కెఎస్ అనేవారంట కదా పాత కమ్యూనిస్టులు మరింత ప్రమాదకరం, దోపిడీ కిటుకులు తెలిసి మరింత అదనపు విలువని పిండుతారని. వీళ్లు రివిజనిస్టులు కాకున్నా ఇదో రకం తప్పుడు ఆలోచన, ఆచరణ, నిజానికి బైట సమాజంలో పెరిగినా సంధ్య, వినోద్, సుజాతలాంటివాళ్లు వాళ్ల అమ్మా, నాన్నల బాటని ఎంచుకుని పార్టీలోకి వచ్చి పని చేయడం లేదూ, వాళ్లని చూసినప్పుడు చాలా సంతోషంగా, గొప్పగా అనిపిస్తుంది. మానసలాంటి వాళ్లయినా రేపు రేపు తమకు తాము తెలుసుకుంటే వస్తారు, లేకుంటే ఇక అంతే'

'అదే, తెలుసుకోడానికి వీళ్లు అడ్డం పడ్తున్నారు కదా అని. స్టాలిన్ కూతురు ఆయనకు వ్యతిరేకంగా తయారైంది, చరిత్ర తెలీక కాదు, మనకు పుట్టినంత మాత్రాన విప్లవకారులవుతారనీ అనుకోం గానీ నాకు గమ్మత్తనిపించేదేంటంటే వీళ్లంతా ప్రజాస్వామ్యం, స్వేచ్ఛల గురించి మనకు చెప్తూ వుంటారు. చెప్పద్దని కాదు గానీ మరి పిల్లల్ని ప్రజాస్వామ్యయుతంగా, స్వేచ్ఛగా పెంచడం అంటే ఇదేనో, బూర్జువాల ప్రభావానికి లోనవ్వమని దిక్కులేకుండా వదిలేయడమేనో?'

'వాళ్లు తెలిసి చేసినా తెలీక చేసినా వాళ్ల భయాలతో, స్వార్థంతో పిల్లల్ని బూర్జువా సమాజం ప్రభావంలోకే తోసేస్తున్నారనేది స్పష్టమే. సర్లే, వాళ్ల గురించి మళ్లీ చర్చించుకుందాం గానీ మానసతో ఏం మాట్లాడదాం?'

'అది మాట్లాడదామని మొదలుపెట్టి ఎటో పోయాం కదూ, నువ్వే చెప్పు, తనకెంత కొత్తగా ఉందో మనకీ అంతే కొత్తగా వుంది కదా'

'ఊ'

'ఏముంది, వేర్వేరు కుటుంబాల్లో ఇలా పెరుగుతున్న పిల్లలందరితో ఏం మాట్లాడ్తున్నామో అదే మాట్లాడదాం, అనుకున్నదే కదా'

'అనుకున్నదే గానీ మళ్లోసారి అడుగుదామని. నువ్వే మాట్లాడ్తావుగా'

'నేనా? నువ్వే మాట్లాడు, ఏమన్నుంటే నేను అందిస్తాలే. నువ్వే తనని ఎక్కువ ఎత్తుకున్నావు కనక నీకే ఛాన్సు' అంది భవాని ఆటపట్టిస్తూ.

'ఇంకా మర్చిపోలేదా? సరేలే ఇద్దరం కలిసే మాట్లాడదాం' అన్నాడు సాగర్ నవ్వుతూ.

'నేనేదీ మర్చిపోలేదు' భవాని మనసులోనే అనుకుంది.

'పద మరి, సాధనకు చెబ్దాం. వీళ్ల ప్రయాణం ఏర్పాట్లు చేయాలిగా'

* * *

చీకటి కావొస్తుంది. సాయంత్రం ఆరుంబావు వార్తలు విన్నాక సాధనని పిలిచి,

'కాస్సేపు అమ్మా, నాన్న వాళ్లతో కూచుని మన విషయాలూ అవీ చెప్తావా? చర్చల విషయంలో కూడా అపోహలూ అవీ లేకుండా రాబోయే కాలం ఎలా వుంటుందో కూడా వాళ్లకి మరోసారి నువ్వు చెప్పు, డివిజన్ విషయాలు ప్రత్యేకం ఏం చెప్పలేదు నేను, అవీ చెప్పు. నేనూ, భవానీ మానసతో కూచుంటాం' అన్నాడు సాగర్.

'మంచిదిలే విడిగా మాట్లాడ్తే కూడా. రాగానే బెరుగ్గా వున్నా మానస సాయంత్రం వరకూ కాస్త ఫ్రీ అయ్యింది. తెలివైందే మొత్తానికి'

'అదే, అందుకే ఆ తెలివిని కాస్త ప్రజల కోసమూ ఉపయోగించమని చెబ్దామనే'

'అంతేనా, ఇంకేం మాట్లాడరా?'

'ఇంకేముంటుంది, నిజంగానే నాకింకేం తోచడం లేదు, పోనీ నువ్వు చెప్పు, ఏమన్నుంటే మాట్లాడదాం'

సాధన ఒక క్షణం ఏమనలేదు.

'అంతేలే, ఇంకేముంటుంది' అని నవ్వేసి అమ్మా వాళ్లున్న టెంట్‌కేసి నడిచింది.

మానసని తీసుకుని బయలు ప్రదేశంలో మంచి గాలి వీస్తున్న దగ్గర పాల్తీన్ వేసుకుని కూచున్నారు సాగర్, భవాని.

మానసలో ఉదయం వున్న సంకోచం కొంచెం తగ్గింది. ఉపోద్ఘాతంగా అవీ, ఇవీ మాట్లాడి అసలు విషయంలోకి దిగారు.

'ఇంటర్ అయ్యాక ఏం చేద్దామనుకుంటున్నావు?'

'ఏమో, మార్కులు రావాలిగా'

'బాగానే చదువుతున్నట్లున్నావుగా'

'ఊ, నా ప్రయత్నం నేనూ చేస్తున్నా, లక్ వుండాలిగా'

భవాని లక్ అనే మాటకి నవ్వి, 'అది కాదురా, నీకంటూ ఒక లక్ష్యం ఉంటుంది కదా అని అడుగుతున్నాం'

'ఏమో నాకీమధ్య ఏం చూస్తే అదే చేయాలనిపిస్తోంది. ఫొటోగ్రఫీ అంటే ఇష్టం, నేషనల్ జియోగ్రఫీలాంటివి చూసినప్పుడు అలాంటి దాంట్లోకి వెళ్లాలనిపిస్తుంది, కంప్యూటర్‌లోకి వెళ్తే యానిమేషన్ చేయాలనిపిస్తుంది. మళ్లీ ట్రావెలింగ్ కూడా ఇష్టమే. బయాలజీలో ఎప్పుడూ ఎక్కువ మార్కులొస్తాయి కనక అదీ ఇష్టమే...' గబగబ ఇవన్నీ చెప్పేశాక ఎందుకో మానసకి సిగ్గనిపించి వాళ్లిద్దరినీ ఓరకంట చూసింది.

మానస మాటలకి భవానీ, సాగర్ ఇద్దరూ పకపకా నవ్వారు. మానసా నవ్వింది.

'బైపిసి తీసుకుంటే మెడిసిన్ వైపు ఆలోచిస్తున్నావేమో అనుకున్నాం'

'అవును, నిజానికి అలా అనే తీసుకున్నా, కానీ కెమిస్ట్రీలో తక్కువ మార్కులొస్తున్నాయి, దాంతో ఆలోచనలు అటూ ఇటూ అవుతున్నాయి'

'సరే అది సరిచేసుకోవచ్చు కానీ నీకంటూ అసలు ఏం కావాలని వుందని?' మళ్లీ అడిగింది భవానీ.

'అలా అయితే మెడిసినే'

'మెడిసినే ఎందుకు చేయాలని?' సాగర్ సూటిగా.

'అంటే?'

'అంటే అందులో బాగా డబ్బులొస్తాయనా? ఫారిన్ వెళ్లచ్చనా? లేక అందులో ఇంకా కొత్తవి ఏమైనా పరిశోధించాలనా? ఏంటని?'

మానస ఏం మాట్లాడకుండా తలొంచుకుని గడ్డి పరకలు పీకడం మొదలెట్టింది.

'లేక ప్రజలకు సేవ చేయాలనా?' అందించింది భవాని.

మానస తలెత్తి, 'ఆ - అది కూడా' అంది.

'అది కూడా అంటే అసలుది ఏంటి? డబ్బులొస్తాయనా?'

'ఛ కాదు. అమ్మ చిన్నప్పటినుండి నువ్వు డాక్టర్ కావాలి అని అంటూ వుండేది, వంశీ అన్నయ్య అమెరికాలో వున్నాడు కదా అక్కడ చదివిస్తాను అని ఎంకరేజ్ చేశాడు, వికాస్ అన్నయ్య ఆస్ట్రేలియా అయినా వెళ్లచ్చు అన్నాడు....'

'వాళ్లకిష్టమని చేస్తావా? నీకిష్టమనా?' సాగర్ వదల్లేదు.

'ఇద్దరికీ'

భవాని కళ్లతోనే వారించింది మరీ రెట్టించద్దని. సాగర్ ఏం కాదన్నట్లు నవ్వి,

'చాలా మంచిదిరా, కానీ మరి మెడిసిన్‌లో సీటు రావాలంటే చాలా కష్టపడాలి కదా, చదువుతున్నావా మరి? కోచింగ్‌ల మీద ఆధారపడ్డామనుకుంటున్నావా?'

'ఊహు, నాకు చిన్నప్పటినుంచీ ట్యూషన్‌లు అలవాటు లేదు, ఎప్పుడైనా అర్థం చేసుకునే రాస్తాను, బట్టీ కొట్టడం నాకు చిరాగ్గా వుంటుంది'

భవాని మెచ్చుకోలుగా చూసుకుంది కూతుర్ని. 'మంచిదిరా, అలాగే చదువు, సీటు వచ్చినా రాకున్నా మనకు రావల్సింది జ్ఞానం' అంది భుజం తడుతూ. మానస బుద్ధిగా తలూపింది.

ఇక అప్పుడు మొదలుపెట్టాడు సాగర్ - దేశంలో పేదవాళ్ల అనారోగ్యానికి కారణాలు దారిద్ర్యమేననీ, అది పోవడం కోసమే తనూ, అమ్మలాంటి వాళ్లూ ఎందరమో పోరాడుతున్నామనీ, మానస కూడా ఆ పోరాటం గురించి తెలుసుకుని అందులో చేరడం విషయం ఆలోచించాలనీ, అలా కాకుండా మెడిసిన్ చేసినా ప్రజలకు సేవ చేయడం అనేది వుండాలి తప్ప డబ్బూ, ఫారిన్ వెళ్లటాలూ ప్రధానం చేసుకోవద్దనీ, డాక్టర్ అయితే ఇక్కడి ప్రజలకే సేవ చేయడానికి సిద్ధపడాలనీ...ఇలా చాలాసేపు మానసకి అర్థమవుతాయనుకున్న కోణాలన్నిటినీ వెలికి తీస్తూ మాట్లాడాడు. భవాని కూడా తాము పని చేస్తున్న ఆదివాసీ ప్రాంతాల్లో ప్రజల దుస్థితి గురించీ, వారికి అంకితభావం గల డాక్టర్ల అవసరం గురించీ అనేక సంఘటనలన్నీ గుదిగుచ్చి మధ్య మధ్యలో సాగర్ చెప్పే విషయాలకు అందిస్తూ వచ్చింది.

మానస ఏం మాట్లాడకుండా తలొంచుకుని గడ్డిపరకల్ని తెంపుతూ అన్నీ విన్నది.

మరీ ఎక్కువ మాట్లాడ్డం కూడా అనవసరం అనీ, తాము చెప్పిన విషయాలు తనలో ఆలోచనని రేకెత్తిస్తే చాలనీ ముందే అనుకున్నారు కనక ఇద్దరూ తాము చెప్పాలనుకున్నవి క్లుప్తంగా చెప్పి ఇక ఆపారు.

'ఏరా, ఆలోచిస్తావు కదా' అడిగింది భవాని ముక్తాయింపుగా. మానస తలూపింది.

మళ్లీ కాసేపు మానస ఫ్రెండ్స్ గురించీ, వాళ్ల లక్ష్యాలు, ఆలోచనలూ ఎలా వున్నాయనే దాని గురించీ సాగర్, భవాని అడిగి తెలుసుకున్నారు. అడవి జీవితంలో వున్న వారికి నగరాల్లో విద్యార్థుల ఆలోచనల తీరుతెన్నులు దగ్గరగా తెలుసుకోడానికీ ఇదో మార్గం అయ్యింది. నేటి విద్యార్థుల్లో కెరీర్‌కి సంబంధించిన ఆలోచనలే ప్రధానంగా వున్నాయనేది వారికి అర్థమైంది. అదే సమయంలో స్నేహానికి చాలా ప్రాధాన్యం ఇచ్చే ఒక లక్షణం కూడా వుందని అర్థమై సంతోషించారు. మానసలో ఆ గుణం వుండడం వారికి ఊరటగా తోచింది.

'మానసా, మనిషి మూడు విషయాల్ని నిరంతరం కాపాడుకోవాలి. నీ శారీరక, మానసిక ఆరోగ్యాల్ని కాపాడుకో. అంతకంటే ముఖ్యమైనది జీవితంలో నైతిక విలువలు. ఇవి లేకుంటే మిగతా రెండూ వుండవు, వున్నా వుపయోగం వుండదు. నైతిక విలువల విషయంలో మాత్రం ఎన్నడూ రాజీ పడద్దు, మేం నీకు ఇవ్వగలిగే అతి ముఖ్యమైన సలహా ఇదే మరి' అంది భవాని చివరగా.

'నైతిక విలువలు అంటే అర్థమైందిగా, ముఖ్యంగా తోటి మనుషుల విషయంలో ఉండాల్సిన వర్తన. మోసం, దగా లేకుండా జీవించాలి, సమాజానికి మేలు కలిగేలా......'

'తెలుసు' అంది మానస.

* * *

'ఏంటో అంతా కలలాగ వుంది'

'వూ'

'అప్పుడే అమ్మావాళ్లూ, మానసా వచ్చి వెళ్లడం అయిపోయిందా అనిపిస్తుంది'

'నీకు సంతోషంగా వుందా'

'నీకు లేదూ'

'ఎందుకు లేదూ, కానీ ఏంటో కనిపించని దూరాలేవో వున్నాయనిపిస్తుంది'

'కనిపించనివి కావు, చాలా స్పష్టంగా కనిపించేవే, కాదా'

'వూ. మానసని మళ్లీ ఎలాగైనా కాంటాక్టు చేస్తూ వుంటే బాగుంటుందనిపిస్తుంది'

'సాధ్యం కాని ఆలోచనలు ఎందుకు, అయినా నేను సంజీవ్‌కి రాస్తాను. తనకి సీటు వస్తే వాళ్లు తప్పక సిటీలో కాంటాక్టులో వుంచుకుంటారు. ఏదో ఒక సంఘంలో పని చేయిస్తారు లేదా కనీసం మన విషయాలు అర్థం చేయిస్తారు, మానస సంసిద్ధతను బట్టి'

'అబ్బో! సంజీవ్ వాళ్లయితే ఏ మాత్రం స్పార్క్ వున్నా వదలరులే'

'వాళ్లిప్పుడే వెళ్లారు కనక మనం ఇంతసేపు మాట్లాడుకుంటున్నాం గానీ కొత్త ఏరియాకి వెళ్లాక అన్నీ లోతుగా అధ్యయనం చేసి అర్థం చేసుకోడంలో పడిపోతాం కనక మనకు తల్చుకోడానికి కూడా సమయం దొరకదు'

'నిజంగా చెప్పు సాగర్, దాచకుండా...నీకు ఎలా అనిపించింది, ప్రత్యేకంగా ఏమన్నా అనిపించిందా లేదా? లోపల ఏమన్నా కదిలిందా లేదా'

'తెలుసుకుని ఏం చేస్తావు?'

'అబ్బా, చెప్పరాదు'

'నువ్వు చెప్పు, అందరూ అంటారు కదా కన్నపేగు అని, నీకు ఎలా అనిపించింది?'

'నీతో ఇదే చిక్కు, నేను నిన్ను అడిగితే..'

'ఏం చెప్పను, ఒకే సమయంలో చాలా దగ్గరగా, మళ్లీ దూరంగా కూడా అనిపించింది. మళ్లీ మళ్లీ కలవగల్గితేనో, లేక ఉత్తరాలైనా రాయగల్గితేనో తప్ప ఆ దగ్గరితనం గాఢమవ్వదేమో అనిపిస్తుంది, మనకా అవకాశం ఎలాగూ లేదు. కానీ మనం కన్న పాప ఇంత ఎదిగింది అని చూసుకోవడం మాత్రం ఇంకే విషయంలోనూ కలగని చిత్రమైన ఒక ఆనందాన్ని ఇచ్చింది, ఆ ఉల్లాసం ఇంకా లోపల గెంతులేస్తున్నట్లే వుంది. తను సమాజానికుపయోగపడేలా కనీసంగా మారకపోతే మాత్రం ఇది పోతుందనీ అనిపిస్తుంది......సర్లే, నువ్వు చెప్పు ఇక'

'నేను చెప్తానని నీకేం వాగ్దానం చేయలేదు కదా'

'నాతో అన్నీ చెప్పించుకోవడమే ఎప్పుడూ, తప్పించుకున్నావు దొంగా'

* * *

'కొత్త ప్రాంతం' అనేది భవానీకే గానీ సాగర్‌కి అది పాత ప్రాంతమే. తను మొట్టమొదట డిప్యూటీగా, తర్వాత కమాండర్‌గా పని చేసిన ప్రాంతం అదే. తర్వాత పార్టీ అవసరాల రీత్యా అడవిలోకి మార్చాక అక్కడే వుండిపోయాడు. పాపను వదిలాక భవాని కూడా అక్కడికే వచ్చింది. అన్ని సంవత్సరాల అనుబంధం గల ప్రాంతాన్ని వదలడం భవానికి కొంచెం కష్టంగానే తోచినా కొత్త ప్రాంతంలో అనుభవాల కోసం కూడా మనసు ఏకకాలంలో ఉరకలు వేస్తోంది. అన్నిటికంటే తనకి ఉత్సాహాన్ని ఇస్తున్న విషయం తన ప్రాణస్నేహితురాలు పద్మని ఏడాదికొకసారైనా కలిసే అవకాశం వుంటుందనే విషయం. ఇప్పుడు ఇద్దరూ ఒకటే జోన్‌కి చెందుతారు.

పట్టణ ఆర్గనైజర్‌గా వుంటూ మొట్టమొదటిసారిగా దళజీవితాన్ని మొదటిసారిగా చవి చూపిన ఆ పాత ప్రాంతానికి వెళుతుంటే సాగర్‌కి ఒకలాంటి ఉద్వేగంగా, తెలీని ఉత్సాహంగా వుంది. అక్కడే తను దళజీవితంలో అ,ఆ లు నేర్చింది. అక్కడ ప్రజలూ, వారి కష్టసుఖాలు అన్నిట్లో తనకి సంబంధం వుండేది. ఎన్ని ఇండ్లల్లోనో తనకు ఒక్కొక్కరి గురించీ పూర్తి అవగాహన, అంచనా వుండేది. ఇప్పుడు వాళ్లందరి గురించీ మళ్లీ ప్రత్యక్షంగా తెలుసుకోవచ్చు. పద్మా, ఇతరులూ అరుదుగా రాసే వుత్తరాల్లో కొన్ని విషయాలు తెలిసినా అందరి గురించీ పేరుపేరునా అడిగి తెలుసుకునే అవకాశం మాత్రం కలిగబోతోంది ఇప్పుడే. కొందరు సంఘనాయకులు అమరులైపోయారు, కొందరు పార్టీలోకి వచ్చేశారు. కొందరు దిగజారిపోయారు. తీవ్ర నిర్బంధాన్ని ఎదుర్కొన్నారు అయినా మొత్తంగా పార్టీతోనే నిలిచారు. తాము వేసిన పునాదులు ఇప్పటికీ తమకు ఉపయోగపడ్తున్నాయని అక్కడి కామ్రేడ్స్ రాసినప్పుడు ఎన్నోసార్లు అక్కడకి ఒకసారి వెళ్లగలిగితే అని వుగేవాడు సాగర్. ఇన్నాళ్లకి తన కోరిక తీరబోతోంది.

* * *

పద్మతో రోజంతా మాట్లాడినా ఇంకా ఏవో విషయాలు పుట్టుకొస్తూనే వున్నాయి భవానీకి. గంట దూరంలో వేరే ఎపిటికి వెళ్లి వచ్చిన సాగర్ కూడా ఇక జత కలిశాడు. తను తిరిగినప్పటి పూర్ల గురించీ, ఆ మనుషుల గురించీ సాగర్ అడుగుతూ పోతున్నాడు. అతని జ్ఞాపక శక్తికి ఆశ్చర్యపోతూనే పద్మ ఓపిగ్గా సమాధానాలు చెప్తూ పోతోంది. భవాని ఇక మూగ ప్రేక్షకురాలే అయ్యింది. చిరునవ్వుతో అన్నీ వింటోంది తనూ.

'శీనన్న అమరుడయినప్పుడు మస్తు బాధపడ్డా'

'ఆయన మీద నువ్వు రాసిన స్పందన చదివాను'

'ఎంత మంచి సంఘనాయకుడాయన, వాళ్ల పాపను ఎత్తుకుని వచ్చేటోడు ఎప్పుడూ'

పద్మ కళ్లలో తళుక్కున ఓ మెరుపు.

'గుర్తుందా నీకింకా?'

'నాకు గుర్తు లేకపోవడమేంటి? భవానికి కూడా చాలాసార్లు చెప్పాను, గుర్తుందా గంగ అని..'

'ఆ పాపనా? పద్మా! ఇప్పటికి ఏ వందసార్లు చెప్పి వుంటాడో నాకు, తనకి నిజంగా పెంచుకోవాలనిపించేదట ఆ పాపను. శీనన్నను అడిగితే ఈ పాప లేకుండా నేను బతకలేను అనేవాడట. అంత ప్రాణం అట కదా ఆయనకు'

'అవును. ఆయనను పోలీసులు పట్టుకొని చంపేనాటికి ఐదేళ్లు వుంటాయేమో గంగకు'

'అంటే ఇప్పుడు 20, 21 ఏండ్లు వుండచ్చు కదా, ఏం చేస్తోందో, చదువుకుంటోందో, పెళ్లి చేసేశారో, కలిస్తే బాగుండు'

'కలుస్తావా?' పద్మ గమ్మత్తుగా నవ్వుతూ.

'వేరే అడగాలా?'

'రేపు ఎపిటికి వెళ్లే దగ్గర వుంటుంది, చూడు, గుర్తుపడతావో లేదో చూస్తాం' అంది పద్మ సవాలు చేస్తూ.

సాగర్ కళ్లు ఆశ్చర్యంతో పెద్దగా అయ్యాయి. నిజమా అన్నట్లు చూశాడు పద్మకేసి. పద్మ నవ్వుతూ తలూపింది.

'నిజంగానా? గంగ పార్టీలోకి వచ్చిందా? ఎప్పుడు? నాకు చెప్పనేలేదు, ఎప్పుడు, ఎలా?' పట్టరాని సంతోషంతో మాటలు తడబడుతుండగా అడిగాడు సాగర్.

'రావడమే కాదు ఇప్పుడు తను కమాండర్'

భవానీ, పద్మా సాగర్ మొహం అంత సంతోషంతో వెలిగిపోవడాన్ని ఆనందాశ్చర్యాలతో చూస్తూ వుండిపోయారు. సాగర్‌కి సంతోషంతో మాటలు కూడా రావడం లేదు.. 'నిజమా, గంగ కమాండరా, రేపు కలుస్తదా అయితే' అని పదే పదే అంటూ మురిసిపోతుంటే పద్మా, భవానీ పకపకా నవ్వారు.

* * *

రాత్రి చుక్కల కింద పడుకుని ఆకాశం కేసి చూస్తూ ఉదయంనుండి కామ్రేడ్స్‌నుండి తెలుసుకున్న విషయాలన్నీ బుర్రలో తిరుగుతూ వుంటే మౌనంగా ఒకరి పక్కన ఒకరు, ఎవరి ఆలోచనల్లో వారు మునిగిపోయి పడుకుని ఉన్నారు సాగర్, భవాని.

సాగర్‌కి అన్నిటికంటే గంగ విషయమే చాలా ఆనందంగా వుంది. తను ఎత్తుకుని ఆడించిన పాప, తండ్రి అమరుడైనా ఏ మాత్రం వెనకడుగు వేయకుండా ఉద్యమంతోనే కొనసాగిందన్న మాట. శీనన్న జ్ఞాపకం గుండెను ఆర్ద్రంగా చేసేసింది. అక్కను తప్పక కలవాలి. భర్త చనిపోయినా కూతుర్ని వారించని ఆమె త్యాగాన్ని ఏ మాటల్లో కొలవగలం? అక్కకు మనసులోనే జోహార్లు అర్పించాడు.

'సాగర్, ఏమాలోచిస్తున్నావు'

'చెప్పుకో'

'ఊ...గంగ గురించి'

'అంత సరిగ్గా ఎలా వూహించావు'

'ఇన్నాళ్ల సహచర్యంలో ఆ మాత్రం వూహించకుంటే నేనెందుకూ'

'తెలుసా, ఆ పాపను ఎత్తుకుని శీనన్న ఎప్పుడు వచ్చినా వెళ్లేవరకూ.....'

సాగర్‌లో పొంగులు వారుతూ ఉబికి వస్తున్న ఆ 'పుత్రికోత్సాహాన్ని' చూస్తూ భవాని 'నేను విననంటే వినను, చాలాసార్లు చెప్పావు బాబూ' అంది నవ్వుతూ.

'నువ్వు చెప్తే ఎన్నిసార్లయినా నేను వినడం లేదూ, ఒక్కసారి వినచ్చుగా...'

సాగర్ 'కోపం' చూసిన భవానికి నవ్వాగడంలేదు.

'వూహు' అంటూ సాగర్ నోటికి చేయి అడ్డం పెట్టి నవ్వుతూనే వుంది.

(ఈ కథని నేను రాసింది 2009 మే 20-22 మధ్యలో. కా. పటేల్ సుధాకర్ రామన్నగా ఏటపల్లి కమాండర్‌గా వున్నప్పుడు ఎత్తుకున్న పాప పార్టీలోకి వచ్చి, నాయకత్వంలోకి ఎదిగిందని 2007లో అక్కడి కామ్రేడ్స్ తనతో చెప్పినప్పుడు తన ఫీలింగ్స్ గురించి ఆ కామ్రేడ్స్ తర్వాత ఎప్పుడో నాతో చెప్పిన విషయాలు దీనికి ప్రేరణ. ఆమెకు ఉత్తరం కూడా రాసి పంపాడట. తనకు చూపించాకే ఈ కథని ప్రచురణకు పంపిస్తే బాగుంటుంది అనుకున్నా. ఇప్పుడిక దీన్ని 'ఏటపల్లి కా. రామన్నకి ముచ్చటగా....')

*




◆ శ్రీనివాసరావు

# పెద్దకొడుకు

పగబట్టిన పాముగని అట్టానే చూస్తూ పడుకోనుండట్టు మన జీవితాలు కూడ అంతే, ఇండియాకు అధ్యక్షుణ్ణి కావడం కన్నా విరసానికి అధ్యక్షుడు కావడమే నాకు సంతోషం అన్నాడట శ్రీశ్రీ. ప్రపంచంలో ప్రజలకు అత్యంత మేలు చేసే పార్టీలో సభ్యుడిగా చనిపోవడమే నాకు ఆనందం అన్నాడంట స్టాలిన్, అట్టానే మనం గూడ ఎవరు ఎట్టా ఉన్నా కష్టమైనా నష్టమైనా మన జీవితాలు కూడ ఉద్యమం తోటే అన్నాడు జాన్ వేణు వైపు చూస్తూ. వేణు అట్లాగే జాన్ ముఖంలోకి చూశాడు. గతంలో తనెరిగిన జాన్‌కు ఇపుడు తను చూస్తున్న జాన్‌కు ఎంత తేడా అనుకున్నాడు. ఐదారేళ్ళ క్రితం ఏ చదువూ లేని కూలి పని చేసుకునే కూలి రైతు. ఏదో గుడ్డి నమ్మకంతో మీటింగులకు వచ్చేవాడు. తనను కలిసిన వాళ్ళు తనకు పనులు చెప్పిన వాళ్ళు, తన ఇంట్లో తిన్నవాళ్ళు, తన ఇంట్లో ఉన్నవాళ్ళు చివరకు తన కొడుకు కూడ విప్లవోద్యమంలో ప్రాణాలర్పించినా ధైర్యంగా ఇప్పటికీ ఉద్యమానికి తను చెయ్యగలిగిందేదో చేస్తున్నాడు. ఆ నిజాయితీ, విశ్వాసం, నిబ్బరం జాన్ ముఖంలో స్పష్టంగా కన్పిస్తున్నై. కాని అప్పుడప్పుడు ఎందుకో ఒక విధమైన ఇబ్బందిగా, వెలితిగా ఉంటుందన్నా ఇంటికెళ్ళి పని చేసుకుందామనిపిస్తుంది అన్నాడు జాన్ ముఖంలోంచి దృష్టి మరలుస్తూ వేణు.

నువ్వట్టాలోచించకూడదు, మంచి బతగ్గలిగే అవకాశం ఉన్నా మాలాంటి వాళ్ళ కోసం ఏదో చెయ్యాలని వస్తున్న మీలాంటి వాళ్ళను చూసి మేం చెయ్యగలిగిందేదో చేస్తున్నాం. అన్నీ తెలిసిన నువ్వే ఇట్టాలోచిస్తే మేమెట్టాలోచించాల? కనుక నవ్వట్టసలాలోచించద్దు. ఎప్పుడూ ఒకే రకంగా ఉండదు. ముప్పై ఏళ్ళ నుండి చూస్తున్నా. ఎప్పుడూ ఒక రకంగా లేదు. ఇప్పుడూ అంతే, ఇది ఇట్టాగే ఉండదు అన్నాడు వేణు భుజం మీద చెయ్యివేసి.

కొద్ది క్షణాలు వేణు అట్లాగే మౌనంగా ఉండిపోయాడు. ఒక అమృత హస్తమేదో వేణును ఊరడించినట్లనిపించింది. కొంతకాలంగా మనసు నిండా అలుముకున్న దిగులు ఏదో కొంత తొలగినట్లనిపించింది. మనసులో ఉన్న దుఃఖం మంచి వాళ్ళతో పంచుకుంటే కొంత భారం తగ్గుతుందేమో? పదేళ్ళుగా పనిచేస్తున్నాడు. కష్టాలు సుఖాలు అనుభవంలోకొచ్చాయి. నిర్బంధాలు, హెచ్చరికలు ఎదుర్కొన్నాడు. ఇప్పుడు మొత్తం నిరాశా పూరిత వాతావరణం అలుముకుంది. మనసులో ఉన్నవి మాట్లాడుకునే అవకాశం కూడ లేదు. అట్లా దిగులావహించి అచేతనంగా ఉన్న మనస్సుకు ఎందుకో జాన్ గుర్తుకొచ్చాడు. ఆ వెంటనే రమేష్ గుర్తుకొచ్చాడు. ఒక్కసారి జాన్‌ను కలుద్దామనిపించింది. ఫోన్ చేశాడు. రేపు కలుస్తానన్నాడు జాన్.

ఆగస్టు నెల రుతుపవనాల ప్రభావం అంత తీవ్రంగా లేదు. అప్పటి వరకు పల్చ పల్చగా ఉన్న మేఘాలు దట్టం కాసాగాయి. వాతావరణం చల్లగానే ఉంది. వాళ్ళ ముందున్న బండివాణ్ణి రెండు గ్లాసుల ద్రాక్షరసం ఇమ్మన్నాడు వేణు. జాతీయ రహదారి మీద వాహనాలు అటు ఇటు వెళ్తున్నాయి. వాళ్ళ వెనుక ఉన్న బస్టాండులోకి ప్రక్కనే దారి. ఆ దారి గుండా వెళ్ళే వాళ్ళు వెళ్తున్నారు. వచ్చేవాళ్ళు వస్తున్నారు. అటు ఇటు శనక్కాయల బండివాడు అప్పుడప్పుడూ వాళ్ళ వైపు చూస్తా వ్యాపారం చేసుకుంటున్నాడు. ఇటు పక్క ఆటోవాడు పమిడిపాడ్ పమిడిపాడ్ అని అరుస్తున్నాడు. ద్రాక్షరసం ఇచ్చాడు ఇద్దరూ మౌనంగా తాగుతూ కూర్చున్నారు.

వచ్చే అక్టోబర్‌కు సంవత్సరం అవుతుంది మనోడు చనిపోయి. ఏమైనా చేద్దామా అన్నాడు జాన్ తాగిన గ్లాసు కింద పడేస్తూ. అందుబాటులో ఉన్న వాళ్ళందర్నీ పిలిచి చిన్న సమావేశంలాగా జరుపుకోవచ్చు. ఒకసారి అందరం జ్ఞాపకం చేసుకున్నట్టుంటుంది అన్నాడు వేణు. ఊళ్ళో మన వాళ్ళు కూడ ఏదో ఒకటి చేద్దామంటున్నారు అన్నాడు జాన్ మళ్ళీ. ఒక ఏభై మందితో సభ జరుపుదాం అన్నాడు వేణు. సరేనన్నాడు జాన్.

ఆకాశం నిండా మేఘాలు దట్టంగా కమ్ముకున్నాయి. చిన్నచిన్నగా తుంపర్లు మొదలయ్యాయి. కొద్దిసేపట్లో పెద్ద వర్షంగా అయింది. అందరూ బస్టాండులో కెళ్తున్నారు. వేణు, జాన్‌లు కూడ బస్టాండులోకెళ్ళారు. బస్టాండంతా జనంతో నిండి కోలాహలంగా ఉంది. అంతలో వేణుకు సాయంత్రం ఆరుగంటలకు రాంమోహన్‌ను కలుస్తానన్న మాట గుర్తు వచ్చింది. అదే చెప్పాడు జాన్‌కు. సరే నాక్కూడా పొద్దుబోతంది. బస్సొస్తే వెళ్ళానన్నాడు జాన్. సరేనన్నాడు వేణు. పది నిమిషాల్లో బస్సొచ్చింది. చెయ్యి కలిపి వెళ్ళిపోయాడు జాన్.

బయట వర్షపు జల్లు కురుస్తూ ఉంది. అది ఒక వింతైన శబ్దం చేస్తూ ఉంది. ఆ వింతైన శబ్దానికి అంతరాయం కలిగిస్తూ వేణు వెళ్ళే బస్సు కూడ వచ్చింది. అది నేరుగా ప్లాట్‌ఫాం ముందు ఆగింది. ఆగిన బస్సు మీద పడే వర్షం టపటప శబ్దం చేస్తుంది. అట్లాగే పరిగెత్తుకుంటూ వెళ్ళి బస్సెక్కాడు. కండక్టరు దగ్గర టిక్కెట్టు తీసుకొని వెళ్ళి సీట్లో కూర్చున్నాడు. బస్సు బయలుదేరి జాతీయ రహదారి మీదకు వచ్చింది. బస్సులో పెద్దగా జనం లేరు. వర్షంలోనే ఆ జాతీయ రహదారి మీద పరుగందుకుంది. ఇంజను మోత వర్షం చప్పుడు కలిసిపోయి ఒక విధమైన శబ్దం చేస్తూ బస్సు దూసుకుపోతోంది.

వేణు మనసిప్పుడు కొంచెం తేలికపడినట్టుగా ఉంది. జాన్ గురించిన ఆలోచనల వైపు అది మళ్ళింది. జాన్ తనకు పదేళ్ళ క్రితం పరిచయం. ఏమీ చదువుకోలేదు. మంచి కష్టజీవి. ఇద్దరు కొడుకులు, ఒక కూతురు, పెద్దకొడుకు విప్లవోద్యమంలో చనిపోయాడు. మిగిలి ఇద్దరు చదువుకుంటున్నారు. ఐదు సంవత్సరాల క్రితం వరకు తను వాళ్ళింటికెళ్ళొస్తుండేవాడు. జిల్లాలో పెరిగిన పోలీసు ఒత్తిడి మూలంగా సొంత ఊరికి, దగ్గరి వాళ్ళకు దూరం కావలసె వచ్చింది. అట్టా దూరమై ఈ మధ్యనే ఒకటి రెండు సార్లు మాత్రమే జాన్‌ను కలువ గలిగాడు. అదీ ఎక్కువ సమయం మాట్లాడడానికి వీలు పడలేదు. ఇప్పుడే కాస్త తీరిగ్గా మాట్లాడాడు.

బస్సు వేగం తగ్గలేదు. వర్షం కొద్దిగా తగ్గింది. అందరూ కిటికీ అద్దాలు కొంచెం తెరిచారు. బస్సులోకి చల్లని గాలి చొరబడుతూ ఉంది. అది అందరి ముఖాలను తాకుతూ ఉంది. ఆ తాకిడి అందరికీ ఆహ్లాదంగా ఉంది. రోడ్డు పక్క వేగంగా వెనక్కి వెళ్తున్న చెట్లను చూస్తూ ఉన్నాడు వేణు. అప్పుడే సంవత్సరం కావస్తంది. జాన్ పెద్దకొడుకు రమేష్ చనిపోయింది అక్టోబర్‌లోనే. మొదటిసారి తనకు పరిచయమైనపుడు పదహారు పదిహేడేళ్ళు ఉంటాయేమో? చామనచాయ శరీరం, విశాలమైన నుదురు, తీరైన పలువరుస. ఎప్పుడూ కలిసినా నవ్వుతూ పలకరించేవాడు. ఆ నవ్వు ముఖం చూసినపుడల్లా ఇంటి ముందు ఎర్రగా పూసిన ముద్దమందారంలా ఉన్నట్టుండేది. ఇంటికి పెద్దకొడుకు. పెద్దకొడుకులకు సహజంగా కుటుంబ బాధ్యతలు త్వరగా మీద పడుతూ ఉంటాయి. కాని రమేష్ అన్నిటికన్నా ఉన్నతమైన బాధ్యత మీదేసుకున్నాడు.

తన సంస్థ సభ్యుడు రమణ కోసం మొదటి సారి తను ఆ ఊరెళ్ళాడు. అది అక్టోబర్ నెల. అప్పటికే సాయంకాలమైంది. సన్నగా చినుకులు పడుతున్నై. రోడ్లన్నీ బురదగా ఉన్నై. ఇళ్ళ ముందు అప్పుడే పొయ్యిలు రాజేస్తున్నారు. వాకబు చేస్తూ నేరుగా వాళ్ళింటికెళ్ళాడు. రమణ లేడు. రమణ తమ్ముడు రమణ లేడని రమేష్ వాళ్ళింటికి తీసుకెళ్ళాడు. వాళ్ళింటికెళ్ళేటప్పటికి రమేష్ బత్తెకి కుడితి పెడుతున్నాడు. దూరం నుండే ఏమోయ్ అల్లుడూ ఏం సంగతులు అన్నాడు. ఏముండె మావా అన్నాడు రమేష్ నవ్వుతూ. ఈ అన్న రమణన్న కోసం వచ్చాడు. ఆయనేమో ఊరికెళ్ళాడు. అన్న ఈ రోజిక్కడే ఉంటాను అన్నాడు. సరే మావా అన్నాడు రమేష్. పనుందని చెప్పి అతడెళ్ళిపోయాడు. బత్తె మెడతాడు నడుం మీదేసి ఇంట్లోకెళ్ళి మంచం దుప్పటి తెచ్చి వాల్చాడు.

తెల్లారింది. అందరూ ఎవరి పనుల్లో వాళ్ళున్నారు. జాన్ బత్తె దగ్గర బాగు చేస్తున్నాడు. రమేష్ వాళ్ళమ్మ కళ్ళాపు చల్లుతుంది. రమేష్ అప్పుడే వచ్చి బత్తె తాడిప్పి కుడితిగాబు దగ్గరకు తీసుకెళ్ళాడు. బత్తె నేరుగా వెళ్ళి కుడితిలో

ముట్టె ముంచింది. రమేష్ మంచి కళాకారుడు. పాటందుకున్నాడు. ఆగదు ఆగదు ఆగదు ఈ ఆకలి పోరు ఆగదు... ఆగదు ఆగదు ఆగదు ఈ సాయుధపోరు ఆగదు అంటూ ఒక్కసారి పెద్దగా హ్హా.... అన్నాడు. దాంతో కుడితిలో ముట్టె ముంచిన బఱ్ఱె ఒక్కసారిగా తలపైకి లేపింది. దాని కొమ్ము రమేష్ చేతికి తగిలి అబ్బా అంటూ చెయ్యి విదిలించాడు. జాన్ అటువైపు చూసి ఆగిపోయిందేందిరా పోరు అన్నాడు. రమేష్ ముసిముసిగా నవ్వుతూ చెయ్యి విదిలించుతూ తనవైపు చూసి దీని కొద్దంటలేవే అన్నాడు.

ఆ తరువాత తరచుగానే ఆ ఊరెళ్ళి వస్తుండే వాడు తను. సంస్థ సమావేశాలు జరుపుకుంటుండేవారు. అప్పుడు బంధువులు, పరిచయాలు ఇళ్ళ దగ్గర భోజనాలు చెప్పేవాడు. అందర్నీ తీసుకెళ్ళేవాడు. సమావేశాల్లో వాళ్ళకు టీలు, మంచినీళ్లు అందించేవాడు. సమావేశాలు ముగిసి వెళ్ళే వరకు ఏ ఇబ్బంది లేకుండా చూసేవాడు. ఇలా ఉండగా హైదరాబాద్‌లో పౌరహక్కుల పురుషోత్తం హత్య జరిగింది. అప్పుడు ఆ ఊళ్ళో తమసంస్థ సంస్మరణ సభ జరపాలనుకుంది. దానికి ఆ ఊళ్ళో చుట్టుప్రక్కల గ్రామాల్లో ప్రచారం దగ్గర నుండి ఆరోజు సభ ఏర్పాటు చేసి ముగించే వరకు శ్రమపడ్డాడు. సభలో గజ్జకట్టి గోచి గొంగడి వేసి సాంస్కృతిక దళంతో ఆడాడు పాడాడు. అట్లా కార్యకర్తగా, ప్రజా కళాకారుడుగా, ప్రజా సైనికుడిగా ఎదిగాడు.

ఇక అప్పటి నుండి రమేష్ కన్పించలేదు. ఆ ఊరెళ్ళినపుడు ఒకరిద్దర్నడిగాడు. తెలియదన్నారు. జాన్‌ను కూడ అడిగాడు. హైదరాబాద్ బేలుదారి పనికెళ్ళాడన్నాడు. నిజమేననుకున్నాడు. ఇంకా కొంతకాలం గడిచింది. జిల్లాలో ఒకదాని కొకటిగా సంఘటనలు జరిగిపోయాయి. పోలీసుల ఒత్తిడి సంస్థల మీద పెరిగిపోయింది. దాంతో ఊళ్ళొదిలి రాజధాని చేరుకోవాల్సిన పరిస్థితి. తను కూడా అట్లా వెళ్ళిపోయాడు.

అక్కడి నుండి కొన్ని సంవత్సరాలు గడిచిపోయాయి. అక్టోబర్ నెల దసరా పండుగరోజు. ఉదయం నాగేశ్వరరావు ఫోన్ చేశాడు. టి.వి. చూశావా? అన్నాడు. లేదన్నాడు తను పార్వతీపురం దగ్గర ఎన్‌కౌంటర్ జరిగింది. అందులో గుంటూరు జిల్లా అతను, ప్రకాశం జిల్లా అతను ఉన్నారని వస్తోంది అన్నాడు. ఎవరయ్యుంటారన్నాడు తను. ఏమో తెలియదన్నాడు.

నాగేశ్వరరావు సాయంత్రం మరలా ఫోన్‌చేసి ప్రకాశం జిల్లా అతను రమేష్ అని టీవీలో వస్తుంది అన్నాడు. ఒక్కసారి ఆ రమేష్ తనకు తెల్సిన రమేష్ కాదు కదా అనుకున్నాడు. కాని కొద్దిసేపటికి ఊరు కూడ చెప్పారు. మనసు కలవరానికి, ఆశ్చర్యానికి గురైంది. ఇప్పటికీ నమ్మలేకుండా ఉంది. బతుకుదెరువు కోసం బేలుదారి పనికెళ్ళాడన్నారు! కాదా? అందరి బతుకు బాగుకోసం వెళ్ళాడా? అట్లా వెళ్ళిన వాడు ఇట్లా వస్తున్నాడా?

దూరం కావడంతో ఆ దేహం రావడం రెండు మూడు రోజులు పట్టింది. చూడ్డానికెళ్ళాడు తను. ఊరు మొదట్లోనే నిలువెత్తు ప్లెక్స్. నవ్వుతూ పలకరిస్తూనే ఉన్నట్టుంది. అప్పటికి పన్నెండు కావస్తుంది. అన్ని సంఘాల వాళ్ళు, ప్రజలు బంధువులు వచ్చారు. ఎండ మండిపోతూ ఉంది. ట్రాక్టరు మీద ఊరేగింపుకు ఏర్పాటు జరుగుతున్నై. అమ్మ ప్రక్కనే పైటకొంగు కప్పుకుని ఏడుస్తూ ఉంది. జాన్ పైకి పలకరిస్తూ ఉన్నా దుఃఖపు జాడ కళ్లల్లో కన్పిస్తూ ఉంది. అంతిమ యాత్ర బయలుదేరడానికి ముందు ఎరిగిన వాళ్ళందరూ రమేష్ గురించి జ్ఞాపకాలు పంచుకున్నారు. చివరగా జాన్‌ను మాట్లాడమన్నారు. జాన్ కళ్ళల్లో నీళ్ళు తిరుగుతున్నై అందరూ జాన్‌వైపే చూస్తున్నారు. కొంతమంది నినాదాలిచ్చారు. కొంచెం మౌనం తర్వాత "నేనెప్పుడూ పిల్లలకు మంచిగా బతకండి, మంచి పనులు చేయండి అని చెప్పాను. మంచి పని చేస్తూనే రమేష్ చనిపోయాడు. చనిపోయాడని నాకు బాధలేదు. ఎప్పుడైనా చనిపోవలసిందే. కాకపోతే కొందరు ముందూ వెనక. అయితే ఇంకా కొంత కాలం పని చేసి ఉంటే ఇంకా సంతోషించే వాణ్ణి" అన్నాడు. ఇంకా మాట్లాడలేకపోయాడు.

ఊరేగింపు ప్రారంభమైంది. కొద్ది దూరం వెళ్ళిన తర్వాత అప్పటిదాకా పనుల్లో ఉన్న రమణ కొంచం ఖాళీగా, నిదానంగా నడుస్తూ కన్పించాడు. కొంచెం దగ్గర కెళ్ళి ఏంటి విషయాలని పలకరించాడు. నిజానికి రమణ తన కన్నా ఎక్కువ నిర్బంధమే అనుభవించాడు. తనకన్నా ముందే ఊరొదిలి వెళ్ళిపోయాడు. తర్వాత కుటుంబ బాధ్యతల రీత్యా లొంగిపోయి ఊళ్ళోనే ఉంటున్నాడు. సుదీర్ఘకాలం తర్వాత ఇప్పుడే కలిశాడు.

తను లొంగిపోవడానికి దారి తీసిన పరిస్థితులు, ఆ సందర్భంలో జరిగిన విషయాలు, ప్రస్తుతం తన జీవితం ఇవన్నీ చెప్పుకొచ్చాడు. కొంచెం సేపటి తర్వాత రమేష్ అపుడే వెళ్ళిపోయాడా? అడిగాడతను. ఆ... అప్పుడే వెళ్ళిపోయాడా? అన్నాడు రమణ. మొదటిసారి నేనిక్కడకు రాబోయే ముందు కూడ కొంతకాలం బేలుదారి పనికి హైదరాబాద్ వెళ్ళాడు కదా అన్నాడతను. ఆ... అన్నాడు. అట్లాగే వెళ్ళాడనుకున్నాను. నాకిప్పటిదాకా తెలియదు.

లేదు. లోపలికే వెళ్ళాడు. కొన్ని సందర్భాల్లో ధైర్యంగా నిలబడ్డాడు కూడ అన్నాడు. ఒకసారి రెండు వేల రెండులోనో మూడు లోనో అనుకుంటాను ఒక ఎన్‌కౌంటర్ జరిగింది. అందులో నలుగురు చనిపోయారు. ఇద్దరాడవాళ్ళు, ఇద్దరు మగవాళ్ళు ఆ.... అవును. అందులో రమేష్ ఉండాడు. కొద్దిలో తప్పుకున్నాడు అన్నాడు. ఔను! అంటూ చూశాడు తను. ఔనని చెప్పి జరిగిన సంఘటన గురించి చెప్పడం ప్రారంభించాడు రమణ.

ఊరేగింపు అరుపులు నినాదాలతో సాగిపోతూ ఉంది. ఊళ్ళో అందరూ ఆ రోజు పనులాపేశారు. ముందు కార్యకర్తలు, కళాకారులు తర్వాత ఆడవాళ్ళు, ఆ తర్వాత ఊరిజనం, బయటనుండొచ్చిన వాళ్లు, వెనుక ఎర్రకాగితాల అలంకరణతో ట్రాక్టరులో రమేష్ దేహం చిన్నగా సాగిపోతూ ఉంది. యాత్ర రెండు బజార్లు దాటి మలుపు తిరిగింది. వెనుక మేం మాట్లాడుకుంటూ నడుస్తున్నాం. అప్పుడప్పుడూ ఊళ్ళో తెలిసిన వాళ్ళు బాగున్నారన్నా అని పలకరిస్తున్నారు.

అర్థరాత్రి అమావాస్య రోజులు, గాడాంధకారం. అందరూ అలసిపోయి గాఢనిద్రలో ఉన్నారు. పదకొండు మందిదాకా ఉన్నారు. సెంట్రి వైపు ప్రధానం చేసుకొని ఒక వైపు ఖాళీ ఉంచి మూడు వైపులా చుట్టు ముట్టి రావడమే సెంట్రి వైపు తుపాకి పేలడంతో సెంట్రి పడిపోయాడు. అందరూ మేలుకొని క్షణాల్లో ఫైరింగ్ ప్రారంభించారు. ఐదు నిముషాలసేపు జరిగింది. అందరూ చెల్లా చెదురైపోయారు. రమేష్‌కు తొడ కండరాల నుండి తూట దూసుకుపోయింది. అట్లానే పాక్కుంటూ రెండు గంటలకు ఒక ఎత్తైన కొండ పైకి చేరుకున్నాడు. ఒక బండ మీద కూర్చున్నాడు. కిట్టు దించి ముందు పెట్టుకున్నాడు. తొడగాయం తీవులు పెడుతూ ఉంది. కర్చీఫ్ తీసి దానికి గట్టిగా కట్టాడు. రక్తం కారి ప్యాంటంతా తడిచిపోయింది. ఒళ్ళంతా చీరుకుపోయింది. బట్టలు పేలికలైపోయాయి. ఒళ్ళంతా చెమటలు కారుతూ ఉంది. పైకి చూశాడు. ఆకాశం దట్టంగా మబ్బులు కమ్మి ఉంది. కొద్ది కొద్దిగా ప్రారంభమైన వర్షం తగ్గిపోయింది. కిట్టు తడిచిపోయాయి. మళ్ళీ పైకి చూశాడు. అక్కడక్కడా చుక్కలు కన్పిస్తున్నై కిందికి చూశాడు అప్పుడప్పుడూ టార్చిలైటు వెలుగులు కన్పిస్తున్నై.

తలవంచుకొని కూర్చున్నాడు. జుట్టు నుండి నుదుటి మీదకి, చెంపల మీదకి నీళ్లు కారుతున్నై. మిగిలిన వాళ్ళేమైపోయారో తెలియదు. ఎంతమంది చనిపోయారో తెలియదు. తుపాకి పేలిన శబ్దం వినిపించేటప్పటికే ఎవరిదారిన వాళ్ళున్నారు. కమాండర్ చెప్పిన జాగ్రత్తల ప్రకారం తుపాకితో రెండు మూడడుగులు పాక్కుంటూ పోయాడు. ఎందుకైనా మంచిదని వెనక్కి జరిగి కిట్టందుకుని తగిలించుకున్నాడు. అట్లా పాక్కుంటూ కొండపైకి చేరుకున్నాడు.

చల్లని గాలి వీస్తుంది. బట్ట తడి ఆరలేదు. తల నుండి బొట్లు బొట్లుగా నీళ్ళు కారుతున్నై. ఎడమచేతిలో తుపాకి కాలు మీదుంచి ముందున్న కిట్టు విప్పాడు. మందుల పెట్టె తీసి రెండు నీరోబియాన్ ఇంజక్షన్లుంటే తీసి పగలగొట్టి తాగాడు. నీళ్ళ బాటిల్‌లో నీళ్ళు రెండు గుక్కలుంటే తాగాడు. కిట్టు లోపల కొంచెంపొడిగానే ఉంది. అంచుల వైపు బట్టలు పుస్తకాలు తడిశాయి. కిట్టు మూసి క్లిప్పులు పెడుతున్నాడు. చేతివేలికేదో తగిలినట్టనిపించింది. తడిమి చూశాడు. బుల్లెట్ ఇరుక్కుపోయి వేలాడుతూ ఉంది. అన్నం తినే స్టీలు కంచం దానికడ్డుగా ఉంది. అది ఎస్సెల్లార్

వ్యాసం

◆ రవీంద్రన్

తెలుగు : మాసీ

# తమిళ ఈళం పోరాటం - గుణపాఠాలు

2009, మే 18 నాడు శ్రీలంక అధ్యక్షుడు మహీందా రాజపక్సే ఎల్‌టిటిఇకి వ్యతిరేకంగా మూడు దశాబ్దాలుగా జరుగుతున్న యుద్ధం ముగింపుకు వచ్చిందని ప్రకటించాడు. టైగర్ల మీద శ్రీలంక సైన్యం అంతిమ విజయాన్ని సాధించిందని అతను ప్రకటించాడు. శ్రీలంక సైన్యమూ, ప్రభుత్వమూ ఎల్‌టిటిఇ నాయకుడు ప్రభాకరన్, అతని లెఫ్టినెంటులలో అనేకమందీ యుద్ధంలో మరణించారని చెప్పి, ఎలక్ట్రానిక్, ప్రింట్ మీడియాల్లో (టీవీల్లో, వార్తాపత్రికల్లో) ప్రభాకరన్ శవం ఫోటోలను చూపారు. 20వ తేదీని శ్రీలంక ప్రభుత్వం 'విజయోత్సవాల్ని' జరుపుకునేందుకు గానూ జాతీయ శెలవుదినంగా ప్రకటించింది. ఈ ప్రకటనకు ఎంచుకున్న సమయం శ్రీలంకలోనూ, భారతదేశంలోనూ, ప్రపంచంలోనూ జరుగుతున్న పరిణామాల్ని దగ్గరగా, నిశితంగా పరిశీలిస్తున్నవారిలో అనేక సందేహాలను కలిగించింది. భారతదేశంలో పార్లమెంటరీ ఎన్నికల ఫలితాల్ని ప్రకటించాకనే కావాలని ఈ వార్తను శ్రీలంక ప్రభుత్వం ప్రచారంలో పెట్టినట్లుగా కనిపిస్తోంది. ఒక పక్క శ్రీలంక ప్రభుత్వమూ, భారతదేశంలో కాంగ్రెస్ పార్టీ నేతృత్వంలోని యుపిఎ ప్రభుత్వమూ దీన్ని ఉత్సవంగా జరుపుకోగా, మరో వైపు ప్రపంచవ్యాప్తంగా లక్షల సంఖ్యలో తమిళ ఈళంనీ, టైగర్లనూ సమర్థించేవారూ, వారి సానుభూతిపరులూ ప్రత్యేక తమిళ ఈళం సాధనకై చేస్తున్న పోరాటం ఈ విధంగా అంతమవ్వడాన్ని చూసి దిగ్భ్రాంతికి, నిజమేనా అనే సంశయానికీ గురయ్యారు. ఇరవై నాలుగు గంటలలోనే, టైగర్లు శ్రీలంక ప్రభుత్వ ప్రకటనల్ని ఖండిస్తూ, టైగర్ల నాయకుడూ, మిగతా తమిళ ఈళం నాయకులూ సురక్షితంగా వున్నారనీ, ఈళం ప్రజల కోసం ప్రత్యేక మాతృభూమిని సాధించే లక్ష్యాన్ని నెరవేర్చేవరకూ తమిళ ఈళం గురించిన పోరాటం కొనసాగుతుందనీ ప్రకటనను వెలువరించారు.

ప్రపంచవ్యాప్తంగా తమిళులు నిరసన ప్రదర్శనలు నిర్వహించారు. తమిళనాడులో అయితే వీటితో పాటు కొన్ని హింసాత్మక ఘటనలు కూడా చోటు చేసుకున్నాయి. ఎల్‌టిటిఇ పైనా, ప్రత్యేక ఈళం మాతృభూమికై జరుగుతుండిన సాయుధ పోరాటం పైనా నిర్ణయాత్మకమైన విజయాన్ని సాధించామని శ్రీలంక ప్రభుత్వం చెప్పుకుంటున్న విషయం నిర్వివాదం కాకపోయినప్పటికీ, కనీసం ప్రస్తుతానికైతే శ్రీలంక ప్రభుత్వం ఎల్‌టిటిఇ పై ఒక పెద్ద మిలటరీ విజయాన్ని సాధించింది అనడంలో సందేహం లేదు. అత్యంత శక్తివంతమైన గెరిల్లా బలగాల్లో ఒకటైన ఎల్‌టిటిఇ ఇటువంటి ఓటమిని ఎలా పొందింది? శ్రీలంక సైన్యం దానిని ఇలా ఎలా ఓడించగలిగింది? ఈ ఓటమితో స్వయం నిర్ణయాధికారం కోసం మూడున్నర దశాబ్దాలుగా జరుగుతున్న సాయుధ పోరాటం అంతమైనట్లేనా? శ్రీలంక ప్రభుత్వం ఈళం ప్రజల న్యాయమైన జాతి ఆకాంక్షలను నేరవేర్చగలదా? శ్రీలంకలోని తమిళ ప్రజలు సింహళ ప్రజలతో సమానమైన పౌరులుగా జీవించగల్గుతారా? శ్రీలంకలోని తమిళ ప్రజల భవిష్యత్తు ఏమిటి? ఇవన్నీ తమిళ ఈళం ఆశయాన్ని న్యాయంగా సమర్థించే వారందరి, ప్రజల ప్రజాస్వామ్యం, జాతి విముక్తి, స్వాతంత్ర్యాల కోసం పోరాడే వారందరి మనస్సుల్లో మెదిలే ముఖ్యమైన ప్రశ్నలు. తమిళ ఈళం కై పోరాటాన్ని అర్థం చేసుకోవాలంటే దాని మూలాల్నీ, దాని ఎదుగుదలనీ అర్థం చేసుకోవడం అవసరం.

ప్రత్యేక తమిళ ఈళం డిమాండ్ పుట్టు పూర్వోత్తరాలు

దాదాపు క్రీ.పూ. 500 నాడు విజయ రాకుమారుడు భారతదేశం నుండి తమ ద్వీపానికి రావడం తమ మూలాలకు ఆరంభంగా సింహళ ప్రజలు భావిస్తారు. విజయ రాకుమారుడు రాక ముందునుండే తమిళులు ఈ ద్వీపంలో నివసిస్తూ వుండినారు. సింహళ చరిత్రకారుడూ, కేంబ్రిడ్జ్ విద్వాంసుడూ అయిన పాల్ పెయిరిస్ ప్రకారం "...భారతదేశం నుండి కేవలం 30 మైళ్ల దూరంలో, రోజువారీగా చేపల్ని పట్టడానికి సముద్రంలోకి వెళ్లే మత్స్యకారులకు కనిపించేంత దూరంలో వున్న ద్వీపానికి ఓడల మీద ప్రయాణం చేయడం నేర్చుకున్న వెంటనే మనుషులు వచ్చి నివాసం ఏర్పర్చుకుని వుంటారని వూహించడం సహేతుకంగానే వుంటుంది....విజయ రాకుమారుడు రావడానికంటే

---

కుపయోగించే బుల్లెట్. ఈ కంచం లేకపోతే తను.... గుండె వేగం ఒక్కసారి పెరిగింది. క్రమంగా తగ్గిపోయింది.

ఒక్క నిట్టూర్పు విడిచాడు. ఇప్పుడేమిటి పరిస్థితి ఆలోచిస్తున్నాడు. కిట్టు సర్దాడు. అట్లా కూర్చున్నాడు. ఏదో అలికిడైనట్లనిపించింది. ఆ వైపు చూశాడు. అది దగ్గర కొస్తున్నట్టుంది. చేతిలో తుపాకి గట్టిగా పట్టుకొన్నాడు. పొజిషన్ తీసుకున్నాడు. తీక్షణంగా చూశాడు. ఎలుగుబంటి. ఒక్క నిమిషం ఏమీ పాలుపోలేదు. ఇది దగ్గరకొస్తే చంపుతుంది. తుపాకి పేలిస్తే కింద పోలీసులున్నారు. ఒక ఆలోచన తట్టింది. అంతకు మించి మార్గం లేదు. కిట్టు పక్కన అట్లాగే పడుకుండిపోయాడు. అది క్రమంగా దగ్గరకొచ్చింది. తలవైపు వచ్చింది. వాసన చూసింది. పక్కకు వచ్చింది. దేహమంతా వాసన చూసింది మళ్ళీ తలవైపొచ్చింది. ముక్కు దగ్గర చూసింది. ఉచ్ఛ్వాస నిచ్ఛ్వాసాలేమి లేవు. కొద్ది క్షణాలు అలాగే ఉంది. చిన్నగా నడుచుకుంటూ వెళ్ళిపోయింది.

కొంచెం సేపటి తర్వాత లేచి కూర్చున్నాడు. చుట్టూ చూశాడు. ఆలోచిస్తున్నాడు. చావు అంచులదాకా పయనించాడు, ఎంతమంది చనిపోయారో? ఎంతమంది పట్టుబడ్డారో? ఎంమందికి గాయాలైనయ్యో? అరుణ, క్రాంతి ఎలా ఉన్నారో? సంధ్య ఎలా ఉందో? సంధ్య మలేరియాతో బాధపడుతాంది. సాగర్, ప్రవీణ్ ఎలా ఉన్నారో? సాగర్ ఈ మధ్యనే వచ్చాడు. ఏమయ్యాడో? అట్లా ఒక్కొక్కళ్ళు అందరూ జ్ఞాపకం వచ్చారు. తనేం చేయాలి? ముందు బ్రతకాలి. తెల్లవారేలోపు ఇక్కడ నుండి వెళ్ళాలి. వెళ్ళి ఏంచేయాలి? మన వాళ్ళను కలవాలి. ఒళ్ళంతా తీపులు, గాయం బాధ భరించలేకుండా ఉంది. ఆర్.వి ప్లేస్, టైం గుర్తు చేసుకున్నాడు. కిట్టు తగిలించుకున్నాడు. లేచి చిన్నగా కొండ దిగడం ప్రారంభించాడు. దూరంగా ఆకాశంలో వెలుతురు తొంగిచూస్తున్నట్టుంది.

అట్లా రమణ చెప్పడం పూర్తయ్యేటప్పటికి ఊరేగింపు శ్మశానానికొచ్చింది. అలాటి సందర్భంలో కూడ తటపటాయించలేదు. ఉద్యమంలోనే కొనసాగాలని నిర్ణయించు కున్నాడు. గాయం నయం చేయించుకోవడంకోసం బయటికొచ్చినపుడు కబురు చేస్తే వెళ్ళాను. అప్పుడు చెప్పాడు ఈ విషయాలన్నీ అన్నాడు రమణ. అట్లా పొద్దుకూకేటప్పటికి అంత్యక్రియలైపోయాయి. ఎవరిదారిన వాళ్ళు వెళ్ళి పోయారు. తను కూడ జాన్‌కు మళ్ళీ కలుస్తానని చెప్పి వెళ్ళి పోయాడు. ఆ తర్వాత ఒకటి రెండుసార్లు కలిశాడుగానీ వివరంగా మాట్లాడే అవకాశం దొరకలేదు. ఇప్పుడిలా కలిశాడు.

మనిషికి అన్నిటికన్నా ముఖ్యమైంది ప్రాణం. ప్రజలకోసం ప్రాణం ఇవ్వడానికి సిద్ధపడడం మహోన్నతం. రమేష్ తనకన్నా పదేళ్ళు చిన్నవాడు అతడు. యుద్ధంలో మరణించాడు. రమేష్‌లాంటి ఎంతో మంది ప్రాణాలివ్వడానికి సిద్ధపడుతున్నారు. తనదేముంది, తను ఎదుర్కొనే సమస్యలు పెద్ద లెక్కలోనివి కావు. నిర్బంధంలో భాగంగా ఎప్పుడైనా తను అరెస్టు కావచ్చు. అయితే కొన్నాళ్ళు జైల్లో ఉండవలసి రావచ్చు. పోలీసులు చిత్రహింసలు పెట్టవచ్చు. ప్రాణం కన్నా ఎక్కువైనవి కాదుగదా. ఈ సందర్భంలోనే తను నిలబడాలి. ఉద్యమాన్ని తిరిగి నిలబెట్టడంలో తన వంతు ప్రయత్నం చేయాలి. అందుకు ఎన్ని సమస్యలొచ్చినా ఎదుర్కోవాలి. వేణు అట్లా ఆలోచనల్లో ఉండగానే బస్సు రామోహన్ వాళ్ళ ఊరు వచ్చింది.

*

చాలాకాలం ముందే శ్రీలంకలో గుర్తింపు పొందిన ఐదు శివుడి ఈశ్వరాలు వుండినాయి. ఇవి భారతదేశం అంతటిలోనూ గుర్తింపు పొంది పూజలందుకున్నవి. అవి మహాతిత వద్ద గల తిరుకేటీశ్వరం; ముత్యాల వేటపైనా, సాలావాట్టి పైనా ఆధిక్యత కలిగిన మున్నేశ్వరం; మంటోటా వద్ద గల తొండేశ్వరం; కొట్టియార్ మహా అఖాతం వద్ద గల తిర్కోనేశ్వరం మరియు కంకేశంతురై వద్ద గల నకులేశ్వరం". (పాల్ ఇ. పెయిరిస్: నాగదీపా మరియు జాఫ్నాలోని బుద్ధ అవశేషాలు: జర్నల్ ఆఫ్ రాయల్ ఏసియాటిక్ సొసైటీ, సిలోన్ శాఖ, సంపుటి.28)

1505లో పోర్చుగీసు వలసవాదులు ద్వీపం మీదకు అడుగిడేనాటికి అక్కడ మూడు రాజ్యాలు వుండినాయి - జాఫ్నాలో తమిళ ఆధారిత రాజ్యం, కొట్టేలో రెండు సింహళ ఆధారిత రాజ్యాలు, మూడవది కాండీలో వుండేది. 1619లో పోర్చుగీసు వారు తమిళ రాజును ఓడించి జాఫ్నా రాజ్యాన్ని ఆక్రమించుకున్నారు. 1656లో డచ్‌వారు అక్కడకు చేరుకున్నారు. ఆ తర్వాత 1796లో బ్రిటిష్‌వారు ద్వీపాన్ని ఆక్రమించుకున్నారు. 1802లో సిలోన్ బ్రిటన్ రాజ్యానికి (క్రౌన్) వలసగా మారింది. 1833లో మొదటిసారిగా సిలోన్ మొత్తంగా బ్రిటిష్ వారి ఆధ్వర్యంలో ఏకైక పాలనా యంత్రాంగం కిందకి వచ్చింది. దాదాపు అదే కాలంలో, తేయాకు, కాఫీ, కొబ్బరి ప్లాంటేషన్లలో పని చేయడానికి బ్రిటిష్‌వారు తమిళనాడు నుండి కూలీల్ని తేవడం ఆరంభమైంది.

పది కోట్ల డెబ్బై లక్షలుగా ఉన్న ద్వీపంలోని జనాభాలో దాదాపు ఐదింట ఒక వంతు జనాభా తమిళులుగా వుండేవారు. అంటే దాదాపు సింహళుల సంఖ్యలో మూడు వంతులకంటే తక్కువ. తమిళులు ప్రధానంగా ద్వీపంలోని ఉత్తర, తూర్పు ప్రాంతాల్లోనూ, మధ్య ప్రాంతంలోని గుట్టల్లో గల ప్లాంటేషన్లలోనూ నివసించగా, సింహళులు దక్షిణంలో, పశ్చిమంలో అలాగే మధ్య ప్రాంతంలో కూడా నివసించేవారు. ఈశాన్యంలోని తమిళుల మాతృభూమి దాదాపు 7,500 చదరపు మైళ్ల విస్తీర్ణాన్ని కలిగి వుంది, అంటే 19,509 చదరపు కిలోమీటర్ల విస్తీర్ణం అన్నమాట.

1919లో తమిళులూ, సింహళులూ కూడా సభ్యులుగా గల సిలోన్ జాతీయ కాంగ్రెస్ (సిఎన్‌సి) అరుణాచలం పొన్నాంబళం అనే తమిళుడి నాయకత్వంలో ఏర్పడింది. ఆ తర్వాత 1921లో అది కేవలం సింహళులకే ప్రాతినిధ్యం వహిస్తోందని ఆరోపిస్తూ అతను సిఎన్‌సినుండి వైదొలిగాడు. 1947లో సోల్‌బరీ రాజ్యాంగాన్ని తయారు చేశారు. ఇది వలస పాలన కింద వుండే యూనిటరీ ప్రభుత్వం వుండాలని వక్కాణించింది. 1948లో బ్రిటిష్‌వారు సింహళ దళారులకు అధికారాన్ని అప్పగించి సిలోన్‌నుండి వైదొలగారు. సింహళ పాలకవర్గాలు ద్వీపాన్ని కేవలం సింహళుల నివాస స్థలంగా పరిగణిస్తూ, తమిళ ప్రజల్ని 'బైటివారిగా', యూనిటరీ సింహళ బుద్ధిస్టు ప్రభుత్వం పరిధిలోకి కలిపేసుకుని, తమ చెప్పుచేతల్లో వుంచుకోవల్సినవారిగా చూస్తూ వచ్చారు.

1949లో అధికారాన్ని చేపడుతూనే, సింహళ పాలకవర్గాలు తమిళనాడు నుండి వచ్చిన ప్లాంటేషన్ కార్మికులకు ఓటుహక్కును లేకుండా చేశారు. 1949 నాటి పౌరసత్వ చట్టం భారతదేశ మూలాలు కలిగిన దాదాపు 10 లక్షలకు పైగా తమిళ ప్లాంటేషన్ కార్మికులకు ఓటుహక్కునూ, దేశాన్నీ లేకుండా చేసేసింది. 1949లో ఎస్.జె.వి. సెల్వనాయగం నేతృత్వంలో తమిళ ఫెడరల్ పార్టీ (ఎఫ్.పి.) ఏర్పడింది. ఇతన్ని ఈళం జాతి పితామహుడిగా పరిగణిస్తారు. దీని మొదటి సదస్సు 1951లో జరిగింది. ఫెడరల్ పరిపాలనా యంత్రాంగాన్నీ, ఉత్తర, తూర్పు ప్రాంతాల్లో నివసిస్తున్న తమిళులకు ప్రాంతీయ స్వయం ప్రతిపత్తినీ డిమాండ్ చేస్తూ క్యాంపెయిన్ చేపట్టాలనే ఆశయాన్ని అది ప్రకటించింది. 1956లో సింహళ జాతీయవాదం ఇచ్చిన ఊతంతో సోలమన్ బండారనాయకే ఎన్నికయ్యాడు. సింహళ భాషను సిలోన్ ఏకైక అధికార భాషగా ప్రకటించారు. అలాగే సింహళ, బుద్ధిస్టు జాతి ఉన్మాదాన్ని పెంచే విధంగా అనేక ఇతర చర్యలను కూడా ప్రభుత్వం చేపట్టింది. 1980లలో శ్రీలంక అధ్యక్షుడిగా ఎన్నికైన జె.ఆర్. జయవర్ధనే బహిరంగంగా సింహళ జాతి ఉన్మాదాన్ని ఇలా రెచ్చగొట్టాడు: "....గత 2,500 ఏళ్లుగా ఉనికిలో వుంటూ, తన భాషనూ, మతాన్నీ ఉత్సాహంగా కాపాడుకుంటూ వస్తున్న సింహళ జాతి ఎటువంటి శషభిషలకూ తావు లేకుండా లేచి నిలబడి తన జన్మహక్కును కాపాడుకోడానికై పోరాడాల్సిన తరుణం ఆసన్నమైంది....నేను ఆ క్యాంపెయిన్‌కు నాయకత్వం వహిస్తాను..." (జె.ఆర్. జయవర్ధనే, సింహళ ప్రతిపక్ష నాయకుడు, శ్రీలంక ట్రిబ్యూన్, ఆగస్టు 30, 1957).

1958లో బండారనాయకే, తమిళ నాయకుడు సెల్వనాయగం ఫెడరల్ పరిష్కారంతో ఒక ఒప్పందం పై సంతకాలు చేశారు (బి-సి పాక్ట్ అంటారు దీన్ని). ఇది సిలోన్‌లోని ఉత్తర, తూర్పు ప్రాంతంలోని తమిళులకు విస్తృతమైన అధికారాలను ఇచ్చింది. కానీ, ఒప్పందంపై సంతకాలు పెట్టిన వారం రోజులకే సింహళ, బుద్ధిస్టు జాతి ఉన్మాదుల ఒత్తిడికి లోనై ఏకపక్షంగా దాన్ని కాలరాచివేసింది. దీనికి నిరసనగా, ఎఫ్.పి. ఒక శాంతియుత సహాయ నిరాకరణ ఉద్యమాన్ని ఆరంభించింది. ప్రభుత్వం ఈ ఉద్యమాన్ని అణచటానికి పోలీసుల్నీ, పారా మిలటరీనీ పంపించింది. అలాగే సింహళ ఆధిక్యత గల ప్రాంతాల్లో తమిళ వ్యతిరేక దాడుల్ని ఎక్కుపెట్టింది. 200 మందికి పైగా తమిళులు మరణించారు. వేలాదిమంది నిర్వాసితులయ్యారు.

1959లో ఒక బౌద్ధ సన్యాసి సోలమన్ బండారనాయకేని చంపిన తర్వాత అతని భార్య సిరిమావో బండారనాయకే ప్రపంచంలోనే మొట్టమొదటి మహిళా ప్రధానమంత్రిగా అధికారాన్ని చేపట్టింది. ఆమె సింహళ జాతి ఉన్మాద చర్యలను కొనసాగించింది. 1972లో సిలోన్ పేరును శ్రీలంకగా మార్చి, బౌద్ధ మతానికి దేశ మతంగా ప్రముఖ హోదాను కల్పించారు. ఈ చర్యలు ద్వీపంలోని తమిళుల్ని మరింతగా పరాయీకరణకూ, వ్యతిరేక భావాలకూ గురి చేశాయి. 1964లో దేశం లేని ప్లాంటేషన్ కార్మికుల్ని భారతదేశానికి తిరిగి పంపేయడానికి సిరిమావో-శాస్త్రి ఒప్పందం పై సంతకాలు చేశారు. 1965లో డడ్లీ-చెలువా ఒప్పందం పై సంతకాలు చేశారు. ఇది బి-సి ఒప్పందాన్ని మరింత పలుచన చేసిన ఒక ఒప్పందం. సింహళ జాతి ఉన్మాదులూ, బౌద్ధ మత పెద్దలూ దీన్ని వ్యతిరేకించడంతో ఈ ఒప్పందాన్ని అమలు చేయకుండానే విడనాడారు. దీనికి నిరసనగా, స్థానిక ప్రభుత్వంలో మంత్రిగా వున్న ఎఫ్.పి. కి చెందిన తిరుచెల్వం కేబినెట్ నుండి రాజీనామా చేశాడు.

1972 మే 22న సిలోన్ రిపబ్లిక్‌గా మారి, రిపబ్లిక్ ఆఫ్ శ్రీలంకగా పేరు మార్చుకుంది. యునైటెడ్ ఫ్రంట్ ప్రభుత్వం ఒక సింహళ ఆధిక్య 'రిపబ్లికన్ రాజ్యాంగాన్ని' దేశం అంతటి కోసం రూపొందించింది. అది బౌద్ధ మతాన్ని ప్రభుత్వ మతంగా చేసేసి, ఈళంకూ, ప్లాంటేషన్లకూ చెందిన తమిళుల్ని రెండో శ్రేణి పౌరులుగా మార్చివేసింది.

ప్రభుత్వ ప్రాయోజిత జాతి ఉన్మాదం వల్ల దెబ్బ తినగల స్థితిలో వుండిన తమిళ పార్టీలు తమిళ యునైటెడ్ ఫ్రంట్ (టియుఎఫ్)ను ఏర్పరిచారు. ఇందులో ఎఫ్.పి, జి.జి.పొన్నాంబళం నాయకత్వంలోని తమిళ కాంగ్రెస్ (టిసి), తొండమాన్ నాయకత్వంలోని సిలోన్ వర్కర్స్ కాంగ్రెస్ (దీనినే తర్వాత 1976లో టియుఎల్ఎఫ్ (తుల్ఫ్) గా పేరు మార్చారు) పార్టీలు వుండేవి. యువకులతో కూడిన ఒక చిన్న బృందం తమిళ న్యూ టైగర్స్ (టిఎన్‌టి) అనే సంస్థను ఏర్పరచింది. ఆ తర్వాత తమిళ హక్కుల కోసం పోరాడ్డానికై 1976లో జాఫ్నా ద్వీపకల్పంలో దీని పేరును లిబరేషన్ టైగర్స్ ఆఫ్ తమిళ ఈళంగా మార్చారు. దీని నాయకుడు 17 ఏండ్ల వేలుపిళ్లై ప్రభాకరన్.

1974లో సింహళ జాతి ఉన్మాదులు సింహళ పోలీసులతో కుమ్మక్కై జాఫ్నాలో జరుగుతున్న ప్రతిష్టాకరమైన అంతర్జాతీయ తమిళ కల్చరల్ కాన్ఫరెన్స్‌కు హాజరైనవారి పై దాడి చేసి తొమ్మిదిమంది తమిళుల్ని చంపి,

అనేకమందిని గాయపరిచారు. 'ప్రామాణీకరణ'ను ప్రవేశపెట్టి విశ్వవిద్యాలయాల్లో తమిళ విద్యార్థుల ప్రవేశానికి సమాన అవకాశాలు లేకుండా చేయడంతో తమిళుల పట్ల ప్రభుత్వ వివక్ష పరాకాష్టకు చేరుకుంది. ఈ చర్య కేవలం తమిళులకు ఉన్నత విద్య, ఉద్యోగావకాశాల్ని లేకుండా చేయడమే కాక, క్రమంగా పాలనా యంత్రాంగంలో, పోలీసుల్లో, సైన్యంలో తమిళుల్ని లేకుండా చేయడానికి కూడా ఉద్దేశించబడినది. 1976లో తుల్ఫ్ "వడ్డుకొడ్డై తీర్మానా"న్ని ఆమోదించింది. దాని లక్ష్యం శ్రీలంకలో తమిళుల ఉనికిని కాపాడ్డానికై "స్వేచ్ఛాయుతమైన, సార్వభౌమాధికారం గల, సెక్యులర్, సోషలిస్టు తమిళ ఈళం ప్రభుత్వాన్ని స్వయం నిర్ణయాధికార హక్కు ప్రాతిపదికగా స్థాపించడం". 1977 నాటి సార్వత్రిక ఎన్నికల్లో, తుల్ఫ్ ప్రత్యేక తమిళ ఈళం రాజ్యం కావాలనే నినాదంతో ఎన్నికల్లో పోటీ చేసింది. అత్యధిక మెజారిటీ తమిళులు అంటే 90 శాతానికి పైగా తమిళులు ప్రత్యేక ఈళం కొరకు ఓటు వేశారు. తమిళుల స్వయం నిర్ణయాధికార హక్కు విషయంలో వారి ఆకాంక్షలకు శాంతియుత పద్ధతుల్లో జరిగిన రిఫరెండమే తప్ప మరేమీ కాదు ఇది. కానీ, సింహళ-బౌద్ధ జాతి ఉన్మాదులు తమిళుల హక్కుల్నీ, ఆకాంక్షల్నీ గుర్తించ నిరాకరించారు; పైపెచ్చు వారి న్యాయమైన డిమాండ్లను కాలరాచివేయడానికి మరింత ఎక్కువగా రాజ్య ప్రాయోజిత హింసకు పాల్పడ్డారు. తమిళ అస్మితనూ, వారి చరిత్రనూ తుడిచివేసే ప్రయత్నంలో భాగంగా ఇద్దరు మంత్రులు గామిని దిస్సనాయకే, సిరిల్ మాథ్యూల సారథ్యంలో జాఫ్నా పబ్లిక్ గ్రంథాలయాన్ని శ్రీలంక సాయుధ బలగాలు అగ్నిగి ఆహుతి చేశాయి. ఈ గ్రంథాలయంలో దాదాపు 95,000లకు పైగా అరుదైన పుస్తకాల భాండారం వుండింది. వాటిలో సాంస్కృతికంగా ఎంతో ముఖ్యమైన, మరెక్కడా లభ్యం కాని ఎన్నో తమిళ రాతప్రతులు కూడా వుండినాయి.

విముక్తి పూర్వ యుద్ధ కాలంలో, 1983 జులైలో (దీన్ని 'బ్లాక్ జులై' అంటారు) తమిళుల్ని మహా క్రూరంగా, అత్యంత విస్తృతంగా పథకం ప్రకారం ఊచకోత కోశారు. ఇది కేవలం తమిళులు అత్యధికంగా నివసిస్తుండిన ఉత్తర, తూర్పు శ్రీలంకలోనే కాక దేశవ్యాప్తంగా కూడా జరిగింది. 4000 మందికి పైగా తమిళుల్ని చంపేశారు. వేలాదిమంది నిర్వాసితులయ్యారు. వారి ఆస్తుల్ని ధ్వంసం చేశారు లేదా లూటీ చేశారు. ఫలితంగా వారికి జీవనాధారం లేకుండా పోయింది. జైళ్లలో కూడా తమిళ ఖైదీల్ని పాశవికంగా హత్యలు చేశారు, వారి కళ్లను పెకిలించారు. 1,50,000 మందికి పైగా ప్రజలు కాందిశీకులుగా శ్రీలంకనుండి భారతదేశానికీ, పశ్చిమ దేశాలకూ పారిపోయారు. నేరుగా ఈ దాడుల్ని రెచ్చగొడుతూ అధ్యక్షుడు జయవర్దనే, "తమిళ ప్రజల అభిప్రాయాల గురించి నేను పట్టించుకోను...ప్రస్తుతం మనం దాని గురించి ఆలోచించలేం, వారి ప్రాణాల గురించి గానీ, వారి అభిప్రాయాల గురించి గానీ...ఉత్తర ప్రాంతం పై మనం ఎంత ఎక్కువ వత్తిడి తీసుకొస్తే, ఇక్కడ సింహళ ప్రజలు అంత ఆనందంగా వుంటారు...నిజంగా నేను తమిళ ప్రజల్ని ఆకలికి మాడిస్తే, సింహళ ప్రజలు ఎంతగానో సంతోషిస్తారు" అన్నాడు. (అధ్యక్షుడు జె.ఆర్.జయవర్దనే, డెయిలీ టెలిగ్రాఫ్, 11 జులై, 1983).

ఈ ఘటన తమిళ ఈళం ప్రజల స్వయం నిర్ణయాధికార పోరాటంలో ఒక మలుపు. తమిళ ప్రజలు శ్రీలంక 'పార్లమెంటరీ ప్రజాస్వామ్యం' పై విశ్వాసాన్ని కోల్పోయారు. ఎందుకంటే అది ద్వీపం పై సింహళ-బౌద్ధ ఆధిపత్యాన్ని స్థాపించడానికి ఒక పరంపరగా పాలనాపరమైన, చట్టపరమైన చర్యల్ని తీసుకుంది. అవి ఓటుహక్కును లేకుండా చేయడం, తమిళ మాతృభూమి అయిన ఉత్తర, తూర్పు ప్రాంతాల్లో పథకం ప్రకారం సింహళ ప్రజలకు నివాసం ఏర్పరచడం ద్వారా ప్రభుత్వ ప్రాయోజిత వలసల్ని ప్రోత్సహించడం, వివక్షాపూరితమైన భాషా, ఉద్యోగ విధానాలు, విశ్వవిద్యాలయంలో ప్రవేశాన్ని అడ్డుకునే 'ప్రామాణీకరణ' విధానం మొదలైనవి.

పోరాటం అహింసాయుత, శాంతియుత పద్ధతులనుండి సాయుధ పోరాటంగా పరిణమించింది. వేలాదిమంది యువత వివిధ మిలిటెంట్ సంస్థల్లో చేరారు. వారు మొదట భారతదేశంలో, భారత ప్రభుత్వ మద్దతుతో మిలటరీ శిక్షణను పొందారు. అప్పటికి సోవియట్ సోషల్ సామ్రాజ్యవాదుల ఆధిపత్యంలో నడుస్తున్న భారత విస్తరణవాదులు ఈ సమస్యను ఉపయోగించుకుని అప్పటికి అమెరికా ఆధిపత్యం కింద నడుస్తున్న శ్రీలంక ప్రభుత్వం పై వత్తిడి తీసుకొచ్చి, తమ విస్తరణవాద డిమాండ్లకు తలొగ్గేలా చేసుకోవాలని భావించారు. పార్లమెంటరీ, శాంతియుత పద్ధతులు తమ ఆత్మాభిమానాన్నీ, హక్కుల్నే కాక గౌరవప్రదమైన జీవితాన్ని కూడా లేకుండా చేస్తున్నాయని ప్రజలు గ్రహించారు. అందువల్ల, వారు పార్లమెంటరీ రాజకీయ నాయకుల్ని నిరాకరించి, మనస్ఫూర్తిగా సాయుధ పోరాటానికి మద్దతునిచ్చారు. ఈ వాస్తవాల్ని మరుగుపర్చి భారత ప్రభుత్వమూ, మీడియా, ముఖ్యంగా ఇంగ్లీషు వార్తాపత్రికలూ, టివి ఛానెళ్లూ 'టెర్రరిజం' అనే పదాన్ని ఉపయోగిస్తూ సాయుధ పోరాటం గురించి గగ్గోలు పెడుతూ వస్తున్నాయి. వీరు ఉద్దేశపూర్వకంగానే తమిళ ఈళం పోరాట చరిత్రను వక్రీకరించి, దాని గురించి అబద్ధాల్ని ప్రచారం చేస్తున్నారు. అప్పటినుండీ ఎల్‌టిటిఇ కొద్ది సంవత్సరాల కాలంలోనే ప్రత్యేక ఈళం పోరాటానికి ప్రాతినిధ్యం వహించే అత్యంత ప్రముఖ సంస్థగా ఎదిగింది; ఈ క్రమంలో వారు భారత ప్రభుత్వానికి లేదా శ్రీలంక ప్రభుత్వానికి దాదాపుగా ఏజెంట్లుగా మారిపోయిన మిగతా సంస్థల్ని హింసాత్మకంగా అణచివేశారు.

అంతర్యుద్ధం, శాంతి చర్చలు

1983 జులైలో, ఎల్‌టిటిఇ దేశ ఉత్తర ప్రాంతంలో మిలటరీ పై దాడి చేసి 13 మంది సైనికుల్ని చంపేసింది. జాతి ఉన్మాద సెంటిమెంట్లను రెచ్చగొట్టి శ్రీలంక ప్రభుత్వం కొలంబోలోనూ, దేశంలోని ఇతర ప్రాంతాల్లోనూ ఊచకోతల్నీ, నిర్మూలనా దాడుల్నీ ఎక్కుపెట్టింది. దాదాపు 4,000 మంది తమిళులు చనిపోయారు, వేలాదిమంది సింహళ ఆధిక్యత గల ప్రాంతాలనుండి పారిపోయారు. ఇది అంతర్యుద్ధానికీ, లేదా **మొదటి ఈళం యుద్ధానికీ** ఆరంభంగా నిలిచింది.

1983లో అంతర్యుద్ధం ప్రారంభం అయిన తర్వాతనుండి, ఇటీవలి ఎల్‌టిటిఇ ఓటమి వరకూ నాలుగు యుద్ధాలూ, నాలుగు సార్లు శాంతి చర్చలూ జరిగాయి. మొదటి శాంతి ప్రక్రియ భారత విస్తరణవాదుల జోక్యంతో భూటాన్ రాజధాని థింపులో 1985లో ప్రారంభమైంది. ఎల్‌టిటిఇ, ఇతర మిలిటెంట్ గ్రూపులూ తమిళులకు ప్రత్యేక సర్వసత్తాక రాజ్యం అనే డిమాండ్‌ను వదులుకుని, తమిళుల్ని ఒక జాతిగా గుర్తించాలనీ, శ్రీలంక ఉత్తర, తూర్పు ప్రాంతాల్ని ఒకటే భాగంగా (ఎంటిటీ) గుర్తించాలనీ, ఈళం మాతృభూమికి గల విడిపోయే హక్కుతో సహా స్వయం నిర్ణయాధికార హక్కుని గుర్తించాలనీ డిమాండ్లు రూపొందించుకుని చర్చల్లో పాల్గొన్నాయి. తమిళ ప్రజల న్యాయమైన ఆకాంక్షలను శ్రీలంక ప్రభుత్వం ఆమోదించ నిరాకరించడంతో చర్చలు విఫలమయ్యాయి.

కానీ భారత, శ్రీలంక ప్రభుత్వాలు 1987 జులై 29న ఇండో-శ్రీలంక ఒప్పందం పై సంతకాలు చేశాయి. ఇందులో ఈళం ప్రజల, జాతి విముక్తి పోరాటం చేస్తున్న మిలిటెంట్ గ్రూపుల ప్రాతినిధ్యం గానీ, భాగస్వామ్యం గానీ లేనేలేవు. అందుకు బదులుగా, అప్పటివరకూ తమిళనాడులో మిలిటెంట్ గ్రూపులకు బేసుల్ని ఏర్పర్చుకోడానికి అనుమతినిచ్చి, వారికి ఆయుధాలనూ, మందుగుండునూ, శిక్షణనూ అందించిన భారత విస్తరణవాదులు, వారి పై ఈ ఒప్పందాన్ని రుద్దారు. శ్రీలంక ప్రభుత్వం రాజ్యాంగానికి 13వ సవరణను తీసుకువచ్చింది. ఇది తమిళ ప్రజలకు కొన్ని అధికారాల్ని యివ్వడానికి ఉద్దేశించినది. ఎల్‌టిటిఇ, తమిళ ఈళం ప్రజలూ ఈ ఒప్పందాన్ని నిరాకరించారు. ఎందుకంటే దీని ప్రకారం వారికి సింహళ యూనిటరీ ప్రభుత్వం కింద ఒక ప్రావిన్షియల్ కౌన్సిల్ ఏర్పర్చుకునే అవకాశం మాత్రం

లభిస్తుంది. న్యాయమైన వారి స్వయం నిర్ణయాధికర హక్కుకు ఇది ఎంతో సుదూరంలో ఉన్నది. అంతే కాక, ఈ ఒప్పందం అమలుకై భారత ప్రభుత్వం 1,40,000 మంది సైనికులు గల 'శాంతి సైన్యాన్ని' శ్రీలంక ఉత్తర, తూర్పు ప్రాంతాలకు తరలించింది. ఈ విధంగా భారతదేశ వ్యూహాత్మక ప్రయోజనాలను ఈ భారత-శ్రీలంక ఒప్పందం నెరవేర్చింది. శ్రీలంక ప్రభుత్వం "భారత ప్రయోజనాలకు భంగం కలిగించే విధంగా వేరే ఏ దేశమూ ట్రింకోమలిని గానీ, శ్రీలంకలోని ఏ ఇతర నౌకాశ్రయాలను గానీ మిలటరీపరంగా ఉపయోగించుకోకుండా వుండేలా చూస్తామని'' భారతదేశానికి హామీ ఇచ్చింది.

భారత ప్రభుత్వం నిర్వహించిన పాత్ర, జాతి విముక్తి కోసం న్యాయంగా పోరాడుతున్న వారి మనస్సుల్లో సందేహాలకు దారి తీసింది. భారత ప్రభుత్వం తమకు వెన్నుపోటు పొడిచి తమకు ద్రోహం చేసిందని వారు భావించారు. శాంతి చర్చలు కొనసాగుతుండగానే భారతదేశానికీ, ఎల్‌టిటిఇకీ మధ్య సంబంధాలు మరింతగా దిగజారాయి. 1988 అక్టోబర్ 4న శ్రీలంక నావికాదళం ఒక పడవను స్వాధీనం చేసుకుని పులేంద్రన్, కుమరప్ప అనే పై స్థాయి నాయకులతో సహా 17 మంది ఎల్‌టిటిఇ కార్యకర్తలను పాయింట్ పెడ్రో వద్ద అరెస్టు చేసింది. ఎల్‌టిటిఇ భారత ప్రభుత్వాన్ని జోక్యం చేసుకుని వారిని విడుదల చేయించమని కోరింది. భారతదేశం ద్వంద్వ ప్రమాణాలతో వ్యవహరిస్తున్న తీరును నిరసిస్తూ ఎల్‌టిటిఇ రాజకీయ విభాగం నాయకుడు లెఫ్టినెంట్ కల్నల్ దిలీపన్ ఆమరణ నిరాహార దీక్ష చేపట్టి, ఫలితంగా మరణించాడు. కానీ ఖైదీల్ని కొలంబోకు తరలిస్తున్న శ్రీలంక ప్రభుత్వానికి భారత ప్రభుత్వం లోపాయికారీగా మద్దతుగా నిలిచింది. ఫలితంగా, జైల్లోని ఎల్‌టిటిఇ కార్యకర్తలందరూ సామూహికంగా ఆత్మహత్య చేసుకున్నారు. ఇది ఘర్షణలకూ, నిరసనలకూ దారి తీసింది. శాంతి చర్చలు ఆగిపోయాయి, అంతర్యుద్ధం తిరిగి ప్రారంభమైంది. శ్రీలంక ప్రభుత్వం ఈ తిరుగుబాటును అణచివేయమని ఐపికెఎఫ్‌ను కోరింది. 1988, అక్టోబర్ 9న ఐపికెఎఫ్ ఎల్‌టిటిఇ పై "ఆపరేషన్ పవన్'' పేరుతో దాడిని ఎక్కుపెట్టింది.

కొద్ది వారాల్లోనే ఈ ఆపరేషన్ పూర్తయిపోతుందని వారు ఆశించారు. కానీ అందుకు భిన్నంగా, ఐపికెఎఫ్ యుద్ధంలో కూరుకుపోయి 1700 మంది సైనికుల్ని కోల్పోయింది. వేలాదిమంది గాయపడ్డమో, వికలాంగులు కావడమో జరిగింది. ఎట్టకేలకు 1990 మార్చిలో వారు అవమానకరంగా బలవంతంగా అక్కడినుండి వెనక్కు రావల్సి వచ్చింది.

భారత, శ్రీలంక ప్రభుత్వాలు కలిసికట్టుగా తుపాకిని ఎక్కుపెట్టి ఈశాన్య ప్రావిన్సియల్ కౌన్సిల్‌కి ఎన్నికలను ప్రజలపై రుద్దాయి. ఎల్‌టిటిఇ ఎన్నికల్ని బహిష్కరించగా, ఇపిఆర్ఎల్ఎఫ్ వంటి భారత విస్తరణవాదుల తొత్తులైన ఇతర మిలిటెంట్ గ్రూపులు ఎన్నికల్లో పాల్గొన్నాయి. నేటికీ కూడా భారత ప్రభుత్వమూ, దాని వందిమాగధులూ 1987లో భారత విస్తరణవాదులు రుద్దిన ఈ 'పరిష్కారం' పై ఆధారపడి 'జాతి ఘర్షణ'కు బూటకపు పరిష్కారం వెతకాలని గొంతు చించుకుంటున్నారు. అయితే సింహళ-బౌద్ధ జాతి ఉన్మాదులు తమిళులకు ఈ నామమాత్రమైన 'అధికారాల బదలాయింపు'ను కూడా వ్యతిరేకించారు. పిమ్మట, శ్రీలంక సుప్రీం కోర్టు ఈ 13వ అధికరణాన్ని 'రాజ్యాంగ వ్యతిరేకమైనది'గా పేర్కొంటూ కొట్టివేసింది.

ఒప్పందం పట్ల వ్యతిరేకతా, భారత సైనిక బలగాల ఉనికి పట్ల వ్యతిరేకతా సింహళ ప్రజల్లో కూడా ఊపందుకుంది. తమ బద్ధ విరోధులైన ఎల్‌టిటిఇకి ప్రేమదాస ప్రభుత్వం భారత సాయుధ బలగాలకు వ్యతిరేకంగా పోరాడడానికి ఆయుధాల్ని కూడా సప్లయి చేసింది. తన అధికారానికి రాగల ప్రమాదాన్ని గ్రహించి ప్రేమదాస ప్రభుత్వం ఐపికెఎఫ్‌ను వెనక్కు వెళిపొమ్మని కోరింది. 1989 సార్వత్రిక ఎన్నికల్లో రాజీవ్ గాంధీ ఓటమితో, తమిళనాడు తెస్తున్న ఒత్తిడి వల్లా, వి.పి.సింగ్ ప్రభుత్వం 1990 మార్చిలో ఐపికెఎఫ్ ను వెనక్కు రమ్మని ఆదేశించింది. ఐపికెఎఫ్ వెనకకు మరలాక, ఎల్‌టిటిఇకీ, కొలంబోకూ మధ్య తాత్కాలికంగా శాంతికాలం నెలకొంది. కానీ తిరిగి 1990 జూన్‌లో యుద్ధం మొదలైంది. ఆ విధంగా రెండవ ఈళం యుద్ధం ఆరంభమైంది.

ఐపికెఎఫ్ వెనకకు మరలాక, ఎల్‌టిటిఇ ఉత్తర, తూర్పు ప్రాంతాల్లో తన స్థితిని సంఘటితపర్చుకుంది. ఎల్‌టిటిఇతో శాంతి అనే నినాదంతో చంద్రిక కుమారతుంగ పీపుల్స్ అలయెన్స్ (పిఎ) అధికారంలోకి వచ్చాక, 1995 జనవరిలో ఇరువురూ యుద్ధ విరమణ ఒప్పందంపై సంతకాలు చేసి చర్చలు ప్రారంభించారు. కానీ శ్రీలంక ప్రభుత్వ పట్టువిడుపులు లేని ధోరణి వల్ల ఇవి కూడా విఫలమైనాయి. 1995 ఏప్రిల్‌లో **మూడవ ఈళం యుద్ధం** ఆరంభమైంది. శ్రీలంక ఎయిర్ ఫోర్స్ జెట్ విమానాలు నవలి వద్ద సెయింట్ పీటర్స్ చర్చి మీద బాంబులు వేసి 125 మంది పౌరుల్ని చంపి, మరో 150 మందిని గాయపరచడంతో శ్రీలంక ప్రభుత్వ దాడి మరింత రక్తసిక్తంగా మారిపోయింది. ఏడు వారాల తీవ్ర యుద్ధం తర్వాత ప్రభుత్వ బలగాలు జాఫ్నాను దశాబ్దకాలంలో మొదటిసారిగా తమ ఆధీనంలోకి తెచ్చుకోగలిగాయి. 'విజయా'నికి చిహ్నంగా శ్రీలంక రక్షణ మంత్రి అనిరుద్ధ రత్తవతె 1995, డిసెంబర్ 5న జాఫ్నా ఫోర్టు (కోట)లో జాతీయ జెండాను ఎగురవేశాడు. దాదాపు 2,500 మంది తిరుగుబాటుదార్లూ, సైనికులూ ఈ దాడిలో చనిపోయారనీ, దాదాపు 7,000 మంది గాయపడ్డారనీ ప్రభుత్వం అంచనా కట్టింది.

1999లో ఎల్‌టిటిఇ "ఆపరేషన్ అలుపెరుగని అలలు'' (ఓయాద అలైగళ్)తో పాటు మరో 17 దాడులతో శత్రువు పై తన కౌంటర్ అఫెన్సివ్ (ఎదురుదాడి)ని ఎక్కుపెట్టి కోల్పోయిన భూభాగాలన్నిటినీ తిరిగి స్వాధీనం చేసుకుంది. మూడు రోజులకంటే తక్కువ కాలం పట్టిన ఈ ఒక్క ఆపరేషన్‌లోనే ఎల్‌టిటిఇ 1200లకు పైగా శ్రీలంక సైనికుల్ని హతమార్చింది. రెండు దేశాలు సంప్రదాయక యుద్ధంలో తలపడినట్లుగా వుండింది. అది ఎలిఫెంట్ పాస్‌ను కూడా ఆపరేషన్ కప్ప (ఫ్రాగ్) ద్వారా అది విజయవంతంగా స్వాధీనం చేసుకుంది. తద్వారా అది కిలినొచ్చి పట్టణంలోనూ, చుట్టుపక్కల ప్రాంతాల్లోనూ వున్న శ్రీలంక సాయుధ బలగాలకు చెందిన అన్ని సముద్ర, భూభాగ సప్లయి లైన్లనూ తెంపేసింది. 2000, ఏప్రిల్ 22న 17 ఏళ్లుగా జాఫ్నా ద్వీపకల్పాన్ని వన్నీ ప్రధాన భూభాగం నుండి వేరుపరుస్తుండిన ఎలిఫెంట్ పాస్ మిలటరీ కాంప్లెక్స్ (సముదాయం) పూర్తిగా ఎల్‌టిటిఇ స్వాధీనమైంది. జాఫ్నాలోని దాదాపు 40,000 శ్రీలంక బలగాల్ని ఎల్‌టిటిఇ చుట్టుముట్టింది. వారు చాలా ఘోరమైన స్థితిలోకి నెట్టబడ్డారు. లొంగిపోవడమో, ఊచకోతకు గురవ్వడమో తప్ప వారికి వేరే మార్గం మిగల్లేదు. భారత, అమెరికా ప్రభుత్వాల జోక్యంతో మాత్రమే ఇది నివారించబడింది. వాజ్‌పేయి ప్రభుత్వం అంతకంటే ముందుకు అడ్వాన్స్ అవ్వద్దనీ, అలా జరిగితే సీరియస్ పరిణామాలకు సిద్ధం కావల్సి వుంటుందనీ ఎల్‌టిటిఇని బహిరంగంగానే హెచ్చరించింది. శ్రీలంక సైనికుల్ని కాపాడడానికి అది నావికాదళ నౌకల్ని కూడా పంపింది. అమెరికా, భారత ప్రభుత్వాల హెచ్చరికల్ని బేఖాతరు చేయడానికి సిద్ధంగా లేని ఎల్‌టిటిఇ ఇక ముందుకు అడ్వాన్స్ కాలేదు.

తమిళ ప్రజల జాతి సమస్యకు మిలటరీ పరిష్కారాల్ని రుద్దడంలో శ్రీలంక పాలకవర్గాలు అసమర్థతను ప్రదర్శించడంతో, శాంతి ప్రాతిపదికగా 2001 ఎన్నికల్లో రనిల్ విక్రమసింఘే నాయకత్వంలోని యునైటెడ్ నేషనల్ ఫ్రంట్ భారీ మెజారిటీతో గెలిచింది. నార్వే దేశ మధ్యవర్తిత్వంతో 2001, డిసెంబర్‌లో తిరిగి ఒక శాంతి ప్రక్రియ ప్రారంభమైంది. ఎల్‌టిటిఇ 30 రోజుల కాల్పుల విరమణను ప్రకటించాక శ్రీలంక ప్రభుత్వం కూడా ఆ విధంగా ప్రకటించింది. 2002, ఫిబ్రవరి 22న లాంఛనంగా ఒక అవగాహనా ఒప్పందం (ఎంఓయు) పై సంతకం చేసి శాశ్వత కాల్పుల విరమణ ఒప్పందాన్ని (సిఎఫ్ఎ) అధికారికంగా ఖరారు చేసుకున్నారు. కాల్పుల విరమణను పర్యవేక్షించడానికి

(శ్రీలంక మానిటరింగ్ మిషన్ అనే ఒక నిపుణుల బృందాన్ని కూడా నార్వే తదితర నార్డిక్ దేశాల వారితో ఏర్పరిచారు. మొదటి శాంతి చర్చల్ని 2002, సెప్టెంబర్ 16న థాయ్‌ల్యాండ్‌లోని పుకేట్‌లో నిర్వహించారు. దీని తర్వాత అనేక దఫాల చర్చలు కొనసాగాయి. ఎల్‌టిటిఇ ప్రత్యేక ఈళం కావాలనే తన గత వైఖరి విషయంలో రాజీకి సిద్ధపడి ఈళం సమస్యకు ఫెడరల్ పరిష్కారానికి ఒప్పుకుంది. అది మధ్యంతర స్వయంపాలనా అథారిటీ (ఐఎస్‌జిఎ) ని ఏర్పర్చాలనే తన ప్రతిపాదనను ముందు పెట్టింది. ప్రభుత్వం కూడా తమిళులకు కనీస స్థాయిలో అధికారాల బదలాయింపు అనే వైఖరి నుండి ముందుకు అడుగు వేసి మొదటిసారిగా తన వైపునుండి ఫెడరల్ పరిష్కారానికి ఆమోదం తెలిపింది. ఐఎస్‌జిఎ పూర్తిగా ఎల్‌టిటిఇ అదుపులో వుంటుందనీ, ఉత్తర, తూర్పు ప్రాంతాల్లో అది తన అధికారాన్ని చెలాయిస్తుందనీ టైగర్లు ప్రతిపాదించారు. దక్షిణ ప్రాంతంలోని సింహళ-బౌద్ధ జాతి ఉన్మాదులు, విక్రమసింఘె ఎల్‌టిటిఇకి ఉత్తర, తూర్పు ప్రాంతాల్ని ధారాదత్తం చేస్తున్నాడని పెద్ద ఎత్తున గోల చేసి, శాంతి ఒప్పందాన్ని అధికారికంగా ఖరారు చేసుకోకుండా ప్రభుత్వం పై వత్తిడి తీసుకొచ్చారు.

అధ్యక్షురాలు చంద్రిక కుమారతుంగ ఐఎస్‌జిఎని వ్యతిరేకిస్తూ ఎమర్జెన్సీని ప్రకటించింది. భారత విస్తరణవాదులూ, వారి బూట్లు నాకే 'ది హిందూ' ఎడిటర్ ఎన్.రామ్, సుబ్రహ్మణ్యం స్వామి లాంటి వారు భారత ప్రజలనుండి వాస్తవాల్నీ, నిజాన్నీ మరుగునపరుస్తూ, (అంటే ఎల్‌టిటిఇ రాజీకి కూడా సిద్ధపడిందనే విషయాన్ని దాస్తూ) ఎల్‌టిటిఇ కేవలం ఒక 'టెర్రరిస్టు' సంస్థ అనీ, దానికి విద్రోహ చర్యల మీదనే ఆసక్తి వుంటుంది గానీ ఎటువంటి చర్చిత ఒప్పందాలకూ అది సిద్ధంగా వుండదనీ ఇల్లెక్కి అవాకులూ చవాకులూ కూస్తున్నారు. భారత ప్రజాస్వామ్యానికి చెందిన ఈ నాలుగో స్థంభం వాస్తవంగా భారత బడా బూర్జువాజీల, సింహళ జాతి ఉన్మాదుల ఏజెంటుగా వ్యవహరించి, తమిళ ఈళం ప్రజల న్యాయమైన హక్కులకూ, ఎల్‌టిటిఇ చేస్తున్న న్యాయమైన సాయుధ పోరాటానికీ వ్యతిరేకంగా ప్రజాభిప్రాయాన్ని మలచడానికి కృషి చేసింది. జాతి సమస్యకు ఎటువంటి పరిష్కారాన్నీ చేరుకోలేకపోయినా, శాంతి చర్చల్లో ఎటువంటి ముందడుగునూ సాధించలేకపోయినా కాల్పుల విరమణ 2006 జులై వరకూ కొనసాగింది.

బహిరంగంగా జాతి ఉన్మాదంతో వుండే జెవిపితో మహిందా రాజపక్షే ఎన్నికల పొత్తు పెట్టుకుని 2004 ఎన్నికల్లో విక్రమసింఘెని ఓడించి అధికారంలోకి వచ్చాడు. బహిరంగంగా శాంతి ప్రక్రియను వ్యతిరేకించిన రాజపక్షే ఎల్‌టిటిఇ పై పెద్ద దాడికి పథకం వేశాడు. తమ గత ఓటములనుండి గుణపాఠాలు తీసుకుని అతను మిత్ర దేశాలనుండి, ముఖ్యంగా భారతదేశం, చైనాలనుండి అవసరమైన ఆర్థిక, మిలటరీ, రాజకీయ మద్దతును సంపాదించడం పై కేంద్రీకరించాడు. అంతిమ దాడికై తన బలగాల్ని తయారు చేశాడు. ఎల్‌టిటిఇ పై దౌత్యపరమైన దాడిని కూడా, ముఖ్యంగా పశ్చిమ దేశాల్లో, అతను ఎక్కుపెట్టాడు. ఎందుకంటే అక్కడి తమిళ ప్రజల్లో ఎల్‌టిటిఇకి బలమైన మద్దతుదారులు ఉన్నారు. దీనికి తోడు, ప్రభుత్వం ఎల్‌టిటిఇలో చీలికను తీసుకొచ్చి, ఈళం ప్రజలకు ద్రోహం చేసిన కరుణను తన వైపుకు తిప్పుకుంది. దీంతో ఎల్‌టిటిఇని తూర్పు ప్రాంతంలో గణనీయంగా బలహీనపడడమే కాక, అప్పటివరకూ ప్రభుత్వానికి తెలీని అనేక మిలటరీ రహస్యాలు కూడా బహిర్గతమయిపోయాయి.

**నాలుగవ ఈళం యుద్ధం** 2006, జులై 26న శ్రీలంక ఎయిర్ ఫోర్స్ దాడితో మొదలైంది. ఆ దాడికి సాకు ఏంటంటే ఎల్‌టిటిఇ మూసేసిన మవిల్ అరు గేట్లను తెరవడం కోసం అని. ఇది ప్రభుత్వ ఆధీనంలోని తూర్పు ప్రాంతంలోని 15,000 గ్రామాలకు సాగునీటిని అందజేస్తుందని వారు చెప్పుకున్నారు. శ్రీలంక మానిటరింగ్ మిషన్ ఎల్‌టిటిఇని గేట్లను తెరవమని కోరింది. కానీ శ్రీలంక ప్రభుత్వం దాడిని ఆపడానికి నిరాకరిస్తూ, "సౌకర్యాలను బేరసారాలాడే సాధనాలుగా ఉపయోగించడం తగదు" అని ప్రకటించింది. ఎస్‌ఎల్‌ఎంఎం దాడుల్ని ఖండిస్తూ, "వారికి (ప్రభుత్వానికి) నీరు విషయంలో ఆసక్తి ఏం లేదనేది తేటతెల్లమే. వారికి వేరే విషయంలో ఆసక్తి వున్నది" అని తన పరిశీలనను పేర్కొంది.

2006 నుండి మొదలుకుని ప్రభుత్వ బలగాలు క్రమంగా, స్థిరంగా ముందుకు అడ్వాన్స్ అవుతూ ఎల్‌టిటిఇ అదుపులోని ఒక్కో ప్రాంతాన్నీ ఒకదాని తర్వాత ఒకటిగా స్వాధీనం చేసుకుంటూ వచ్చాయి. మొదటగా వారు తూర్పు ప్రాంతం పై కేంద్రీకరించి 2007 జులై వరకూ దాని పై పూర్తి అదుపును సాధించారు. మిలటరీపరమైన విజయాన్ని సాధించాక, ప్రభుత్వం ఎన్నికల ప్రహసనాన్ని నడిపి రాజకీయంగా సంఘటితపడింది. ద్రోహి కరుణ స్థాపించిన తమిళ మక్కళ్ విడుదలై పులిగళ్ (టిఎంవిపి) అనే పార్టీకి అక్కడ అధికారాన్ని కట్టబెట్టారు. ఆ తర్వాత 2007 సెప్టెంబర్‌లో వారు ఉత్తర ప్రాంతం పై కేంద్రీకరించి, మొదట మన్నార్‌ని స్వాధీనం చేసుకున్నారు. ఆ తర్వాత ఇతర ప్రాంతాలను స్వాధీనం చేసుకుంటూ అంతిమంగా ఎల్‌టిటిఇ అదుపులోని అన్ని ప్రాంతాలనూ స్వాధీనం చేసుకున్నారు.

అంతర్యుద్ధం మొదలైనాక, గత 25 సంవత్సరాల్లో యుద్ధం అభివృద్ధిని అనుసరించి ఎల్‌టిటిఇ అదుపులోని ప్రాంతం పెరుగుతూనో, తరుగుతూనో వచ్చింది. కానీ ఇటీవలి యుద్ధంలో దాని ఓటమి వరకూ అది ఎంతో కొంత ప్రాంతాన్ని తన అదుపులో వుంచుకుంటూ వచ్చింది. తన ప్రాంతంలో ఎల్‌టిటిఇ సమాంతర ప్రభుత్వాన్ని నడిపింది. దానికి న్యాయవ్యవస్థ, పోలీసు, రెవెన్యూ, టివి, రేడియో స్టేషన్లు, ద్రవ్యం మరియు బ్యాంకింగ్, ప్రవాసుల కోసం శాఖ(ఇమ్మిగ్రేషన్), వ్యాపారాలు, వ్యవసాయం వగైరా, వగైరా వ్యవస్థలూ, నిర్మాణాలూ వుండేవి. మిలటరీపరంగా చూసినప్పుడు 1983లో 30 మందితో కూడిన గెరిల్లా బలగంనుండి ఎల్‌టిటిఇ వేలాదిమంది గల సంప్రదాయక స్టాండింగ్ ఆర్మీగా ఎదిగింది. దానిలో పదాతి బలగాలూ (ఇన్‌ఫాంట్రీ), మహిళా బ్రిగేడ్‌లూ, కమాండో యూనిట్లూ, మైన్లు పరచడానికీ, స్నైపింగ్ చేయడానికీ, మోర్టార్లూ, తోపులూ వుపయోగించడానికీ, ట్యాంకులనూ, సాయుధ శకటాలనూ ప్రతిఘటించడానికీ స్పెషలైజ్‌డ్ డివిజన్లూ వగైరా వుండేవి. టైగర్లకు సీ టైగర్లు అనే నావికా దళం కూడా వుండేది. మొత్తం ప్రపంచంలోనే ఎయిర్ టైగర్లు అనే వైమానిక దళం (ఎయిర్ వింగ్) కలిగిన ఏకైక గెరిల్లా బలగం కేవలం ఎల్‌టిటిఇనే. ఎల్‌టిటిఇ వద్ద అనేక నావలూ, పరిమిత సంఖ్యలో చిన్న విమానాలూ వుండినాయి.

భారత విస్తరణవాదుల పాత్ర

మొదటినుండీ కూడా భారత ప్రభుత్వం తన విస్తరణవాద ప్రయోజనాల్ని గమనంలో వుంచుకుని శ్రీలంకలో జోక్యం చేసుకుంటూనే వచ్చింది. తమిళుల కష్టాల పట్ల మొసలి కన్నీరు కారుస్తూ భారత ప్రభుత్వం లోపాయికారీగా సింహళ-బౌద్ధ జాతి ఉన్మాద పాలకవర్గాలకు మద్దతును అందిస్తూ వచ్చింది. 1949లో సింహళ పాలకవర్గాలు అధికారంలోకి వచ్చాక అది భారత మూలాలు గల ప్లాంటేషన్ కార్మికులకు ఓటుహక్కు లేకుండా చేయడంలో వారితో కుమ్మక్కై, సిటిజన్‌షిప్ యాక్టు,1949ని తీసుకురావడానికి అంగీకరించింది. దీని వల్ల పది లక్షలకు పైగా తమిళ ప్లాంటేషన్ కార్మికులు దేశం లేని వారయ్యారు. 1971లో జెవిపి తిరుగుబాటు వల్ల సిరిమావో బండారనాయకే ప్రభుత్వం ప్రమాదంలో పడే పరిస్థితి తలెత్తినప్పుడు, భారత ప్రభుత్వం ఆ తిరుగుబాటును అణచివేయడానికి అన్ని రకాల సహాయ సహకారాల్నీ అందించింది. ఎందుకంటే అది తన ప్రముఖ హోదాను చైనాకు వదులుకోడానికి సిద్ధంగా లేకుండింది. తిరిగి 1974లో, అదే కారణంతో అది అనాదిగా తమిళనాడుకు చెందిన మత్స్యకారుల ద్వీప రేవు అయిన కచ్చైత్తీవుని, తమిళ ప్రజల, రాష్ట్ర ప్రభుత్వ ప్రతిఘటనను పక్కకు తోసేస్తూ, శ్రీలంకకు అప్పగించింది. ఫలితంగా, నేడు తమిళనాడుకి చెందిన 400 మందికి పైగా

మత్స్యకారులు చనిపోయారు, వేలాదిమంది అరెస్టులయ్యారు, చిత్రహింసలపాలయ్యారు. వారి చేపల పడవులనూ, వలలనూ, లక్షల విలువ చేసే ఇతర సామగ్రినీ శ్రీలంక నావికా దళం నాశనం చేసింది. తమిళ మత్స్యకారులూ వందల సంఖ్యలో నిరసన ప్రదర్శనలనూ, బంద్‌లనూ నిర్వహించారు. వివిధ సెక్షన్ల ప్రజలూ, రాజకీయ పార్టీలూ మత్స్యకారుల పరిరక్షణకై తగిన చర్యలు తీసుకోవాలని డిమాండ్ చేశారు. కానీ వీటన్నిటినీ ఈ మత్స్యకారులు ఎల్‌టిటిఇకి వాహకాలుగా పని చేస్తున్నారనే సాకుతో భారత ప్రభుత్వం పెడచెవిన పెట్టింది.

తన విస్తరణవాద ప్రయోజనాలను నెరవేర్చుకోడానికి భారత ప్రభుత్వం శ్రీలంక జాతి ఉన్మాదుల్ని బుజ్జగించడమో లేక తమిళ సమస్యను ఉపయోగించుకుని వారిపై వత్తిడి తేవడమో చేస్తూ వచ్చింది. 1983లో శ్రీలంకలో తమిళ వ్యతిరేక దాడులు ఆరంభమైనప్పుడు జోక్యం చేసుకోవడానికి అవకాశం కోసం ఎదురు చూస్తుండిన భారత ప్రభుత్వం, వెంటనే రంగంలోకి ప్రవేశించి ఎల్‌టిటిఇకి ఆయుధాలు యిచ్చి, భారతదేశంలో వారికి శిక్షణా క్యాంపులను ఆరంభించింది. 1985లో ఉత్తర శ్రీలంకలో తమిళులపై విమానాలనుండి బాంబులు వేయడాన్ని ఎదిరించే సాకుతో, భారత ఎయిర్ ఫోర్స్ జెట్ విమానాలు శ్రీలంక భూభాగంలోకి ప్రవేశించి, అన్ని అంతర్జాతీయ చట్టాల్నీ, నియమాల్నీ ఉల్లంఘిస్తూ ఆహార పదార్థాల్నీ, మందుల్నీ పైనుండి పడేసి పోయాయి.

భారత, శ్రీలంక ప్రభుత్వాలు 1987లో చేసుకున్న భారత-శ్రీలంక ఒప్పందం అణచివేయబడ్తున్న తమిళులకు ఒక పరిష్కారాన్ని చూపడానికో లేక వారికి కొంత ఉపశమనాన్ని కలిగించడానికో ఉద్దేశించినది కాదు. అది భారత ప్రభుత్వం శ్రీలంక మొత్తాన్ని తన ఆధీనంలోకి తెచ్చుకోవాలని చేసుకున్నదే. అది అక్షరాలా అన్ని తమిళ గ్రూపులనూ తన మాట వినమని బెదిరించింది. ఎల్‌టిటిఇ, తమిళ ఈళం ప్రజలూ ఆ ఒప్పందాన్ని వ్యతిరేకించినప్పుడు అది వారి న్యాయమైన జాతి ఆకాంక్షలను అణచిపారేయటానికి మిలటరీ ఆపరేషన్లను ఆరంభించింది. అయితే జాతి విముక్తిని సాధించుకోవడం కోసం ఎటువంటి కష్టానికైనా సిద్ధపడి, దృఢనిశ్చయంతో వున్న ప్రజలపై అది తన అభీష్టాన్ని రుద్దడంలో విఫలమైందనేది తేటతెల్లమే. అంతే కాక వారు ఘోరమైన పరాజయం పాలై వెనుతిరిగారు. జాతి విముక్తి పోరాటాన్ని బలహీనపరచి దాన్ని తన విస్తరణవాద పేరాశకు ఒక సాధనంగా చేసుకోవాలనే ఉద్దేశంతో భారత ప్రభుత్వం, రా (రిసర్చి అండ్ అనాలిసిస్ వింగ్) ఎల్‌టిటిఇని చీల్చడానికీ, అందులోకి ఇన్‌ఫిల్ట్రేట్ (చొరబాటుకీ) కావడానికీ కుట్ర పన్నాయి. ఇపిఆర్ఎల్ఎఫ్, ఇఎన్‌డిఎల్ఎఫ్ వంటి ఇతర మిలిటెంట్ గ్రూపులకు అన్ని రకాల రక్షణల్ని కల్పిస్తూ, వారిని తన తొత్తులుగా కూడా మార్చుకుని ప్రత్యేక ఈళం గురించిన పోరాటాన్ని భారత్ వ్యతిరేకిస్తూ వచ్చింది. ఎల్‌టిటిఇ చీఫ్ ప్రభాకరన్‌నూ, ఇతర ఉన్నత స్థాయి నాయకత్వాన్నీ తన ఏజెంట్లయిన మహేంద్రరాజా మహత్తయ్యా వంటి వారి ద్వారా చంపించడానికి అనేక ప్రయత్నాలు చేసింది. మహత్తయ్య ఎల్‌టిటిఇలో ప్రభాకరన్ తర్వాతి స్థానంలో ఉండినాడు.

సింహళ ప్రభుత్వానికి అన్ని రకాల మిలటరీ సహాయాల్ని అందించడం ద్వారా భారత ప్రభుత్వం నిజానికి తమిళ ప్రజల ఊచకోతలో పూర్తి స్థాయిలో పాల్గొన్నది. అది అత్యాధునిక ఆయుధాల్నీ, రాడార్లనూ, ఇతర యుద్ధ యంత్రాలనూ శ్రీలంకకు సరఫరా చేయడమే కాక, వారికి శిక్షణనివ్వడానికి మిలటరీ అధికారులను కూడా శ్రీలంకకు పంపింది. కొన్ని సందర్భాల్లో ఫీల్డు ట్రెయినింగ్‌ను కూడా అందజేసింది. తమిళనాడు ప్రజలూ, కొన్ని విప్లవకర, జాతివాద సంస్థలూ నేరంలో దాని భాగస్వామ్యం గురించి ఆరోపణలు చేసినప్పటికీ, ప్రభుత్వం వాస్తవాల్ని వక్రీకరించడానికి ప్రయత్నించింది. కానీ, అంతిమంగా, తాను ఆయుధాల్ని సరఫరా చేశానని అది ఒప్పుకోక తప్పలేదు. అయితే అవి కేవలం 'ఆత్మరక్షణ ప్రయోజనాల' ఇచ్చానని అది చెప్పుకుంది. రాజీవ్ గాంధీని చంపిందనే సాకుతో అది భారతదేశంలో ఎల్‌టిటిఇని నిషేధించింది. ఆ విధంగా భారత ప్రజలకు, ముఖ్యంగా తమిళనాడు ప్రజలకు, గల తమిళ ఈళం న్యాయమైన పోరాటానికి మద్దతునిచ్చే ప్రజాస్వామిక హక్కును కాలరాచివేశారు. ఈళం పోరాటానికి మద్దతునిచ్చే వారందరినీ అరెస్టు చేయమని అది రాష్ట్ర ప్రభుత్వం పై వత్తిడి తీసుకొచ్చింది. ఈళం పోరాటానికి మద్దతునిచ్చినందుకు డజన్ల సంఖ్యలో తమిళ జాతివాదులనూ, విప్లవకారులనూ నాసా కింద, ఇంకా ఇతర నల్ల చట్టాల కిందా అరెస్టు చేశారు. ఎల్‌టిటిఇ సప్లై నావల మీదా, స్పీడ్‌బోట్ల మీదా నిఘా కోసం అది తన నావికా దళాన్నీ, కోస్ట్ గార్డులనూ మోహరించింది. అనేక సందర్భాల్లో అది శ్రీలంక నావికా దళానికి సమాచారాన్ని అందించి, ఈలం పోరాటానికి భారీ నష్టాన్ని కలిగించింది. బీడీలూ, లుంగీలూ, బ్యాటరీ సెల్లులు వగైరా వస్తువుల్ని ఎల్‌టిటిఇకి సరఫరా చేస్తున్నారనే చిన్న చిన్న సాకులతో తమిళనాడుకు చెందిన మత్స్యకారులను భారత కోస్ట్ గార్డులు అరెస్టు చేసేవారు. అలాగే జాతి విముక్తి పోరాటానికీ, ముఖ్యంగా ఎల్‌టిటిఇకీ వ్యతిరేకంగా తన రాయబార కార్యాలయాల ద్వారా, తన ఏజెంట్లయిన బ్రాహ్మణవాద సుబ్రహ్మణ్యం స్వామి, 'జాతీయ' (వ్యతిరేక) వార్తపత్రిక 'ది హిందూ' ద్వారా ఒక దుష్ప్రచార క్యాంపెయిన్‌ని కూడా అది ఆరంభించింది.

అధికారికంగా 1983 నుండి యుద్ధంలో మరణించిన ప్రజల సంఖ్య 70,000కు పైగా వుందని అంచనా కట్టారు. అయితే, యూనివర్సిటీ ఆఫ్ వాషింగ్టన్, హార్వర్డ్ మెడికల్ స్కూలు వారు చేపట్టిన స్వతంత్ర అధ్యయనం చనిపోయిన వారి సంఖ్య 3,38,000 మంది దాకా వుండవచ్చని తెలిపింది. 2008 అక్టోబర్‌లో జాతి నిర్మూలన యుద్ధం 50,000 మందిని చంపి, అంతకంటే రెట్టింపు మందిని గాయపరిచి ఒక పరాకాష్టకు చేరుకున్న సమయానికి, భారత ప్రభుత్వం కనీసం ఈ దారుణ మారణకాండకు వ్యతిరేకంగా ఒక్క పదం కూడా ఖండిస్తూ మాట్లాడింది లేదు. కొన్ని నివేదికల ప్రకారం, భారత ప్రభుత్వం ఎల్‌టిటిఇ రాజకీయ విభాగం చీఫ్ నడేశన్‌కూ, మరో ఉన్నత స్థాయి నాయకుడైన పులిదేవన్‌కూ ఆయుధాల్ని వదిలిపెట్టి శ్రీలంక ప్రభుత్వానికి లొంగిపొమ్మనీ, దీని గురించి తాము అప్పటికే శ్రీలంక అధ్యక్షుడితో మాట్లాడామనీ, అతనూ వారికి క్షమాభిక్ష పెట్టడానికి అంగీకరించాడనీ హామీ ఇచ్చిందట. భారతదేశం ఇచ్చిన హామీని నమ్మి వారు తెల్లజెండాను పట్టుకుని సైన్యం ముందు లొంగిపోవడానికి బైటకు వచ్చారు. కానీ వారిని దగ్గరనుండి కాల్చి చంపారు. సింహళ మూలానికి చెందిన నడేశన్ భార్య నిరాయుధంగా ఈ పాశవిక నేరాన్ని ఎదిరించింది. కానీ ఆమెను కూడా క్రూరంగా కాల్చి చంపారు. ఎల్‌టిటిఇ చీఫ్ ప్రభాకరన్‌ని చంపామని శ్రీలంక ప్రభుత్వం చెప్పుకున్న రోజున, కేవలం రెండు రోజుల్లోనే 20,000 మంది పౌరులను చంపేశారని రిపోర్టు వచ్చింది.

ప్రపంచం దృష్టిని ఈ దారుణ మారణకాండనుండి మళ్లించడానికే ప్రభాకరన్‌ని చంపిన వార్తను కావాలని ప్రచారం చేశారని కూడా వార్తలు వచ్చాయి. చనిపోయిన మహిళా టైగర్లను అత్యాచారం చేసి, దాన్ని విడియో టేప్‌లో బంధించి ఇంటర్‌నెట్‌లో పెట్టారు రక్తపిపాసులైన శ్రీలంక సైనికులు. చనిపోయిన మహిళా టైగర్ల శరీర భాగాల్ని కూడా బజార్లో మాంసం అమ్మినట్లుగా అమ్మారు ఈ క్రూరులు. ప్రపంచంలోని అతి పెద్ద ప్రజాస్వామ్య దేశాలుగా గప్పాలు కొట్టుకునే దేశాల పాలకులెవ్వరూ దీని పై ఆగ్రహాన్ని వ్యక్తం చేసింది లేదు. బదులుగా, జాతీయ సెక్యూరిటీ సలహాదారు కె.ఎన్.నారాయణన్ శ్రీలంక హంతక ఆర్మీ చీఫ్‌ను 'ప్రపంచంలోని అతి గొప్ప ఆర్మీ చీఫ్' అని పొగిడాడు. గత ఆరు నెలల్లో ఢిల్లీలోని యుపిఎ ప్రభుత్వం ఒక్కసారి కూడా పౌరులను చంపడం ఆపమని కొలంబోను అడిగింది లేదు. అది చేసిందల్లా ఈ నయా-నాజీలకు పౌరులు ఆశ్రయం పొందడానికి వీలుగా మరిన్ని 'నో ఫ్లై

జోన్ (ఎన్‌ఎఫ్‌జెడ్ - విమాన దాడులు జరగని ప్రాంతం) లను కేటాయించమని 'విజ్ఞప్తి' చేయడం మాత్రమే. నిజానికి అప్పటికే సోకాల్డ్ ఎన్‌ఎఫ్‌జెడ్‌లుగా చెప్పబడ్తున్న ప్రాంతాల మీద కూడా బాంబింగ్ చేస్తూ వేలాదిమంది స్త్రీలనూ, పిల్లలనూ, ముసలివారినీ చంపేస్తున్నారు. అది జనాన్ని మోసం చేయడానికి పన్నిన ఎత్తు తప్ప మరొకటి కాదు. "భారత ప్రభుత్వం అందించిన సహాయ, సహకారాలు ఎంతో సంతృప్తికరంగా ఉన్నాయం"టూ ఫాసిస్టు మహీందా రాజపక్సే, భారత ప్రభుత్వం పోషించిన పాత్ర ఎలాంటిదో అందరికీ తెలియజేశాడు. యుద్ధం ముగిసిపోయిందని శ్రీలంక ప్రభుత్వం ప్రకటించాక, విముక్తి పోరాటాన్ని అణచడంలో భారత ప్రభుత్వం అందించిన మద్దతును పొగుడుతూ కొలంబోలో పోస్టర్లు వెలిశాయి. జాతి నిర్మూలన యుద్ధం ముగిసిన తర్వాత కూడా, భారత ప్రభుత్వం ఎల్‌టిటిఇ పరిచిన మందుపాతరలను నిర్వీర్యం చేయడానికి మిలటరీ సిబ్బందిని పంపించింది. తమిళనాడు ప్రజలు ఈళం పోరాటానికి అందించిన మద్దతును ఏ మాత్రం పట్టించుకోకుండా, ఈళం తమిళులతో వారికి అనాదిగా వుండిన జాతిపరమైన, బొడ్డుతాడు సంబంధాన్ని ఖాతరు చేయకుండా భారత పాలకులు తమ విస్తరణవాద పన్నాగాలను అమలు చేశారు. శ్రీలంక ప్రభుత్వం భారత ప్రభుత్వంతో కుమ్మక్కై ఈ యుద్ధాన్ని నడిపింది అని అంటే అది అతిశయోక్తి కాబోదు.

శ్రీలంకలో 1985-89 మధ్యకాలంలో భారత హై కమిషనర్‌గా పని చేసిన జె.ఎన్.దీక్షిత్ శ్రీలంకలోని తమిళుల సమస్య విషయంలో భారత ప్రభుత్వ ప్రయోజనాల్ని ఏ మాత్రం దాచకుండా ఒక దశాబ్దం క్రితం, 1998లో బహిరంగంగా ఇలా ప్రకటించాడు:

"...తమిళ మిలిటెన్సీ భారత సహాయాన్ని పొందడం అనేది అమెరికా, ఇజ్రాయెల్, పాకిస్తాన్‌ల నుండి శ్రీలంక పొందుతున్న నిర్దిష్ట విస్తారిత మిలటరీ, ఇంటలిజెన్స్ సహకారానికి ప్రతిగా జరిగింది. వీటి ఉనికి భారత్‌కి వ్యూహాత్మక ప్రమాదాన్ని తేగలవు అనే అంచనా వుండింది...". ఇదే అభిప్రాయాన్ని తిరిగి వెల్లడి చేస్తూ, విదేశీ వ్యవహారాల మంత్రి ప్రణబ్ ముఖర్జీ 2009 మార్చిలో ఇలా అన్నాడు: "మన ఆతృతలో మనం ఆ ద్వీపం యొక్క వ్యూహాత్మక ప్రాధాన్యతను మరువకోడదు. అది వారి భద్రతకి సంబంధించిన విషయమే కాదు, మన భద్రతతో కూడా దగ్గరగా ముడిపడి వున్న విషయం...మన పెరట్లో ఇతర అంతర్జాతీయ ఆటగాళ్లు వుండడం మనకు సుతరామూ ఇష్టం వుండదనేది స్పష్టమే కదా".

శ్రీలంకలో భారత్ జోక్యం కేవలం దాని భౌగోళిక-రాజకీయ ప్రాముఖ్యతను బట్టే జరగలేదు. అంతులేని పేరాశతో వారు మొత్తం శ్రీలంకనే లూటీ చేయాలనే దుష్ట సంకల్పాన్ని కలిగి వుండినారు. 1990-1996 మధ్యకాలంలో భారతదేశంనుండి శ్రీలంకకు ఎగుమతులు 556 శాతం పెరిగాయి. 1998లో భారత-శ్రీలంక ద్వైపాక్షిక స్వేచ్ఛా వాణిజ్య ఒప్పందం (ఐఎల్‌బిఎఫ్‌టిఎ) పై భారత, శ్రీలంకలు సంతకాలు చేశాయి. దీని ప్రకారం భారతదేశంనుండి శ్రీలంకకు దిగుమతి అవుతున్న సరుకులన్నిటి పైనా పూర్తిగా పన్నును రద్దు చేశారు. దీనితో రెండు దేశాల మధ్య వ్యాపారం ఒక్క గెంతు గెంతింది. భారత దళారులు శ్రీలంకలో పెద్దెత్తున మదుపులు పెట్టారు. సియట్ ఇండియా, ఆసియన్ పెయింట్స్, ఎల్ అండ్ టి, అశోక్ లేల్యాండ్, తాజ్ గ్రూపు హోటళ్లు, టాటా టీ, ఎసిసి, అల్ట్రా టెక్ మరియు అంబుజా సిమెంట్స్, రాంకో గ్రూపు పరిశ్రమలు, ఇండియన్ ఆయిల్ కార్పొరేషన్, మహీంద్రా అండ్ మహీంద్రా, కాడిలా డ్రగ్ కంపెనీ, ఎక్సయిడ్ బ్యాటరీస్, టివిఎస్, బ్రిటానియా, అన్సల్ రియల్ ఎస్టేట్ కంపెనీ, జెట్ ఎయిర్‌వేస్, సహారా మరియు ఇండియన్ ఎయిర్‌లైన్స్, ఐసిఐసిఐ, యుటిఐ, ఎల్‌ఐసీ, అరవింద్ మిల్స్, ఎయిర్‌టెల్ యింకా మరెన్నో బడా బూర్జువా పారిశ్రామికవేత్తల కంపెనీలు శ్రీలంకలో తమ వ్యాపారాల్ని మొదలుపెట్టాయి. 2000లో 16వ స్థానంలో వున్న భారత మదుపులు, 2005 నాటికి 5వ స్థానానికి చేరుకున్నాయి. చైనా పెట్రోలియం బడా సంస్థ సైనోపెక్‌ను తేవడానికి కొలంబో చేసిన ప్రయత్నాన్ని భారత్ అడ్డుకుంది. ట్రింకోమలి భారీ పెట్రోలియం స్టోరేజిని ఇండియన్ ఆయిల్ కార్పొరేషన్‌కు అప్పగించమని శ్రీలంక పై వత్తిడి చేసి, రాబోయే 35 ఏండ్లలో 100కు పైగా పెట్రోలు బంకులను స్థాపించడానికి 750 లక్షల డాలర్ల మదుపుల్ని పెట్టడానికి ఒప్పందాన్ని చేసుకుంది. అందుకు ప్రతిఫలంగా, ఎల్‌టిటిఇకి వ్యతిరేకంగా శ్రీలంక చేస్తున్న యుద్ధానికి అన్ని రకాల మిలటరీ సహకారాన్నీ అందించడానికి అది ఒప్పుకుంది. హిందూ మహాసముద్రంలో సీటైగర్ల కదలికల పై నిఘా వేయడానికి అది శ్రీలంక నావికాదళానికి సహాయం చేసి, వారికి ఇంటలిజెన్స్ ఇన్‌పుట్స్‌ను (సమాచారాన్ని) సరఫరా చేసింది.

ఇప్పుడు ఈ రాబందులు అప్పుడే ఉత్తర, తూర్పు శ్రీలంక ప్రాంతాల 'పునర్నిర్మాణం' పేరుతో జరిగే లూటీలో వాటా కోసం పోటీపడ్తున్నాయి. రెండు దేశాల మధ్యా 2,292 కోట్ల రూపాయల ఖర్చుతో సముద్రం అడుగున విద్యుత్తు లైన్లను పరచి నిర్మించే విద్యుత్తు నెట్‌వర్క్ కోసం భారత, శ్రీలంకల మధ్య ఒక అవగాహనా ఒప్పందం (ఎంఓయు) పై త్వరలోనే సంతకాలు జరుగుతాయి.

'మద్దతు'గా అయినా, వ్యతిరేకంగా అయినా గానీ తమిళ ఈళం సమస్య భారతదేశానికి శ్రీలంకకు వ్యతిరేకంగా ఉపయోగించుకునే సాధనమే తప్ప మరొకటి కాదు. 1987 కంటే ముందు అది అక్కడ తన ప్రాభవాన్ని పెంచుకోడానికి జాతి ఉన్మాద శ్రీలంకకు వ్యతిరేకంగా జరుగుతున్న ఈళం పోరాటానికి 'సహాయం' అందించే పాత్రను నిర్వహించింది. ఒకసారి అదుపు సాధించాక 'రక్షకుడు' తద్విరుద్ధమైన పాత్రలోకి వెళ్లిపోయి, తమిళులకు ప్రత్యేక మాతృభూమి కావాలని రాజీ లేకుండా పోరాడుతున్న ప్రధాన సంస్థ అయిన ఎల్‌టిటిఇని ఓడించడానికి శ్రీలంక పాలకులకు సహాయం చేయసాగాడు. ఎల్‌టిటిఇని తుడిచిపెట్టడం శ్రీలంకలో 'శాంతి'ని నెలకొల్పి కొనసాగించడానికి ఉపయోగపడ్డమే కాక, తమిళనాడులో కూడా శాంతికి దారి తీస్తుంది ఎందుకంటే తమిళ జాతి సెంటిమెంట్లు ఎప్పుడైనా గానీ జాతుల బందిఖానాగా వున్న భారతకు వ్యతిరేకంగానే వుంటాయి. తమిళనాడులో జాతి పోరాటం పైకెగసే విషయంలో అది ఎప్పుడూ భయపడ్తూనే వుంటంది. సాయుధ పోరాటమనే కాదు, ఎటువంటి రూపంలో జాతి ఉద్యమం అభివృద్ధి అయినా గానీ అది ఢిల్లీ పాలకులనుండి నిర్దాక్షిణ్యమైన నిర్బంధాన్నే ఖచ్చితంగా ఎదుర్కొంటుంది. కాశ్మీరు, పంజాబ్, అస్సాం, నాగాల్యాండ్, మణిపూర్, గోర్ఖాల్యాండ్ వగైరాల్లో గత 52 సంవత్సరాల్లో జరుగుతున్న జాతి పోరాటాలే దీనికి సాక్ష్యం.

బోగస్ అంతర్జాతీయ సముదాయం పోషించిన పాత్ర

శ్రీలంక హిందూ మహాసముద్రంలో, అత్యంత ప్రముఖమైన ఒక వ్యూహాత్మక ప్రాంతంలో నెలకొని వున్న దేశం. హిందూ మహాసముద్రంలో 47 దేశాలు వున్నాయి. చుట్టూ ఎన్నో ద్వీపాలు వున్నాయి. ఈ ప్రాంతం పై అదుపు కోసం ప్రయత్నిస్తున్న దేశాలు ప్రధానంగా చైనా, అమెరికా/ఇండియాలు. డిగ్గో గార్షియాలో అమెరికాకు నావల్ మరియు ఎయిర్ బేస్‌లు వున్నాయి. భారతదేశం హిందూ మహాసముద్రం చుట్టూ తన స్వంత ప్రాంతాలను కలిగి వుండడమే కాక, మాల్దీవుల మీద కూడా గణనీయమైన ప్రభావాన్ని కలిగి వుంది. చైనాకు మయన్మార్ సమీపాన గల కోకో ద్వీపాల్లో ఒక బేస్ వుంది.

హిందూ మహాసముద్రం ఒక కీలకమైన జలమార్గం. దీని గుండా ప్రపంచంలోని కంటేనర్లలో (భారీ నౌకలు) రవాణా అయ్యే సరుకుల్లో సగ భాగమూ, బల్క్ (టోకు) సరుకుల్లో మూడింట ఒక వంతూ, ఆయిల్ రవాణాలో మూడింట రెండు వంతులూ రవాణా అవుతుంటాయి. ఈ మార్గం ద్వారా పెట్రోలియం ఉత్పత్తులు భారీ ఎత్తున రవాణా అవుతుంటాయి.

అమెరికా 2007, మార్చి 5న శ్రీలంకతో పది సంవత్సరాల అక్విజిషన్ మరియు క్రాస్-సర్వీసింగ్ ఒప్పందాన్ని (ఎసిఎస్ఎ) చేసుకుంది. దీని ప్రకారం ఇతర విషయాలతో పాటు లాజిస్టికల్ సప్లయిలు, చమురు తిరిగి నింపుకునే (రీఫ్యుయలింగ్) సౌకర్యాలు కూడా దానికి ఒనగూడతాయి. అమెరికాకు ఇప్పటికే ట్రింకోమలిలో వాయిస్ ఆఫ్ అమెరికా ఇన్స్టాలేషన్ (నిర్మాణం) వుంది. దాన్ని నిఘా అవసరాల కోసం ఉపయోగించుకోవచ్చు.

ముందే పేర్కొన్నట్లుగా, 1987నాటి భారత-శ్రీలంక ఒప్పందం ప్రకారమే భారతదేశానికి ఈ కింది హామీ లభించింది - "విదేశీ బ్రాడ్కాస్టింగ్ (ప్రసార) సంస్థలతో వున్న శ్రీలంక ఒప్పందాలను అది సమీక్షించి, శ్రీలంకలో వారు నిర్మించే ఏ నిర్మాణాలైనా గానీ కేవలం పబ్లిక్ బ్రాడ్కాస్టింగ్ కోసం తప్ప మిలటరీ, ఇంటలిజెన్స్ ప్రయోజనాల కోసం ఉపయోగపడకుండా వుండేలా హామీనిస్తుంది. ట్రింకోమలి గానీ, శ్రీలంకలోని ఇతర ఓడరేవులు గానీ భారతదేశ ప్రయోజనాలకు భంగం కలిగించే విధంగా ఏ దేశానికైనా గానీ మిలటరీ ప్రయోజనాలకు ఉపయోగపడకుండా వుండేలా హామీ పడుతుంది." అమెరికా, సోవియట్ సంఘర్షణ పరాకాష్టకు చేరుకుని వున్న సమయం అది. భారతదేశం సోవియట్ వైపు వున్నది. అప్పటినుండీ అంతర్జాతీయ సమీకరణలు మారాయి. ఇప్పుడు భారతదేశం ఈ ప్రాంతంలో అమెరికాకు ప్రధాన తొత్తుగా వ్యవహరిస్తున్నది..

1993 నుండి చమురును ప్రధానంగా దిగుమతి చేసుకునే దేశంగా వుండిన చైనా, చమురు వినియోగంలో అమెరికా తర్వాత రెండో స్థానంలో వుంది. 2000-2004 మధ్య ప్రపంచవ్యాప్తంగా ముడిచమురు కోసం పెరిగిన డిమాండ్లో చైనా డిమాండే 40 శాతంగా వుంది. నిరంతరాయమైన ఆర్థిక ప్రగతి కై చైనాకు ఇంధన వనరులు చాలా కీలకమైనవి. అందుకని తన చమురు సప్లయిలకు కీలకమైన జలమార్గాలనూ, రవాణా మార్గాలనూ పొందడానికై చైనా తన ప్రయత్నాల్ని ముమ్మరం చేసింది. 2005 నాటి సునామీ బీభత్సం తర్వాత, చైనా గాల్ని పునర్నిర్మించడానికి 40 లక్షల డాలర్ల అదనపు 'సహాయా'న్ని అందించింది. ఎందుకంటే అక్కడ దానికి ఆయుధాలు సరఫరా చేసే నోరింగో ఆయుధ గోడౌన్ వుంది. 2007లో అది ఈ గోడౌన్ను మూసేసినప్పుడు మరింత చౌక ధరలకు ఆధునిక ఆయుధాలను పాలి టెక్నాలజీస్ నుండి సరఫరా చేయడానికి అంగీకరించింది. ఆ విధంగానే తర్వాత 2007 ఏప్రిల్లో పాలి టెక్నాలజీస్ శ్రీలంకకు 365 లక్షల డాలర్ల విలువ గల ఆయుధాలను సరఫరా చేసింది. కమ్యునికేషన్ల కోసం దేశవ్యాప్త ఇన్ఫ్రాస్ట్రక్చర్ను (అవస్థాపనా నిర్మాణాన్ని) నిర్మించడం కోసం చైనా ఇంటలిజెన్స్ వింగ్ అయిన ఎంఎస్ఎస్తో దగ్గరి సంబంధాల్లో వుండే చైనా హువెయ్ కి 1500 లక్షల డాలర్ల కాంట్రాక్టును అప్పగించారు. తన ఆయిల్ ట్యాంకర్ల రక్షణకు హామీగా నిలిచేందుకు శ్రీలంక దక్షిణ కోస్తా ప్రాంతంలో హంబన్టోటా వద్ద ఒక ఓడరేవును నిర్మించడానికి కూడా చైనా శ్రీలంకతో ఒప్పందాన్ని ఖరారు చేసుకుంది. ఇటీవలే 2009 జూన్లో, **నాలుగవ ఈళం యుద్ధం** ముగిసిపోయాక, అది నోరోచ్చోలై కోల్ పవర్ ప్రాజెక్టు కోసం 8910 లక్షల డాలర్ల ఒక ఒప్పందం పై సంతకాలు చేసింది. చైనా కంపెనీలకు ఒక ఆర్థిక జోన్ను కేటాయించి 33 సంవత్సరాల వరకూ వర్తించే ఒక ఒప్పందం పై సంతకాలు చేసుకున్నారు. హుయ్చిన్ హోల్డింగ్స్ లిమిటెడ్ రాబోయే మూడేళ్లలో మిరిగమా జోన్లో 280 లక్షల డాలర్ల మదుపుల్ని పెట్టబోతోంది. మొదటిసారిగా ఒక నిర్దిష్టమైన ప్రాంతాన్ని ఒక విదేశీ సంస్థకు అప్పగించారు, అదీ కొలంబోకి సమీపంలో. చైనా శ్రీలంకలోకి చొచ్చుకుని పోతోంది. అది అమెరికా-భారత కూటమికి ఆందోళనకరంగా మారింది.

తమ వ్యూహాత్మక భౌగోళిక-రాజకీయ (జియో-పొలిటికల్), ఆర్థిక ప్రయోజనాలకు అనుగుణంగా శ్రీలంకలోని తమిళ జాతి సమస్య పట్ల వైఖరిని తీసుకున్న ప్రధాన దేశాలు ఇవి. శ్రీలంక సైన్యం ఇక యుద్ధాన్ని ముగిస్తుండగా అమెరికా సామ్రాజ్యవాదులు 'అమాయకుల' హత్యల గురించీ, 'మానవ సంక్షోభం' గురించీ గోల చేశారు. 50,000 మందికి పైగా పౌరుల మరణాలకు దారి తీసిన జాతి నిర్మూలన యుద్ధం 2008 సెప్టెంబర్ నుండి జరుగుతున్నప్పటికీ యుద్ధాన్ని అంతం చేయడానికి అది ఎటువంటి నిర్దిష్ట చర్యనూ చేపట్టలేదు. అది మానవ హక్కుల ఉల్లంఘన గురించీ, 'అమాయకుల' 'దుస్థితి' గురించీ మొసలి కన్నీరు కారుస్తోంది గానీ అదంతా తన ప్రయోజనాలకు భంగం కలిగించే ఎటువంటి చర్యనూ చేపట్టవద్దని అంటే చైనాని దరి జేరనివ్వవద్దని శ్రీలంక ప్రభుత్వాన్ని బెదిరించడానికి ముసుగు తప్ప మరొకటి కాదు. కానీ చైనా శ్రీలంకలోకి పెద్దెత్తున చొచ్చుకుపోతున్న కొద్దీ, అమెరికా తన వత్తిడిని పెంచుతూ పోతోంది. అప్పటికే శ్రీలంక అధ్యక్షుడు మహిందా రాజపక్సేకి సలహాదారుగా పని చేస్తుండిన (ఇప్పుడు చేయడం లేదు) ఒక అమెరికా లాయర్ అమెరికా కోర్టులో శ్రీలంక యుద్ధ నేరాల గురించి కేసు వేయడానికి ఫైల్ తయారు చేస్తుండినాడు. ఆసక్తికరంగా, మహిందా రాజపక్సే సోదరుడూ, శ్రీలంక రక్షణ సెక్రటరీ గొట్టబోయ రాజపక్షేకీ, ఆర్మీ చీఫ్ ఫొన్సెకాకీ కూడా అమెరికా పౌరసత్వం వుంది. శ్రీలంకలో చైనాతో తనకున్న పోటీలో అమెరికా ఈ విషయాన్ని ఎప్పుడైనా గానీ శ్రీలంక ప్రభుత్వం పై వత్తిడి చేయడానికి ఉపయోగించుకోవచ్చు.

చైనా నయా-నాజీలకు అత్యాధునిక ఆయుధాలనూ, సహాయాల్నీ అందించడమే కాక, వేలాదిమంది పౌరుల్ని చంపినందుకు శ్రీలంకను ఖండిస్తూ ఐరాస సెక్యూరిటీ కౌన్సిల్ తీర్మానాన్ని జారీ చేసే ప్రయత్నాల్ని కూడా అది అడ్డుకుంది. భారతదేశం కూడా తీర్మానాన్ని వ్యతిరేకించడమే కాక దానికి వ్యతిరేకంగా ఓటు వేయడానికి కొన్ని ఇతర దేశాలతో కలిసి లాబీయింగ్ కూడా చేసి ఇదే పాత్రను నిర్వహించింది.

ఎన్ఎఫ్జెడ్లలో పౌరుల స్థితిగతులను పరిశోధించడానికి ఐరాస తన ప్రతినిధిగా విజయ్ నంబియార్ని పంపింది. ఇతగాడు శ్రీలంక ప్రభుత్వానిది ఏ మాత్రం తప్పు లేదన్నట్లుగా ప్రకటన చేశాడు. శ్రీలంక ప్రభుతానికి రక్షణ సంబంధిత విషయాల్లో అతని సోదరుడు సతీష్ నంబియార్ ఒక సలహాదారుగా వున్నాడనే విషయాన్ని ఇక్కడ పేర్కొనడం అసంగతంగా వుండబోదు. ఒక సోదరుడు జాతి విముక్తి పోరాటాన్ని నిర్దాక్షిణ్యంగా ఎలా అణచివేయాలో సలహాలు ఇస్తాడు, మరో సోదరుడు 'మానవ హక్కుల' ఉల్లంఘన ఎలా వుందో చూస్తాడు. జాతి ఊచకోత కాగానే పరిస్థితి ఎలా వుందో 'పరిశీలించడానికి' శ్రీలంక వచ్చిన ఐరాస సెక్రటరీ జనరల్ పైన కూడా సీరియస్ ఆరోపణలు వచ్చాయి. నిజానికి అతను అమాయకుల హత్యలనూ, శ్రీలంక మిలటరీ ఫాసిస్టులు చేసిన ఇతర యుద్ధ నేరాలనూ బయటకు రాకుండా కప్పెట్టాడు. వాస్తవానికి, ఎల్టిటిఇ టెర్రరిస్టుల పై శ్రీలంక ప్రభుత్వ విజయాన్ని పొగుడుతూ ఐరాస ఒక తీర్మానాన్ని ఆమోదించింది. జెనీవాలో ఐరాస కార్యాలయం ముందు ఒక ఈళం తమిళుడితో సహా 14 మంది తమిళులు ఆత్మాహుతి చేసుకున్నప్పటికీ వారు పట్టించుకోలేదు.

ప్రపంచవ్యాప్తంగా ప్రజాభిప్రాయాన్నీ, నిరసనల్నీ ఏ మాత్రం పట్టించుకోకుండా, ఈ ప్రతీఘాతుక శక్తులు అమాయకుల దారుణ ఊచకోతల్ని కొనసాగించడానికి ఒక్కటయ్యారు. అనేక సంవత్సరాలుగా పథకం ప్రకారం నిర్వహిస్తున్న జాతి నిర్మూలన కార్యక్రమాలకు బలవుతూ వస్తున్న ఈళం ప్రజలు ప్రత్యేక మాతృభూమికై, స్వేచ్ఛకై చేస్తున్న న్యాయమైన పోరాటాన్ని అణచడంలో నాగరిక సమాజానికి చెందిన ప్రజాస్వామిక నియమాలన్నిటినీ వీరంతా నిస్సిగ్గుగా ఉల్లంఘించారు. ఇరాక్లోనూ, ఆఫ్ఘనిస్తాన్లోనూ, ఇప్పుడు పాకిస్తాన్లోని స్వాత్ ప్రాంతంలోనూ ఈ ప్రతీఘాతుకులు ఇలాంటి ఊచకోతల్నే కొనసాగిస్తున్నారు. తమ వ్యాపార ప్రయోజనాల కోసం ఈ హంతకులు ఎంతటి హీనమైన నేరాలకు పాల్పడతారు అనడానికి ఇవన్నీ సాక్ష్యాలు. పైకి ఎటువంటి తేడాలు

కనిపించినప్పటికీ, అవన్నీ కూడా తమ సామ్రాజ్యవాద/విస్తరణవాద ప్రయోజనాల్ని కొనసాగించుకోవడంలో ఆ ప్రాంతంలో వ్యూహాత్మకంగా ఎవరిది పై చేయి అవుతుందనే విషయంలోని తేడాలే తప్ప మరొకటి కాదు.

ఎల్‌టిటిఇ ఓటమి - గుణపాఠాలు

జాతి విముక్తి పోరాటాన్ని మూడు దశాబ్దాలకు పైగా విజయవంతంగా నడిపిన ఎల్‌టిటిఇ నాలుగవ ఈళం యుద్ధంలో ఓటమి పాలవడమే కాక, తన బేసులన్నిటినీ కోల్పోయింది, దానికి చెందిన వేలాదిమంది సైనికులు మరణించారు, గాయపడ్డారు లేదా అరెస్టు అయ్యారు. తిరిగి ఒక దగ్గరకు చేరి, ప్రత్యేక మాతృభూమి కోసం పోరాటాన్ని కొనసాగించాలంటే వారికి చాలా సమయమే పడుతుంది. దోపిడీకీ, అన్యాయానికీ, అణచివేతకీ వ్యతిరేకంగా పోరాడేవారందరికీ, ముఖ్యంగా సాయుధ పోరాటం చేసే వారందరికీ ఎల్‌టిటిఇ నాయకత్వంలో నడిచిన యుద్ధం ఒక ఉత్తేజంగా వుండేది. ఎల్‌టిటిఇ ఓటమి తమిళ ఈళం ప్రజలకే కాక పీడకులకు వ్యతిరేకంగా సాయుధంగా పోరాడుతున్న వారందరికీ కూడా గొప్ప నష్టం. ఈ పోరాటానికి మద్దతుగా నిలిచి, సానుభూతిని చూపిన వారందరిలో ఇంత శక్తివంతమైన మిలిటెంట్ బలగం ఓటమి పాలవడం అనేది నిరాశా నిస్పృహల్ని కలిగించడం సహజమే. అందుకని ప్రపంచవ్యాప్తంగా అన్ని జాతుల ఉద్యమాలకూ భారతదేశంలోనూ, దక్షిణ ఆసియాలోనూ సాయుధ పోరాటం చేస్తున్న శక్తులకూ దాని ఓటమికి కారణాల్ని అర్థం చేసుకోవడం గుణపాఠాల్ని తీసుకోవడానికి ఎంతో అవసరం.

పరిగణనలోకి తీసుకోవాల్సినవిగా ఈ కింది ముఖ్యమైన పాయింట్లు వుంటాయనుకోవచ్చు:

1. ఎల్‌టిటిఇ మూడు దశాబ్దాలకు పైగా జాతి విముక్తి యుద్ధాన్ని నడుపుతుండిన ఒక మిలిటెంట్ సంస్థగా వుండింది. ఈ కాలమంతటా అనేక ఒడిదుడుకుల్ని అది ఎదుర్కొంది. ఇప్పుడు అది తన బేసులన్నిటినీ కోల్పోయింది. కానీ అది ఎన్నడూ, ఎంత కఠినమైన పరిస్థితుల్లో కూడా తన ప్రత్యేక 'తమిళ ఈళం' లక్ష్యం విషయంలో రాజీ పడింది లేదు.

అయినప్పటికీ దాని సిద్ధాంతం, వర్గపునాది బూర్జువా స్వభావం కలిగినదే. ఇందువల్ల, అది తన చిరకాల ఆకాంక్ష అయిన తమిళ ఈళం మిత్రులకూ, శత్రువులకూ తేడాను చూడలేకపోయింది. తన స్వంత ప్రజల పట్లే దాని వైఖరిలో సమస్య వుండింది. తమిళ ఈళంలో భాగమైన ఉత్తర, తూర్పు శ్రీలంకలో నివసించే ఈళం తమిళులు, ముస్లింలు, శ్రీలంక మధ్య భాగంలో నివసించే తమిళులు, సింహళ ప్రజలూ, తమిళ ఈళం లక్ష్యం కోసం అన్ని రకాల సహాయాల్నీ అందించిన భారతదేశంలోని తమిళులూ, తమిళనాడులోని బూర్జువా పార్టీలూ, భారత ప్రభుత్వం, సామ్రాజ్యవాదులూ - ఈ విభిన్నమైన శక్తులన్నిటినీ అది బూర్జువా దృక్పథంతోటే చూసింది. సింహళ-బౌద్ధ జాతి ఉన్మాదంతో వ్యవహరించేటప్పుడు అది పాలకవర్గాలకూ, పీడిత ప్రజలకూ గల వర్గ భేదాలను పరిగణనలోకి తీసుకోకుండా సింహళ శ్రామిక ప్రజలను కూడా టార్గెట్ చేసింది. అప్పటికే జాతి ఉన్మాదం మీద ఆధారపడి ఉనికిని కాపాడుకుంటున్న శ్రీలంక పాలక వర్గాలకు, తమిళ వ్యతిరేక ఊచకోతల్ని రెచ్చగొట్టి, సింహళ ప్రజల్ని 'రక్షించే' పేరుతో తమిళుల మీద ఎటువంటి అత్యాచారాలనైనా చేయడానికీ, సింహళ ప్రజల్ని అసలైన సమస్యల నుండి పక్కదోవ పట్టించడానికి అది పుష్కలమైన అవకాశాల్ని కల్పించింది. ప్రత్యేక మాతృభూమికై వారు చేస్తున్న పోరాటానికి సింహళ ప్రజల సానుభూతిని గెలుచుకోవడం సాధ్యం కాకపోయినప్పటికీ, జాతి ఉన్మాద సెంటిమెంట్లు ఆధిపత్యంలో వుండడం వల్ల అది అమాయకుల్ని చంపకుండా వుండాల్సింది. పై పెచ్చు, లంక సమ సమాజ్ పార్టీ (ఎల్ఎస్ఎస్‌పి) లాంటి సంస్థలు ఈళం ప్రజలకు గల విడిపోయే హక్కుతో సహా స్వయం నిర్ణయాధికార హక్కును ఎత్తిపట్టాయి కనక శ్రీలంక పాలకవర్గ పార్టీలకు వ్యతిరేకంగా, అది ఎంత బలహీనంగా అయినప్పటికీ, ఐక్య పోరాటం చేసే ఒక అవకాశం వుండింది.

కానీ తన బూర్జువా జాతీయ దృక్పథం వల్ల ఎల్‌టిటిఇ ఎత్తుగడల్ని రూపొందించుకునేటప్పుడు ఈ పార్శ్వాల్ని పరిగణనలోకి తీసుకోలేదు. తన స్వంత ప్రజలతో సంబంధాల్లో కూడా అది వర్గ భేదాల్ని పరిగణనలోకి తీసుకోలేదు. ఇంకా సరిగ్గా చెప్పాలంటే శ్రామిక ప్రజలకూ, బూర్జువాలకూ విభేదాలు తలెత్తినప్పుడు అది బుర్జువాలకు మద్దతునిచ్చే వైఖరినే తీసుకుంది. అలాగే, అది విశాల ప్రజానీకం మద్దతుకంటే తమిళనాడులోని బూర్జువావర్గం, బూర్జువా పార్టీల మద్దతును కూడగట్టుకోడానికి ఎక్కువ కృషి చేసింది. కార్మికులు, రైతాంగం, విద్యార్థులు, యువజనులు, పెటీ బూర్జువా వర్గం, మేధావులు మొదలైన విశాల ప్రజానీకం తమకు గల తమిళ జాతి సెంటిమెంట్ల రీత్యా తమిళులకు ప్రత్యేక మాతృభూమి అనే న్యాయమైన ఆశయాన్ని ఎత్తిపడుతూ తమ మద్దతును స్వచ్ఛందంగా అందించారు. తమిళనాడు ప్రజలూ, విప్లవకారులూ, ఇతర ప్రజాస్వామిక శక్తులూ ఎల్‌టిటిఇతో సహా ఈళం పోరాటానికి ఎటువంటి ఊగిసలాట లేకుండా మద్దతును అందించారు. కానీ ఎల్‌టిటిఇ భారతదేశంలోని మావోయిస్టు సంస్థలతో ఎట్టువంటి సంబంధాలూ కలిగి వుండరాదని తన కార్యకర్తలకు ఖచ్చితమైన ఆదేశాలు కూడా ఇచ్చింది. అంతర్జాతీయ స్థాయిలో కూడా ఇదే కథ. ఎల్‌టిటిఇ ప్రపంచవ్యాప్తంగా గల ప్రవాస తమిళులలో ఒక బలమైన నెట్‌వర్క్‌ను నిర్మించింది. కానీ పోరాడే ప్రజలతో గానీ, సంస్థలతో గానీ దగ్గరి సంబంధాల్ని కలిగి వుండడానికి గానీ, వారి మద్దతును పొందడానికి గానీ అది ఎటువంటి సీరియస్ ప్రయత్నాల్నీ కూడా చేయలేదు. బదులుగా అది సామ్రాజ్యవాదుల ప్రభుత్వాల లేదా ప్రభుత్వాలలోని ప్రభావం గల వ్యక్తుల మద్దతును సంపాదించుకోడం పై కేంద్రీకరించింది. అది కేవలం జాతి వేర్పాటు (ఎక్స్‌క్లూసివిస్ట్) దృక్పథం మాత్రమే కాదు, ప్రజలకంటే బూర్జువాలకే ప్రాముఖ్యతనిచ్చే వర్గ దృక్పథమే అది. సైద్ధాంతికంగా మా-లె-మా తన ప్రయోజనాలకు విరుద్ధమైనదని ఎల్‌టిటిఇకి చాలా స్పష్టత వుండింది. ఒకప్పుడు అది 'సోషలిస్టు తమిళ ఈళం' అనే నినాదాన్ని ఇచ్చింది. కానీ స్వల్ప కాలంలోనే అది తన వర్గ ప్రయోజనాలకు వ్యతిరేకమైనది కనక దాన్ని వెనక్కి తీసుకుంది.

2. ఎల్‌టిటిఇ జాతి విముక్తికై తన సాయుధ పోరాటాన్ని ఒక గెరిల్లా బలగంగా, అతి తక్కువమంది నిబద్ధత కలిగిన కార్యకర్తలతో మొదలుపెట్టింది. 1983లో పెద్ద ఎత్తున తమిళ వ్యతిరేక ఊచకోతలు జరిగిన "బ్లాక్ జులై" సమయంలో దాని బలం కేవలం ముప్పైమంది కార్యకర్తలు మాత్రమే. కానీ నాలుగవ ఈళం యుద్ధం మొదలయ్యే సమయానికి దాని బలం 30,000 - 40,000 మధ్య వున్నది. శ్రీలంక మిలటరీ అధికారికంగా 22,000 మంది ఎల్‌టిటిఇ గెరిల్లాలు చనిపోయారనీ, మరో పది వేలమంది గాయపడ్డమో, అరెస్టు కావడమో లేక యుద్ధం చివరి దశలో లొంగిపోవడమో జరిగిందనీ ప్రకటించింది. రాజకీయ అధికారాన్ని చేజిక్కించుకోవడానికి పోరాడే ఏ సంస్థ అయినా శత్రువు నుండి భూభాగాన్ని లాక్కుని, తన/ప్రజా పాలనను నెలకొల్పాలి. కాబట్టి, గెరిల్లా యుద్ధం నుండి స్థావర యుద్ధంగానూ, గెరిల్లా సైన్యం నుండి రెగ్యులర్/సంప్రదాయ సైన్యంగానూ అది మారుతుంది. **నాలుగవ ఈళం యుద్ధం** మొదలవ్వక ముందు 2006 జులైలో ఎల్‌టిటిఇ శ్రీలంక ఉత్తర, తూర్పు ప్రాంతంలో 16,000 చదరపు కిలోమీటర్ల భూభాగాన్ని తన అధీనంలోకి తెచ్చుకుని, తన స్వంత పౌర, మిలటరీ పరిపాలనను ఈ ప్రాంతాల్లో స్థాపించింది. తర్వాత నుండి అది క్రమంగా మూడేళ్ల కాలంలో తన భూభాగం పై అదుపును కోల్పోతూ వచ్చింది. ఒక సంవత్సరం తర్వాత 2007 జులైలో తొప్పిగలలో ఓటమి పాలయ్యాక అది తూర్పు ప్రావిన్స్‌లోని ట్రింకోమలి పై తన పట్టును పూర్తిగా కోల్పోయింది. ప్రభుత్వం వెంటనే అక్కడ ఎన్నికల ప్రహసనాన్ని నిర్వహించి తన ఏజెంటు, రెనెగేడ్ (ద్రోహి) అయిన కరుణ పార్టీని ప్రావిన్సియల్ ప్రభుత్వంలో కూచోబెట్టింది. తూర్పు ప్రావిన్స్‌ని స్వాధీనం చేసుకున్నాక శ్రీలంక సైన్యం ఉత్తర ప్రావిన్స్ పై తన దాడిని

ఎక్కుబెట్టింది. 2007 సెప్టెంబర్ నుండి ఎల్‌టిటిఇ శ్రీలంక సైన్యానికి తన భూభాగాన్ని ఒక్కొక్కటిగా కోల్పోతూ వచ్చింది. ఈ మొత్తం కాలంలో ఎల్‌టిటిఇ తన భూభాగాల్ని కోల్పోయినప్పటికీ తన స్థావర యుద్ధం విధానాన్నే వదలకుండా పట్టుకుని వుండిపోయింది. ఆ విధంగా మరింత బలహీనపడి, శత్రు దాడులకు గురయ్యే ప్రమాదం పెరుగుతూ పోయింది. అప్పుడు కూడా అది తన స్థావర యుద్ధ పద్ధతిని విడనాడి తిరిగి గెరిల్లా యుద్ధ తంత్రానికి మరలలేదు. స్థావర యుద్ధంలో వున్న సూత్రం ఏంటంటే ఒక ప్రాంతాన్ని కోల్పోకుండా వుండడం ద్వారా గానీ, లేదా శత్రువునుండి ఒక ప్రాంతాన్ని కైవసం చేసుకోవడం ద్వారా గానీ విజయం సిద్ధిస్తుంది. ఒకసారి ఆ అనుకూలతను కోల్పోయాక, స్థావర యుద్ధాన్నే కొనసాగించడం వృథా. తద్వారా మిగిలిన పొజిషన్ల మీద శత్రువు తన దాడిని కేంద్రీకరించడానికి మరింత అవకాశం కల్పించడమే అవుతుంది. శత్రువు తన దాడిని కేంద్రీకరిస్తున్నప్పుడు ఏరియా ఆఫ్ ఆపరేషన్ (తాము తిరిగే ప్రాంతాన్ని) ని విస్తరించి, గెరిల్లా పద్ధతులను అనుసరించడానికి బదులుగా, అది తన శక్తులను ప్రజలతో సహా మరింత మరింత తక్కువ ప్రాంతంలోనికి రిట్రీట్ చేస్తూ (ఉపసంహరించుకుంటూ) వచ్చింది. ఈ ఎత్తుగడ ఆత్మహత్యా సదృశమైనది, ఎందుకంటే సైనిక విన్యాసాలు చేయడానికి తగినంత ప్రాంతమే కరువైపోతుంది. ఏమీ లేని దగ్గర నుండి మొదలై అత్యున్నత స్థాయి యుద్ధాన్ని ఎల్‌టిటిఇ అభివృద్ధి పరిచినప్పటికీ, యుద్ధ పరిస్థితులను బట్టీ, యుద్ధ అవసరాలను బట్టీ ఒక యుద్ధరూపం నుండి మరో యుద్ధరూపానికి మారే వెసులుబాటును (ఫ్లెక్సిబిలిటీ) ఎల్‌టిటిఇ చేపట్టలేదు. వివిధ రకాల యుద్ధతంత్ర రూపాల్లో పోరాడిన విస్తృతమైన అనుభవం వున్నప్పటికీ (గెరిల్లా, చలన, స్థావర యుద్ధతంత్రాలు) అది ఎందుకు తప్పటడుగు వేసింది? పౌరుల నష్టాలు పెరుగుతున్న కొలదీ అంతర్జాతీయ సముదాయం, అంటే సామ్రాజ్యవాద, భారత ప్రభుత్వాలు శ్రీలంక ప్రభుత్వాన్ని జాతి నిర్మూలన యుద్ధాన్ని ఆపేయమని వత్తిడి చేస్తాయని వారు ఆశించారు. కానీ మనం ముందే చూసినట్లుగా ఈ ప్రతీఘాతుకులందరూ తమ ప్రయోజనాల్ని నెరవేర్చుకోడంలోనే ఎక్కువ ఆసక్తిని కలిగి ఉన్నారు. వారిలో ఎవరికీ నిజంగా ప్రజల బాధల పట్ల అక్కర లేదు. జాతి అణచివేతకు వ్యతిరేకంగా ఒక గౌరవప్రదమైన ఒప్పందాన్ని చేసుకోడంలో వారికి సహాయం చేద్దామని అసలు లేదు. ఎల్‌టిటిఇ చీఫ్ ప్రభాకరన్ 1993లో ఒకసారి ఇలా అన్నాడు, "ఈ ప్రపంచంలోని ప్రతి దేశం తన స్వంత ప్రయోజనాల్నే ముందుకు తీసుకెళ్తుంది. ప్రస్తుత ప్రపంచ వ్యవస్థను నిర్ణయించేవి ఆర్థిక, వ్యాపార ప్రయోజనాలే తప్ప నైతిక న్యాయ చట్టాలో, ప్రజల హక్కులో కాదు. అంతర్జాతీయ సంబంధాలూ, దేశాల మధ్య దౌత్య సంబంధాలూ ఇటువంటి ప్రయోజనాల చేతనే నిర్ణయించబడతాయి. అందువల్ల అంతర్జాతీయ సముదాయం మా లక్ష్యం యొక్క నైతిక సాధికారతను వెంటనే గుర్తిస్తుందని మేం ఆశించలేం. వాస్తవానికి, మా పోరాట విజయం మా మీద ఆధారపడి వుంటుంది తప్ప, ప్రపంచం మీద కాదు. మా విజయం మా కృషి మీద, మా స్వంత బలం మీద, మా దృఢనిశ్చయం మీద ఆధారపడి వుంటుంది..." సామ్రాజ్యవాదుల మీద, విప్లవ ప్రతీఘాతుక శక్తుల మీద దరిదాపుగా సరైన అవగాహనే వున్నప్పటికీ, ఎల్‌టిటిఇ దాన్ని ఆచరణలోకి తేవడంలో విఫలమైంది.

3. ఎల్‌టిటిఇ శ్రీలంక ప్రభుత్వానికి వ్యతిరేకంగా, గత మూడు దశాబ్దాలుగా రాజీ లేని జాతి విముక్తి పోరాటాన్ని చేస్తూ వస్తోంది. ఈ పోరాటం శ్రీలంక దళారీ పాలక వర్గాలకు వ్యతిరేకంగా ఎక్కుపెట్టినది అయినప్పటికీ, వస్తుగతంగా అది సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా ఎక్కుపెట్టబడినది కూడా. కానీ ఎల్‌టిటిఇకి తన జాతి విముక్తి పోరాటంలో ఎన్నడూ సామ్రాజ్యవాద వ్యతిరేక దృక్పథం (ఓరియంటేషన్) గానీ, కార్యక్రమం గానీ లేకుండింది. స్వతంత్ర, స్వయం సమృద్ధ తమిళ ఈళంను సాధించడానికి అది రూపొందించిన కార్యక్రమం దళారీ పాలకుల నుండి దాన్ని సాధించడానికి ఉద్దేశింపబడినదే తప్ప సామ్రాజ్యవాద దోపిడీ నుండీ, అణచివేత నుండీ విముక్తి కావడానికి ఉద్దేశింపబడింది కాదు. అంతే కాదు, అది సామ్రాజ్యవాద దేశాలను తమిళ ఈళంకి మిత్రులుగా పరిగణిస్తూ, తమ పోరాటానికి వారి మద్దతును సంపాదించడానికి ఎల్లప్పుడూ ప్రయత్నిస్తూ వచ్చింది. ఇటీవలి యుద్ధంలో కూడా అది ప్రపంచ ప్రజల నెంబర్ వన్ శత్రువూ, శ్రీలంకతో సహా ప్రపంచవ్యాప్తంగా విప్లవ ప్రతీఘాతుక పాలక వర్గాల నాయకుడూ అయిన అమెరికా సామ్రాజ్యవాదం, తమను ఆదుకోడానికి ముందుకొస్తుందని చివరి నిమిషం వరకూ ఆశిస్తూ వుండిపోయింది. దాంతో ఇది తమిళ ప్రజల్లోనూ, గెరిల్లాలలోనూ సామ్రాజ్యవాద వ్యతిరేక చైతన్యాన్ని మొద్దుబార్చింది.

4. ఈళం విముక్తి యుద్ధం గెరిల్లా యుద్ధతంత్రం నుండి స్థావర యుద్ధతంత్రంగా మారడంతో ఆధునిక, అత్యాధునిక ఆయుధాల మీద వారు ఆధారపడడం విపరీతంగా పెరిగిపోయింది. అది తన సరఫరాల కోసం ప్రధానంగా సామ్రాజ్యవాద దేశాల మీదా, అంతర్జాతీయ ఆయుధ మార్కెట్టు మీదా ఆధారపడింది. అందుకని అది ఈ దేశాల్లో అధికారంలో ఉన్నత స్థానాల్లో వున్నవారితో లాబీయింగ్ చేసేది. దీన్ని గుర్తించి, శ్రీలంక అధ్యక్షుడా రాజపక్షే తన దౌత్య సంబంధాల్ని వుపయోగించుకుని విజయవంతంగా ఎల్‌టిటిఇకి జరుగుతున్న ఆయుధాల సరఫరాని ఆపేయించాడు. అలాగే ఈళం పోరాటానికి య్యూరోప్, ఉత్తర అమెరికాల్లోని ప్రవాసులనుండి అందుతున్న నిధులను కూడా ఆపేయించారు. ఫాసిస్టు రాజపక్షేకి ఆ దేశాలు 'టెర్రరిజం పై యుద్ధం' లో సహాయం చేసినప్పుడు సామ్రాజ్యవాద దేశాల మీద ఇలా ఆధారపడ్డం అనేది ఎల్‌టిటిఇకి హానికరంగా పరిణమించింది. ఆర్థిక, రాజకీయ వ్యవహారాల్లోనే కాక, మిలటరీ సరఫరాలలో కూడా స్వయం సమృద్ధిని సాధించడం విప్లవ ప్రతీఘాతుక పాలకవర్గాల మీద పోరాడే గెరిల్లాలకు ఎంతో ఆవశ్యకమైనది.

5. ఐక్య సంఘటన విషయంలో దానికి చాలా లోపపూరితమైన అవగాహన వుండింది. అది ఉమ్మడి శత్రువుకు వ్యతిరేకంగా కలుపుకురాగల్గిన శక్తులన్నిటినీ కలుపుకోవడంలో విఫలమైంది. నిజానికి దాని వైఖరి శ్రీలంక సైన్యానికి వ్యతిరేకంగా పోరాడుతున్న శక్తులన్నింటినీ ఐక్యం చేయడానికి వ్యతిరేకంగా వుండింది. ఆధిపత్యం కోసం, నాయకత్వ స్థానం కోసం అది ఇతర పెటీ-బూర్జువా మిలిటెంట్ గ్రూపులను (వీటిలో చాలా గ్రూపులు శ్రీలంక ప్రభుత్వానికో, భారత ప్రభుత్వానికో ఏజెంట్లుగా తయారయ్యాయి) నిర్మూలించడమే కాక, ప్రత్యేక తమిళ ఈళం కొరకు పోరాడుతున్న నిజమైన శక్తులను కూడా అది నిర్మూలించింది. మా-లె-మా సిద్ధాంతం కలిగి, నూతన ప్రజాస్వామిక కార్యక్రమం గల నేషనల్ లిబరేషన్ ఫ్రంట్ ఆఫ్ తమిళ ఈళం (ఎన్‌ఎల్‌ఎఫ్‌టి), పీపుల్స్ లిబరేషన్ ఫ్రంట్ ఆఫ్ తమిళ ఈళం (పిఎల్‌ఎఫ్‌టి), ప్రొలిటేరియన్ వాన్‌గార్డ్ ఆర్గనైజేషన్ (ప్రోవో) వంటి విప్లవ శక్తులను తమిళ ప్రాంతాల్లో పని చేయడానికి అది అనుమతించ లేదు. వారిని తమ కార్యకాలాపాలు బంద్ చేసుకోమనైనా చెప్పారు లేదా హత్యలు గావించారు.

6. తమిళ ఈళంలోని మూడు ప్రాంతాలలోని, అంటే జాఫ్నా, వన్ని, తూర్పు ప్రాంతాల్లోని ప్రాంతీయ భేదాల్ని, ముఖ్యంగా ఉత్తర ప్రాంతానికీ, తూర్పు ప్రాంతానికీ వున్న భేదాల్ని అది పరిగణనలోకి తీసుకోలేదు. దీంతో కరుణ వంటి ద్రోహులు ఈ సెంటిమెంటును ఉపయోగించుకుని తూర్పు ప్రాంతంలోని ప్రజల్ని ఎల్‌టిటిఇకి వ్యతిరేకంగా తయారు చేయగలిగారు.

7. ముస్లింలతో తప్పుగా వ్యవహరించడంతో అది తమిళ ఈళంలోనే భాగమైన ముస్లిం సముదాయాన్ని వారికి వ్యతిరేకంగా నిలిపింది. 1990 అక్టోబర్‌లో 28,000 మంది ముస్లింలను కొంపా బేడా సర్దుకోమని జాఫ్నానుండి బలవంతంగా తరిమివేయడం తమిళ ఈళం పోరాటం పై తీవ్రమైన దుష్ప్రభావాన్ని వేసింది. ప్రజల్ని చీలదీయడానికి అవకాశం కోసం

వ్యాసం

◆ ఇ.ఎస్.బ్రహ్మచారి

## ఉద్యోగుల ఆత్మహత్యలు - ఫ్రాన్స్ టెలికాం

"నేనీ కొత్త పునర్వ్యవస్థీకరణని తట్టుకోలేను. ఈ రాత్రే చచ్చిపోతాను" - అని 32 ఏళ్ళ మహిళా ఉద్యోగి స్టెఫెనీ తండ్రికి ఈ మెయిల్ పంపించింది. ఆయన దాన్ని చదివే అవకాశం ఇవ్వకుండానే, కొన్ని నిమిషాలకే తన ఆఫీస్ అయిదో అంతస్తు కిటికీ గూడా అమాంతం దూకి అన్నంత పనీ చేసింది. చూస్తూనే వున్న తోటి వాళ్ళు నిర్ఘాంత పోయారు. ఈ ఘటన సెప్టెంబర్ 11న జరిగింది. పని ఒత్తిడి వల్ల ఆత్మహత్య చేసుకున్న ఫ్రాన్స్ టెలికాం ఉద్యోగులు అప్పటికి 22 మందయ్యారు. ఈమె 23వ ఉద్యోగి. మరో 13 మంది ప్రయత్నించి, చివరకి ఎలాగో బతికారు.

అంతకు రెండు రోజులు ముందు డెర్విస్ అనే 49 ఏళ్ళ ఇంజనీర్ ఆఫీసులో మీటింగ్ జరుగుతుండగానే కత్తిదీసి పొట్టలో పొడుచుకున్నాడు. అయితే చావు తప్పింది. కావాలనే అలా చేశానన్నాడు. కంపెనీలో పనిపరిస్థితులు దారుణంగా వున్నాయనీ, నిరసన తెలపటమే తన ఉద్దేశమనీ చెప్పాడు. కంపెనీకి కావలసిన నైపుణ్యాలు తనకి లేవని మేనేజర్ దెప్పి పొడుస్తున్నాడన్నాడు. తక్కువ స్థాయి ఉద్యోగంలోకి మార్చి వేశారని బాధపడ్డాడు.

స్టెఫెనీ ఆత్మహత్య వార్త పొక్కగానే కార్మికసంఘాలు తీవ్ర నిరసన తెలిపాయి. ప్రభుత్వం కంపెనీ సి.ఇ.ఓ.డిడియర్ లాంబార్డ్‌ని వివరణ కోరింది. ఆర్థికమంత్రి ఆ కంపెనీ బోర్డ్ ఆఫ్ డైరెక్టర్ల సమావేశం ఏర్పాటు చేసింది. కాని ఒరిగిందేమీ లేదు.

సెప్టెంబర్ 28న మరొక ఉద్యోగి బ్రిడ్జి మీదనుంచి దూకి రోడ్డుమీద పడి చనిపోయాడు. కార్లో భార్యకి రాసిన ఉత్తరం దొరికింది. తాను పనిచేస్తున్న కాల్‌సెంటర్‌లో పరిస్థితులు దారుణంగా వున్నాయనీ, ఇక ఎంత మాత్రమూ పనిచేయలేననీ అందులో వ్రాసాడు. అతనికి 51 ఏళ్ళు ఇద్దరు బిడ్డల తండ్రి. ఇది 24 వ ఆత్మహత్య.

అతను చనిపోయాక ఉద్యోగులు గగ్గోలు పెట్టారు. అంత్యక్రియల సమయంలో కంపెనీ నుంచి బయటికొచ్చారు. ఈ ఆత్మహత్యల గురించి టి.విల్లో చర్చలు వచ్చాయి. పత్రికలన్నీ సంపాదకీయాలు రాశాయి. ప్రతిపక్షాలు లాంబార్డ్ రాజీనామా చెయ్యమన్నాయి. అయితే లాంబార్డ్‌తో మాట్లాడాక, ఆర్థికమంత్రిణి క్రిటిన్ లాగార్డ్ అతను సంక్షోభం నుంచి కంపెనీని గట్టెక్కిస్తాడనే నమ్మకం తనకుందని చెప్పింది. లాంబార్డ్ ఆత్మహత్యల్ని ఆపుతానని ప్రతిజ్ఞ చేశాడు.

సెప్టెంబర్‌లో కొన్ని చర్యలు చేపట్టారు. వ్యక్తుల బదిలీలని నిలిపివేశారు. సైకాలజిస్టుల చేత కౌన్సిలింగ్ ఇప్పించారు.జనరల్ మేనేజర్ వీన్స్ అక్టోబర్ 5న రాజీనామా చేశాడు. ఈ మొత్తం ఆధునికీకరణకి రూపకల్పన చేసింది అతనేనన్నారు. 2011కి 170కోట్ల యూరోల ఖర్చు తగ్గించే పనిలో తలమునకలై ఉన్నాడు. అతని స్థానంలో స్టీఫెన్ రిచర్డ్ కూర్చున్నాడు. పరిస్థితేమీ మారలేదు.

---

ఎల్లప్పుడూ ఎదురు చూసే పాలకవర్గాలు తమిళులకూ, ముస్లింలకూ మధ్యన శాశ్వతంగా ఒక చీలకను సృష్టించారు. ముస్లింలోని కులీన వర్గం శ్రీలంక పాలకవర్గాలతో రాజీపడి ముస్లిం జనాభాలోని గణనీయమైన భాగాన్ని వారి నుండి దూరం చేశారు.

8. మావోయిస్టుల సూత్రం అయిన "ప్రజలే చరిత్ర నిర్మాతలు" కి భిన్నంగా, ఎల్‌టిటిఇ దృక్పథం "వీరులే చరిత్ర నిర్మాతలు" అనేది. దీనిని అనుసరించే వారు యుద్ధాన్ని అభివృద్ధి చేయడానికి, ప్రజాయుద్ధాన్ని అభివృద్ధి చేసే మావోయిస్టు పద్ధతికి భిన్నంగా బూర్జువా పద్ధతుల్ని ఎంచుకున్నారు. ఉదాహరణకు, అత్యంత శక్తివంతమైన సూపర్ పవర్ అమెరికా సామ్రాజ్యవాదానికీ, దాని తొత్తుల పాలనకూ వ్యతిరేకంగా జాతి విముక్తి యుద్ధంలో కమ్యూనిస్టు పార్టీ నేతృత్వంలో మహత్తర వియత్నాం ప్రజలు "సాయుధ ప్రజా సముద్రంలో" శత్రువును ముంచెత్తారు. ఈళం విముక్తి యుద్ధంలో ప్రజలు ఎల్‌టిటిఇ చేస్తున్న యుద్ధాన్ని కేవలం సమర్థించేవారిగా వుండిపోయారు. మూడున్నర దశాబ్దాల అంతర్యుద్ధంలో ప్రజలు ఎన్నో అకృత్యాలను సహిస్తూ వచ్చినప్పటికీ, సర్వసాధారణ బూర్జువా దృక్పథాన్ని అనుసరిస్తూ ఎల్‌టిటిఇ శ్రీలంక సైన్యానికి వ్యతిరేకంగా జరిగిన యుద్ధంలో ప్రజల్ని సాయుధం చేయలేదు. ఎంత సుదీర్ఘమైనదైనా గానీ, ఎంత మిలిటెంట్‌దైనా గానీ పోరాటాన్నీ, చరిత్రనీ నిర్మించేది ప్రజలే, ప్రజలు మాత్రమే అనే ప్రపంచవ్యాప్త పోరాట ప్రజల అనుభవాల్లోని చారిత్రక సత్యాన్ని గ్రహించడంలో అది విఫలమైంది.

ముగింపు

ఇన్ని పొరపాట్లూ, పరిమితులూ వున్నప్పటికీ ఎల్‌టిటిఇ ఇప్పటివరకూ రాజీ లేకుండా పోరాడుతూ వచ్చింది. అది వేలాదిగా తన నాయకులనూ, కార్యకర్తలనూ ఆశయం కోసం త్యాగం చేసి ఒక ఉజ్వలమైన సంప్రదాయాన్ని నెలకొల్పింది. ఇటీవలి యుద్ధంలో ఎల్‌టిటిఇ ఓటమి వారి సుదీర్ఘ పోరాటంలో ఒక వెనుకంజ అనేది నిస్సందేహం. కానీ మూడు దశాబ్దాల సాయుధ పోరాటం, ప్రత్యేక తమిళ ఈళం మాతృభూమి గురించి ప్రజల న్యాయమైన ఆకాంక్షలూ, వారి త్యాగాలూ వృథా పోవు. శ్రీలంక ప్రభుత్వం ఒక పెద్ద విజయాన్ని సాధించి, ఎల్‌టిటిఇనీ, తద్వారా జాతి విముక్తి పోరాటాన్నీ బలహీనపరచినప్పటికీ, ఇటువంటి ఉద్యమాలు రావడానికి గల (భౌతిక) పరిస్థితులు మరింత సీరియస్‌గా ఇప్పటికీ కొనసాగుతున్నాయి. అంతే కాదు, వారు చివరి వరకూ వీరోచితంగా పోరాడారు తప్ప శత్రువు ముందు మోకరిల్లడమో, లొంగిపోవడమో చేయలేదు. గతంలోని తప్పుల నుండి నేర్చుకుని ఆయుధం పట్టడానికి ఇది మరో కొత్త తరాన్ని ఉత్తేజపరుస్తుంది.

యుద్ధం ముగిసిన రెండు నెలల తర్వాత కూడా మూడు లక్షలకు పైగా తమిళ ప్రజలు ఇప్పటికీ ఎన్‌ఎఫ్‌జెడ్‌లలో కునారిల్లుతున్నారు. ఇవి నాజీ కాన్‌సంట్రేషన్ క్యాంపులకంటే అధ్వాన్నంగా వున్నాయి. నేటికీ కూడా, స్వతంత్ర మీడియా వక్తులకు గానీ, అంతర్జాతీయ ఎయిడ్ ఏజెన్సీలకు గానీ ఆ క్యాంపులను సందర్శించడానికి అనుమతి ఇవ్వలేదు. ఈ క్యాంపులనుండి బైటకు వెలువడుతున్న వార్తలు అక్కడి తమిళులు బలవంతంగా అనుభవించాల్సి వస్తున్న ఘోరమైన పరిస్థితులను వివరిస్తున్నాయి. యువతీ యువకులను పథకం ప్రకారం వారి కుటుంబ సభ్యుల నుండి విడదీశాక వారు జాడ తెలియకుండా పోతున్నారు. తమ ఇళ్లకు తిరిగి పంపించాలని వారు పదే పదే చేస్తున్న డిమాండ్‌ను ఇప్పటికీ ఆమోదించడం లేదు. ఆహారం, నీరు, పరిశుభ్రత, ఇతర మౌలిక వసతులను ప్రజలకు అందజేయడం లేదు. పాలస్తీనాలో జియోనిస్టులు చేసినట్లుగా, రాజపక్సే ప్రభుత్వం తమిళ ప్రాంతాలను సింహళ ఆవాసాలు (సెటిల్‌మెంట్లు)గా మార్చడానికి పథకం వేస్తోంది. శ్రీలంక ఆర్మీ చీఫ్ శరత్ ఫొన్‌సెకా ఇప్పుడిక తమిళులు లంకలో రెండో శ్రేణి పౌరులుగా నివసించడానికి సిద్ధం కావాలని బహిరంగంగా ప్రకటించాడు.

తమ తప్పులనుండి నేర్చుకుంటూ తమిళులు, కేవలం జాతి అణచివేత, వేధింపుల నుండే కాక వర్గ దోపిడీ, అణచివేతల నుండి కూడా తమను తాము విముక్తి చేసుకునే లక్ష్యాన్ని సాధించేవరకూ పోరాడి తీరతారు. ప్రపంచవ్యాప్తంగానూ, భారతదేశంలోనూ అన్ని రకాల ప్రగతిశీల, ప్రజాస్వామిక, విప్లవకర ప్రజానీకం ప్రత్యేక మాతృభూమికై శ్రీలంక తమిళ ప్రజల న్యాయమైన పోరాటానికి మద్దతునిస్తూనే వుంటారు.

(పీపుల్స్ ట్రూత్ ఆగస్టు 2009 సంచికలోని వ్యాసానికి అనువాదం)

*

అక్టోబర్ 15న 48 ఏళ్ళ ఇంజనీర్ ఇంట్లోనే ఉరేసుకున్నాడు. ఇతనిది 25వ ఆత్మహత్య. వెంటనే లాంబార్డ్ అతను పనిచేసే చోటికి వెళ్ళాడు. ఈ ఆత్మహత్యల పరంపరని ఆపాలని ఆదేశించాడు. అక్టోబర్ 20న వివాదాస్పద పునర్వ్యవస్థీకరణని కంపెనీ సస్పెండ్ చేసింది. యూనియన్లతో సంప్రదించి కొత్త విధానాన్ని 2009 డిసెంబర్ దాకా నిలిపినట్లు చెప్పింది. అప్పటికి సంప్రదింపులు పూర్తికావాలి. ఒక అంగీకారానికి రావాలి. ఇప్పటికే కొన్ని వందల బదిలీలను ఆపినట్లు తెలిపింది.

కంపెనీలో 4శాతం వాటావున్న ఎడిఇఎఎస్ గ్రూప్ మానవీయ ముఖం కలిగిన పెట్టుబడిదారీ విధానాన్ని కోరింది. అంతకు ముందే, కార్మిక మంత్రి డార్కొన్ సి.ఇ.వో. లాంచార్డ్‌ను పిలిచి మరింత మానవీయంగా వ్యవహరించమని చెప్పాడు. ఆ కంపెనీలో ఇప్పటికీ ప్రభుత్వానికి 27 శాతం వాటవుంది. అదే పెద్ద భాగస్వామి కనక ప్రభుత్వానికి తెలియకుండా ఏ విధానమూ అమలు కాదు. అయినా తనకేమీ తలియనట్లు, ఇందుకు తన బాధ్యత లేనట్లు సి.ఇ.ఓ.ని చెప్పమంటోంది. ఒకరా, ఇద్దరా 23మంది చనిపోయాక, కార్మికులు గగ్గోలు పెట్టాక కళ్ళు నులుముకుంటోంది. కలిసి చేసిన నిర్వాకాన్ని అవతలవాళ్ళమీదికి నెట్టే ప్రయత్నం చేస్తోంది.

2008 జనవరి నించీ 37 మంది ఆత్మహత్యలు చేసుకున్నారు. సీ.ఈ.ఓ పదవీ ఛైర్మన్ పదవీ విడదీసి రిచర్డ్‌ని సి.ఈ.వో చేసి లాంబార్డ్‌ని ఛైర్మన్‌గా 2011 దాకా (పదవీ కాలం ముగిసే దాకా) ఫిబ్రవరి 24న ఎగ్జిక్యూటివ్ సమావేశం నిర్ణయించింది. 2010 మార్చ్ 1న రిచర్డ్ సి.ఇ.ఓ. బాధ్యతలు చేపట్టాడు. రిచర్డ్ జనరల్ మేనేజర్‌గా వచ్చాక 13 మంది ఆత్మహత్యలు చేసుకున్నారు. పరిస్థితుల్ని మార్చలేకపోయాడు. ఇక సీ.ఈ.ఓ పగ్గాలు చేపట్టినా ఉద్యోగులకి ఒరిగేదేమీ ఉండదు. కారణం: సాగుతున్న పునర్వ్యవస్థీకరణ ఆగేది కాదు. సీ.ఈ.ఓ గా ఆ కార్యక్రమాన్ని ముందుకు తీసుకుపోతాడు.

ఈమార్చి మొదటి వారంలో (Technologia) అనే మానవ వనరుల కన్సల్టెన్సీ ఫ్రాన్స్ టెలికాంకి మధ్యంతర నివేదిక పంపింది. అది మార్చ్ 7న పత్రికలకి పొక్కింది. అందులో యాజమాన్యం తీవ్రమైన మార్పులు త్వరగా చెయ్యాలని సూచించింది. కంపెనీ ప్రతినిధి (Jean Bernard Orsoni) ఆ సూచనల అమలు గురించి వివిధ యూనియన్లతో సంప్రదింపులు జరుపుతున్నట్లు, రిపోర్ట్ అందినట్లు చెప్పాడు. అయితే కొన్ని వారాలలో సమస్యని పోగొట్టేందుకు మా దగ్గర మంత్రదండం ఏదీ లేదు అన్నాడు.

ఉద్యోగులేమంటున్నారు?

ఫ్రాన్స్ టెలికాం ఒకప్పుడు ప్రభుత్వ రంగ సంస్థ. 1996లో ప్రైవేట్ పెట్టుబడిని ప్రభుత్వం ఆహ్వానించింది. 2004 కల్లా ఎక్కువ భాగం ప్రైవేటు పరమయింది. అప్పుడు 160,000 మంది సిబ్బంది ఉండేవాళ్ళు. ఇప్పుడు ఒక లక్షమందున్నారు. 100 మందిలో 65మంది ప్రభుత్వోగుల కిందనే లెక్క. ఉద్యోగుల్లో సగం మంది 50 ఏళ్ళు దాటినవాళ్ళే.

వాళ్ళని తీసెయ్యలేరు. అందుకనే పునర్ వ్యవస్థీకరణ పేరిట ఉద్యోగుల్ని అటూ ఇటూ తిప్పితిప్పి, ఆ పనీ ఈపనీ మార్చి మార్చీ హోదాలు తగ్గించీ వాళ్ళంతట వాళ్ళే వెళ్ళేట్టు చిక్కులు కలిగిస్తున్నారు. చీకాకు పెడుతున్నారు. 2006-08 మధ్య 22 వేలమందిని ఇళ్ళకు పంపారు.

వివాదాస్పద పునర్వ్యవస్థీకరణ కార్యక్రమాలు ఈ ఆత్మహత్యలకి కారణమని యూనియన్లన్నీ ముక్తకంఠంతో చెబుతున్నాయి. మరణించినవాళ్ళు రాసిన నోట్‌లు ఈ ఆరోపణలకి అద్దంపడుతున్నాయి. ప్రభుత్వం ఎక్కువభాగస్వామ్యం కలిగి ఉన్నప్పటికీ ఆ సంస్థ లాభమే పరమావధిగా ఉత్పాదకతే ధ్యేయంగా పెట్టుకున్న యాజమాన్య వైఖరిని అవలంభిస్తున్నది. అని కార్మిక సంఘాలు ఆరోపిస్తున్నాయి. మానవత్వానికి ఏమాత్రం తావులేదనీ, వ్యాపారం పెరగటమే లెక్క అనీ అంటున్నాయి. కంపెనీ లాభ రంధిని దుయ్యబడుతున్నాయి.

ఇంటర్నెట్ మొబైల్ మార్కెట్‌లో పెరుగుతున్న పోటీలో ముందుండాలనే తపనతో కంపెనీ భారీస్థాయి మార్పులకు పూనుకున్నది. ఇప్పటిదాకావున్న పనివిధానాన్ని మారుస్తుంది. కార్మికులు కొత్తకొత్త పనులు చేయవలసి వస్తున్నది. తరచూ పనులు మారుస్తున్నది. పని ప్రదేశాల్నీ మారుస్తున్నది ఒక పనిలోంచి మరొక పనిలోకి నెడుతున్నది. ఈ పరిస్థితులు ఉద్యోగులకి ఒత్తిడి కలిగిస్తున్నాయి.

కొత్త టెక్నాలజీ వల్ల కార్మికుల్ని తోటివాళ్ళ నుంచి విడగొట్టి చూచే వీలు కలిగింది. ప్రతివాని పనినీ, చర్యల్నీ నియంత్రవచ్చు. ఎవరెవరు ఎలా పనిచేస్తున్నారో గమనించవచ్చు. కంపెనీలు ఒక్కొక్క కార్మికుణ్ణి గుంపునుంచి విడదీసి చూస్తున్నాయి. ఎంత పనిచేస్తున్నదీ పరిశీలిస్తున్నాయి. నైపుణ్యాన్నీ, సామర్థ్యాన్నీ బట్టి స్థాయినీ, జీతాన్నీ నిర్ణయిస్తున్నాయి. అంటే కార్మికుల్లో ఒకరికొకరికి పోటీ పెడుతున్నాయి.

"అలా వాళ్ళని వ్యక్తులుగా విడగొడితే వాళ్ళని బలహీన పరచినట్లేనని (Jean clavde delgenes) అనే ఒక కన్సల్టెన్సీ అధిపతి చెప్పాడు. ఈ మార్పులు వాళ్ళని 'ఒంటరి వాళ్ళైపోయినట్లు, విలువలేనివాళ్ళైపోయినట్లు' చేస్తున్నాయని అన్నాడు. ఈ అభిప్రాయంతో ఉద్యోగులు ఏకీభవిస్తున్నారు.

35 సంవత్సరాల అనుభవం ఉన్న సైకియాట్రిస్ట్ Mavie - france nirigoyen పనిస్థలాల్లో కార్మికులు బాధలు పడుతున్నారన్నారు. 35 ఏళ్ళనాడు తమ సొంత కష్టాల గురించి చెప్పేవాళ్ళు. ఇప్పుడు ఉద్యోగాలగురించి చెబుతున్నారు అన్నారు.

ఉద్యోగులు చేసే ఫోన్ కాల్స్‌ని మానిటర్ చెయ్యద్దనీ, వ్యక్తి సామర్థ్యాన్ని కొలవద్దని, శ్రామికుల్ని తగ్గించే టార్గెట్లు మేనేజర్లకు పెట్టద్దనీ యూనియన్లు కోరుతున్నాయి.

కంపెనీ ఏమంటోంది?

లక్షమందిలో ఇన్ని ఆత్మహత్యలు లెక్కలోది కాదు. 2000లో కంపెనీలో ఇంతకన్నా ఎక్కువగా 28 మంది, 2002లో 29 మందీ, 2003లో 22మందీ చనిపోయారనీ ఈ19నెలల్లో 25మంది తక్కువేగదా అన్నది. వాళ్ళ చర్యకి కారణం కంపెనీ కానే కాదనీ, వాళ్ళ సొంత విషయాలేననీ చెప్పింది.

మేము గుంపు తొలగింపులు చేయలేదు అన్నాడు బార్బరాట్. "ఎక్కువమంది వాళ్ళ నైపుణ్యాల్ని పెంచుకుంటున్నారు. కొత్త పనుల్లోకి మారగలుతున్నారు. కొద్దిమంది మాత్రం ఇబ్బంది పడుతున్నారు" అన్నాడు.

డార్కోస్ ఒక ఇంటర్వ్యూలో ఈపని ఒత్తిడి ఫ్రాన్స్ లోనే కాదు. అన్ని దేశాల్లోనూ ఉంది. ఉద్యోగం లేకుండా ఉండటం కంటే ఒత్తిడి పెట్టే ఉద్యోగమయినా మంచిదే. పూర్తి సంతోషాన్ని కలిగించనిదైనా, పార్ట్ టైం దయినా నయమేకదా అని చెప్పాడు.

కంపెనీ మానవ వనరుల డైరెక్టర్ లీ మాండే పనికీ ఆత్మహత్యలకి ముడిబెట్టడం సరైంది కాదన్నాడు. ఆత్మహత్యలు ఒక కారణం వల్ల జరగవు,అనేక కారణాలుంటాయి అని నిపుణులు చెప్పారని అన్నాడు. ఒకర్ని చూచి ఒకరు ఇలా చేస్తున్నరనీ, ఇదొక అంటు అలవాటు అయిందనీ పనికి సంబంధించినవి కానేకావనీ కంపెని కొట్టిపారేస్తూ వచ్చింది. అయితే సెప్టెంబర్ 29న లాంబార్డ్ తన ఉద్యోగులకి ఒత్తిడి పెంచే పొరపాట్లు చేశానని ఒప్పుకున్నాడు.

## కంపెనీలు ఎందుకిలా చేస్తున్నాయ్?

ఒక్క ముక్కలో లాభాల కోసం. ఇబ్బడికిబ్బడి లాభాలు లాగాలని.పోటీ పడే కంపెనీలకంటే తక్కువ ధరలకి తన సరుకు అమ్మితే ఇతరులకన్నా ముందుగా వేగంగా అమ్ముకోవచ్చు. మరిన్ని సరుకులు తయారు చేసి వాటినీ అమ్మవచ్చు. చౌకగా అమ్మితే పోటీలో ఇతరులని వెనక్కి నెట్టగలుతుంది. పోటీ సక్రమంగా ఉంటే సరుకుల ధరలు తగ్గించిన కంపెనీలే పోటీలో ముందుకు పోతాయి. చౌకగా అమ్మితే అమ్మకాలు పెరిగినా లాభం రేటు తగ్గుతుంది, లాభం మొత్తం తగ్గేప్రమాదమూ ఉంది. లాభం రేటు తగ్గినా, లాభం మొత్తం పెరగాలనేది పెట్టుబడిదారుడి కోరిక. ఇతరులకంటే చౌకగా

అమ్మికూడా లాభం పెంచుకోవాలి. ఇందుకొకదారి ఉంది. సరుకుల్ని ఇంతకు ముందుకన్నా ఇతరులకన్నా చౌకగా తయారుచెయ్యాలి. ఇందుకు కార్మికుల్ని కొందరిని తొలగించి, మిగిలిన వాళ్ళ చేత అన్నే సరుకులు తయారుచేయించాలి. అందరినీ ఉంచినా, వాళ్ళ వేతనాలు తగ్గించాలి. ఎవ్వరినీ తొలగించక పోయినా, జీతాలు తగ్గించకపోయినా, ఎక్కువగంటలు పనిచేయించాలి. ఇవేవీ మార్చకపోయినా, అదే కాలంలో మరిన్ని సరుకులన్నా తయారుచేయించాలి. యజమానులు ఇవన్ని ఒకేసారి చెయ్యకపోయినా ఒకదాని తర్వాత ఒకటి వీలునిబట్టి చేస్తారు.

మరొకటి మెరుగైన యంత్రాలు పెట్టటం. సరికొత్త సాంకేతిక పద్దతులు అవలంబించటం. వీటితో విధులూ పని విధానాలూ మారతాయి. చేస్తున్నపనినుంచి మరొకదానికి మారాలంటే ఒత్తిడి కలుగుతుంది. కొత్తగా తర్ఫీదు కావాలి. వయసు పెరిగిన వాళ్ళకి చాలా కష్టమవుతుంది. కంపెనీలు లాభరంధితో ఇవన్నీ చేస్తాయి. కార్మికులకేమో శారీరక మానసిక ఒత్తిళ్ళు ఎక్కువవుతాయి. ఆదాయాలు తగ్గుతాయి. కనక పునర్వ్యవస్థీకరణ వద్దంటారు. కంపెనీలు వెనకడుగు వెయ్యవు.

లక్షమంది ఉద్యోగులతో నడుస్తున్న ఈ కంపెనీ 40 వేల ఉద్యోగాలు తగ్గించే ప్రయత్నంలో ఉంది. ఇప్పటికే చాలామందిని ఇతర పనులకు పంపించింది. టెక్నీషియన్లని కస్టమర్ సర్వీస్‌కి మార్చింది. అమ్మేవాళ్ళకి కాల్‌సెంటర్ పనులు పురమాయించింది. చాలామందికి ఈ కొత్తపనులు చేసేందుకు తగిన తర్ఫీదయినా లేదు. కంపెనీలు నిరంతరమూ పునర్వ్యవస్థీకరిస్తున్నాయి. దీంతో కార్మికుల విధులూ పని విధానాలూ తరచూ మారుతున్నాయి. అందుకు తగ్గట్లు ఎప్పటికప్పుడు మారలేక కార్మికులు శారీరకంగా మానసికంగా నలిగిపోతున్నారు. పనివేళలు మారుతున్నాయి. నిన్న వున్నట్లు ఇవ్వాళ, ఇప్పుడున్నట్లు రేపూ ఉండటం లేదు. ఎక్కువ గంటలు పనిచేయాల్సి వస్తున్నది. కుటుంబంతో ఉండటానికి, పిల్లల ఆలనా పాలనా పట్టించుకోవటానికీ, తగిన సమయం చిక్కటం లేదు.

ఇలా రోజు రోజుకీ ఒత్తిడీ, అసంతృప్తీ పెరుగుతున్నాయి. కొందరు సర్దుకోలేక ఆత్మహత్యలు చేసుకుంటున్నారు. ఇటీవలి కాలంలో ఇలాంటి ఘటనలు మితిమీరుతున్నాయని పలు పరిశోధనల్లో వెల్లడవుతోంది. 1990ల వరకూ ఆత్మహత్యలు వ్యవసాయరంగంలో మాత్రమే వుండేవనీ, ఇప్పుడు ఆస్పత్రులకీ, స్కూళ్ళకీ, నిర్మాణరంగానికీ, ఎలెక్ట్రానిక్స్ పరిశ్రమకీ, బాంక్‌రంగానికీ కూడా పాకాయని (Christophe Dejour) పనిస్థలాల్లో ఆత్మహత్యలమీద రాసిన పుస్తకంలో రుజువు చేశాడు. ఒక్క ఫ్రాన్స్‌లోనే కాదు. పనితో ముడిబడిన ఆత్మహత్యలు అభివృద్ధి చెందిన అన్ని దేశాల్లోనూ పెరుగుతూనే ఉన్నాయి.

అమెరికాలో పెట్టుబడిదారీ విధానం ఫ్రాన్స్ కన్నా ముందుకు పోయింది. అమెరికాలో ఉద్యోగులు ఇలాంటి కష్టనష్టాల్ని భరించటానికి అలవాటు పడ్డారు. రాత్రి పనులకీ వారాంతంలో పనిచెయ్యటానికీ, తొలగింపులకీ, రాంకులకీ, పనినిబట్టి జీతాలు పొందటానికి అలవాటుపడ్డారు. ఇదంతా ఇష్టపడి వాళ్ళు చేస్తున్నారనికాదు. తప్పని పరిస్థితుల్లో చెప్పుకుంటే వినే దిక్కులేక, ఎదుర్కోలేక కష్టమైనా నష్టమైనా సహించి రాజీ పడ్డారు. ఫ్రాన్స్ వాళ్ళు ఎదుర్కోగలిగితే సరే. లేకపోతే అమెరికాలో వుంటూనే సరిచెయ్యటం కుదరదు. ప్రభుత్వ యాజమాన్యంలో నడిచినా లాభాలు రావాల్సిందే. ప్రభుత్వరంగం ప్రైవేట్ రంగంతో పోటీ పడి లాభాలార్జించాలి. లేకపోతే ప్రైవేట్ వ్యక్తులకి అమ్మెయ్యటమనే విధానాన్ని అన్ని దేశాలూ అమలుపరుస్తున్నాయి. నష్టాలొచ్చేట్టు చేసి వాటాలమ్మిన సందర్భాలు చాలానే ఉన్నాయి. ప్రైవేట్ యజమానులకి లాభం తప్ప మరే అంశమూ పట్టదు. ఉద్యోగుల మీద ఎంత ఒత్తిడి నయినా కలిగించటానికి వెనకాడదు. ప్రభుత్వానికి ఎన్నికలొచ్చినప్పుడు ఓట్లు మరీముఖ్యం. అందుకే ఆ కాసేపూ శ్రామికుల తరఫున ఉన్నట్లు నటించటం. కార్మికులకి ఇబ్బందులు కలుగుతున్నట్లు ఇప్పుడే తెలుసుకున్నట్లు కంపెనీని వివరణ కోరటం. ఇదేతంతు అన్ని దేశాల్లో, అన్ని సంస్థల్లో మామూలైపోయింది. ప్రభుత్వం మధ్యవర్తి పోజు పెడుతుంది. కంపెనీ ఎవరో పెద్ద ఉద్యోగి మీదకు నెడుతుంది. ఫ్రాన్స్ టెలికాంలో జరుగుతున్నది సరిగ్గా ఇదే. పునర్వ్యవస్థీకరణ ఉద్యోగులకు వేదన కలిగిస్తున్న మాట నిజమేనని మానవ వనరుల డైరెక్టర్ ఒలీవియర్ బార్బరాట్ ఒప్పుకున్నాడు. తర్వాత లాంబార్డ్ యూనియన్లతో సంప్రతింపులు మొదలవుతాయనీ, ఉద్యోగుల సమస్యల్ని చూచేందుకు 100 మంది మానవ వనరుల ఉద్యోగుల్ని నియమిస్తామనీ చెప్పాడు. అయితే అసలు సమస్య పరిష్కారం కాలేదు. ఒలీవియర్ బార్బరాట్ పునర్వ్యవస్థీకరణని ఆపటం ఊహించే విషయం కాదు అని (Journal de dimanche) అనే పత్రికకి రాసిన వ్యాసంతో తేల్చి చెప్పాడు.

అందుకే ఈ ఆత్మహత్యలు ప్రభుత్వాలు సరిగా ధర్మంగా వ్యవహరిస్తాయి ఇవి ఆగుతాయి అని ఉద్యోగులు భావించే రోజొస్తుందా? నీళ్ళల్లో గోగు బెండ్లు మునగటం, ఇనపగుండ్లు తేలటం ఎలా జరిగేదికాదో ప్రపంచబాంక్ ఐఎఫ్.ఎం.. చెప్పిన ఆర్థిక సంస్కరణలు అమలుపరిచే ఏ ప్రభుత్వమైనా పెట్టుబడిని పెంచుతుందే కాని శ్రామికుల బాధల్ని తగ్గించే బాధ్యత తీసుకోదు. ఆపటానికి ఏం చెయ్యాలో నిర్ణయించుకోవలసింది ఉద్యోగులే.

# స్వీకారం

1. **ప్రత్యేక తెలంగాణ ఉద్యమ కెరటం**
   జీవన్ వెల : రూ. 50/-
   ప్రతిభ ప్రచురణలు :
   ఇం.నెం.4-1-25, రోటరీ నగర్, ఖమ్మం.
2. **భావ విప్లవకారుడు కొడవటిగంటి**
   విరసం ప్రచురణ వెల : 80/-
   ఎడిటర్ : టంకశాల అశోక్
   ప్రతులకు : చలసాని ప్రసాద్,
   ఎల్.ఐ.జి. 15, హౌసింగ్‌బోర్డ్ కాలనీ,
3. **లేచి నిలిచిన తెలంగాణ**
   రచన : ఎన్. వేణుగోపాల్ వెల : 90/-
   సోల్ డిస్ట్రిబ్యూషన్
   దిశా పుస్తక కేంద్రం, 1-187/2/ఎ, చిక్కడపల్లి, హైదరాబాద్.
4. **తెలంగాణ - సమైక్యాంధ్ర**
   భ్రమలు - అబద్ధాలు - వాస్తవాలు
   రచన : ఎన్. వేణుగోపాల్
   ప్రచురణ : ఫోరం ఫర్ సస్టెయినబుల్ తెలంగాణ
   వెల : 5/-
   ప్రతులకు :
   దిశా పుస్తక కేంద్రం, 1-187/2/ఎ, చిక్కడపల్లి, హైదరాబాద్.
5. **మా మట్టికోసం మా హైదరాబాద్ కోసం**
   రచన :
   వడ్డెబోయిన శ్రీనివాస్, అబ్దుల్ బాసిత్, వంగాల సంపత్ రెడ్డి
   బందగి ప్రచురణలు వెల : రూ.5/-
   అన్ని పుస్తకాల షాపుల్లో దొరుకుతుంది.

వ్యాసం

◆ అరుంధతీ రాయ్

తెలుగు: పి. వరలక్ష్మి

# కామ్రేడ్స్‌తో కొన్ని రోజులు

భారతదేశ అంతర్గత భద్రతకు పెను ప్రమాదంతో నా అపాయింట్‌మెంటును ధృవపరుస్తూ టైపు చేయబడ్డ క్లుప్తమైన సందేశంతో ఓ సీల్డుకవరు నా తలుపు సందుగా లోనికి జారింది. కొన్ని నెలలుగా వాళ్ళనుండి ఈ కబురు కోసం ఎదురుచూస్తున్నా.

ఛత్తీస్‌ఘడ్‌లోని దంతెవాడ మాతా దంతేశ్వరి మందిరం వద్ద నిర్దేశించిన రెండు రోజుల్లో నాలుగు సమయాల్లో ఏదో ఒక టైంలో నేనుండాలి. అననుకూల వాతావరణం, పంక్చర్లు, దిగ్బంధనాలు, రవాణా సమ్మెలు లేదా కేవలం దురదృష్టమో మా కద్దుపడకుండా ముందు జాగ్రత్తగా ఈ ఏర్పాటు. "రచయిత కెమెరా, కుంకుమ బొట్టు, కొబ్బరికాయతో ఉండాలని ఆ చీటీ చెప్పింది. "కలుసుకునే వ్యక్తి టోపీ పెట్టుకొని హిందీ అవుట్‌లుక్ పత్రిక, అరటి పళ్ళు పట్టుకొని ఉంటాడు" మాకోడ్ "నమస్కార్ గురుజీ".

నమస్కార గురుజీ! నన్ను కలుసుకొని పలకరించబోయే వ్యక్తి ఒకవేళ ఒక పురుషున్ని ఊహిస్తూ వస్తాడా. నేను మీసంగాని తగిలించుకోవాలా!

దంతెవాడను ఎన్నో తీర్లుగా వర్ణించొచ్చు. ఒకే చోట పరస్పర విరుద్ధాంశాలు గోచరిస్తాయి. దంతెవాడ భారతదేశ నడిబొడ్డులోని సరిహద్దు ప్రాంతం. అది యుద్ధ కేంద్రం. అది తలకిందులైనట్టు, లోపలిది బైటికి తిరగేసినట్టుండే పట్టణం.

దంతెవాడలో పోలీసులు సాధారణ దుస్తులు. తిరుగుబాటు దార్లు యూనిఫాంలు ధరిస్తారు. జైలుసూపరిండెంటెండ్ జైల్లో ఉంటాడు. ఖైదీలు స్వేచ్ఛా జీవులు (రెండేళ్ళ క్రితం పాత టౌన్ జైలు నుండి మూడొందల మంది తప్పించుకున్నారు). అత్యాచారనికి గురైన స్త్రీలు పోలీసు కస్టడీలో ఉంటారు. అత్యాచారం చేసిన వాళ్ళు బజార్లలో ఉపన్యాసాలిస్తుంటారు. ఇంద్రావతి నది ఒడ్డున పోలీసులు 'పాకిస్తాన్' అని పిలిచే ప్రాంతం మావోయిస్టుల నియంత్రణలో ఉంది. అక్కడగ్రామాలు ఖాళీగా ఉంటాయి గాని అడవి జనంతో నిండి ఉంటుంది. స్కూల్లో ఉండాల్సిన పిల్లలు అడవిలో పరిగెత్తుతుంటారు. అందమైన అటవీ గ్రామాల్లో కాంక్రీటు స్కూలు భవనాలు పేల్చివేయబడి కుప్పగా పడిపోయో లేదా పోలీసులతో నిండిపోయో ఉంటాయి. ఈ అడవిలో విచ్చుకుంటున్న భయానక యుద్ధం భారత ప్రభుత్వానికి గర్వకారణమూ, అవమానకరమూ కూడా.

ఆపరేషన్ గ్రీన్‌హంట్ అధికారికంగా ప్రకటించుకోబడింది. అదే సమయంలో తిరస్కరించబడింది. భారత హోంమంత్రి పి. చిదంబరం (యుద్ధానికి సి.ఈ.వో) అటువంటిదేమీ లేదని, అది మీడియా సృష్టి అని అంటున్నాడు. అయినా అవసరమైనన్ని నిధుల్ని కేటాయించడం, వేలకొద్దీ బలగాల్ని తరలించడం జరుగుతూనే ఉంది. ఇప్పుడు యుద్ధక్షేత్రం మధ్య భారతంలోని అడవులు. కాని దాని పరిణామాలు మనందరి మీద తీవ్రంగా ఉంటాయి.

భౌతిక జీవితం అంతమైనాక, ఈ ప్రపంచాన్ని వీడలేని ఆత్మలు దెయ్యాలై తాయంటారు. దీన్ని తిరగేస్తే అడవిని చీల్చుకుంటూ పోయిన ఈ సరికొత్త నాలుగు రోడ్ల రహదారి ప్రేతాత్మకు వ్యతిరేకార్థంలో ఉంటుంది. బహుశా ఇది ముందు ముందు రాబోయే వాటికి శకునమేమో.

అడవిలో ప్రత్యర్థులు దాదాపు అన్ని విధాలుగా సమ ఉజ్జీలుకారు. అసలు ఇరువురిని పోల్చనే లేము. ఒక వైపు ధనము, మందుగుండు, మీడియాలతో పాటు సూపర్ పవర్‌గా ఎదుగుతున్నామన్న మదంతో ఇండియా పారా మిలిటరీ బలగాలు .

మరో వైపు సాంప్రదాయ ఆయుధాలతో సాధారణ గ్రామీణులు, వీరి వెంట అసాధారణ సాయుధ పోరాట చరిత్ర, అద్భుతమైన నిర్మాణం, గొప్ప పోరాట స్ఫూర్తి గలిగిన మావోయిస్టు సాయుధ గెరిల్లా సైన్యం. మావోయిస్టులు, పారా మిలిటరీ బలగాలు పాత శత్రువులే. వీరు గతంలో ఎన్నో అవతార్లలో పోరాడారు. 1950లలో తెలంగాణలో, 1960లు, 1970లలో పశ్చిమ బెంగాల్, బీహార్, శ్రీకాకుళంలలో, తర్వాత మళ్ళీ 1980ల నుండి ఆంధ్రప్రదేశ్, బీహార్, మహారాష్ట్రలో.

ఒకరి ఎత్తుగడలు ఇంకొకరికి చిరపరిచితమే. ఒకరి ప్రతిఘటనా పద్ధతిని ఇంకొకరు క్షుణ్ణంగా అధ్యయనం చేసిన వాళ్ళే. ప్రతి సారీ మావోయిస్టులు (లేదా వారి పూర్వ అవతార్లు) ఓడిపోయినట్లే కాదు, నిజానికి భౌతికంగా నిర్మూలించబడినట్లు కూడా కనిపించేది. ప్రతిసారీ వాళ్ళు గతంలో కంటే మరింత శక్తివంతంగా, మరింత ప్రభావశీలంగా నిర్మాణమై పైకిలేస్తున్నారు. ఈ రోజున వీళ్ళ తిరుగుబాటు అపార ఖనిజ సంపదలున్న ఛత్తీస్‌ఘడ్, జార్ఖండ్, ఒరిస్సా, పశ్చిమబెంగాల్, అడవుల్లోకి విస్తరించింది. అవి లక్షలమంది భారతదేశ ఆదివాసీల పుట్టినిండ్లు. కార్పొరేట్ ప్రపంచపు కలల వనాలు.

అడవుల్లో జరుగుతున్న ఈ యుద్ధం ప్రభుత్వానికి, మావోయిస్టులకు మధ్య అని విశ్వసించడం ఉదారవాద విచక్షణకు చాలా తేలిక. మావోయిస్టులు ఎన్నికలను బూటకమని, పార్లమెంటు బందెలదొడ్డి అని అంటూ భారత రాజ్యాంగాన్ని కూలుస్తామని బహిరంగంగా ప్రకటించుకున్నారు కనుక. మధ్య భారతదేశంలోని ఆదివాసులకు మావోలకంటే శతాబ్దాల పూర్వమే తిరుగుబాటు చరిత్ర వుందని మరచిపోవడం చాలా సౌలభ్యం. (ఏదైనా ఉన్నది లేదనడం లోకప్రతీతి అయితే అది ఉండనే ఉండదు.). హో, ఒరాన్, సంతాళ్, ముండా, గోండు జాతుల ఆదివాసులందరూ బ్రిటిష్ వారిపై, జమిందార్లపై, వడ్డీ వ్యాపారులపై అనేకసార్లు తిరుగుబాట్లు చేశారు. ఈ తిరుగుబాట్లను ఎంత క్రూరంగా అణిచివేసినా, వేలాదిమందిని చంపినా ఎన్నడూ ఈ ప్రజలు లొంగలేదు. స్వాతంత్ర్యానికి తర్వాత కూడా మొట్టమొదటి మావోయిస్టు తిరుగుబాటుగా చెప్పగలిగే పశ్చిమబెంగాల్‌లోని నక్సల్బరీ ఉద్యమానికి ఆదివాసులే గుండెకాయ ('నక్సలైట్' పదం ఇక్కడి నుండే పుట్టింది. ఇప్పుడు దానికి సమానార్థంగా 'మావోయిస్టు' వాడుకలో ఉంది). అప్పటి నుండీ నక్సలైట్ రాజకీయాలు ఆదివాసీతిరుగుబాట్లతో విడదీయలేనంతగా పెనవేసుకుపోయాయి. అవి నక్సలైట్ల గురించి ఎంత చెప్తాయో ఆదివాసుల గురించి అంత చెప్తాయి.

భారత ప్రభుత్వంచేత ఉద్దేశపూర్వకంగా నిరాకరించబడ్డ, పక్కకు నెట్టివేయబడ్డ జనానికి ఈ ఉద్యమ వారసత్వమే మిగిలింది. 1950లో భారతదేశ ప్రజాస్వామ్యానికి నైతిక పునాది అయిన భారత రాజ్యాంగాన్ని పార్లమెంటు దత్తత తీసుకున్న రోజు నిజానికి ఆదివాసులకు దురదృష్టకరమైన రోజు. రాజ్యాంగం వలస విధానాన్నే స్థిరీకరిస్తూ ఆదివాసుల నివాస ప్రాంతాలకు రాజ్యం సంరక్షకురాలిగా ఉంటుందని తేల్చింది. ఉన్నట్లుండి మొత్తం ఆదివాసీ సమూహాలనన్నింటినీ వాళ్ళ సొంతనేల మీదే పరాయివాళ్ళను చేసింది. అది అటవీ ఉత్పత్తులమీద వారి సాంప్రదాయ హక్కును నిరాకరించి వారి జీవన విధానాన్నే నేరమయం చేసింది. ఓటుహక్కుకు బదులుగా, వాళ్ళ జీవించే హక్కును, ఆత్మగౌరవాన్ని లాగేసుకుంది.

వాళ్ళను తిరస్కరించి, అట్టడుక్కు నెట్టివేసిన ప్రభుత్వం వారి దైన్యాన్ని కూడా ఉపయోగించుకునే దుర్మార్గమైన కుట్రను రచించింది. ఆనకట్టలు, సాగునీటి ప్రాజెక్టుల, గనుల కోసం పెద్ద సంఖ్యలో జనాన్ని ఖాళీ చేయించాల్సి వచ్చినప్పుడల్లా ఆదివాసుల్ని ప్రధాన జీవన స్రవంతిలోకి తీసుకురావాలని, అభివృద్ధి ఫలాల్ని ప్రభుత్వం వాళ్ళకూ అందించాలని మాట్లాడుతుంది. భారతదేశం'అభివృద్ధి' క్రమంలో శరణార్థులుగా మారిన లక్షలమంది నిర్వాసితుల్లో అత్యధికులు ఆదివాసులే. ఎప్పుడైనా ప్రభుత్వం గిరిజన సంక్షేమం గురించి మాట్లాడితే భయం మొదలవుతుంది.

ఆదివాసులు మ్యూజియం సంస్కృతుల్లా ఉండాలని తాను కోరుకోవడం లేదని హోంమంత్రి చిదంబరం తాజాగా తన వాత్సల్యపూరిత భావాల్ని ప్రకటించాడు. ప్రధాన మైనింగ్ కంపెనీల్లో పనిచేసి, వాటి ప్రయోజనాల్ని పరిరక్షించిన ఈ కార్పొరేట్ వకీలు, తనవృత్తి జీవితం మొత్తంలో ఎన్నడూ ఆదివాసులకు ఇంత ప్రాధాన్యతనివ్వలేదు. కాబట్టి ఇతని సరికొత్త ఆసక్తిని గురించి విచారించాల్సిందే.

దాదాపు ఐదుసంవత్సరాలగా ఛత్తీస్‌ఘడ్, జార్ఖండ్, ఒరిస్సా, పశ్చిమబెంగాల్ ప్రభుత్వాలు కొన్ని వేలకోట్ల విలువచేసే పరస్పర అవగాహన పత్రాలపై (యం.వో.యూలు) సంతకాలు చేశాయి. అన్నీ రహస్య ఒప్పందాలే - తుక్కు ఇనుము కర్మాగారాలు, విద్యుదుత్పత్తి కేంద్రాలు, అల్యూమినియం శుద్ధికేంద్రాలు, ఆనకట్టలు, గనులకు సంబంధించినవి. ఈ ఒప్పంద పత్రాలన్నీ వాస్తవ రూపంలో డబ్బుగా మారడానికి ఆదివాసుల్ని గెంటెయ్యాలి.

అందుకే ఈ యుద్ధం

ప్రజాస్వామ్యంగా చెప్పుకుంటున్న ఒకదేశం దాని సరిహద్దుల లోపలే బహిరంగంగా యుద్ధాన్ని ప్రకటిస్తే ఆ యుద్ధం ఎలా ఉంటుంది? ప్రతిఘటనకు అవకాశం ఉంటుందా? అసలు ఉండాలా? ఎవరీ మావోయిస్టులు? ఒక కాలం చెల్లిన సిద్ధాంతాన్ని అమాయక ఆదివాసులపై ప్రయోగిస్తూ వాళ్ళను ఆత్మహత్యా సదృశ్యమైన తిరుగుబాటుకు ప్రేరేపిస్తున్న అరాచక హింసా వాదులా? పాత అనుభవాల నుండి వాళ్ళేం నేర్చుకొని ఉంటారు? సాయుధపోరాటం నిజంగా అంత అప్రజాస్వామికమైనదా? ప్రభుత్వానికి మావోయిస్టులకు నడుమ అమాయక ఆదివాసులు 'అడకత్తెరలో పోక చెక్క'లా నలిగిపోతున్నారనడం సరైనదేనా? వీళ్ళు చెబుతున్నట్లు ఆదివాసులు, మావోయిస్టులు రెండు పూర్తి భిన్నమైన వర్గాలకి చెందిన వారా? వారికి ఉమ్మడి ఆవశ్యకతలు లేవా? పరస్పరం ఒకరి నుండి ఒకరు ఏమైనా నేర్చుకున్నారా? ఒకళ్ళనొకళ్ళు ప్రభావితం చేసుకున్నారా?

నేను బయలుదేరే ముందురోజు నిద్రావస్థలో మా అమ్మ "నేనేం ఆలోచిస్తున్నానంటే" అంటూ అలౌకికమైన ఒక తల్లి సహజాతంతో "ఈ దేశానికి విప్లవం అవసరం" అంది.

ఇంటర్నెట్‌లోని ఒక వ్యాసం ఇజ్రాయిల్ నిఘా సంస్థ (మోసద్) 30 మంది భారత ఉన్నత శ్రేణి పోలీసు అధికారులకు మావోయిస్టు నాయకత్వాన్ని అంతమొందించే శిక్షణనందిస్తున్నట్లు చెప్పింది. ఇజ్రాయిల్ నుండి కొనుగోలు చేసిన సరికొత్త లేజర్ రేంజ్ ఫైండర్స్ (లేజర్ కిరణాలతో ఆచూకీ కనుకొనేవి.. అను) థర్మల్ ఇమేజింగ్ పరికరాలు(విద్యుదయస్కాంత తరంగాలతో పనిచేసేవి.. అను) మానవ రహిత వాహనాలు అమెరికా సైన్యానికి సుపరిచితమైనవి. అటువంటి యంత్రాల గురించిన వార్తలు పత్రికల్లో వస్తున్నాయి. నిజమే, పేదవాళ్ళమీద ప్రయోగించాల్సిన సిసలైన ఆయుధాలే అవి!

రాయపూర్ నుండి దంతెవాడకు పదిగంటల ప్రయాణ సమయం. ఈ ప్రయాణం 'మావోయిస్టు చీడపట్టిన' ప్రాంతాల గుండా సాగుతోంది. జబ్బులు, రోగాలు అనుకునేటప్పుడు వాడే పదం మావోయిస్టుల విషయంలో అలవోకగా కాదు, ఉద్దేశ పూర్వకంగా ఉపయోగిస్తున్నారు. చీడ పురుగులను నిర్మూలించినట్టుగా మావోయిస్టులను తుడిచిపెట్టేయాలి. ఇట్లాంటి జాతి నిర్మూలనా భాష మన పదకోశంలోకి నిశ్శబ్దంగా చొరబడింది.

రహదారి రక్షణ కోసం భద్రతా దళాలు దారి కిరువైపులా 'రక్షణ'గా నిలబడ్డారు. లోపలి ప్రాంతాల్లో 'దాదాల రాజ్యం' వాళ్ళే 'అన్నలు', 'కామ్రేడ్లు'.

రాయ్‌పూర్ శివార్లలో ఓ భారీ అడ్వటైజ్‌మెంటుబోర్డు వేదాంత (మనహోంమంత్రి ఒకప్పుడు పనిచేసిన కంపెనీ) వారి క్యాన్సర్ ఆసుపత్రిని గురించి ప్రకటిస్తోంది. ఒరిస్సాలో బాక్సైట్ గనుల వ్యాపారం చేస్తూ వేదాంత కంపెనీ ఒక యూనివర్సిటీకి నిధులనందిస్తోంది. ఇట్లా ఈ మైనింగ్ కార్పొరేషన్లు నిరపాయకరమైన, అహింసా మార్గాల్లో మన భ్రమా లోకాల్లోకి చొరబడతాయి. ఈ పెద్ద మనుషులే మన సంరక్షకులు అనుకునేలా. దీన్ని కార్పొరేట్ సామాజిక బాధ్యత(కార్పొరేట్ సోషియల్ రెస్పాన్సిబిలిటీ - సి.యస్.ఆర్) అంటున్నారు. మైనింగ్ సంస్థలు ఒకేసారి హీరో, విలన్ పాత్రల్ని పోషిస్తాయన్నమాట. మాజీ ముఖ్యమంత్రి, నట దిగ్గజం ఎన్టీయార్ పౌరాణిక సినిమాల్లో కథానాయకుని పాత్రలోనూ, దుష్టపాత్రలోనూ ద్విపాత్రాభినయం చేసినట్లు. ఈ మైనింగ్ సంస్థల వికృతమైన వ్యాపార ముఖానికి అందమైన ముసుగే వాటి సి.యస్.ఆర్. ఉదాహరణకు లోకాయుక్త కర్నాటకకు సంబంధించిన తాజా నివేదిక ప్రకారం ఏదైనా ప్రైవేటు కంపెనీ ఒక టన్ను ఇనుప ఖనిజాన్ని వెలికి తీస్తే ప్రభుత్వానికి రాయల్టీ రూపంలో వచ్చేది 27 రూపాయలు కాగా, కంపెనీ 5000 రూపాయల లాభం చేసుకుంటుంది. ఇక బాక్సైట్, అల్యూమినియం గనుల్లో ఈ లెక్కలు ఇంకా దారుణంగా ఉంటాయి. మనం మాట్లాడుకుంటున్నది పట్టపగటి దోపిడీ గురించి! అది పోగేసే వేలకోట్ల డాలర్లు ఎన్నికలను, ప్రభుత్వాన్ని, న్యాయమూర్తులను, దిన పత్రికలను, టి.వి.ఛానళ్ళను, స్వచ్ఛంద సంస్థలను, సహకార సంఘాలను కొనెయ్యడానికి బాగా సరిపోతుంది. ఇక అడపాదడపా అక్కడక్కడా కొన్ని క్యాన్సర్ ఆసుపత్రుల నిర్మాణానికే పాటి?

ఛత్తీస్‌ఘడ్ ప్రభుత్వం సంతకం చేసిన పొడవాటి యం.వో.యూల జాబితాలో ఈ వేదాంత పేరు చూసినట్లు గుర్తు లేదు. కాని ఇక్కడ క్యాన్సర్ ఆసుపత్రి ఉన్నదంటే ఎక్కడో బాక్సైట్ నిక్షేపాల కొండ ఉంటుందని అనుమానపడక తప్పడం లేదు.

ఇప్పుడు మనం కాంకేర్‌ను దాటుతున్నాము. ఇక్కడ ప్రసిద్ధి చెందిన బ్రిగేడియర్.బి.కే.పాన్‌వార్ ఆధ్వర్యంలో తీవ్రవాదంపై యుద్ధానికి సైన్యాన్ని తయారుచేస్తున్న అటవీ యుద్ధ శిక్షణా కేంద్రం నడుస్తోంది. ఇది పనికిమాలిన చెత్త పోలీసులను అడవి యుద్ధ కమెండోలుగా తీర్చిదిద్దే బృహత్కార్యాన్ని నిర్వహిస్తోంది. "గెరిల్లాతో గెరిల్లావలె తలపడు" యుద్ధ శిక్షణా కేంద్ర మౌలిక సూత్రం అక్కడ బండలపై రాయబడి ఉంది.

అక్కడ పోలీసులకు పరిగెత్తడం, పాకడం, గాలిలో ఎగురుతున్న హెలికాప్టర్ల నుండి కిందికి దూకడం, సైకిక్కడం, గుర్రపు స్వారి (ఎందు చేతనో), పాముల్ని తినడం, అడవి పరిస్థితుల్లో జీవించడం నేర్పుతారు. వీధి కుక్కలను ఈ విధంగా తీవ్రవాదుల నెదుర్కొనేంతగా శిక్షణనిస్తూ తీర్చిదిద్దుతున్నందుకు బ్రిగేడియర్ గారు చాలా గర్వపడతారు. ప్రతి ఆరువారాలకు ఎనిమిది వందల మంది పోలీసులు ఇక్కడ శిక్షణ తీసుకొని వస్తారు. దేశ వ్యాప్తంగా ఇటువంటివే ఇరవై శిక్షణా కేంద్రాల్ని నెలకొల్పే ఆలోచన ఉంది. పోలీసు బలగాలు క్రమంగా సైనిక బలగాలుగా మార్చివేయబడుతున్నాయి. (కాశ్మీరులో ఇది మరోలా ఉంది. అక్కడ సైన్యాన్ని పోలీసు బలగాలుగా మార్చి పోలీసు రాజ్యాన్ని నడిపిస్తున్నారు) తలకిందులుగా, తిరగేసినట్లు. ఏ విధంగానైనా వాళ్ళ శత్రువులు ప్రజలు.

బాగా చీకటి పడింది. జగదల్ పూర్ మొత్తం నిద్రపోతోంది. రాహుల్ గాంధీ జనాన్ని యూత్ కాంగ్రెస్‌లో చేరమని పిలుపునిస్తున్న హోర్డింగులు తప్ప. ఇటీవలి మాసాల్లో బస్తర్‌కు రెండుసార్లు వచ్చినా ఈయుద్ధం గురించి అతనేమీ మాట్లాడలేదు. యువరాజుకు ఇటువంటి విషయాల్లో కలగజేసుకోవడం చీదరగా ఉండొచ్చు.

ప్రభుత్వ ప్రోత్సాహక సల్వాజుడుం (శుద్ధిచేసే వేట) - ఎన్నో హత్యలు, అత్యాచారాలు, చేస్తూ ఊళ్ళను తగలబెడుతూ లక్షలమంది గ్రామస్తులను వాళ్ళ ఇళ్ళ నుండి వెళ్ళగొడుతున్న హంతకముఠాకు మార్గదర్శి, కాంగ్రెస్ ఎమ్మెల్యే మహేంద్ర కర్మకు, వ్యూహాత్మకంగానే రాహుల్ గాంధీ ప్రచార సంరంభంలో, పెద్ద పాత్ర లేదు.

నిర్ణీత సమయానికే నేను మాతా దంతేశ్వరి మందిరం వద్దకు చేరుకున్నా. (మొదటి రోజు మొదటి ఆటకే) నా కెమెరా, చిన్న కొబ్బరికాయ, నుదిటిపై ఎర్రటి కుంకుమ బొట్టు ఉన్నాయి. ఎవరైనా నన్ను చూస్తూ నవ్వుతున్నారేమో

అనిపిస్తోంది. కొద్ది నిముషాల్లోనే ఒక చిన్న పిల్లవాడు నా దగ్గరికొచ్చాడు. వాడు టోపీ పెట్టుకొని వీపుకు స్కూల్ బ్యాగ్ తగిలించుకొని ఉన్నాడు. చేతివేళ్ళకు ఎర్రటి గోళ్ళరంగు దట్టించుకొని ఉన్నాడు. హిందీ ఔట్ లుక్‌లేదు, అరటిపళ్ళూ లేవూ. "నువ్వేనా లోపలికి పోయేది?" అనడిగాడు. నమస్కార్ గురూజీ లేదు. నాకేం చెప్పాలో అర్థం కాలేదు. వాడి జేబులోనుండి తడి చీటీ ఒకటి తీసి నా చేతికిచ్చాడు. "ఔట్ లుక్ నహీ మిలా" (ఔట్‌లుక్ దొరకలేదు) అని ఆ చీటీ చెప్పింది.

"మరి అరటి పళ్ళు ?"

"నేను తినేశాను, ఆకలేసింది" అన్నాడు.

నిజంగా వీడు భద్రతకు ప్రమాదమే

వాడి వీపు మీద సంచిపై ఇలా ఉంది - చార్లీబ్రౌన్ - మీ వంటి మందమతి మాత్రంకాదు. తన పేరు మంగ్తు అని చెప్పాడు. నేను ప్రవేశించబోయే అడవి, దండకారణ్యం చాలా మారుపేర్లతో ఉండే మనుషులతో నిండి ఉందని చాలా తొందరగానే తెలుసుకున్నాం ఈ సదుపాయమేదో నాకు చాలా హాయిగా అనిపించింది. నీ సొంత అస్తిత్వంలో నువ్వు ఇరుక్కుపోకుండా కాసేపు ఇంకొకరిలా మారడం ఎంత అద్భుతంగా ఉంటుంది ?

మందిరం నుండి కొన్ని నిమిషాల నడకతో మేం బస్టాండుకొచ్చాం. అది అప్పటికే జనం రద్దీతో ఉంది. అన్నీ వెంట వెంటనే జరిగిపోయాయి. ఇద్దరు వ్యక్తులు బైకుల మీదున్నారు. ఏ సంభాషణా లేదు. నిర్ధారణ చేసుకోనీకి ఒక చూపు, వాహనం మీదికి మనిషి, మోటార్ల నడక మొదలు. మేమెక్కడి పోతున్నామో నాకేమీ తెలియదు. పోయినసారి నేనొచ్చిన యస్పీ ఇంటిని దాటుకుంటూ పోతున్నట్లు గుర్తించాను. ఆ యస్పీ చాలా నిర్మొహమాటస్తుడు. "చూడండి మేడమ్. సూటిగా మాట్లాడుకుంటే ఈ పోలీసులు, మిలిటరీతో ఈ సమస్య తీరదు. వాళ్ళలో దురాశ పుడితేగాని మనకు నమ్మకం లేదు. నేను మా బాస్‌కు చెప్పాను.'బలగాలన్నీ తీసేసి వాటి బదులు ప్రతి ఇంట్లో ఒక టి.వి. పెట్టండి. అన్నీ వాటంతటవే సర్దుకుంటాయి"

చూస్తుండగానే టౌన్ దాటేశాం. అంతులేని సుదీర్ఘ ప్రయాణం. నా గడియారం లెక్క ప్రకారం మూడు గంటలు. ఉన్నట్లుండి నడిరోడ్డు మీద ఆగిపోయాం. ఎక్కడున్నామో తెలీని ఖాళీ రోడ్డుకిరువైపులా అడవి. మంగ్తు దిగిపోయాడు. నేనూ దిగాను. బైకులు వెళ్ళిపోయాయి. నా సంచి వీపుకు తగిలించుకొని "అంతర్గత భద్రతకు చిన్నారి ప్రమాదాన్ని" అనుసరిస్తూ అడవిలోకి ప్రవేశించాను. అందమైన పగటి కాంతి అడవి నేలపై బంగారు తివాచిని పరిచింది.

క్షణాల్లో మేం వెడల్పాటి నది ఒడ్డున తెల్లని ఇసుక తిన్నెలపై తేలాము. ఇది వర్షాధార నదని చెప్పకనే చెబుతోంది. చాలా సులువుగా దాటగలిగేలా మధ్యలో పాదాలు మునిగేంత చిన్న కాలువ తప్ప మిగతా అంతా ఇసుకే ఉంది. ఒడ్డునే "పాకిస్తాన్". "అటువైపు మేడమ్" నిర్మొహమాటంగా మాట్లాడే యస్పీ అన్నాడు "మా కుర్రాళ్ళు షూట్ చేస్తారు" నది దాటుతుండగా యస్పీ మాటలు గుర్తొచ్చాయి. పోలీసు వాడి తుపాకి గురిలో నుండి చూశాను. సీనరీలో చిన్న చిన్న ఆకారాల్లా, ఏరివేయడానికి చాలా సులభమనిపించేలా! మంగ్తు ఇవేవీ పట్టనట్లున్నాడు. నేను అనుసరించసాగాను.

ఆవలి ఒడ్డున మాకోసం ఎదురు చూస్తూ "హార్లిక్స్" అన్న లేత ఆకుపచ్చ చొక్కా ధరించిన వ్యక్తి చందు. అంతర్గత భద్రతకు కాస్త పెద్ద ప్రమాదం. ఇరవై ఏళ్ళుండొచ్చు. అందమైన చిరునవ్వు. సైకిల్, వేడి నీళ్ళు నింపిన క్యాన్. నాకోసం పార్టీ పంపిన గ్లూకోజ్ బిస్కెట్ పొట్లాలతో అతనున్నాడు. కాస్త ఊపిరి పీల్చుకొని మళ్ళీ నడక మొదలు పెట్టాం. ఈ సైకిల్ బాగా ఇబ్బందిగా తయారైంది. దారి ఏమాత్రం సైకిల్ తొక్కడానికి అనువుగా లేదు. నిటారు కొండల్ని ఎక్కుతూ బండరాళ్ళతో నిండిపోయిన దారిపై పాకుతూ అప్పుడప్పుడూ కాస్త చదునైన ఉపరితలంపై నడుస్తూ వెళుతున్నాం. సైకిల్ తొక్కలేనప్పుడల్లా చందు దాన్ని అలవోకగా పైకెత్తుకొని నడుస్తున్నాడు. అతని పల్లెటూరి మొరటులేనాన్ని ఒకంతా ఆశ్చర్యంగా చూస్తూ ఉండిపోయాను. అతను అన్ని రకాల ఆయుధాల్ని ఉపయోగించగలడని నేను చాలా సేపటి తర్వాత తెలుసుకున్నాను. "ఒక్క ఎల్.ఎమ్.జి.తప్ప" అని నవ్వుతూ చెప్పాడు.

తలపాగాలో పువ్వులు ధరించి బాగా తాగి ఉన్న ముగ్గురు అందమైన వ్యక్తులు మా వెంట సుమారు అరగంట పాటు నడిచారు. మా దార్లు వేరయ్యే దాకా. సంధ్యా సమయానికి వాళ్ళు భుజాలకు తగిలించుకున్న సంచులు అరవడం మొదలు పెట్టాయి. వాటిలో సంతలో అమ్ముడు పోని కోళ్ళున్నాయి.

చందు చీకట్లో కూడా నడవగలిగేలా ఉన్నాడు. నేను టార్చ్ ఉపయోగించాల్సొచ్చింది. కీచురాళ్ళు అరవటం మొదలు పెట్టాయి. మా చుట్టూ ఆర్కెస్ట్రా. శబ్దాల మంటపం. రాత్రి ఆకాశాన్ని చూడాలని మనసులాగింది. పైకి చూసే ధైర్యం చేయలేకపోయా. నా చూపులు నేలపైనే ఉండాలి. ప్రతి అడుగూ శ్రద్ధగా.

కుక్కల అరుపులు వినబడుతున్నాయి. కాని అవి ఎంత దూరంలో ఉన్నాయో చెప్పలేను. మా దారి చదునవుతూ వస్తోంది. ఆకాశం వంక ఓరగా చూశాను. నాకది అకాలిక ఆనందాన్నిస్తుంది. త్వరలో మేం ఆగిపోవచ్చు. "తొందరగానే" అంటాడు చందు. అది గంటకు పైగా అయ్యేలా ఉంది. పెద్ద పెద్ద వృక్షాలు అగుపిస్తున్నాయి. మేం వచ్చేశాం.

ఊరు చాలా విశాలంగా కనబడుతోంది. దూరదూరంగా ఇళ్ళు. మేం ప్రవేశించిన ఇళ్ళు చాలా అందంగా ఉంది. మంట చుట్టూ కొంతమంది కూర్చొని ఉన్నారు. బైట చీకట్లో చాలా మంది ఉన్నట్టున్నారు. ఎంతమందీ చెప్పలేను. అస్పష్టంగా ఊరికే ఆకారాలు చూడగలను. గుసగుసలు చుట్టుముట్టాయి. లాల్‌సలామ్ కామ్రేడ్. నేనూ లాల్‌సలామ్ అన్నా. నేను అలసటను మించిన స్థితిలో ఉన్నాను. ఇంటామె నన్ను పిలిచి చిక్కుడు గింజలతో ఉడకబెట్టిన కోడికూర, ఎర్రన్నం పెట్టింది. అద్భుతం. నా పక్కనే ఆమె బిడ్డ నిద్రపోతూ ఉంది. ఆమె కాళ్ళకు తొడిగిన వెండి కడియాలు మంట వెలుగులో మెరుస్తున్నాయి.

భోజనం తర్వాత పక్కపరచుకోడానికి బ్యాగ్ తెరిచాను. ఆ పెద్ద 'జిప్' శబ్దం ఆవాతావరణానికి అసంబద్ధంగా ఉంది. ఎవరో రేడియో పెట్టారు. హిందీ బిబిసి ప్రసారాలు. వేదాంత వారి నియంగిరి ప్రాజెక్టు నుండి ఇంగ్లాండ్ చర్చి నిధుల్ని ఉపసంహరించుకుంది. పర్యావరణం విధ్వంసమవుతుంది, డోంగ్రియా గొండుల హక్కులు హరించి వేయబడతాయనే కారణాలు చెప్పింది. ఆవు గంటల శబ్దాలు, వాటి ఆఘ్రానింపులు, మందల అడుగుల చప్పుళ్ళు, పశువుల పిత్తులు నాకు వినబడుతున్నాయి. లోకమంతా బాగుంది. నాకళ్ళు మూతలు పడ్డాయి.

ఐదు గంటల కంతా మేం లేచాము. ఆరుకంతా బయలుదేరాము. మరో రెండు గంటల్లో ఇంకో నదిని దాటాము. కొన్ని అందమైన పల్లెటూళ్ళ గుండా నడిచాము. ప్రతి గ్రామంలోనూ చింత చెట్ల సముదాయం అండగాఉండే భారీ దేవతా మూర్తుల్లా. తియ్యటి బస్తర్ చింతపండు. పదకొండు గంటల కంతా సూర్యుడు మీదకొచ్చేశాడు. నడక అంత ఆహ్లాదకరంగా లేదు. మధ్యాహ్నభోజనానికి ఒక గ్రామంలో ఆగాము.

ఆ ఇంటి వాళ్ళు చందుకు తెలిసినట్లుగా ఉంది. ఒక అందమైన అమ్మాయి అతడితో పరాచికాలడుతోంది. నేనున్నాననేమో అతడు కొంచెం సిగ్గుపడుతున్నాడు. బొప్పాయి కాయపప్పు, ఎర్రన్నం, ఎర్రమిరప్పొడితో మా భోజనం. మళ్ళీ నడక మొదలుపెట్టబోయే ముందు సూర్యుడు కాస్త తాపాన్ని తగ్గించుకోనీ అని ఆగాం. కొట్టంలో ఓ కునుకు తీశాం. ఈ ప్రదేశానికేదో ప్రత్యేకమైన సౌందర్యముంది. ప్రతిదీ శుభ్రంగా, అవసరమైన వస్తువులే ఉన్నాయి. అనవసర చెత్తలేదు. నల్లటి కోడి ఒకటి దర్జాగా మట్టిగోడను అధిరోహిస్తూ, అవరోహిస్తూ ఉంది. వెదురు తడిక ఒకటి గదుల్ని విభజిస్తూ,

పూరి పైకప్పు దంతెల్ని మోస్తూ రెండు విధాలుగా ఉపయోగపడుతోంది. అక్కడి ఓ గడ్డి పుల్లల చీపురు, రెండు డ్రమ్ములు, రెల్లుతో అల్లిన బుట్ట, ఒక విరిగిన గొడుగు, చదునుగా మడిచి ఒక దాని మీదొకటి ఎత్తుగా పేర్చిన అట్టపెట్టెలున్నాయి. ఏదో నా దృష్టిని ఆకర్షించింది. నా కళ్ళ జోడు కావాలి. అట్టపెట్టె మీద ముద్రించబడిన అక్షరాలు - ఐడియల్ పవర్ 90 హై ఎనర్జీ ఎమల్షన్ ఎక్స్‌ప్లోజివ్ (క్లాస్ -2) ఎస్.డి. సి.ఏ.టి.జెడ్.జెడ్ ( ఒక రకమైన శక్తివంతమైన పేలుడు పదార్థం - అను)

రెండు గంటలకంతా మళ్ళీ నడక మొదలు. మేం వెళ్ళబోయే గ్రామంలో ఒక దీదీ(అక్క)ని కలవబోతున్నాం. మా తదుపరి ప్రయాణం గురించి ఆమెకే తెలుసు. చందుకు తెలీదు. ఇక్కడ సమాచారంలో కూడా పొదుపు పాటిస్తారు. ఎవరికీ అంతా తెలియకూడదు. మొదటిసారి చందు ముఖంమీద చిన్న విచార మేఘం కమ్ముకోవటం చూశాను. నా మీద పెద్దది కమ్ముకుంది. ఇక్కడ సమాచార వ్యవస్థ ఎలా ఉంటుందో? ఒక వేళ ఏదైనా పొరపాటు జరిగితే ఊరికి కొద్ది దూరంలో ఒక ఖాళీ పాఠశాల భవనం బైట నిలబడ్డాం.

ఈ ఊళ్ళలో ప్రభుత్వ పాఠశాల భవనాలన్నీ తలుపులకు, కిటికీలకు ఉక్కు షట్టర్లు బిగించి కాంక్రీటు బురుజుల్లా కట్టారెందుకో? ఇవి పల్లెటూరి ఇళ్ళలో పూరి గుడిసెల్లా ఎందుకు లేవు? ఎందుకంటే అవి ఒకేసారి బంకర్లలా, బ్యారెక్కుల్లా కూడా ఉపయోగపడతాయని. “ఆబూజ్‌మాడ్ పల్లెల్లో స్కూళ్ళు ఇలాగే ఉంటాయి” అంటాడు చందు. ఒక పుల్ల తీసుకొని నేలమీద భవనం ఆకారం గీశాడు. ఎనిమిది గోడలతో నిర్మించిన అష్టకోణాకృతి. ఇలాంటివి మూడు ఒకదాన్నొనుకొని ఒకటి తేనెటీగల గదుల్లా “ఇలా అన్ని వైపుల నుండి వాళ్ళు కాల్చొచ్చు” బాణం గుర్తులు గీస్తూ టి.విలో క్రికెట్ ఆటలో బ్యాట్స్‌మెన్ బంతుల్ని కొట్టిన దిశల్ని చూపినట్లు వివరించాడు. ఏ స్కూల్లోనూ టీచర్లు లేరు, అందరూ పారిపోయారంటాడు చందు. లేదా మీరు తరిమేశారా? లేదు మేం పోలీసుల్నే తరుముతాం. అయినా టీచర్లు ఇక్కడికి, ఈ అడవికి ఎందుకు రావాలి. ఇంట్లో కూర్చుంటే జీతాలొచ్చేటప్పుడు? మంచి సంగతే చెప్పాడు.

ఇది కొత్త ఏరియా అని చెప్తాడు చందు. పార్టీ ఇటీవలే ఇక్కడికి ప్రవేశించింది.

ఇరవైకి అటూ ఇటూ వయసున్న యువతీ యువకులు ఇరవై మంది దాకా వచ్చారు. “ఇది గ్రామస్థాయి మిలీషియా. మావోయిస్టు మిలిటరీ మొత్తంలోకి ఇది ప్రాథమిక స్థాయి” వివరించాడు చందు. ఇలాంటి వాళ్ళను నేనిదివరకెప్పుడూ చూళ్ళేదు. చీరలు, లుంగీలు ధరించి ఉన్నారు. కొంతమంది వెలిసిపోయిన ఆలివ్‌గ్రీన్ దుస్తుల్లో ఉన్నారు. అబ్బాయిలు తలకు రుమాలు చుట్టుకొని నగలు కూడా ధరిస్తారు. అందరి వద్దా బర్మార్లనబడే పొడవాటి తుపాకులున్నాయి. కొంతమంది వద్ద కత్తులు, గొడ్డెళ్ళు, విల్లుబాణాలు కూడా ఉన్నాయి.

ఒకబ్బాయి మూడడుగుల గొట్టంతో తయారుచేసిన నాటు తుపాకి పట్టుకొని ఉన్నాడు. అది తుపాకి మందు, ఒక గుండుతో నింపబడి పేల్చడానికి సిద్ధంగా ఉంది. ఇది చాలా శబ్దం చేస్తుంది. కాని ఒక్కసారే కాల్చొచ్చు. అయినా పోలీసుల్ని బెదరగొడ్తాది అంటూ వాళ్ళు గలగలా నవ్వారు.

సల్వాజుడుం స్థావరాలకు చాలా వెలుపలిగా ఉన్నందువల్లేమో యుద్ధం గురించిన ఆలోచనలు అంత ఎక్కువగా వీళ్ళ మెదళ్ళను ఆక్రమించలేదు. ఆరోజు పనేదో ముగించుకొని అప్పుడే వచ్చారు. మేకలు పొలాలమీద పడకుండా గ్రామంలోని కొన్ని ఇళ్ళ చుట్టూ వాటికోసం కంచె కట్టే పనిలో సాయం చేసి వచ్చారు. ఆటలు, వినోదాల్లో మునిగిపోయారు. అమ్మాయిలు అబ్బాయిలతో నిస్సంకోచంగా హాయిగా ఉండటం నన్నాకర్షించింది. ప్రత్యేకంగా ఈ విషయాన్ని గమనించే అలవాటు నాది. ఇక్కడ నాకు తృప్తిగా అనిపించింది. “వీళ్ళ పని గస్తీ తిరుగుతూ నాలుగైదు ఊళ్ళను కాపలాగాయటం, పొలం పనుల్లో, బావుల్ని శుభ్రం చేయడంలో, ఇళ్ళను బాగు చెయ్యడంలో ఎక్కడ అవసరమైతే అక్కడ సాయం చెయ్యటం” చెప్పుకుంటూ పోయాడు చందు.

ఇంకా దీదీ జాడలేదు. ఏం చెయ్యడం? ఏమీ లేదు ఎదురుచూడడం తప్ప తరగటం, తొక్కలు తియ్యటం వంటి వేవో సహాయాలు.

భోజనం తర్వాత ఎక్కువ మాటలేవీ లేకుండా అందరం వరుసగా నిలుచున్నాం. స్పష్టంగా మేం కదులుతున్నాం. మాతోపాటు ప్రతి ఒక్కటి. బియ్యం, కూరగాయలు, కుండలు, పెనాలు అన్నీ కదిలి వస్తున్నాయి. స్కూలు కాంపౌండు దాటి ఒకే వరుసలో అడవిలోకి నడుస్తున్నాం. అరగంట లోపే ఒక డొంకలోకొచ్చాము. అది మేము నిద్రపోయే చోటు. పూర్తి నిశ్శబ్దం. నిమిషాల్లో అందరూ వాళ్ళనీలం రంగు ప్లాస్టిక్ దుప్పట్లు (ఝుల్లీ) పరుచుకున్నారు. (ఈ ఝుల్లీ ప్రతి చోటా ఉండాల్సిందే ఇది లేందే విప్లవం లేదు) చందు, మంగ్తు ఒక దాంట్లో సర్దుకొని నాకొకటి పరిచారు. నాకోసం మంచి రాతి మీద చక్కటి చోటును వెదికిపెట్టారు. దీదీకి కబురు పంపానంటాడు చందు. ముందది అందితే ఉదయానికల్లా ఆమె ఇక్కడుంటుంటుంది. ఆమెకి కబురందితేనే!

చాలా కాలంగా నేను నిద్రించిన గదుల్లో కెల్లా అందమైన గది ఇదే. వేయి నక్షత్రాల హోటల్‌లో నా విడిది. నా చుట్టు ఆయుధాలతో చిత్రమైన, అద్భుతమైన పిల్లలు. వీళ్ళంతా నిజంగా మావోయిస్టులే. వీళ్ళందరినీ చంపేస్తారా? అటవీ యుద్ధ శిక్షణా కేంద్రం వీళ్ళ కోసమేనా? యుద్ధవిమానాలు, థర్మల్, లేజర్ నిఘా యంత్రాలు కూడానూ.

అసలు వీళ్ళెందుకు చచ్చిపోవాలి? దేని కోసం? ఇదంతా గనులు తవ్వేయడానికా? నేనెళ్ళిన ఒరిస్సా కేయోంఝూర్ ఓపన్‌క్యాస్టు ఇనుప ఖనిజం గనులు గుర్తొస్తున్నాయి. ఒకప్పుడక్కడ అడవి ఉండేది. ఇటువంటి పిల్లలుండేవారు. ఇప్పుడు ఆ నేలంతా ఎర్రగా పచ్చిపుండులా ఉంది. ముక్కుల్లో ఊపిరి తిత్తుల్లో ఎర్రదుమ్ము నిండిపోతుంది. అక్కడ నీళ్ళు ఎరుపు, గాలి ఎరుపు, జనం ఎరుపు, వాళ్ళఊపిరితిత్తులు ఎరుపు, వాళ్ళ వెంట్రుకలు ఎరుపు. రాత్రింబవళ్ళు వాళ్ళ గ్రామాల గుండా, రేవు నుండి రేవుకు విచ్చలవిడిగా వేలకొద్దీ ట్రక్కులు ఖనిజాన్ని పారాదీప్ పోర్టుకు చేరుస్తాయి. అక్కడినుండి అది చైనాకు పోతుంది. అక్కడది కార్లుగా, పొగగా, రాత్రికి రాత్రి పుట్టుకొచ్చే నగరాలుగా మారుతుంది. ఆర్థిక వేత్తలకు ఊపిరి సలపనివ్వని వృద్ధి రేటుగా మారుతుంది. యుద్ధం చేయడానికి ఆయుధాలుగా మారుతుంది.

సెంట్రీలు తప్ప అందరూ గాఢంగా నిద్రపోతున్నారు. ఒకొక్కరూ గంటన్నర చొప్పున సెంట్రీ చేస్తారు. ఎట్టకేలకు నేను నిశ్చింతగా నక్షత్రాల్ని చూడగల్గుతున్నా. నాచిన్నతనంలో మీనాంచల్ నదిఒడ్డున పెరిగే రోజుల్లో సంధ్యా కాంతుల్లో మొదలయ్యే కీచురాళ్ళ శబ్దాల్ని అప్పుడే మేల్కొని వెలుగులు విరజిమ్మేందుకు సిద్ధమవుతున్న నక్షత్రాలు చేసే శబ్దాలనుకునే దాన్ని. నేనుండే ప్రపంచంలో వేరెవ్వరూ లేరు. ఈ రాత్రి నెనెవరిగా ఉండాలి? కామ్రేడ్ రాహెల్, నక్షత్రాల నీడన. బహుశా దీదీ రేపు రావొచ్చు.

మధ్యాహ్నం కావొస్తుండగా వాళ్ళొచ్చేశారు. కొద్ది దూరం నుండి వాళ్ళ రాకను చూశాను. పదిహేనుమంది దాకా, అందరూ ఆలివ్ గ్రీన్ దుస్తుల్లో మావైపు పరిగెత్తుకుంటూ వస్తున్నారు. దూరం నుండైనా వాళ్ళు పరిగెత్తే విధానాన్ని బట్టి వాళ్ళు సుశిక్షితులైన సైనికులని చెప్పగలను. ప్రజా విముక్తి గెరిల్లా సైన్యం (పి.ఎల్.జి.ఏ). ఎవరికోసమైతే థర్మల్ ఇమేజింగులు, లేజర్ రైఫిళ్ళు ఉన్నాయో, అటవీ యుద్ధ శిక్షణా కేంద్రం ఉన్నదో వాళ్ళు.

ఇన్‌సాస్, ఎస్సెల్లార్ వంటి గంభీరమైన ఆయుధాలు పట్టుకొని ఉన్నారు. ఇద్దరి దగ్గర ఏ.కే 47లున్నాయి. ఈ బృందానికి నాయకుడు కామ్రేడ్ మాధవ్. తొమ్మిది సంవత్సరాల వయసు నుండి పార్టీలో ఉన్నాడు. ఆంధ్రప్రదేశ్‌లోని వరంగల్ నుండి వచ్చాడు. అతను చాలా అపరాధభావంతో చింతగా ఉన్నాడు. పదే పదే చెప్తున్నాడు చాలా పెద్ద సమాచారలోపం ఏర్పడిందని. మొదటిరోజు రాత్రే నేను మెయిన్ క్యాంప్‌కు వచ్చి ఉండాల్సింది. జంగిల్ రిలేలో ఎవరో

క(్రని పడేశారు. బైక్ మరోచోట దింపాల్సి ఉండె. మిమ్మల్ని చాలా ఎదురుచూడనిచ్చాం. చాలా నడిపించాం. మీరిక్కడున్నారని తెలిసిన వెంటనే పరిగెత్తుకుంటూ వచ్చాం. మరేం ఫరవాలేదు. నేను సిద్దపడే వచ్చాను. వెయిట్ చేయడానికి, నడవడానికి, వినడానికి సిద్ధపడే వచ్చానన్నాను. క్యాంప్‌లో ఉన్న వాళ్ళు కంగారు పడుతుండొచ్చు. వెంటనే బయలు దేరాలి అన్నాడు.

క్యాంపుకు కొన్ని గంటలనడక. మేమొచ్చేసరికి చీకటి పడబోతోంది. అంచెలంచెలుగా ఎన్నో సెంట్రీలు. వలయాలు వలయాలుగా గస్తీలున్నాయి. రెండు వరుసల్లో నిలబడ్డ కామ్రేడ్స్ వందమందిదాకా ఉండొచ్చు. అందరి దగ్గరా ఆయుధం ఉంది. చిరునవ్వుకూడా. పాడటం మొదలు పెట్టారు. లాల్‌సలామ్, లాల్‌సలామ్, అనేవాల్ సాధియోం కో లాల్‌సలాం (వచ్చిన కామ్రేడ్స్‌కు లాల్‌సలామ్) ఆ పాటను నది గురించి, విచ్చుకునే అడవి గురించిన జానపదంలాగా చాలా మధురంగా పాడారు. పాట, పలకరింపు, కరచాలనం, బిగించిన పిడికిలి. అందరూ అందర్నీ పలకరిస్తున్నారు చిన్నగా గొణుగుతూ లాల్‌సలామ్ లాల్‌సలామ్ లాల్‌సలామ్...

నేలమీద పరిచిన దాదాపు 15 అడుగుల విస్తీర్ణం గల నీలిరంగు ఝిల్లీ తప్ప క్యాంపులో మరే ఆనవాళ్ళు లేవు. దీనికి ఝిల్లీ కప్పుకూడా ఉంది. రాత్రికి ఇది నా గది. రోజుల తరబడి నడిచినందుకు రివార్డో, ముందు ముందు రాబోయే వాటికోసం నన్ను గారాబం చేస్తున్నారో లేక రెండూనో ఏదైనా నా ఈ పర్యటనలో నా నెత్తిమీద కప్పు ఉండటం ఇదే ఆఖరు. భోజనం తర్వాత నేను కలిసేవాళ్ళు - క్రాంతికారి ఆదివాసీ మహిళా సంఘటన (కే.ఏ.యమ్.యస్) బాధ్యురాలు కామ్రేడ్ నర్మద ఆమె తలకు బహుమతి ఉంది, చేతిలో ఉన్న ఎస్సెల్లార్ అంతే ఉండే పి.ఎల్.జి.ఏ కామ్రేడ్ సరోజ, తలకు వెల ఉన్న మరో కామ్రేడ్ మాసే (గోండు భాషలో నల్లపిల్ల అని అర్థం), టెక్ నేర్పరి కామ్రేడ్ రూపీ, నేను నడిచొచ్చిన డివిజన్ ఇంచార్జి కామ్రేడ్ రాజు, ఇంకా అందర్లోకి సీనియర్, పొలిట్ బ్యూరో కూడా కావొచ్చు. కాని నాకు చెప్పరు, నేనడగను - కామ్రేడ్ వేణు (లేదా మురళి, సోను, సుశీల్, మీ ఇష్టం ఎలాగైనా పిలవొచ్చు). మా మధ్య గోండు, హాల్బీ, తెలుగు, పంజాబీ, మళయాలం మాట్లాడేవాళ్ళున్నారు. మాసేకు మాత్రమే ఇంగ్లీషొచ్చు (కాబట్టి మేం హిందీలో మాట్లాడుకోవచ్చు) ఎత్తుగా మౌనంగా ఉండే కామ్రేడ్ మాసే మాటలు కలపడానికి కమ్ముకున్న బాధనేదో చీల్చుకొని రావల్సినట్లనిపించింది. ఆమె నన్ను ఆలింగనం చేసుకున్న విధం చూసి ఆమె ఒక పాఠకురాలని చెప్పగలను. అడవిలో ఆమెకు పుస్తకాల లోటు బాగా ఉంది. కొద్దికాలం పోయాకే ఆమె కథను చెప్తుంది. తన విషాదాన్ని పంచుకునేలా నన్ను విశ్వసించాక.

ఒక విషాద వార్త. ఈ అడవిలో ఇది మామూలే. 'బిస్కెట్ల'తో పరిగెత్తుకుంటూ వచ్చారొకరు. చిన్న చతరస్రాలుగా ముడిచి పిన్ చేసిన చీటీలు సంచినిండా ఉన్నాయి. చిప్సలాగా అన్ని దిక్కులనుండి వచ్చిన వార్తలు. ఆగ్నార్ గ్రామంలో పోలీసులు ఐదుగుర్ని చంపేశారు. నలుగురు మిలీషియా సభ్యులు, ఒక సాధారణ గ్రామస్తుడు. సుంతుపొట్ట(25), ఫూలూవడ్డే(22), కండే పొటై(22) రామామోలీ వడ్డే (20), దాల్‌సాయ్ కోరం(22)/ వీళ్ళు నిన్నటి రాత్రి నక్షత్ర కాంతుల నా పడకటింటిలోని పిల్లలు కావొచ్చు.

అంతలోనే ఓ శుభవార్త. బొద్దుగా ఉండే యువకుడితో పాటుగా ఓ బృందం వచ్చింది. అతను కూడా యూనిఫారంలో ఉన్నాడు. అది చాలా కొత్తది లాగున్నది. వాళ్ళను సాధారణంగా ఆహ్వానిస్తూ కొత్త దుస్తులపై వ్యాఖ్యలు చేస్తున్నారు. అతడు సిగ్గును, సంతోషాన్ని కనబరుస్తున్నాడు. అతడు అడవిలో కామ్రేడ్లతో కలిసి పనిచేయడానికొచ్చిన డాక్టర్. ఒక డాక్టర్ దండకారణ్యానికొచ్చి చాలా ఏళ్ళే అయింది.

రేడియోలో యుద్ధాన్ని గురించి చర్చించడానికి 'వామపక్ష తీవ్ర వాద' ప్రభావిత రాష్ట్రాల ముఖ్యమంత్రులతో హోంమంత్రి సమావేశాన్ని గురించిన వార్త చెబుతున్నారు. ఈ అంశంపై మౌనంగా వింటున్న బీహార్, జార్ఖండ్ ముఖ్యమంత్రులు సమావేశానికి హాజరుకాలేదు. రేడియో చుట్టూ కూర్చున్న వాళ్ళంతా నవ్వుతున్నారు. ఎన్నికలప్పుడు, ప్రచారం మొదలుపెట్టినప్పటి నుండి ప్రభుత్వం ఏర్పడ్డాక నెలా రెన్నెళ్ళవరకు ఈ ప్రధాన స్రవంతి రాజకీయ నాయకులంతా 'నక్సలైట్లు బిడ్డల్లాంటి వాళ్ళు' అంటూ మాట్లాడతారు. కచ్చితంగా ఎప్పుడు మాట మార్చి కోరలు సాచుతారో మీరు టైం పెట్టుకోవచ్చు.

నన్ను కామ్రేడ్ కమలకు పరిచయం చేశారు. ఎట్టి పరిస్థితుల్లోనూ తనను లేపకుండా నా ఝిల్లీ దాటి ఐదడుగులు కూడా వెయ్యకూడదని ఆమె నన్ను హెచ్చరించింది. ఎందుకంటే చీకట్లో దారి తప్పి పోవడం చాలా సహజం. (నేనామెను లేపను. మొద్దులా నిద్రపోతాను) ఉదయాన్నే కమల నాకు పసుపు రంగు ప్లాస్టిక్ కవరు ఇచ్చింది. ఒకప్పుడు దాంట్లో ఏబిస్ గోల్డ్ వారి శుద్ధి చేయబడిన సోయా నూనె ఉండేది. ఇప్పుడది దొడ్డి చెంబు. విప్లవ బాటలో ఏదీ వృధా పోదు.

(నేనిప్పటికీ కామ్రేడ్ కమల గురించి ఆలోచిస్తూ ఉంటాను. ప్రతిరోజూ. ఆమె వయసు 17. నడుముకొక నాటు తుపాకీ ధరించి ఉంటుంది. బాబోయ్ ఏమి చిరునవ్వు ఆమెది! కాని పోలీసుల కంటపడితే మాత్రం వాళ్ళామెను చంపేస్తారు. ముందు ఆమెను రేప్ చెయొచ్చు. వాళ్ళనేమీ అడగరు. ఎందుకంటే ఆమె అంతర్గత భద్రతకు ముప్పు కాబట్టి)

టిఫిన్ అయ్యాక ఝిల్లీపై బాసింపట్టు వేసుకొని నాకోసం ఎదురుచూస్తూ కూర్చున్నాడు. కామ్రేడ్ వేణు (సుశీల్, సోను, మురళి). చూడ్డానికతను చాలా అరకంగా పల్లెటూరి బడి పంతుల్లా కనిపిస్తాడు. నేనాయనతో చరిత్ర పాఠం చెప్పించుకోబోతున్నా. కచ్చితంగా చెప్పాలంటే గత ముప్పై సంవత్సరాల దండకారణ్య చరిత్ర. దేని చుట్టూ అయితే నేడు యుద్ధం సుడితిరుగుతోందో, ఏదైతే యుద్ధమనే ఉచ్చదశకు చేరుకుందో దాని గురించి ఇది వాళ్ళ దృష్టికోణం నుండే కావొచ్చు. అయినా ఏది చరిత్ర కాకుండా పోతుంది? ఏదేమైనా దాన్ని సవాలు చేయాలన్నా, వాదించాలన్నా ఇప్పుడు జరుగుతున్నట్లు, కేవలం అబద్ధాలతో కొట్టి పడేయకూడదు. రహస్య చరిత్రను బహిర్గత పరచాలి.

కామ్రేడ్ వేణుది నెమ్మదిగా, ప్రశాంత చిత్తంతో మాట్లాడగలిగే స్వభావం. రాబోయే రోజుల్లో ఈ విషయానికి, సబంధించి ఏదైనా సందర్భం వస్తే అది నన్ను పూర్తిగా ఉద్రేక పరచొచ్చు. ఈ ఉదయం ఆయన గంటల తరబడి దాదాపు నిర్విరామంగా మాట్లాడుతూ ఉన్నాడు. ఒక పెద్ద తాళాల గుత్తి పట్టుకొని కథలు, పాటలు, విశ్లేషణలు ఏవి కావాలన్నా వాటిని సొరుగుల్ని తెరిచి బైటికి తీసిచ్చే చిన్న స్టోర్ మేనేజర్ లాగున్నాడాయన.

ముప్పైఏళ్ళ క్రితం 1980 జూన్‌లో ఆంధ్రప్రదేశ్ నుండి గోదావరి నది దాటి దండకారణ్యానికి (పార్టీ భాషలో డి.కే) ప్రవేశించిన ఏడుసాయుధ దళాల్లో ఒక దళ సభ్యుడు. అంటే మొట్టమొదటి నలభై తొమ్మిది మందిలో ఈయనొకరనన్నమాట. వీళ్ళు మొదటి నక్సలైట్ పార్టీ భారత కమ్యూనిస్టు పార్టీ (మార్క్సిస్టు లెనినిస్టు) నుండి విడిపోయిన పీపుల్స్ వార్ గ్రూప్ (పి.డబ్ల్యూజి) వాళ్ళు. అదే సంవత్సరం ఏప్రిల్‌లో కొండపల్లి సీతారామయ్య నేతృత్వంలో పి.డబ్ల్యూ.జిని ఒక ప్రత్యేక, స్వతంత్ర్య పార్టీగా ప్రకటించారు. పి.డబ్ల్యూజి ఒక సాయుధ సైన్యాన్ని నిర్మించుకోవాలనుకున్నది. దానికోసం ఒక స్థావర ప్రాంతం కావాలి. డి.కేను అట్లా ఒక స్థావరంగా ఎన్నుకొని దాన్ని పరిశోధించి ఆ తర్వాత గెరిల్లా జోన్లను నిర్మించడానికి ఆ దళాల్ని పంపారు. అసలు కమ్యూనిస్టు పార్టీకి ఒక స్థిర సైన్యం ఉండాల్నా అనీ, ప్రజాసైన్యం ఆవశ్యకతను గురించిన చర్చల్లో వైరుధ్యాలు చాలా పాతవి. సాయుధ సైన్యాన్ని నిర్మించుకోవాలన్న పి.డబ్ల్యూ.జి నిర్ణయం ఆంధ్రప్రదేశ్ అనుభవాల నుండి తీసుకోబడింది. 'దున్నే వాడికే భూమి' పోరాటంలో భూస్వాములతో ముఖాముఖి తలపడాల్సి వచ్చినప్పుడు దాని పర్యవసానంగా వచ్చిన పోలీసు నిర్బంధాన్ని ఎదుర్కోడానికి పార్టీకి శిక్షణ పొందిన సొంత సాయుధ దళాలు లేనందువల్ల అది నిలబడలేకపోయింది.

(2004నాటికి పి.డబ్ల్యూ.జి, మిగతా సి.పి.ఐ (యమ్. యల్) గ్రూపులు, పార్టీయూనిటీ (పి.యూ) మావోయిస్టు కమ్యూనిస్టు సెంటర్ (యం.సీ.సీ)లు. పార్టీ యూనిటీ యం.సీ.సీలు ఎక్కువగా బీహార్, జార్ఖండ్‌లలో పనిచేసేవి ఏకమై ఇప్పటి భారత కమ్యూనిస్టు పార్టీ (మావోయిస్టు) ఏర్పడింది.)

దండకారణ్యం బ్రిటీష్ వాడు తెల్లవాడి పరిభాషలో పిలిచిన గోండుల ప్రాంతం గోండ్వానాలో భాగం. ఇప్పుడు మధ్యప్రదేశ్, ఛత్తీస్‌గఢ్, ఒరిస్సా, ఆంధ్రప్రదేశ్, మహారాష్ట్ర సరిహద్దులు ఈ అడవిని చీలుస్తూ పోతాయి. సమస్యాత్మక జనాన్ని వేరువేరు పరిపాలనా విభాగాల కింద విడగొట్టే విధానం ఒక పాత కుయుక్తే. అయితే ఈ మావోయిస్టులు, మావోయిస్టు గోండులు రాష్ట్ర సరిహద్దుల్ని పట్టించుకోరు. వాళ్ళ బుర్రల్లో వేరే మ్యాపులుంటాయి. అడవిలోని మిగతా ప్రాణుల్లాగే వాళ్ళకు వాళ్ళ మార్గాలుంటాయి. వాళ్ళకు రోడ్లు నడవడానికి కాదు, దాటడానికే. లేదా ఈ మధ్య ఎక్కువగా జరుగుతున్నట్లు పేల్చివేయడానికి. గోండులు (కోయ, దోర్ల తెగల మధ్య విభజించబడ్డారు) అత్యధిక సంఖ్యలో ఉన్నా చిన్న చిన్న తండాలుగా వేరే ఆదివాసీ తెగలు కూడా ఉన్నాయి. గిరిజనేతర సమూహాలు, వ్యాపారస్తులు, ఇతర ప్రాంతాల నుండి వచ్చి స్థిరపడ్డ వాళ్ళు అడవి అంచుల్లో, రోడ్లకు, మార్కెట్లకు దగ్గరగా నివసిస్తారు.

దండకారణ్యానికి వచ్చిన సేవకుల్లో పిడబ్ల్యూజి వాళ్ళు మొదటి వాళ్ళు కాదు. 1975లో వరోరాలో గాంధేయవాది బాబా ఆమ్టే తన ఆశ్రమాన్ని, కుష్టురోగుల కోసం ఆసుపత్రిని నెలకొల్పాడు. అబుజ్‌మాడ్ అటవీ ప్రాంతంలో రామకృష్ణ మిషన్ గ్రామీణ పాఠశాలల్ని నెలకొల్పింది. ఉత్తం బస్తర్‌లో బాబా బీహారీ దాస్ 'గిరిజనుల్ని హిందూ ధర్మంలోకి' రప్పించే కార్యక్రమాన్ని నడిపించాడు. ఈ క్యాంపెయిన్‌లో ఆదివాసీ సంస్కృతిని కించపరిచి, వాళ్ళని ఆత్మన్యూనతలోకి నెట్టడంతో పాటు హిందూమతాన్ని వారిపై బలవంతంగా రుద్ది, దాని గొప్ప కానుక -కులాన్ని ప్రవేశ పెట్టారు. మొట్టమొదట హిందువుగా మారిన గ్రామ పెద్దలు, భూస్వాములు, సల్వాజుడుం వ్యవస్థాపకుడు మహేంద్ర కర్మలాంటి వాళ్ళకు ద్విజులు అంటే బ్రాహ్మణుల హోదా దక్కింది.(నిజానికి ఇదో పెద్ద కుంభకోణం. ఎందుకంటే ఎవరూ బ్రాహ్మణులుగా మారే అవకాశం లేదు. అదేగనక సాధ్యమయితే మనది బ్రాహ్మణుల దేశం అయ్యేది). అయితే ఈ మతానుకరణ కూడా బిస్కెట్లు, సబ్బులు, అగ్గిపెట్టెలు, నూనె వంటి సంతలో అమ్మే వస్తువుల్లానే వాళ్ళకు చాలా బాగుంది. హిందూ మతాంతీకరణలో భాగంగా గ్రామాల పేర్లను రెవెన్యూ రికార్డుల్లో మార్చివేశారు. ఫలితంగా చాలావాటికి రెండు పేర్లున్నాయి. ప్రజలపేర్లు, ప్రభుత్వ పేర్లు. ఉదాహరణకు ఇన్నార్ గ్రామం చిన్నారి అయింది. ఓటర్ల జాబితాలో ఆదివాసీ పేర్లను హిందూ పేర్లగా మార్చేశారు. (మస్సాకార్మకాస్తా మహేంద్ర కర్మ అయింది) హిందూ మతంలోకి చేరడానికి ముందుకు రాని వాళ్ళను కత్వాలుగా నిర్ధారించారు (అంటరాని వాళ్ళన్నమాట). తర్వాత వాళ్ళు సహజంగానే మావోయిస్టుల మనుషులయ్యారు.

పి.డబ్ల్యూ.జి తన కార్యకలాపాల్ని మొదట దక్షిణ బస్తర్, గడ్చిరోలిలో ప్రారంభించింది. ఆ తొలి రోజుల గురించి కామ్రేడ్ వేణు కొంచెం వివరంగా చెప్పాడు. గ్రామస్తులు ఎలా వాళ్ళను అనుమానంగా చూసేవారో, ఇళ్ళలోకి రానిచ్చేవారుకాదో, అదంతా. ఎవరూ వాళ్ళకు అన్నం నీళ్ళు ఇచ్చేవాళ్ళు కారు. వీళ్ళు దొంగలని పుకార్లు పుట్టించేవాళ్ళు పోలీసులు. దాంతో ఆడవాళ్ళు నగల్ని కట్టెలపొయ్యి బూడిదలో దాచుకునేవారు. విపరీతమైన నిర్బంధం ఉండేది. 1980 నవంబర్‌లో గడ్చిరోలిలో గ్రామసభపై పోలీసులు కాల్పులు జరిపి మొత్తం దళాన్నే చంపేశారు. అది డీ.కే.లో మొదటి'ఎన్‌కౌంటర్'. అదొక బాధాకరమైన వెనకడుగు. కామ్రేడ్స్ మళ్ళీ గోదావరినిదాటి వెనక్కి తిరిగి అదిలాబాద్ వెళ్ళిపోయారు. కాని 1981లో తిరిగొచ్చారు. ఆదివాసుల్ని ఏకం చేసి తునికాకు (బీడీలు చుట్టడానికి ఉపయోగించే ఆకులు) ధర పెంచాలని డిమాండ్ చేయించారు. అప్పుడు దళారీలు 50 ఆకులుండే ఒక కట్ట తునికాకుకు 3 పైసలు చెల్లించేవారు. వీటిని మానక్ బోరాలంటారు. ఒక మనక్ బొరాకు 1000 కట్టలుంటాయి.

(అయితే కాంట్రాక్టర్లు వాళ్ళు సేకరించాల్సిన దానికంటే ఎక్కువ సేకరించరనడానికి ఏ భరోసా లేదు) మార్కెట్‌లో కొచ్చేసరికి, తునికాకును కిలోల్లో అమ్ముతారు. ఈ జారుడు లెక్కల్ని, కొలతల్లో మతలబుల్ని, కట్టల్ని మానక్ బోరాలుగా, కిలోలుగా మార్చే ప్రక్రియను కాంట్రాక్టర్లు నియంత్రిస్తారు. ఈ క్రమంలో లాభాల లెక్కల్ని ఎంత దాకానైనా లాక్కుపోవచ్చు. సాధారణ అంచనా ప్రకారం ఒక బస్తాకు 1100 లాభమొస్తుంది. (బస్తాకు 120 రూపాయలు పార్టీకి కమిషన్ కట్టగా పోను). ఈ లెక్క ప్రకారమైనా ఒక చిన్న కాంట్రాక్టరుకు (1500 బస్తాలు).ఏడాదికి 16లక్షలు, పెద్దవాడికి(5000 బస్తాలు) 55లక్షలు లాభమొస్తుంది.

వాస్తవ అంచనాలు వేస్తే దీనికి అనేక రెట్లు కూడా ఉండొచ్చు. ఈ క్రమంలో "అంతర్గత భద్రతకు పెనుప్రమాదం" మాత్రం ఏడాది దాకా జీవిక కోసం సరిపడేంతనే తీసుకుంటుంది.

యువ పి.ఎల్.జి.ఏ. కామ్రేడ్స్‌లో ఒకరైన నీలేష్ రాక మాకు అంతరాయం కలిగించింది. అతను చెంప మీద కొట్టుకుంటూ వంట దగ్గరికి వడివడిగా నడుచుకుంటూ వస్తూంటే కొంతమంది నవ్వుతున్నారు. దగ్గరికొచ్చాక చూస్తే అతను ఆకులతో అల్లిన గూటి నిండా కోపోద్రిక్తంగా పారాడుతున్న ఎర్రచీమల్ని పట్టుకొస్తున్నాడు. అవి అతని చేతుల మీదుగా మెడవరకు పాకి బాగా కుట్టేస్తున్నాయి. నీలేష్ కూడా నవ్వుతున్నాడు. "మీరెప్పుడైనా చీమల చెట్నీ తిన్నారా?" కామ్రేడ్ వేణు అడిగాడు. నాకు ఎర్రచీమలు బాగా తెలుసు. కేరళలో ఉన్నప్పుడు నా చిన్నతనంలో వాటితో కుట్టించుకున్నా. కాని ఎప్పుడూ వాటిని తినలేదు (మొత్తానికి చెట్నీ చాలా బాగుంది. దండిగా ఫోలిక్ ఆమ్లం)

నీలేష్ సల్వాజుడుం కార్యాకలాపాలు చాలా తీవ్రంగా ఉన్న బీజాపూర్ నుండి వచ్చాడు. సల్వాజుడుం మూకలు లూటీలు, దహనాలు చేసుకుంటూ పోతుంటే నీలేష్ తమ్ముడు వాళ్ళలో చేరిపోయి తర్వాత యస్పీవో (స్పెషల్ పోలీస్ ఆఫీసర్) అయ్యాడు. అతను తల్లితోపాటు బాసగూడ శిబిరంలో ఉంటున్నాడు. తండ్రి అక్కడికెళ్ళడానికి నిరాకరించి ఊళ్ళోనే ఉండిపోయాడు. అది కుటుంబ కలహం అయింది.

తర్వాత ఒకసారి నాకతనితో మాట్లాడే అవకాశం దొరికినప్పుడు ఎందుకు మీ తమ్ముడలా చేశాడని నీలేషును అడిగా. "వాడు చిన్న కుర్రాడు. ఉరికెత్తుతూ, జనాన్ని కొడుతూ, ఇళ్ళను తగలబెడుతూ తిరిగే సందు దొరికింది. వాడు పిచ్చోడైపోయాడు. భయంకరమైన పనులు చేశాడు. ఇప్పుడు వాడు ఇరుక్కుపోయాడు. ఇంకెప్పటికీ ఊరికి తిరిగిరాలేడు. వాడినెప్పటికీ క్షమించరు. వాడికది తెలుసు".

మేం చరిత్ర పాఠానికి తిరిగొచ్చాం. "పార్టీ తర్వాతి పెద్ద ఉద్యమం బల్లార్‌పూర్ పేపర్ మిల్లుకు వ్యతిరేకంగా" కామ్రేడ్ వేణు చెప్పుకుంటూ పోయాడు. ప్రభుత్వం థాపర్లకు ఒకటిన్నర లక్షల టన్నుల వెదురు సేకరించే 45 సంవత్సరాల కాంట్రాక్ట్ భారీ సబ్సిడీతో ఇచ్చారు (బాక్సైట్‌తో పోలిస్తే చిన్నదే, అయినా సరే). 20 కర్రలున్న కట్టకుగాను గిరిజనులకు 10 పై సలిచ్చేవారు. (థాపర్లు చేసుకునే లాభంతో దాన్ని పోల్చి లెక్కలు వేసేంత పనికిమాలిన ఆలోచనలు చేయను). సుదీర్ఘ ఆందోళన, ఒక సమ్మె తర్వాత పేపరు మిల్లు యాజమాన్యంతో ప్రజల సమక్షంలో జరిపిన చర్చలు ధరని మూడురెట్లు, అంటే కట్టకు 30 పైసలకు పెంచాయి. గిరిజనుల వైపు నుండి ఇది పెద్ద విజయం. మిగతా రాజకీయపార్టీలు వీళ్ళకు ఎన్నో హామీలిచ్చాయిగాని వాటిని నిలబెట్టుకునే పనులు చేయలేదు. జనం పి.డబ్ల్యూ.జిని సంప్రదించడం మొదలుపెట్టారు.

అయితే తునికాకు, వెదురు ఇతర అటవీ ఉత్పత్తుల రాజకీయాలు

సీజన్లకే పరిమితం. కానీ దీర్ఘ కాలికంగా ప్రజల జీవితాలను ధ్వంసం చేస్తున్న అన్నింటికంటే పెద్ద సమస్య ఫారెస్ట్ డిపార్ట్‌మెంట్. రోజూ పొద్దునే ఫారెస్ట్ ఆఫీసర్లు, అతిచిన్న ఉద్యోగి దగ్గరి నుండి, గ్రామాల్లోకి పీడకలలా వచ్చి పడేవాళ్ళు. జనాన్ని వాళ్ళ పొలాలు దున్నుకోనివ్వకుండా, కట్టెలు కొట్టుకోనివ్వకుండా, ఆకులు తెంపనివ్వకుండా, పండ్లు ఏరనివ్వకుండా, పశువులను మేత మేయనివ్వకుండా అడ్డుకునేవారు. ఏనుగుల్ని తెచ్చి పొలాల్లో పరిగెత్తించి విత్తనాల్ని చెదరగొట్టి భూమిని నాశనం చేసేవారు. ప్రజల్ని కొట్టి, అరెస్టులు చేసి, అవమాన పరిచి, పంటలు పాడుచేసేవారు. అటవీ శాఖ దృష్టిలో వీళ్ళంతా చట్ట వ్యతిరేకులు, నేరస్తులు. డిపార్ట్‌మెంటు కేవలం చట్టాన్ని అమలుపరుస్తోంది. (వీళ్ళ రోజువారీ కడగండ్లకు, స్త్రీలపై లైంగిక దోపిడీ అదనంగా తోడవుతుంది.)

ఈ ఉద్యమాల్లో ప్రజల భాగస్వామ్యం ఇచ్చిన ఉత్సాహంతో, పార్టీ అటవీశాఖతో తలపడాలని నిర్ణయించింది. అటవీ భూమిని ఆక్రమించి, సాగు చేసుకొమ్మని ప్రజలకు పిలుపునిచ్చింది. ప్రతిగా ఫారెస్టు డిపార్ట్‌మెంట్ అటవీ ప్రాంతంలో పుట్టుకొచ్చిన కొత్త గ్రామాలను తగలబెట్టింది. 1986లో బీజాపూర్‌లో జాతీయ ఉద్యానవనాన్ని నిర్మిస్తామని, అంటే 60 గ్రామాలను అక్కడి నుండి లేపేస్తామని ప్రకటించింది. పార్టీ అందుబాటులోకి ప్రవేశించేసరికే సగానికి పైగా గ్రామాలను ఖాళీ చేయించి జాతీయ ఉద్యానవనానికి అవసరమైన మౌలిక సదుపాయాలను నిర్మించడం మొదలుపెట్టింది. పార్టీ వాళ్ళ నిర్మాణాలను ధ్వంసం చేసి, మిగతా గ్రామాల్ని ఖాళీ చేయించకుండా అడ్డుకుంది. కొన్ని సందర్భాల్లో ఆఫీసర్లను పట్టుకుపోయి చెట్లకు కట్టేసి కొట్టేవాళ్ళు గ్రామస్తులు. ఎన్నో తరాల దోపిడీకి అది ప్రతీకారం. దాంతో ఫారెస్టోళ్ళు పరారయ్యారు. 1986-2000లకు మధ్య పార్టీ 3లక్షల ఎకరాల అటవీ భూమిని పంచింది. ఇవాళ దండకారణ్యంలో భూమిలేని రైతులు అస్సలు లేరంటాడు కామ్రేడ్ వేణు.

ఇవ్వాళ్టితరం పిల్లలకు ఫారెస్ట్ డిపార్ట్‌మెంటు ఒక పురాతన జ్ఞాపకం. పూర్వకాలంలో వాళ్ళ జాతి ఎదుర్కొన్న అవమానాల గురించి, బానిసత్వం గురించి తల్లులు పిల్లలకు చెప్పే పురాణ కథల్లోని విషయం. పాత తరానికి ఫారెస్ట్ డిపార్ట్‌మెంట్ నుండి విముక్తంటే నిజమైన స్వాతంత్ర్యం. వాళ్ళు దాన్ని స్పర్శించగలరు, రుచించగలరు. వాళ్ళకు సంబంధించని భారత స్వాతంత్ర్యం కంటే.ఇది ఎంతో గొప్ప విషయం. అందుకే వాళ్ళతో కలిసి పోరాటం చేసిన పార్టీ వెంట వాళ్ళు నడవసాగారు.

ఆ ఏడు దళాల బృందం అక్కడి నుండి ఎంతోదూరం ప్రయాణం చేసింది. దాని ప్రభావం 60 వేల చదరపు కిలోమీటర్ల అడవి ప్రాంతానికి, వేల గ్రామాల్లోకి లక్షలాది జనానికి విస్తరించింది.

కాని ఫారెస్టోళ్ళ నిష్క్రమణ పోలీసుల ప్రవేశానికి దారి తీసింది. రక్తపాతాల పరంపర మొదలైంది. పోలీసుల బూటకపు ఎన్‌కౌంటర్లు, పీపుల్స్‌వార్ ఆంబుష్‌లు. భూపంపిణీతో పార్టీకి సాగునీరు, వ్యవసాయోత్పత్తికి సంబంధించిన అదనపు బాధ్యతలొచ్చాయి. జన సంఖ్య పెరిగే కొద్దీ అడవుల్ని నరికేసే సమస్యను తెచ్చిపెట్టింది. ప్రజావసరాలకు సంబంధించిన పనులను, మిలిటరీ పనులను విభజించాలని నిర్ణయించబడింది.

ఇవ్వాళ దండకారణ్యం విస్తృతమైన నిర్మాణం గల జనతన సర్కార్ల (ప్రజా ప్రభుత్వాలు) పరిపాలనలో ఉంది. చైనా విప్లవం, వియత్నాం యుద్ధం నుండి నిర్మాణ సూత్రాలను స్వీకరించారు. ఒక్కో జనతన సర్కార్‌ను కొన్ని గ్రామాల సముదాయం ఎన్నుకుంటుంది. దీని మొత్తం జనాభా 500 నుండి 5000వరకు ఉంటుంది. ఈ గ్రామాల సముదాయం ఆధ్వర్యంలో తొమ్మిది విభాగాలుంటాయి - కృషి (వ్యవసాయం) వ్యాపార్, ఉద్యోగ్ (వ్యాపారం,పరిశ్రమలు), ఆర్థిక్ (ఆర్థికం),న్యాయ్ (న్యాయం), రక్షా (రక్షణ) హాస్పిటల్ (ఆరోగ్యం), జన్ సంపర్క్ (పౌర సంబంధాలు), స్కూల్, రీతి రివాజ్(విద్య, సంస్కృతి), జంగల్ (అడవి). ఇలాంటి జనతన సర్కార్ల బృందం ఒక ఏరియా కమిటీ కిందికొస్తుంది. మూడు ఏరియా కమిటీలు కలిసి ఒక డివిజన్. దండకారణ్యంలో మొత్తం పది డివిజన్లున్నాయి.

"ఇప్పుడు మాకు అడవుల్ని రక్షించే డిపార్ట్‌మెంట్ ఉంది" అన్నాడు కామ్రేడ్ వేణు. "నక్సల్ ప్రాంతాల్లో అడవి పెరిగిందని చెప్పిన ప్రభుత్వ నివేదిక మీరు చదివుంటారు".

అయితే పార్టీ ఫారెస్ట్ డిపార్ట్‌మెంట్ మీద చేపట్టిన ఉద్యమం వల్ల మొట్టమొదట ముఖియాలు (గ్రామ పెద్దలు), ద్విజుల దళం లాభపడటం పెద్ద ఐరనీ అంటాడు కామ్రేడ్ వేణు. వాళ్ళ మందీ మార్బలం, వనరుల్ని ఉపయోగించుకొని ఎంతంటే అంత భూమిని ఆక్రమించుకున్నారు. ఇట్లా జరిగినంత కాలం చేసుకుంటూ పోయారు. అయితే ఆ తర్వాత ప్రజలు వారి 'అంతర్గత వైరుధాల'తో పార్టీని సంప్రదించసాగారు, అంటూ వాళ్ళ పరిభాషలో చెప్పాడు వేణు. పార్టీ ఇక ఆదివాసీ సమాజం లోపలి అసమానతలు, వర్గదోపిడి అన్యాయాల మీదికి దృష్టి మరల్చింది. ఇక్కడ వాళ్ళకేదో ఇబ్బందుందని పసి గట్టారు. పార్టీ ప్రభావం విస్తరించే కొద్దీ వాళ్ళది క్షీణించడం మొదలుపెట్టింది. రాను రాను ప్రజలు వాళ్ళ సమస్యల్ని ముఖియాల వద్దకుగాకుండా పార్టీ వద్దకు తీసుకురావడం ఎక్కువైంది. పాత దోపిడీ రూపాలు ప్రశ్నించబడ్డాయి. మామూలుగా తొలకరి చినుకులు పడ్డరోజు ప్రజలు వాళ్ళ సొంత భూమిని కాక ముఖియాల భూమిని దున్నడం సంప్రదాయంగా వస్తున్న ఆచారం. అది నిలిచిపోయింది. ఇక ఎంత మాత్రం వాళ్ళు మొదటి రోజుల శ్రమను భూ స్వాముల కివ్వడం లేదు. ఆ రోజుల్లో మహువ లేదా ఇంకేమైనా అడవి ఉత్పత్తుల్ని సేకరిస్తారు. ఏదో ఒక పని చెయ్యాలి మరి.

అప్పుడు ప్రవేశించాడు మహేంద్ర కర్మ. ఆ ప్రాంతంలోని అతి పెద్ద భూస్వాముల్లో ఒకడు.అప్పట్లో భారత కమ్యూనిస్టు పార్టీ (సి.పి.ఐ) సభ్యుడు. 1990లో కొంతమంది ముఖియాల్ని, భూస్వాముల్ని గుంపు చేసి జన్‌జాగరణ అభియాన్ (ప్రజల్ని మేల్కొలిపే కార్యక్రమం) మొదలు పెట్టాడు. వాళ్ళ మేల్కొలుపు ఎలా ఉండిందంటే మూడొందల మందితో ఒక వేటగాళ్ళ ముఠాను తయారుచేసి అడవిలోకి పంపితే వాళ్ళు జనాన్ని చంపుతూ, ఇళ్ళు తగలబెడుతూ, స్త్రీలపై అత్యాచారాలు చేస్తూ తిరిగేవాళ్ళు. అప్పటి మధ్యప్రదేశ్ ప్రభుత్వాలు (ఛత్తీస్‌ఘడ్ ఇంకా ఏర్పడలేదు) దానికి పోలీసుల దన్నునందించింది. అటువంటిదే మహారాష్ట్రలో ప్రజాస్వామిక ఫ్రంట్ ఒకటి తన దౌర్జన్యాల్ని మొదలుపెట్టింది. 'పీపుల్స్‌వార్' దీనికినిజమైన 'ప్రజాయుద్ధం' తరహా లోనే ప్రతిస్పందించి కొంతమంది అత్యంత దుర్మార్గులైన భూస్వాముల్ని చంపేసింది. కొన్ని నెలల్లోనే జన్‌జాగరణ్ అభియాన్ ('తెల్ల బీభత్సం' కామ్రేడ్ వేణు పరిభాషలో) తుడిచిపెట్టుకుపోయింది. 1998లో అప్పటికే కాంగ్రెస్ పార్టీలో చేరిపోయిన మహేంద్ర కర్మ జన్‌జాగరణ్ అభియాన్‌ను పునరుద్ధరించాలని ప్రయత్నించాడు. ఈ సారది ఇంకా తొందరగానే అంతమయింది.

తర్వాత 2005 వేసవిలో అతనికి అదృష్టం కలిసొచ్చింది. ఏప్రిల్ మాసంలో ఛత్తీస్‌ఘడ్ ప్రభుత్వం సమీకృత ఉక్కు కర్మాగారాల నిర్మాణానికి రెండు పరస్పర అంగీకార పత్రాలపై సంతకాలు చేసింది. (వాటి నిబంధనలు రహస్యం). ఒకటి 7000 కోట్లకు బైలదిలాలలో ఎస్సార్‌స్టీల్‌తో,ఇంకొకటి 10,000 కోట్లతో లోహండిగూడలో టాటాస్టీల్‌తో అదే నెలలో ప్రధాని మన్‌మోహన్‌సింగ్ "మావోయిస్టులు భారతదేశ అంతర్గత భద్రతకు పెనుప్రమాదమ"ని అతని సుప్రసిద్ధ ప్రకటన చేశాడు. (ఈ సమయంలో ఇది చెప్పడం చాలా ఎబ్బెట్టుగా ఉంది. ఎందుకంటే వాస్తవానికి దీన్ని తిరగేస్తే నిజమవుతుంది. ఆంధ్రప్రదేశ్‌లో కాంగ్రెస్ ప్రభుత్వాలు మావోయిస్టులపై వ్యూహాత్మకంగా పైచేయి సాధించి వాళ్ళను నిర్మూలించింది. 1600దాకా క్యాడర్‌ను కోల్పోయి వాళ్ళు దిక్కుతోచని స్థితిలో వున్నారు). ప్రధాని ప్రకటన

మైనింగ్ కంపెనీల షేర్లను అమాంతం ఆకాశానికెగరేసింది. అది మీడియాకు ఓ సిగ్నలిచ్చింది కూడా. మావోయిస్టులపై ఎవరైనా సరే తేలికగా మాట్లాడొచ్చని. 2005 జూన్‌లో మహేంద్ర కర్మ కుంట్రూ గ్రామంలో ముఖియాలతో రహస్య సమావేశం ఏర్పాటు చేసి సల్వాజుడుం (శుద్ధిచేసే వేట) ను ప్రకటించాడు. ఆదివాసీ ప్రాంతీయత, ద్విజనాజీ సెంటిమెంట్ల గొప్ప మేలు కలయిక!

జనజాగరణ అభియాన్‌లా కాకుండా సల్వాజుడుం నేలనంతా శుభ్రం చేసే ఆపరేషన్. అంటే జనాన్ని ఊర్లనుండి రోడ్డు వార శిబిరాల్లోకి తరిమేసి, అక్కడ వాళ్ళను నియంత్రణలో ఉంచడం. మిలిటరీ పరిభాషలో "స్ట్రాటజిక్ హామ్లెటింగ్" అంటారు. (సమస్యాత్మక జనాన్ని నియంత్రణలో ఉంచడంతో పాటు, క్యాంపుకు మానవ కవచాలుగా ఉపయోగించే వ్యూహం) 1950లో బ్రిటిష్ వాళ్ళు మలయా కమ్యూనిస్టులతో యుద్ధంలో ఉన్నప్పుడు సర్ హెరాల్డ్ బ్రిగ్స్ అనే జనరల్ ఈ వ్యూహాన్ని రూపొందించాడు. బ్రిగ్స్ యుక్తిని భారతసైన్యం నాగాల్యాండ్, మిజోరం, తెలంగాణాలలో చక్కగా ఉపయోగిస్తోంది. ఛత్తీస్‌ఘడ్ బి.జె.పి ముఖ్యమంత్రి రమణ్‌సింగ్ శిబిరాల్లోకి తరలడానికి నిరాకరించిన గ్రామస్తులను ఆయన ప్రభుత్వం మావోయిస్టులుగా జమగడుతుందని బహిరంగంగా ప్రకటించాడు. అందువల్ల బస్తర్‌లో ఇంట్లో ఉండటం, సాధారణ జీవితం గడపడం కూడా ఒక గ్రామస్తునికి తీవ్రవాద కార్యకలాపాల్లో పాల్గొనడంతో సమానం.

ప్రత్యేక ఆతిథ్యం నాకొక స్టీల్ మగ్గులో బ్లాక్‌టీ, దాంతోపాటు ఇయర్ ఫోన్స్ ఇచ్చి చిన్న యంపీత్రీ ప్లేయర్‌ను ఆన్ చేశారు. అది బీజాపూర్ యస్పీ డి.యస్. మన్వర్ గారు వైర్ లెస్‌లో ఒక జూనియర్ ఆఫీసర్‌తో మాట్లాడిన మాటల్ని గొరగొర శబ్దంతో చేసిన రికార్డు. ఆయన కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు జాగృతి (మేల్కొన్న) గ్రామాలకిచ్చే బహుమతులు, ప్రోత్సాహకాల గురించి చెప్పాడు. తదుపరి ఆయన లొంగిపోవడానికి నిరాకరించిన ఊర్లను తగలబెట్టాలని, నక్సలైట్ల వార్తలను సేకరించే జర్నలిస్టు కనపడగానే కాల్చేయాలని స్పష్టమైన ఆదేశాలిస్తున్నాడు. (దీని గురించి చాలాకాలం క్రితం, పేపర్లలో చదివాను) వార్త వెలువడగానే యస్పీని రాష్ట్ర మానవహక్కుల కమిషన్‌కు బదిలీ చేసి చర్య తీసుకున్నారు. (ఎవరి మీద చర్యో అర్థం కావడం లేదు)

సల్వాజుడుం కాల్చేసిన మొదటి గ్రామం అంబేలి (2005 జూన్ 18న). 2005 జూన్, డిసెంబర్ మధ్య అది దక్షిణ దంతెవాడలో వందలకొద్దీ గ్రామాలను లూటీ చేస్తూ, తగలబెడుతూ, హత్యలు, అత్యాచారాలు చేస్తూ తిరిగింది. దాని కార్యకలాపాలకు కేంద్రం బీజాపూర్, బైరాంగఢ్ జిల్లాలు. ఈ ప్రాంతాల సమీపంలో బైలదిలా వద్ద ఎస్సార్ స్టీల్స్ వారు కొత్త కర్మాగారాన్ని నిర్మించే ప్రతిపాదన చేశారు. ఇవి జనతన సర్కార్లు నీటిని నిల్వచేసే చిన్న చిన్న నిర్మాణాల పై ఎంతగానో కృషి చేసిన ప్రాంతాలు కావడం కాకతాళీయం కాదు. సల్వాజుడుం దాడులకు జనతన సర్కార్లు ప్రత్యేక లక్ష్యాలు. వందలకొద్దీ ప్రజలు అత్యంత అమానవీయ పద్ధతుల్లో చంపబడ్డారు. ఆరువేలమంది జనం, కొంతమంది స్వచ్ఛంధంగా, కొంతమంది భయంతో శిబిరాల్లోకి తరలారు. వీళ్ళలో మూడువేలమంది నెలకు 15 వేల రూపాయల జీతంతో స్పెషల్ పోలీస్ ఆఫీసర్లు (యస్పీవో) గా నియామకమయ్యారు. తుచ్ఛమైన ప్రతిఫలాల కోసం నీలేష్ తమ్ముడి లాంటి యువకులు తమకు తాము ముళ్ళ కంచెల్లోపల జీవిత ఖైదు విధించుకున్నారు.

మిగతా వందల వేలమంది ప్రజలు ప్రభుత్వ గాలానికి దూరంగా వెళ్ళారు. (కాని ఆ 644 గ్రామాల అభివృద్ధి నిధులు పోలేదు. ఆ చిన్న బంగారు గని ఏమవుతుంది?) మామూలుగా మిరపకాయల సీజన్‌లో కాంట్రాక్ట్ కూలీలుగా పనిచేయడానికి వెళ్ళే ఆంధ్రప్రదేశ్, ఒరిస్సా ప్రాంతాలకు చాలామంది వెళ్ళిపోయారు. కానీ కొన్ని పదుల వేలమంది అడవిలోకి పారిపోయి ఇప్పటికీ గూడు లేక పగలు మాత్రమే వాళ్ళ ఇళ్ళకి, పొలాలకు పోయి వస్తూ ఉంటారు.

సల్వాజుడుం వెంటనే కుప్పలు తెప్పలుగా పోలీసు స్టేషన్లు, క్యాంపులు ప్రత్యక్షమయ్యాయి. మావోయిస్టులు వాళ్ళ పూర్వపు సామ్రాజ్యంలోకి మళ్ళీ చొరబడకుండా బందోబస్తు ఏర్పాటుచేయడం దాని వెనుక ఉద్దేశ్యం. భారీ భద్రతా బలగాల మీద దాడులు చేసే సాహసం మావోయిస్టులు చెయ్యలేరని అంచనా. మావోయిస్టులు, వాళ్ళవైపు నుండి ఈ భద్రతా వలయాన్ని ఛేదించకపోతే పాతిక సంవత్సరాలుగా ఏ ప్రజలతోనైతే జీవించి పనిచేశారో, ఏ ప్రజల విశ్వాసాన్నైతే పొందగలిగారో ఆ ప్రజల్ని వదిలేసినట్లేనని అర్థం చేసుకున్నారు. కీలకమైన సెక్యూరిటీ మోహరింపులపైనే వరుస దాడులు చేసి ఎదురుదెబ్బ తీశారు.

2006 జనవరి 26న పి.ఎల్.జి.ఏ గంగలూర్ పోలీసు క్యాంపుపై దాడి చేసి ఏడుగురిని హతమార్చింది. 2006 జులై 17న ఎర్రబోరులో సల్వాజుడుం క్యాంపు వారి దాడికి గురైంది. 20 మంది చనిపోగా 150 మంది గాయపడ్డారు. (దీని గురించి మీరు చదివే ఉంటారు. "నక్సలైట్లు భయభ్రాంతులకు గురిచేస్తే గ్రామాలనుండి పారిపోయిన వారికి రాష్ట్ర ప్రభుత్వం ఆశ్రమం కల్పించడం కోసం ఏర్పరచిన పునరావాస శిబిరంపై మావోయిస్టులు దాడికి పాల్పడ్డారు) 2006 డిసెంబర్ 13న బాసగూడ 'పునరావాస' శిబిరంపై దాడి చేసి ముగ్గురు యస్పీవోలను ఒక కానిస్టేబుల్‌ను చంపారు. అన్నింటికంటే సాహసోపేతమైనది 2007 మార్చి 15నాటి దాడి.

నూట ఇరవైమంది పి.ఎల్.జి.ఏ గెరిల్లాలు రాణిబొదిలి కన్యాఆశ్రమాన్ని ముట్టడించారు. ఆ బాలికల ఆశ్రమం 80మంది ఛత్తీస్‌ఘడ్ పోలీసుల (యస్పీవోలు కూడా) బ్యారెక్‌గా మార్చివేయబడగా మానవ కవచాలుగా అమ్మాయిలు అక్కడే జీవిస్తున్నారు. పి.ఎల్.జి.ఏ ఆశ్రమఆవరణలోకి ప్రవేశించి అమ్మాయిలుంటున్న విభాగాన్ని కార్డన్ (మిలిటరీ పరిభాషలో బలగాల్ని అడ్డుగా నిలబెట్టి రక్షణనివ్వడం - అను) చేసి బ్యారెక్కులపై దాడి చేశారు. 55మంది పోలీసులు యస్పీవోలు మృతి చెందారు. ఒక్క అమ్మాయి కూడా గాయపడ లేదు. (నిర్మోహమాటస్తుడైన దంతెవాడ యస్పీ ఆ రోజు నాకు అతని పవర్ పాయింట్ ప్రజెంటేషన్ చూపించాడు. పేల్చివేయబడిన పాఠశాల భవన శిథిలాల మధ్య కాలిపోయిన, పేగులు బైటపడ్డ పోలీసుల మృతదేహాల భయం గొలిపే ఫోటోలు. అవెంత ఘోరంగా ఉన్నాయంటే దాన్ని పట్టించుకోకుండా ఉండటం సాధ్యం కాదు. నా ప్రతిస్పందనతో అతను తృప్తి చెందాడు)

రాణి బొదిలి మీద దాడి దేశమంతా ప్రకంపనలు సృష్టించింది. మానవహక్కుల సంఘాలు మావోయిస్టుల హింసనే కాదు, వాళ్ళు స్కూళ్ళపై దాడులు చేస్తూ విద్యకు వ్యతిరేకులైనందుకు కూడా ఖండించాయి. అయితే దండకారణ్యంలో రాణిబొదిలి దాడి ఒక ఇతిహాస గాథ అయింది. దాని మీద పాటలు, కవితలు, నాటికలు రాశారు.

మావోయిస్టుల ప్రతి దాడులు సెక్యూరిటీ కవచాన్ని ఛేదించి ప్రజలకు కాస్త ఊపిరి తీసుకునే వెసులుబాటునిచ్చాయి. పోలీసులు, సల్వాజుడుం వెనక్కి తగ్గి క్యాంపుల్లోనే ఉంటున్నారు. రాత్రివేళల్లో మాత్రమే 300 నుండి 1000మంది దాకా గుంపుగా గస్తీలు, తనిఖీల కోసమే క్యాంపుల నుండి గ్రామాలకొస్తున్నారు. క్రమంగా యస్పీవోలు వారి కుటుంబాలు తప్ప సల్వాజుడుం క్యాంపుల్లో ఉన్న మిగతా జనం వాళ్ళ గ్రామాలకు తిరిగొస్తున్నారు. మావోయిస్టులు వాళ్ళను స్వాగతించి, యస్పీవోలు కూడా నిజాయితీగా, బహిరంగంగా వాళ్ళ చర్యలపట్ల పశ్చాత్తాపం ప్రకటిస్తే తిరిగి రావొచ్చని ప్రకటించారు. యువకులు పి.ఎల్.జి.ఏలోకి గుమిగూడుతున్నారు. (పి.ఎల్.జి.ఏ 2000డిసెంబర్‌లో ఏర్పడింది. గత ముప్పై ఏళ్ళుగా సాయుధ దళాలు క్రమంగా సెక్షన్లుగా విస్తరించి, సెక్షన్లు ప్లటూన్లుగా వృద్ధి చెంది, ప్లటూన్లు కంపెనీలయ్యాయి. కాని సల్వాజుడుం అరాచకాలు మొదలయ్యాక పి.ఎల్.జి.ఏ చాలా త్వరగా బెటాలియన్ బలం చాటుతోంది).

సల్వాజుడుం కేవలం విఫలమవ్వడమే కాదు, తుపాకి కాల్చితే గుండు వెనక్కి దూసుకొచ్చినట్లైంది. అదేదో స్వల్పకాలంపాటు సాగిన ఒక ప్రాంతపు

కార్యక్రమం కాదని మనకు తెలుసు. పత్రికల్లో ఎంత బుకాయించినా, సల్వాజుడుం ఛత్తీస్‌ఘడ్ రాష్ట్ర ప్రభుత్వం, కేంద్రంలో అధికారంలో ఉన్న కాంగ్రెస్ పార్టీ కలిసి నడిపించిన సంయుక్త కార్యకలాపం. దానిని అంత సులువుగా విఫలం కానివ్వలేరు. యం.వో.యూలన్నీ ఇంకా ఎదురుచూస్తున్నాయి. మార్కెట్ మీద బోలెడంత మోహంతో. ఒక కొత్త ప్రణాళికతో ముందుకొచ్చి మళ్ళీ ప్రయత్నించాల్సిన తీవ్రమైన ఒత్తిడిలో ప్రభుత్వం ఉంది. ఈసారి ఆపరేషన్ గ్రీన్‌హంట్‌తో వచ్చారు. సల్వాజుడుం యస్పీవోలిప్పుడు కోయ కమెండోలుగా పిలవబడుతున్నారు. వీళ్ళకు తోడు ఛత్తీస్‌ఘడ్ సైనిక బలగాలు (సి.ఏ.యఫ్) కేంద్ర రిజర్వ్ పోలీసు బలగాలు (సి.ఆర్.పి.ఎఫ్), సరిహద్దు భద్రతా దళాలు (బి.యస్.యఫ్), భారత్ - టిబెట్ సరిహద్దు పోలీసులు (ఐ.టి.బి.పి), కేంద్ర పరిశ్రమల రక్షణ దళాలు (సి.ఐ.యస్.యఫ్), గ్రేహౌండ్స్, స్కార్పియన్లు, కేబ్రాలను రప్పించారు. ఇంకా మనుసుల్ని, ఆలోచనల్ని గెలుచుకునే వామ్ WHAM - విన్నింగ్ హార్ట్స్ అండ్‌మైండ్స్) అని ముద్దుపేరుగా పిలుచుకునే ఒక పాలసీ తెచ్చారు.

అనామక ప్రాంతాల్లోనే తరచుగా ముఖ్యమైన యుద్ధాలు జరుగుతుంటాయి. స్వేచ్ఛా వాణిజ్య పెట్టుబడి సోవియట్ కమ్యూనిజాన్ని ఆఫ్ఘనిస్తాన్ చవిటి పర్వతాలపై ఓడించింది. ఇక్కడ దంతెవాడ అడవుల్లో భారత్ ఆత్మకోసం సంగ్రామం జరుగుతోంది. భారతదేశ ప్రజాస్వామ్యంలో పెరిగిపోతున్న సంక్షోభం గురించి, బడా కార్పొరేట్ సంస్థలు, ప్రధాన రాజకీయ పక్షాలు, రక్షణ వ్యవస్థ కుట్రలో భాగస్వాములు కావటం చాలామంది చాలా చెప్పి ఉన్నారు. ఎవరికైనా రుజువు కావాలంటే మాత్రం వెళ్ళాల్సిన ప్రాంతం దంతెవాడ.

టాటాస్టీల్, ఎస్సార్‌స్టీల్ సల్వాజుడుంకు మొదటి పోషకులని ప్రభుత్వ వ్యవసాయ సంబంధాలు, అసంపూర్ణంగా మిగిలిపోయిన భూసంస్కరణ పై నివేదిక (మొదటిభాగం) చెబుతోంది. అది ప్రభుత్వ నివేదిక కాబట్టి పత్రికల్లో వచ్చినప్పుడు పెద్ద కలకలం రేగింది. (తదుపరి చివరి నివేదికలో ఈ విషయం కనపడలేదు. ఇది పొరపాటుగా జరిగిందా లేక ఎవరైనా వారి భుజంపై ముద్దుగా సుతిమెత్తని ఉక్కు తట్టింపులు పొందారా)

2009 అక్టోబర్ 12న లోహండిగూడలో టాటాస్టీల్ ప్లాంటు నిర్మాణానికి ప్రజాభిప్రాయ సేకరణ జరగాల్సి ఉండగా, దానికి కొన్ని మైళ్ళదూరంలో ఉన్న జగదల్‌పూర్ కలెక్టరేట్ చిన్న హాలులో భారీ బందోబస్తు నడుమ మొక్కుబడి సమావేశమొకటి జరిగింది. ప్రభుత్వ వాహనాల్లో సెక్యూరిటీ కాన్వాయ్ మధ్య ఓ యాభైమంది గిరిజనుల్ని శ్రోతలుగా కిరాయికి తీసుకొచ్చారు. మీటింగ్ అయినాక సహకరించిన 'లోహండిగూడ ప్రజలకు' కలెక్టర్ అభినందనలు తెలియజేశాడు. ఈ విషయం బాగా తెలిసినా కూడా ప్రాంతీయ వార్తా పత్రికలు అబద్ధాలను రిపోర్ట్ చేశాయి. (వాణిజ్య ప్రకటనలు కుప్పలుగా వచ్చాయి) గ్రామస్తుల అభ్యంతరాల మధ్య భూసేకరణ మొదలైంది.

నిజానికి భారత రాజ్యాంగాన్ని కూలదోయాలని చూసేది మావోయిస్టులొక్కరే కారు. అది అనేక సార్లు హిందూ మతవాదం చేత, ఆర్థిక నియంతృత్వం చేత కూలదోయబడింది.

దంతెవాడ నుండి ఐదుగంటల ప్రయాణ దూరంలో ఉండే లోహండిగూడ గతంలో ఎప్పుడూ నక్సలైట్ ప్రాంతంగా ఉండేది కాదు. కాని ఇప్పుడుంది. నేను చీమల పచ్చడి తింటుండగా నా పక్కనే కూర్చున్న కామ్రేడ్ జూరీ "నక్సలీ ఆవో, హమే బచావో" (నక్సలైట్లొచ్చి మమ్మల్ని రక్షించాలి) అని గ్రామాల్లోని ఇంటి గోడలపై రాతలు కనిపించడం మొదలైనాక మేమక్కడికి వెళ్ళాలని నిర్ణయించాం అన్నది. ఆమె ఆ ప్రాంతంలో పని చేస్తోంది.కొన్ని నెలలక్రితం గామ పంచాయితీ ప్రసిడెంటు విమల్‌మేశ్రామ్‌ను మార్కెట్ ప్రాంతంలో కాల్చి చంపారు. "అతను టాటాల మనిషి" అంటుంది జూరీ. "అతను భూములిచ్చేసి నష్టపరిహారం తీసుకొమ్మంటూ ప్రజల్ని బలవంతపెడుతున్నాడు. అతను అంతమై మంచి పనైంది. మేం కూడా ఓ కామ్రేడ్‌ని కోల్పోయాం. వాళ్ళతన్ని కాల్చారు. మీకింకా చపోలీ కావాలా?" ఆమెకు ఇరవై ఏళ్ళుండవు. "టాటాను మేమక్కడికి రానివ్వం. ప్రజలు వాళ్ళనొద్దంటున్నారు" . జూరీ పి.ఎల్.జీ.ఏ కాదు. ఆమె పార్టీ సాంస్కృతిక విభాగం చేతనా నాట్యమంచ్ (సి.యన్.యమ్)లో ఉంది. ఆమె పాటలు పాడుతుంది, రాస్తుంది. ఆమెది ఆబుజ్ మాడ్ (ఆమె కామ్రేడ్ మాధవ్‌ను పెళ్ళాడింది. సి. యన్.యమ్ బృందంతో అతను వాళ్ళ గ్రామాని కొచ్చినప్పుడు అతని పాటతో ప్రేమలో పడింది).

ఇక్కడ నేనో విషయం చెప్పాలనుకుంటున్నా. నిరర్థకమైన హింస గురించి, అంగీకార యోగ్యంకాని తక్షణ ప్రతీకారాల గురించి. కాని వాళ్ళకు నేనే సలహా ఇవ్వాలి? కోర్టుకు వెళ్ళమనా? న్యూఢిల్లీలోని జంతర్‌మంతర్‌లో ధర్నా చేయమనా? ఊరేగింపా? రిలే నిరాహారదీక్షా? చాలా ఎబ్బెట్టుగా ఉంటుంది. "ప్రత్యామ్నాయం లేదు" అని చాలా అలవోకగా మాట్లాడగలిగే నూతన ఆర్థిక విధానాల సమర్థకులనడగాలి... ప్రత్యామ్నాయ ప్రతిఘటనా పద్ధతిని సూచించమని. అదీ నిర్దిష్టమైనది. ఈనిర్దిష్టమైన అడవిలో, ఈ నిర్దిష్టమైన ప్రజలకోసం. ఇక్కడ. ఇప్పుడు. ఏ పార్టీకి వాళ్ళు ఓటు వేయాలి? ఈ దేశంలో ఏ ప్రజాస్వామిక వ్యవస్థను వాళ్ళు సంప్రదించాలి? నర్మద మీద భారీ ఆనకట్టకు వ్యతిరేకంగా ఏళ్ళ తరబడి జరిపిన పోరాటంలో నర్మద బచావో ఆందోళన తట్టని తలుపేదైనా ఉందా? .

చీకటి పడింది. క్యాంపులో చాలా హడావుడి ఉంది. కాని నేనేం చూడలేను. చుట్టూ కదలాడుతున్న వెలుతురు చుక్కల్ని తప్ప. అవి నక్షత్రాల, మిణుగురులా, నడుస్తున్న మావోయిస్టులా చెప్పటం కష్టం. ఎక్కడి నుండో ప్రత్యక్షమయ్యాడు చిన్నారి మంగ్తు. బాలకమ్యూనిస్టుల సంచార పాఠశాలలో చదవటం, రాయడంతోపాటు కమ్యూనిస్టు మౌలిక సూత్రాల్ని నేర్చుకుంటున్న మొదటి బ్యాచ్‌లోని పదిమంది పిల్లల్లో ఇతనొకడని నాకు తెలిసింది. ("చిన్న పిల్లల మెదళ్ళలోకి సిద్ధాంతాల్ని చొప్పిస్తున్నారని" మన కార్పొరేట్ మీడియా గగ్గోలు పెడుతుంది. టీవీలో వచ్చే వాణిజ్య ప్రకటనలు పిల్లల మెదళ్ళలోకి ఏం చొప్పిస్తోందో వాళ్ళెప్పటికీ ఆలోచించలేరు). బాల కమ్యూనిస్టులకు తుపాకులు పట్టుకోడానికిగాని, యూనిఫాం ధరించడానికిగాని అనుమతి లేదు. కాని వాళ్ళు పి.యల్.జీ.ఏ దళాల అడుగుల వెంట నడుస్తారు. రాక్ బ్యాండ్ బృందంలా, కళ్ళలో నక్షత్రాలతో.

మంగ్తు తన మృదువైన అధికారిక ప్రవర్తనతో నన్ను దత్తత తీసేసుకున్నాడు. అతను నా నీళ్ళ సీసాను నింపి, నన్ను బ్యాగ్ సర్దుకొమన్నాడు. విజిల్ శబ్దం. నీలిరంగు ఝల్లీ ఐదు నిమిషాల్లో విప్పి మడిచి వేయబడింది. ఇంకో విజిల్. నూరుగురు కామ్రేడ్స్ అంతా వరుసలో నిలబడ్డారు. ఐదు వరుసలు. కామ్రేడ్ రాజు మార్గదర్శకుడు. తర్వాత రోల్‌కాల్. నేనూ లైన్‌లో నిలబడి ఉన్నాను. నా ముందు నిల్చున్న కామ్రేడ్ కమల ప్రేరేపించగా నేనూ నా నెంబర్‌ను అరిచి చెప్పాను. (మేం ఇరవై వరకు లెక్కపెట్టి మళ్ళీ ఒకటి నుండి లెక్కపెడతాము. ఎందుకంటే గోండులు అంతవరకే లెక్కపెట్టగలరు. ఇరవై వాళ్ళకు సరిపోతాయి. బహుశా మాక్కూడా సరిపోవచ్చు). చందు ఇప్పుడు యూనిఫాంలో స్టెన్‌గన్ పట్టుకొని ఉన్నాడు. కామ్రేడ్ రాజు తగ్గు స్వరంతో బృందానికి సూచనలిస్తున్నాడు. అంతా గోండు భాషలో ఉంది. నాకొక్క ముక్క అర్థం కాలేదు. కాని ఆర్.వి అనే పదం మాత్రం చాలాసార్లు వినపడుతోంది. అతడు తర్వాత చెప్పాడు... ఆర్.వి. అంటే రేన్ డెవ్జజ్ (కలుసుకునే ప్రదేశం - అను) అని. అదిప్పుడు గోండు పదం అయింది. "ఒక వేళ కాల్పులు జరిగి మేం చెల్లాచెదరు కావల్సివస్తే మళ్ళీకలుసుకోడానికి ఆర్.వి. పాయింట్లు పెట్టుకుంటాం". ఇది నాలో ఎంతో బెదురు పుట్టిస్తుందో అతనికి అర్థం కాదు. నా భయం నేను కాల్చివేయబడతానని కాదు, తప్పిపోతానేమోనని. నా బెడ్‌రూం నుండి బాత్‌రూంకు కూడా దారి మర్చిపోయేంత డైరెక్షనల్ డిస్లెక్సియా (దారులను గ్రహించే శక్తి మెదడుకు తక్కువగా ఉండటం - అను) ఉంది నాకు. ఇక 60,000 చదరపు కిలోమీటర్ల

అడవిలో నేనేమైపోతాను. మిన్ను విరిగి మీద పడనీ, ఉప్పెనొచ్చి ముంచెత్తనీ కామ్రేడ్ రాజు పల్లూ (భుజం పై వేసుకునే గుడ్డ-అను) పట్టుకునే ఉంటాను.

మేం బయలుదేరేటప్పుడు కామ్రేడ్ వేణు నావద్దకొచ్చి "మంచిది కామ్రేడ్. నేను మీ వద్ద సెలవు తీసుకుంటాను" అన్నాడు. నేను తికమక పడ్డాను. ముగ్గురు మహిళలు, ముగ్గురు పురుషులు రక్షణగా అతన్ని చుట్టు ముట్టగా భారీ ఆయుధాలు, ఊలు టోపీ, చెప్పుల్లో అతను చిన్న ఈగలాగా ఉన్నాడు. "మీరింత శ్రమ తీసుకొని అంత దూరం నుండి ఇక్కడి కొచ్చినందుకు చాలా కృతజ్ఞతలు కామ్రేడ్ "అంటూ మరోసారి కరచాలనం, పిడికిలి బిగింపు, "లాల్‌సలామ్ కామ్రేడ్". రహస్యాలను దాచి ఉంచే రహస్యం - అడవిలోకి కనుమరుగయ్యాడు. ఒక్క క్షణంలో అతనిక్కడ ఎప్పుడూ లేనట్టుగానే అయిపోయింది. నేనేదో కోల్పోయిన మనిషినయ్యాను. కాని నాకింకా గంటలకొద్దీ వినే విషయాలున్నాయి. రోజులు వారాలయ్యాక నేనింకా చాలామందిని కలుస్తాను. వాళ్ళు అతను గీసిన రేఖా చిత్రానికి రంగులద్ది మెరుగులు దిద్దుతారు. మేం వ్యతిరేక దిశలో నడవడం మొదలుపెట్టాం. "నా మోకాళ్ళుపోయాయి. గుప్పెడు పెయిన్ కిల్లర్స్ వేసుకుంటేగాని నడవలేను" నవ్వుతూ అన్నాడు కామ్రేడ్ రాజు. అతని ఐటెక్స్ వాసన ఒక మైలు దాకా వస్తుంది.

కామ్రేడ్ రాజు చక్కటి హిందీ మాట్లాడతాడు. చాలా హాస్యభరితమైన కథల్ని ముఖంలో ఏభావాలూ పలకకుండా చెప్తాడతను. రాయ్‌పూర్‌లో పద్దెనిమిదేళ్ళ పాటు న్యాయవాదిగా పనిచేశాడు. అతను, అతని భార్య మాలతి పార్టీ సభ్యులుగా దాని సిటీ విభాగంలో ఉండేవారు. 2007 చివరిలో రాయ్‌పూర్ నెట్‌వర్క్‌లోని కీలకమైన సభ్యుల్లో ఒకరు అరెస్టయి, చిత్రహింసలకు గురై ఇన్ఫార్మర్‌గా మారాడు. అతన్ని పోలీసు వాహనంలో రాయ్‌పూర్ చుట్టూ తిప్పి అతని పూర్వసహచరులను గుర్తు పట్టించారు.

వాళ్ళలో కామ్రేడ్ మాలతి కూడా ఒకరు. 2008 జనవరి 22న ఆమెతో పాటు చాలామందిని అరెస్టు చేశారు. ఆమె మీద ముఖ్యమైన ఆరోపణ ఏమిటంటే సల్వాజుడుం అరాచకాల దృశ్యాలతో ఉన్న సీడీలను చాలామంది పార్లమెంటు సభ్యులకు మెయిల్‌లో పంపిందని. ఆమె కేసు ఎప్పుడోగాని విచారణకు రాదు. ఎందుకంటే అదెంత బలహీనమైన కేసో పోలీసులకు తెలుసు. కానీ కొత్తగా వచ్చిన ఛత్తీస్‌ఘడ్ స్పెషల్ పబ్లిక్ సెక్యూరిటీ ఆక్ట్ బెయిల్ లేకుండా ఆమెను ఎన్ని రోజులయినా జైళ్ళో వుంచగలదు, "పాపం, పార్లమెంట్ సభ్యులకు వాళ్ళ సొంత మెయిల్ నుండే రక్షించడానికి ప్రభుత్వం ఎన్నో బెటాలియన్ల ఛత్తీస్‌ఘడ్ పోలీసులను దింపింది అంటాడు కామ్రేడ్ రాజు. అప్పుడతను ఓ సమావేశం కోసం దండకారణ్యంలో ఉన్నాడు కాబట్టి దొరకలేదు. అప్పటినుండి ఇక్కడే ఉండిపోయాడు. స్కూల్‌కెళ్ళే అతని ఇద్దరు పిల్లలు ఇంట్లో ఒంటరిగా మిగిలితే పోలీసులు వాళ్ళను తీవ్రంగా ఇంటరాగేట్ చేశారు. చివరికి వాళ్ళ ఇంటిని ఖాళీచేసి పిల్లలు వాళ్ళ బంధువు ఒకరితో ఉండటానికి వెళ్ళారు.

కొన్ని వారాల క్రితమే కామ్రేడ్ రాజుకు వాళ్ళ గురించి మొదటిసారిగా సమాచారం తెలిసింది. అతనికెక్కడి నుండి ఇంత బలమొస్తుంది? ఆశయాల్ని అంటిపెట్టుకునే స్థైర్యం ఎక్కడినుండి వస్తుంది. ఎన్ని కష్టనష్టాలనైనా వోర్చుతూ సాగిపోయే వీళ్ళను ఏది నడిపిస్తుంది. వాళ్ళ విశ్వాసం, భవిష్యత్తు పట్ల నమ్మకం, పార్టీ పట్ల ప్రేమ. ఇది నాకు మళ్ళీ మళ్ళీ ఎదురైంది. అత్యంత గాఢంగా, వ్యక్తిగతంగా నాకు దగ్గరగా.

మేమిప్పుడు ఒకే వరుసలో నడుస్తున్నాం. నేను, నాతోపాటు ఓ వందమంది 'విచక్షణా రహిత హింసావాదులు', రక్తపిపాసులైన విప్లవకారులు'. వెళ్ళేముందు ఓసారి క్యాంపు వంక చూశాను. మంట ఉండిన చోట కొంత బూడిద తప్ప వందమంది విడిది చేసిన ఆనవాళ్ళేం లేవు. ఈ సైన్యం నాకు నమ్మశక్యంగా లేదు . వ్యయం చేసేటప్పుడు ఏ గాంధేయ వాది కన్నా ఎక్కువ నిరాడంబరంగా ఉంటారు. వాతావరణ మార్పుల గురించి బోధించే ఏ పర్యావరణ ప్రచారకుని కన్నా తక్కువ కార్బన్ పాదముద్ర (ఒక జీవి రోజువారీ కార్యకలాపాల్లో విడుదల చేసే కార్బన్ డై ఆక్సైడ్, మీథేన్ వంటి హరిత గృహ వాయువుల మొత్తం. ఈ కాలుష్య కారకాల వల్ల భూ ఉపరితలం వేడెక్కుతోంది - అను) కలిగి ఉంటారు. ఇప్పుడైతే విధ్వంసం సందర్భంలో కూడా గాంధేయ వాదం కనిపిస్తుంది. ఉదాహరణకు ఒక పోలీసు వాహనాన్ని తగలబెట్టేముందు దాన్ని పూర్తిగా విప్పేసి ఒక్కో విడి భాగాన్ని ఉపయోగంలోకి తెస్తారు. స్టీరింగ్ చక్రం నిటారుగా బర్మార్ గొట్టంగా మారుతుంది. రెక్సిన్ సీటు కవర్లు తొలగించబడి తూటాలు పెట్టుకునే చిన్న సంచుల్లా ఉపయోగంలోకి వస్తాయి. కారు బ్యాటరీలు సోలార్ యంత్రాలకు ఛార్జర్లవుతాయి. (కేంద్ర నాయకత్వం నుండి వచ్చిన ఉత్తర్వుల ప్రకారం చేజిక్కించుకున్న వాహనాలను పూడ్చిపెట్టాలేగాని కాల్చకూడదు. ఎందుకంటే అవసరమైనప్పుడు వాటిని పునరుత్థానం కావించవచ్చు.) నేనో నాటకం రాస్తే ఎలా ఉంటుంది - మహాత్మా ఆయుధం అందుకో ? నేర విచారణ లేకుండా చట్టం నాకు మరణదండన విధిస్తుంది.

మేము కారు నలుపు చీకట్లో, మృత్యు నిశ్శబ్దంలో నడుస్తున్నాము. నేనొక్కదాన్నే టార్చ్ ఉపయోగిస్తున్నాను. కిందికి సారించిన దాని వెలుతురు వృత్తంలో నల్లటి చెప్పుల్లో బిగుతుగా అదమబడిన కామ్రేడ్ కమల కాలి మడమలను చూడగలుగుతున్నా. అవి నా పాదాన్ని కచ్చితంగా ఎక్కడ మోపాల్నో చూపుతున్నాయి. ఆమె నాకంటే పది రెట్లు ఎక్కువ బరువును మోసుకొస్తోంది. ఆమె వీపుకు ఓ సంచి, ఒకరైఫిల్, నెత్తిమీద సామగ్రితో ఉన్న ఓ పెద్ద సంచి, ఓ పెద్ద వంట పాత్ర, రెండు భుజాలకు వేలాడే సంచుల నిండా కూరగాయలు. ఆమె తల మీది సంచి ఏ మాత్రం ఒరగకుండా స్థిరంగా ఉంది. దాన్ని పెద్దగా ముట్టుకోకుండానే ఏటవాలు ఉపరితాలాల్నీ, జారుడు బండల దారుల్నీ ఆమె దాటేయగలదు. ఆమె ఓ అద్భుతం. ఇదో సుదీర్ఘ నడకలాగున్నట్టుంది. ఆ చరిత్ర పాఠానికి నేను కృతజ్ఞురాలిగా ఉండాలి. ఎందుకంటే అన్నిటినీ మించి అది నాకాళ్ళకు ఒక రోజు మొత్తం విశ్రాంతి నిచ్చింది.

ఇది అత్యంత మనోహరంగా ఉంది. రాత్రివేళలో అడవిలో నడవడం. ఇంకా రాత్రి తర్వాత రాత్రి నేనిది చేయబోతూ ఉన్నాను.

కోయలు బ్రిటీష్ వారిపై తిరుగుబాటుచేసిన 1910 నాటి భూంకాల్ ఉద్యమ శతవార్షికోత్సవానికి మేము వెళ్తున్నాం. భూంకాల్ అంటే భూకంపం. కామ్రేడ్ రాజు అంటాడు, ఈ వేడుక కోసం ప్రజలు రోజుల తరబడి నడిచివస్తారని. బహుశా అడవి ఇలా నడిచే జనంతో నిండి ఉంటుంది. అన్ని డీ.కే డివిజన్లలో వేడుకలు జరుగుతున్నాయి. వేడుకల మాస్టర్ కామ్రేడ్ లెంగ్ మాతో నడుస్తూ ఉండటం మాకెంతో గొప్పగా ఉంది. గోండీలో లెంగ్ అంటే 'ధ్వని'.

పొడవుగా, నడివయస్కుడిలా కనిపిస్తున్న కామ్రేడ్ లెంగ్ ఆంధ్రప్రదేశ్ నుండి వచ్చాడు. 72లో విప్లవ సాంస్కృతిక సంస్థ జన నాట్యమండలి (జె.ఎన్.యం)ని స్థాపించిన గొప్ప ప్రజాగాయకుడు, కవి గద్దర్ సహచరుడు. జె.ఎన్.యం తర్వాత పి.డబ్ల్యూ.జిలో అధికారికంగా భాగమైంది. ఆంధ్రప్రదేశ్‌లో అది పదుల వేల సంఖ్యలో శ్రోతల్ని ఆకట్టుకోగలిగింది.

కామ్రేడ్ లెంగ్ 1977లో అందులో చేరి అతని స్వయం కృషితో మంచి గాయకుడిగా పేరు తెచ్చుకున్నాడు. ఆంధ్రప్రదేశ్‌లో భయంకరమైన నిర్బంధ కాలంలో, దాదాపు ప్రతిరోజూ మిత్రులు ఎన్‌కౌంటర్ హత్యల్లో మరణిస్తున్న కాలంలో అతనున్నాడు. అతన్ని కూడా ఓ రోజు ఆసుపత్రి పడకమీద నుండి డాక్టరు మారువేషంలో ఉన్న మహిళా యస్పీ అపహరించింది. ఎన్‌కౌంటర్ చేయడానికి అతన్ని వరంగల్ శివారు అడవిలోకి తీసుకెళ్ళారు. అదృష్టవశాత్తూ గద్దర్‌కి సమాచారం అంది ప్రమాద గంట మోగించగలిగాడు అంటాడు కామ్రేడ్ లెంగ్. 1998లో పి.డబ్ల్యూ.జి. డీ.కేలో సాంస్కృతిక సంస్థను ప్రారంభించాలని

నిర్ణయించాక కామ్రేడ్ లెంగ్‌ను చేతనా నాట్యమంచ్‌కు బాధ్యునిగా పంపించారు. ఇప్పుడు, ఇక్కడ నాతో ఆలివ్ గ్రీన్ చొక్కా, ఏదో కారణం చేత ఎరుపురంగు పైజామా దానిమీద లేత ఎరుపు రంగు బినియను ధరించి నాతో పాటు నడుచుకుంటూ వస్తున్నాడు. "ఇప్పుడు సి.ఎన్.యం.లో 10,000మంది సభ్యులున్నారు" అన్నాడు. మాకు హిందీ, గొండీ, ఛత్తీస్‌ఘడీ, హాల్బీ భాషల్లో 500 పాటలున్నాయి. 140 పాటలతో ఒక పుస్తకాన్ని ప్రచురించాం. అందరూ పాటలు రాస్తారు".

మొదటిసారి నేనతనితో మాట్లాడినప్పుడు అతను చాలా గంభీరంగా ఒకే దానికి అంకితమైపోయిన మనిషిలా ధ్వనించాడు. కాని తర్వాత మంట చుట్టూ కూర్చునప్పుడు అదే పైజామాలో ఎప్పుడూ నక్సలైట్ పాత్రను పోషించే చాలా ప్రసిద్ధి చెందిన ఓ తెలుగు సినిమా దర్శకుడి (అతని మిత్రుడు కూడా) గురించి చెప్పాడు. "నేనతన్ని ఏమడిగానంటే" కామ్రేడ్ లెంగ్ అతని ముచ్చటైన తెలుగు యాసలో హిందీలో చెప్పాడు "ఎందుకు మీరు నక్సలైట్లెప్పుడూ ఇలా ఉంటారని అనుకుంటారు" అంటూ అతన్ని తమాషాగా అనుకరించాడు. నక్కుతూ, పెద్ద పెద్ద అంగలు వేస్తూ, వెంటాడబడుతున్న మనిషిలాగా ఏకే 47 తో అడివి నుండి ఒక్క ఉదుటున బైటికొచ్చేలా తమాషాగా అతన్ని అనుకరించి మమ్మల్నందరినీ విరగబడి నవ్వేలా చేశాడు.

ఒక వేళ నేను భూంకాల్ ఉత్సవాలకు వెళ్తున్నానేమో సరిగ్గా చెప్పలేను. మావోయిస్టు ప్రచారాలతో దట్టించబడ్డ సంప్రదాయ ఆదివాసీ నృత్యాలను, జనాన్ని ఉద్రేక పరిచేలా చేసే అలంకార పూరిత ఉపన్యాసాలను, వాటిని తదేక దృష్టితో వింటున్న విధేయులైన శ్రోతల్ని చూడాల్సి వస్తుందేమోనని నా భయం. సాయంకాలం చాలా ఆలస్యంగా మేమూ మైదానానికొచ్చాము. అక్కడ వెదురు మంచెను ఎర్రటి వస్త్రంతో చుట్టి ఒక తాత్కాలిక స్థూపాన్ని నిలబెట్టారు. దాని పైన మావోయిస్టు పార్టీ సుత్తీ కొడవలి, అంతకంటే, పైన వెండి కాయితంలో చుట్టబడిన జనతన సర్కార్ విల్లు, బాణం. ప్రాధాన్యతా క్రమం సరిగ్గా ఉంది. విశాలమైన వేదిక. అది కూడా తాత్కాలిక నిర్మాణమే. బలిష్టమైన కర్రలతో వాటి చుట్టూమందంగా బంకమట్టి పూతతో ఉంది. అక్కడక్కడా చెల్లాచెదురుగా మంటలు. అప్పటికే వచ్చేసిన జనం రాత్రి భోజనలు వండుకుంటున్నారు. చీకట్లో నీడలు మాత్రమే కనిపిస్తున్నాయి. మేంవారిని దాటుకుంటూ (లాల్‌సలామ్, లాల్‌సలామ్, లాల్‌సలామ్) మళ్ళీ అడవిలోకి ప్రవేశించేదాక 15 నిమిషాలపాటు నడిచాం.

మా కొత్త క్యాంపు స్థలంలో మళ్ళీ మేం వరుసలో నిలబడ్డాం. ఇంకోసారి రోల్‌కాల్. సెంట్రీ స్థానాల గురించి, కాల్పుల సమయంలో అర్ధచంద్రాకృతిలోని స్థానాల గురించి ఆదేశాలు. దాడి జరిగితే ఎవరు ఏ ప్రాంతాన్ని చూసుకోవాలో నిర్ణయాలు. మళ్ళీ ఆర్.వి.పాయింట్లు.

మాకంటే ముందే ఒక బృందం వచ్చి అప్పటికే వంట చేసేశారు. ఫలహారం కోసం కమల నాకు అడవి జామ పండును తెచ్చింది. నడుస్తూ నడుస్తూ దాన్ని తెంపి నా కోసం దాచి ఉంచింది.

సూర్యోదయానికంతా ఇంకా ఇంకా ఎక్కువమంది ఆ రోజు వేడుక కోసం జమైతున్నారని తెలుస్తోంది. అక్కడ మెల్లగా సందడి మొదలైంది. ఎంతోకాలం నుండి ఒకరినొకరు చూసుకోలేని వారు అక్కడ కలుసుకుంటున్నారు. మైకులు సరిచూసుకునే శబ్దం వినిపిస్తోంది. జెండాలు, తోరణాలు, బ్యానర్లు, పోస్టర్లు సిద్ధమవుతున్నాయి. మేమొచ్చిన రోజు ఆగ్నార్‌లో చంపివేయబడిన ఐదుగురి పోటోలతో ఒక పోస్టర్.

నేను కామ్రేడ్ నర్మద, కామ్రేడ్ మాసే, కామ్రేడ్ రూపీలతో కలిసి టీ తాగుతున్నా. కామ్రేడ్ నర్మద క్రాంతికారీ ఆదివాసీ మహిళా సంఘటన డి.కే విభాగానికి నాయకురాలు కాకముందు గడ్చిరోలిలో చాలా ఏళ్ళపాటు పట్టణ కార్యకర్తగా పనిచేసిన రోజుల గురించి చెబుతోంది. రూపీ, మాసేలు మాసీ ఆంధ్రప్రదేశ్‌లో పట్టణ ప్రాంతాల్లో పనిచేసారు. చాలా సంవత్సరాల పాటు మహిళలు చేసిన పోరాటం గురించి - అది వాళ్ళ హక్కుల కోసమే కాదు, రేపటి న్యాయమైన సమాజపు స్వప్నంలో స్త్రీ పురుష సమానత్వం కేంద్రంగా ఉండేలా పార్టీని తయారుచేయడానికని చెప్తున్నారు. మేం 70ల నాటి సంగతులు మాట్లాడుకున్నాం. నక్సలైట్ ఉద్యమంలోపల తామే గొప్ప విప్లవకారులం అనుకుంటూ అదే పాత పితృస్వామిక భావజాలంతో తప్పటడుగులు వేస్తూ, అదే పురుషాహంకారంతో ఉన్న మొగ కామ్రేడ్స్‌ను చూసి స్త్రీలు అప్పటిదాకా ఉన్న భ్రమలు తొలగించుకున్నారు. అప్పటికీ ఇప్పటికీ పరిస్థితులు చాలా మారాయని మాసే అంటుంది. అయినా వాళ్ళకింకా చేరవలసిన దూరాలున్నాయి. (ఇప్పటికీ కేంద్రకమిటీలో, పొలిట్ బ్యూరోలో మహిళలు లేరు)

మధ్యాహ్నానికంతా ఇంకో పి.ఎల్.జి.ఏ బృందం వచ్చేసింది. పొడవుగా, బక్కపలుచగా పిల్లవాడిలా కనిపించే యువకుడు దీనికి నాయకత్వం వహిస్తున్నాడు. ఈ కామ్రేడ్‌కి సుఖ్‌దేవ్, గుడ్సా ఉసేంది అనే రెండు పేర్లున్నాయి. రెండిట్లో ఏదీ అతని సొంత పేరు కాదు. సుఖ్‌దేవ్ చాలా ప్రియమైన, అమరుడైన ఒక కామ్రేడ్ పేరు. (ఈయుద్ధంలో చనిపోయిన వాళ్ళు మాత్రమే వాళ్ళ స్వంతపేర్లను సురక్షితంగా వాడగలరు). గుడ్సా ఉసేందీ విషయానికొస్తే చాలా మంది కామ్రేడ్స్ ఏదో ఒక చోట గుడ్స్‌ఉసేందీ అయి ఉంటారు. (కొన్ని నెలల క్రితం అది కామ్రేడ్ రాజు). గుడ్సా ఉసేంది దండకారణ్యా పార్టీ అధికార ప్రతినిధి పేరు. నా మిగతా పర్యటన సమయంలో సుఖ్‌దేవ్ నాతో గడపబోతున్నా మళ్ళీ అతన్ని ఎలా కనుక్కుంటానో నాకు తెలీదు. అతని నవ్వును ఎక్కడున్నా గుర్తుపట్టగలరు. అతను డీకేలోకి 1988లో వచ్చానని చెప్పాడు. ఉత్తర తెలంగాణ నుండి మూడోవంతు బలగాల్ని డీకేకి పంపాలని పి.డబ్ల్యూ.జి నిర్ణయించినప్పుడు అతనిక్కడికొచ్చాడు. అతను సివిల్లో (సాధారణ దుస్తులను సివిల్ అంటారు. అదిప్పుడు గోండు పదమైపోయింది) ముచ్చటగా ఉన్నాడు. మావోయిస్టు యూనిఫాంకు భిన్నంగా సివిల్ దుస్తుల్లో చక్కని ఓ యువ అధికారిలాగా వెళ్ళిపోగలడు. యూనిఫాం ఎందుకు లేదు అని అతన్నడిగాను.

తాను ప్రయాణంలో ఉన్నానంటూ ఇప్పుడే కాంకేర్ దగ్గర కేశ్‌కాల్ పర్వతాల వద్ద నుండి వచ్చానని చెప్పాడు. అక్కడ 30 లక్షల టన్నులు బాక్సైట్ నిక్షేపాలున్నట్లు తెలిసింది. వేదాంత అనే కంపెనీ దాని మీద కన్నేసింది.

హుర్రే! నా అంచనాకు పదికి పది మార్కులు.

అక్కడ ప్రజలనాడి ఎలా ఉందో కనుక్కోవాలని వెళ్ళాడట సుఖ్‌దేవ్. వాళ్ళేమైనా పోరాటానికి సిద్ధపడతారా చూద్దామని. "వాళ్ళకిప్పుడే దళాలు కావాలట. తుపాకులు కూడా". అతను తల వెనక్కి విసిరి పగలబడి నవ్వాడు. "అదంత సులభం కాదు భాయ్ అని నేను వాళ్ళకు చెప్పాను" అతని సంభాషణలో కొన్ని మాటల్ని బట్టి, ఏకే 47ని చాలా అలవోకగా పట్టుకునే విధానం బట్టి అతనిది పైస్థాయి అని పి.ఎల్.జీ.ఏలో క్రియాశీలక పాత్ర అని చెప్పగలను.

జంగిల్ పోస్ట్ వచ్చేసింది. నాకోసం ఒక బిస్కెట్ ఉంది! అది కామ్రేడ్ వేణు నుండి. మడతమీద మడత పెట్టిన చిన్న కాగితం ముక్కలో అతను నాకు పంపుతానని మాటిచ్చిన పాటను రాసి పంపాడు. దాన్ని చదువుతూ కామ్రేడ్ నర్మద చిన్నగా నవ్వింది. దాని కథ ఆమెకు తెలుసు. అది 1980ల నాటిది. ప్రజలు పార్టీని మొదటిసారిగా విశ్వసించిన కాలంనాటిది. మొదట వచ్చే వాళ్ళలో మహిళలు ఉండేవారు. ఓ సాయంకాలం మంట పక్కన కూర్చున్న ఒక ముసలావిడ లేచి నిల్చోని దాదాలనుద్దేశించి ఒక పాట పాడింది. ఆమె ఒక మాదియా. మహిళలు పెళ్ళయిన తర్వాత రవికలు తీసేసి ఛాతీని నగ్నంగా ఉంచడం వాళ్ళ తెగలో ఆచారం.

జాంపర్ పోలో ఇంతోర్ దాదా, దాకేనీలే
తానే లేసాం ఇంతోర్ దాదా, దాకేనీలే

బాటా పాపం కిట్టొం దాదా, దాకేనీలే
దునియా కదిలే మాత దాదా, దాకేనీలే

మా రవికలు ఉంచుకోవద్దని వాళ్ళంటారు దాదా, దాకేనీలే
మా చేత దాన్ని విప్పించేస్తారు, దాదా,
మేమేం పాపం చేశాం, దాదా
ప్రపంచం మారిపోయింది కాదా, దాదా

అతుం హట్టేకే దాదా, దాకేనీలే
ఆదానంగా దాంతోం దాదా, దాకేనీలే
బాటా పాపం కిట్టోం దాదా, దాకోనీలే
దునియా కదిలే మాటా దాదా, దాకోనీలే
మేం సంతకు పోవాలంటే దాదా
అర్థనగ్నంగా పోవాలి దాదా
మాకీ బతుకొద్దు దాదా
చెప్పండిది మా పెద్దలకు దాదా

పార్టీ చేపట్టాలనుకున్న మొదటి మహిళా సమస్య ఇదే. దాన్ని చాలా సున్నితంగా శస్త్రచికిత్స పరికరాల్ని ఉపయోగించి వ్యవహరించాల్సి ఉండింది. 1986లో ఆ పార్టీ ఆదివాసీ మహిళా సంఘటన (ఏ.ఎం.యస్)ను ఏర్పాటు చేసింది. అదే క్రాంతి కారీ ఆధివాసీ మహిళా సంఘటనగా రూపుదాల్చింది (కే.ఏ.ఎం.యస్). ఇప్పుడు దానికి 90,000 మంది సభ్యత్వం ఉంది. అది దేశంలోనే అతి పెద్ద మహిళా సంఘం కూడా అవుతుంది. (అన్నట్టు వీళ్ళంతా మావోయిస్టులే మొత్తం 90,000 మంది వీళ్ళందరినీ తుడిచిపెట్టేస్తారా? మరి 10,000 మంది సి.ఎన్.యం సభ్యులు? వాళ్ళను కూడానా?) ఆదివాసీ సంప్రదాయాలైన బలవంతపు పెళ్ళిళ్ళు, ఎత్తుకెళ్ళి పోవడాలకు వ్యతిరేకంగా కే.ఏ.ఎం.యస్ ప్రచారం చేస్తుంది. బహిస్టు అయిన మహిళలను గ్రామాల బైట ఉంచే పద్ధతికి వ్యతిరేకంగా, రెండు పెళ్ళిళ్ళకు, గృహహింసకు వ్యతిరేకంగా కూడా. అది అన్ని పోరాటాలనూ గెలవలేదు. అయితే ఏ స్త్రీ వాదులు మాత్రం గెలిచారు? ఉదాహరణకు దండకారణ్యంలో ఇప్పటికీ మహిళలను విత్తనాలు చల్లనివ్వరు. పార్టీ మీటింగుల్లో ఇది మంచిది కాదని, దీన్ని మార్చేయాలని మగవాళ్ళు ఒప్పుకుంటారు. కాని ఆచరణలో దాన్ని జరగనివ్వరు. కాబట్టి జనతన సర్కార్‌కు సంబంధించిన ఉమ్మడి భూముల్లో మహిళలు విత్తనాలు చల్లాలని పార్టీ నిర్ణయించింది. ఆ భూముల్లో స్త్రీలు విత్తనాలు చల్లుతారు, కూరగాయలు పండిస్తారు. చెక్‌డ్యాములు కట్టుకుంటారు. పూర్తిగా కాకపోయినా సగం విజయం.

బస్తర్‌లో పోలీసు నిర్బంధం పెరిగేకొద్దీ కే.ఏ.యం.ఎస్ మహిళలే వందల సంఖ్యలో, ఒక్కోసారి వేల సంఖ్యలో పోలీసులకు భౌతికంగా ఎదురు నిలిచి వాళ్ళతో ముఖాముఖి తలపడే స్ఫూర్తిదాయకమైన ప్రతిఘటనా శక్తి అయ్యారు. కే.ఏ.యం.ఎస్ ఉన్న ప్రాంతాల్లో విప్లవాత్మక మార్పులు జరిగి మహిళలను సంప్రదాయ వివక్ష రూపాలనుండి విముక్తి చేసిందనడం వాస్తవం. చాలామంది యువతులకు పార్టీలో, మరీ ముఖ్యంగా పి.ఎల్.జీ.ఏలో చేరడమంటే ఊపిరి తీసుకోనివ్వని వాళ్ళ సమాజ బంధనాలనుండి తప్పించుకునే ఒక మార్గం. కే.ఏ.ఎం.యస్ సీనియర్ కార్యనిర్వాహక సభ్యురాలు కామ్రేడ్ సుశీల కే.ఏ.ఎం.యస్ మహిళల మీద సల్వాజుడుం వెళ్ళగక్క విద్వేషం గురించి చెప్పింది. హమ్ దోబీబీ లాయేంగే! లాయేంగే! (మేం ఇద్దరు భార్యల్ని తెచ్చుకుంటాం! తెచ్చుకుంటాం) అనేది వాళ్ళ నినాదాల్లో ఒకటట. లెక్కలేనన్ని అత్యాచారాలతో పాటు అంగఛేదనాలు (రొమ్ములు నరికేయడం) లాంటి అమానుష హింసా పద్ధతుల్ని కే.ఏ.ఎం.యస్ సభ్యులపై గురిపెడుతున్నారు. ఈ క్రూరత్వానికి సాక్షులైన ఎంతోమంది యువతులు తర్వాత పి.ఎల్.జీ.ఏలో చేరిపోయారు. ఇప్పుడు దాని మొత్తం సభ్యుల్లో మహిళలు 45 శాతం అయ్యారు. కామ్రేడ్ నర్మద వాళ్ళలో కొంతమంది కోసం కబురు పెట్టింది. కాసేపట్లో వాళ్ళు మాతో కలిశారు.

కామ్రేడ్ రింకీకి చాలా కురచజుట్టు ఉంది. జుట్టు పొట్టిగా కత్తిరించుకోవడం అంటే ఆమె చాలా సాహసం చేసినట్లు అన్నారు వాళ్ళు గోండీలో.ఎందుకంటే ఇక్కడ జుట్టు కత్తిరించుకోవడం(బాబ్‌కట్) అంటే మావోయిస్టని. వెంటనే మరణశాసనం రాయడానికి పోలీసులకు ఇది బాగా సరిపోయే సాక్ష్యం. కామ్రేడ్ రింకీ ఊరు కోర్మా. 2005లో నాగా బెటాలియన్, సల్వాజుడుల దాడికి గురైంది. అప్పుడు రింకీ గ్రామస్థాయి మిలీషియాలో భాగం. ఆమె స్నేహితురాళ్ళు లుక్కీ, సుక్కీ కూడా అలానే కే.ఏ.ఎం.యస్ సభ్యులు. ఊరిని తగలబెట్టేశాక నాగా బెటాలియన్ లక్కీ, సుక్కీలను, ఇంకో అమ్మాయిని పట్టుకుని సామూహికంగా అత్యాచారం చేసి చంపేశారు."వాళ్ళను గడ్డిమీద రేప్ చేశారు. అది అయిపోయాక అక్కడ గడ్డి మిగలలేదు" అంది రింకీ. నాగా బెటాలియన్ పోయి ఏళ్ళైంది. కాని పోలీసులు ఇంకా వస్తూ ఉంటారు. "వాళ్ళకెప్పుడు ఆడవాళ్ళు, కోళ్ళు కావాలన్నా వస్తారు".

అజితాకు కూడా కురచ జుట్టే. జుడుం వాళ్ళఊరు కోర్సేల్‌లోకొచ్చి ముగ్గురిని నల్లాలో ముంచేసి చంపింది. అప్పుడు అజితా మిలీషియాలోఉంది. కొంతదూరం నుండి జుడుంను పారల్‌నార్ టోదక్ అనే ఊరు సమీపించేదాకా వెంబడించింది. అక్కడ వాళ్ళు ఆరుగురు మహిళల్ని రేప్ చేస్తుండగా చూసి వాళ్ళలో ఒకడిని గొంతులో కాల్చింది.

కామ్రేడ్ లక్ష్మి పొడవాటి జడతో ఉన్న చాలా అందమైన అమ్మాయి. వాళ్ళ ఊరు జోజార్‌లో జుడుం ముప్పై ఇళ్ళను తగలబెడుతుండగా చూశానని చెప్పింది. "అప్పుడు మా దగ్గర ఆయుధాలు లేవు" అంది. "చూస్తూ ఉండటం తప్ప మేమేం చెయ్యలేకపోయాం". తర్వాత త్వరలోనే ఆమె పి.ఎల్.జి.ఏలో చేరిపోయింది. 2008లో అడవి గుండా మూడున్నర నెలలపాటు నడుచుకుంటూ వెళ్ళి ఒరిస్సా నయాగడ్‌లోని ఒక పోలీసు ఆయుధాగారంపై దాడి చేసి 1,200 తుపాకుల్ని 200,000 రౌండ్ల మందుగుండును స్వాధీనం చేసుకున్న 150 మంది గెరిల్లాల్లో లక్ష్మి ఒకరు.

కామ్రేడ్ సుమిత్ర 2004లో సల్వాజుడుం ఉన్మత్త దాడులు మొదలు కాకముందే పి.ఎల్.జీ.ఏలో చేరింది. ఇంటినుండి తప్పించుకోడానికే అందులో చేరానని ఆమె చెప్పింది. "ఆడవాళ్ళను అన్ని రకాలుగా నియంత్రిస్తారు" అంది నాతో. "మా గ్రామాల్లో అమ్మాయిలు చెట్లెక్కకూడదు. ఒక వేళ అలా చేస్తే వాళ్ళు 500రూపాయలు గాని, ఒక కోడినిగాని జరిమానా కట్టాలి. ఒక వేళ ఒక మగవాడు స్త్రీని కొడితే ఆమె తిరిగి కొట్టినందుకో, ఆమె ఒక మేకను ఊరికివ్వాలి. మగవాళ్ళు నెలల తరబడి కొండల్లోకి పోయి వేటాడతారు. ఆడవాళ్ళు వేట దగ్గరికి పోకూడదు. మాంసంలో మంచి మంచి భాగాలు మగవాళ్ళకు పోతాయి. ఆడవాళ్ళను గుడ్లు కూడా తిననివ్వరు". గెరిల్లా సైన్యంలో చేరేందుకు చక్కటి కారణం.

సుమిత్ర తన ఇద్దరు స్నేహితురాళ్ళు కే.ఏ.ఎం.యస్‌లో పని చేసిన తేలం పార్వతి, కమలల కథ చెప్పింది. తేలం పార్వతిది దక్షిణ బస్తర్‌లోని పోలెకాయ గ్రామం. అందరితో పాటు ఆమె కూడా సల్వాజుడుం వాళ్ళు తన గ్రామాన్ని తగలబెడుతుండగా చూసింది. తర్వాత ఆమె పి.ఎల్.జి.ఏలో చేరిపోయి కేశ్‌కాల్ పర్వత ప్రాంతాల్లోని పని చేయడానికి వెళ్ళింది. 2009లో ఆమె, కమల ఇద్దరూ ఆ ప్రాంతంలో మార్చి 8 మహిళా దినోత్సవాలను నిర్వహించి అప్పుడే వచ్చారు. వాద్గో అనే ఊరి బైట చిన్న గుడిసెలో వాళ్ళిద్దరూ ఉన్నారు. ఆ రాత్రే గుడిసెను చుట్టుముట్టిన పోలీసులు కాల్పులు ప్రారంభించారు. కమల తిరిగి కాల్చింది గాని, ఆమె చనిపోయింది. పార్వతి తప్పించుకుంది. తర్వాత మరుసటి రోజు ఆమెను పట్టుకొని చంపేశారు.

పోయినేడాది మహిళా దినోత్సవం రోజున ఆ సంఘటన జరిగింది. ఇక్కడ

ఒక జాతీయ వార్తా పత్రిక ఈ ఏడాది మహిళా దినోత్సవం గురించి రాసిన వార్త ఇది.

మహిళా హక్కుల పక్షం తీసుకున్న మావోయిస్టు తిరుగుబాటుదార్లు: పాహర్‌ఖాన్, మెయిల్‌టుడే, రాయ్‌పూర్, మార్చి 2010. దేశంలో మావోయిస్టు ప్రమాదాన్ని నిరోధించడానికి ప్రభుత్వం తీవ్రంగా యత్నిస్తోంది. కాని ఛత్తీస్‌ఘడ్‌లోని ఓ వర్గం, తిరుగుబాటుదార్లకు వాళ్ళ ఉనికి కంటే కూడా తీవ్రమైన సవాళ్ళు వాళ్ళ దృష్టిలో ఉన్నాయి. అంతర్జాతీయ మహిళా దినోత్సవం సమీపిస్తుండగా బస్తర్ ప్రాంతంలోని మావోయిస్టులు మహిళా హక్కుల పక్షాన ఉద్యమించడానికి వారం పొడవు "ఉత్సవాల"కు పిలుపునిచ్చారు.

బస్తర్ జిల్లాలో ఒక భాగమైన బీజాపూర్‌లో పోస్టర్లు కూడా వేశారు. మహిళా హక్కుల ఉద్యమకారులుగా వాళ్ళను వాళ్ళు పిలుచుకుంటూ ఈ పిలుపునివ్వడం రాష్ట్ర పోలీసు వర్గాలను చాలా ఆశ్చర్యపరిచింది.

ఆ వార్త ఇంకా ఇలా చెప్పుకుంటూ పోయింది.

"మావోయిస్టులు ఎంతో విజయవంతంగా జరుగుతున్న మా జనజాగరణ అభియాన్ (జనాన్ని చైతన్యపరిచే కార్యక్రమం)ను ఎదుర్కొనే ప్రయత్నం చేస్తున్నారని నేను అనుకుంటున్నా. వామపక్ష తీవ్రవాదాన్ని నిర్మూలించడానికి పోలీసులు ప్రారంభించిన ఆపరేషన్ గ్రీన్ హంట్‌కు ప్రజల మద్దతు కూడగట్టడానికి మేమా కార్యక్రమాన్ని చేపట్టాం" అన్నాడు ఐ.జి.

అజ్ఞానం, కార్పణ్యం కలిపి వండే ఇలాంటి కథలు అరుదేం కాదు. పార్టీకి సంబంధించిన నివేదికలను, వార్తలను నమోదుచేసే గుడ్సా ఉసేండికి దీని గురించి చాలామంది కంటే ఎక్కువ తెలుసు. అతని బుల్లి కంప్యూటరు, యంపిత్రీ రికార్డరు పత్రికా ప్రకటనలు, ఖండనలు, సవరణలు, పార్టీ సాహిత్యం, చనిపోయిన వారి జాబితాలు, టీ.వీ క్లిప్పింగులు, ఆడియో, వీడియో సమాచారాలతో నిండిపోయి ఉంటాయి. "గుడ్సా ఉసేండిగా ఉండటంలో అత్యంత విషాదకరమైన విషయం ఏంటంటే ఎన్నడూ ప్రచురణకు నోచుకోని వివరణలు ఇస్తూ ఉండటం" అంటాడతను. "మా అముద్రిత వివరణలు, మా గురించి వాళ్ళు చెప్పే అబద్ధాలతో ఒక లావుపాటి పుస్తకాన్ని తీసుకురావచ్చు" దీనిపై రవ్వంత చిరాకు కూడా ప్రకటించకుండా ఒకింత హాస్యంగా కూడా మాట్లాడతాడతను.

"మీరు ఖండించాల్సి వచ్చిన అత్యంత వెర్రి ఆరోపణ ఏంటి?"

కొంచెం ఆలోచించి అతను "2007లో నహీభాయ్, హమ్‌నే గాయ్‌కో హథోడేసే నహీ మారా' (లేదు బాబూ, మేం ఆవుల్ని సుత్తితో కొట్టి చంపలేదు) అంటూ మేమొక ప్రకటన ఇవ్వాల్సి వచ్చింది. ఒక్కో ఆదివాసీకి ఒక్కో ఆవు అంటూ చేసిన ఎన్నికల హామీ కింద 2007లో రమణ్‌సింగ్ ప్రభుత్వం గాయ్‌యోజనా (ఆవు పథకం) ను ప్రకటించింది. ఒక రోజు నక్సలైట్లు ఆవుల మంద మీద దాడి చేసి సుత్తులతో వాటిని మోది చంపారని, ఎందుకంటే వాళ్ళు హిందువులకు, బి.జే.పీ.కి వ్యతిరేకం కాబట్టి అంటూ టి.వి ఛానళ్ళు, వార్తాపత్రికలు ప్రచారం చేశాయి. ఏం జరిగిందో మీరూహించొచ్చు. మేం ఖండన ప్రకటననిచ్చాం. ఎవరేగాని దాన్ని పట్టించుకోలేదు. తర్వాత తెలిసిన విషయం ఏంటంటే ఆవుల్ని పంచమని ఎవరికైతే వాటిని అప్పగించారో అతను పెద్ద పోకిరని. అతను వాటిని అమ్ముకొని, మేమతని మీద హఠాత్తుగా దాడిచేసి (ఆంబుష్ చేసి) ఆవుల్ని చంపేశామని చెప్పాడని తెల్సింది.

మరి అత్యంత గంభీరమైనది?

"ఓహ్, డజన్లకొద్దీ ఉన్నాయి. అదేపనిగా క్యాంపెయిన్ నడుపుతున్నారాయె. సల్వాజుడుం మొదలైనప్పుడు మొదటిరోజు వాళ్ళు అంబేలి అనే గ్రామంపై దాడిచేసి తగలబెట్టేశారు. తర్వాత యస్పీవోలు, నాగా బెటాలియన్, పోలీసులు అందరూ కొట్రపల్ వైపు కదిలారు. కొట్రపల్ గురించి మీరు చదివుంటారు? చాలా ప్రచారంలో కొచ్చిన గ్రామం. లొంగిపోవడానికి నిరాకరించినందువల్ల దాన్ని 22 సార్లు తగలబెట్టారు. జుడుం కొట్రపల్‌ని చేరుకున్నప్పుడు వాళ్ళ కోసం మా మిలీషియా ఎదురు చూస్తూ ఉంది. వాళ్ళొక ఆంబుష్‌ని సిద్ధం చేశారు. ఇద్దరు యస్పీవోలు చనిపోయారు. మిలీషియా ఏడుగురిని అపహరించింది. మిగిలిన వాళ్ళు పారిపోయారు. తర్వాత రోజు వార్తా పత్రికలు నక్సలైట్లు అమాయక ఆదివాసీలను ఊచకోత కోశారని రాశారు. కొంతమంది మేం వందలమందిని చంపామన్నారు. ఫ్రంట్‌లైన్ వంటి గౌరవప్రదమైన పత్రిక కూడా మేము 18 మంది ఆదివాసీలను చంపామని చెప్పింది. వాస్తవాల పట్ల చాలా జాగ్రత్తగా, నిక్కచ్చిగా వ్యవహరించే కె. బాలగోపాల్, మానవ హక్కుల కార్యకర్త, ఆయన కూడా ఇదే చెప్పాడు. మేము వివరణ పంపాం. ఎవరూ ప్రచురించలేదు. తర్వాత బాలగోపాల్ అతని పుస్తకంలో పొరపాటును అంగీకరించాడు... కాని ఎవరు గమనించారు?"

అపహరించబడ్డ ఆ ఏడుగురు పోలీసులు ఏమయ్యారని అడిగా.

"ప్రాంతీయ కమిటీ జన అదాలత్ (ప్రజాకోర్టు)ను సమావేశపరిచింది. నాలుగు వేలమంది జనం హాజరయ్యారు. వాళ్ళు మొత్తం కథ విన్నారు. ఇద్దరు యస్పీవోలకు మరణశిక్ష విధించాము. ఐదుగురిని హెచ్చరించి వదిలేశాం. ప్రజలు అలా నిర్ణయించారు. ఇన్ఫార్మర్ల (గుఢాచార్లు) విషయంలో కూడా - ఈరోజుల్లో ఇది పెద్ద సమస్య అయిపోతోంది. ప్రజలు కేసు గురించి వింటారు. మొత్తం కథ, వాళ్ళ పశ్చాత్తాపం విని "ఇస్ కా హమ్ రిస్ నహీ లేసక్తే" (ఈవ్యక్తి నమ్మి రిస్క్ తీసుకోలేం) అనో లేదా "ఇస్ కా రిస్క్ హమ్ లేంగే" (ఈ వ్యక్తిని నమ్మి రిస్క్ చేయడానికి సిద్ధంగా ఉన్నాం) అనో చెప్తారు. పత్రికలెప్పుడూ చంపబడిన ఇన్ఫార్మర్ల గురించే సమాచారమిస్తాయి. వదిలేసిన ఎంతోమందిని గురించి ఎన్నడూ చెప్పవు. ఈ ఇన్ఫార్మర్లు చంపిన ప్రజల గురించీ ఎన్నడూ చెప్పావు. కాబట్టి ఇదేదో అందరినీ చంపుకుంటూ పోయే మారణహోమమని అందరూ అనుకుంటారు.ఇక్కడ విషయం ప్రతీకారం కాదు. ఇది ఇప్పటి బతుకు గురించి, భవిష్యత్తు బతుకుల్ని కాపాడుకోవడం గురించి. సమస్యలు ఉండనే ఉన్నాయి. మేం తీవ్రమైన పొరపాట్లు చేశాం. మా ఆంబుష్‌లలో సంబంధం లేని మనుషుల్ని కూడా చంపాం. కాని మీడియా చిత్రీకరిస్తున్నది ఈ విధంగా కాదు.

భయం పుట్టించే ప్రజాకోర్టులు. మనమెలా వాటిని అంగీకరించగలం? ఇలాంటి మొరటు న్యాయాన్ని ఎలా అంగీకరించగలం?

మరోవైపు ఎన్‌కౌంటర్ల మాటేమిటి? బూటకపు ఎదురుకాల్పులు లేదా తక్షణ తీర్పుకు ఘోరమైన పరాకాష్ట అవి భారత ప్రభుత్వం నుండి పోలీసులకు, సైనికులకు సాహస పతకాలు, నగదు బహుమతులు, వాళ్ళవంతు రాకముందే ప్రమోషన్లు అందిస్తాయి. వాళ్ళెంత మందిని చంపితే అన్ని రివార్డులు. వాళ్ళను సాహసవీరులంటారు, ఎన్‌కౌంటర్ స్పెషలిస్టులంటారు. మనల్ని, మనలో ఎవరైతే వాళ్ళను ప్రశ్నిస్తారో వాళ్ళని దేశద్రోహులంటారు. సరిపడినంత సాక్ష్యం లేదని ఒప్పుకుంటూనే సుప్రీంకోర్టు నిస్సిగ్గుగా మహమద్ అఫ్జల్ (2001 డిసెంబర్‌లో పార్లమెంటుపై దాడి ఘటనలో నిందితుడు)కు మరణదండన విధించిన మాటేమిటి? నిందితునికి రాజ్యం మరణదండన విధిస్తే గాని సమాజ నైతిక భావన తృప్తి పడదని సుప్రీంకోర్టు ఆ తీర్పుచెప్పిందట.

కనీసం కొట్రపాల్ ప్రజాకోర్టులో సొంత నిర్ణయం ప్రకటించగల ఒక ప్రజాసమూహం భౌతికంగా ఉంది. ఎప్పుడో సామాన్య ప్రజా జీవితానికి దూరమైనా, వారి పరోక్షంలో వారి తరపున మాట్లాడుతున్నామనుకొని తీర్పులనిచ్చే న్యాయమూర్తుల చేత తీసుకొన్న నిర్ణయం కాదది.

అయినా కొట్రపాల్ ప్రజలు ఏమి చేసి ఉండాల్సిందని నేను చెప్పగలను? పోలీసులకు కబురు పంపాలనా?

డోలు శబ్దాలు ఊపందుకున్నాయి. ఇది భూంకాల్ సమయం. మేం మైదానంలోకి నడిచాం. నా కళ్ళను నేను నమ్మలేకపోతున్నా. అక్కడ మనోహరమైన జనసముద్రం. అడవి అందాలతో అలంకరణలు. వాళ్ళు తల పాగాలను ఈకలతో అలంకరించి, ముఖాలపై రంగుల చిత్రాలు

ముద్రించుకున్నారు. చాలామంది కళ్ళకూ రంగువేసుకొని ముఖానికి తెల్లగా పౌడర్ అద్దుకున్నారు. అక్కడ చారీలా మిలీషియా ఉంది. అమ్మాయిలు ధరించిన చీరెలు గాఢమైన రంగుల్లో ఉన్నాయి. వాళ్ళ భుజాలకు తుపాకులు నిర్లక్ష్యంగా వేలాడుతున్నాయి. అక్కడ ముసలివాళ్ళు, పిల్లలు, ఆకాశానికి అడ్డుగా ఎర్రటి తోరణాల మెరుపులు ఉన్నాయి.

సూర్యుడు నడి ఆకాశంలో చురుగ్గా ఉన్నాడు. కామ్రేడ్ లెంగ్, వివిధ జనతన సర్కార్ల బాధ్యులు మాట్లాడుకుంటున్నారు. తన ఏకేని భుజానికి తగిలించుకొని కామ్రేడ్ నితి మాట్లాడుతోంది. (ఆ తుపాకీకొక కథ ఉంది. దాదాపు ప్రతి ఒక్కరి తుపాకీకి ఒక్కో కథ ఉంటుంది. దాన్ని ఎవరి నుండి, ఎవరు ఎలా లాక్కున్నారు అని) 1997 నుండి పార్టీలో ఉన్న కామ్రేడ్ నితి ఒక అసాధారణ మహిళ. ఆమె దేశానికి ఎంత ప్రమాదకరమంటే 2007 జనవరిలో ఆమె ఇన్నార్ గ్రామంలో ఉందని విని 700 మందికి పైగా పోలీసులు దాన్ని చుట్టు ముట్టారు. కామ్రేడ్ నితి అంత ప్రమాదకరమైన వ్యక్తి అనుకోడానికి ఆమె కోసం అంత పిచ్చిగా వేటాడటానికి కారణం ఆమె ఎన్నో అంబుష్‌లను నడిపించిందని కాదు. ఈ ఆదివాసీ మహిళను గ్రామ ప్రజలు ప్రేమిస్తున్నందుకు. ఎంతో మంది యువజనులకు ఆమె సిసలైన స్ఫూర్తి అయినందుకు.

భూంకాల్ తిరుగుబాటు మీద ఒక సి.ఎన్.యం బృందం నాటికను ప్రదర్శిస్తోంది. దుష్టులైన తెల్లవలసవాదులు టోపీలు పెట్టుకొని, బంగారు రంగు గడ్డిని వెంట్రుకలుగా ధరించారు. ధాంధూం చేస్తూ ఆదివాసుల్ని గుజ్జుగుజ్జుగా కొడుతూ ప్రేక్షకులకు అంతులేని ఉల్లాసాన్నిస్తున్నారు. దక్షిణ గంగలూరు నుండి ఇంకొక బృందం నితిర్ జుడుం పిటో (నెత్తుటి వేట కథ) అనే నాటికను ప్రదర్శిస్తోంది. దాన్ని జూరీ నాకోసం అనువదిస్తోంది. అది కూతురి ఊరిని వెతుకుతూ వెళ్ళిన ఇద్దరి ముసలివాళ్ళ కథ. అడవిలో నడుచుకుంటూ పోతూ వాళ్ళు తప్పిపోతారు. ఎందుకంటే అక్కడ మొత్తం కాలిపోయి గుర్తు పట్టలేనట్లుగా ఉంటుంది. సల్వాజుడుం డోళ్ళను, సంగీత వాయిద్యాలను కూడా తగలబెట్టేసింది. వర్షం పడుతుండటం వల్ల అక్కడ బూడిద కూడా లేదు. ఆ ముసలి వాళ్ళు కూతురిని కనిపెట్టలేకపోతారు. ఆ విషాదంలో ఆజంట పాడటం మొదలుపెడుతుంది. శిథిలాల నుండి వాళ్ళ పాటకు జవాబుగా కూతురి గొంతు పాడుతుడటం వినిపిస్తుంది. మా ఊరి గొంతు మూగబోయిందని ఆమె పాడుతుంది. ఇంక బియ్యం దంపుళ్ళు లేవు. ఊట బావినవ్వులు లేవు. పక్షులు లేవు, మేకల అరుపులు లేవు. మా బిగువైన సంతోషపు తీగను హఠాత్తుగా తెంచేశారు.

ఆమె తండ్రి తిరిగి పాడతాడు. నా చక్కనైన బిడ్డా, ఈరోజు నువ్వు ఏడవద్దు. పుట్టిన ప్రతి ఒక్కరూ చనిపోవాల్సిందే. మన చుట్టూ ఉన్న ఈచెట్లు పడిపోతాయి. పువ్వులు వికసిస్తాయి, వాడిపోతాయి. ఒక రోజు ఈ ప్రపంచం కూడా ముసలిదవుతుంది. కాని మనం చనిపోయేది ఎవరికోసం? ఒక రోజున మన దోపిడి దార్లు తెలుసుకుంటారు. ఒక రోజున సత్యం గెలుస్తుంది. కాని మన ప్రజలు నిన్నెప్పటికీ మర్చిపోరు. వేల సంవత్సరాలైనా మర్చిపోరు.

మరికొన్ని ఉపన్యాసాలు. ఆ తర్వాత డోలు శబ్దాలు, నృత్యాలు మొదలు. ఒక్కో జనతన సర్కారుకు దాని సొంత బృందం ఉంటుంది. ఒక్కో బృందం దాని సొంత నృత్యాన్ని తయారుచేసుకుంటుంది. ఒకరి తర్వాత ఒకరు పెద్ద డోళ్ళతో వచ్చి అడవి కథలకు నృత్యం చేస్తారు. సాధారణంగా ప్రతి బృందంలోనూ హెల్మెట్, నల్లకళ్ళద్దాలు పెట్టుకొని సిగరెట్ కాలుస్తూ ఒక చెడ్డ గని యజమాని ఉంటాడు. కాని వాళ్ళ నృత్యానికి ఏ నిబంధనలు లేవు. యాంత్రికత లేదు. వాళ్ళు నృత్యం చేసేకొద్దీ దుమ్ము రేగుతోంది. క్రమంగా డోలు శబ్దాలు చెవులు చిల్లులు పడేలా పెద్దవవుతాయి. మెల్లగా జనం అటు ఇటూ ఊగడం మొదలుపెడతారు. తర్వాత నృత్యం చేయడం మొదలుపెడతారు. పురుషులు, స్త్రీలు విడివిడిగా ఆరు లేదా ఏడు వరసల్లో ఒకరి నడుము చుట్టూ ఇంకొకరు చేతులు వేసి నృత్యం చేస్తారు. వేల మంది జనం.

అందుకోసమే వీళ్ళొచ్చింది. కేవలం దీని కోసమే. ఇక్కడ, ఈ దండకారణ్యంలో సంతోషం చాలా అమూల్యమైనది. ప్రజలు మైళ్ల కొద్దీ, రోజుల తరబడి నడుచుకుంటూ వస్తారు. జాతర చేసుకోడానికి, పాటలు పాడటానికి, తలపాగాల్లో ఈకలు పెట్టుకోడానికి, వెంట్రుకల్లో పువ్వులు పెట్టుకోడానికి, ఒకరి నడుము చుట్టూ ఇంకొకరు చేతులు వేయడానికి, మహువ తాగి రాత్రంతా నృత్యం చేయడానికి వస్తారు. ఏ ఒక్కరూ ఒంటరిగా పాడటం గాని, నర్తించడం గాని చెయ్యరు. అన్నిటినీ మించి వాళ్ళను నిర్మూలించాలని చూస్తున్న నాగరికత పట్ల వాళ్ళు ప్రదర్శించే ధిక్కారం ఇది.

ఇదంతా పోలీసుల దగ్గరలోనే జరుగుతోందంటే, ఆపరేషన్ గ్రీన్‌హంట్ నడుమనే జరుగుతోందంటే నేను నమ్మలేకపోతున్నా.

మొదట పి.ఎల్.జీ.ఏ కామ్రేడ్స్ వాళ్ళ తుపాకులతో ఒక పక్కకు నిలబడి నృత్యాలు చేస్తున్న వాళ్ళని చూస్తూ ఉంటారు. నీళ్ళలో ఈదుతున్న బాతుల్ని చూస్తూ ఒడ్డున నిలబడి ఉండటం భరించలేని మిగతా బాతుల్లాగా ఒకరి తర్వాత ఒకరుగా లోపలికి దిగి నృత్యం చేయడం మొదలుపెడతారు. వెనువెంటనే ఆలివ్‌గ్రీన్ నృత్యకారుల వరుసలు మిగతా రంగులన్నింటితోనూ సుళ్ళు తిరుగుతాయి. నెలల తరబడి, కొన్ని సార్లు సంవత్సరాల తరబడి కలుసుకోని అక్కచెల్లెళ్ళు, అన్నదమ్ములు, తల్లిదండ్రులు, పిల్లలు, స్నేహితులు ఎదురుపడినప్పుడు వరుస తెగిపోయి మళ్ళీ ఏర్పడుతుంది. ఇక ఆలివ్‌గ్రీన్ సుడులు తిరుగుతున్న చీరెలు, పువ్వులు, డోళ్ళు, తలపాగాల మధ్య పంపక మవుతుంది. ఇది నిజంగా ప్రజా సైన్యమే. కనీసం ఇప్పటికి. చైర్మెన్ మావో గెరిల్లాల గురించి చెప్పిన మాటలు - ప్రజలు నీళ్ళు అని, ఆ నీటిలో ఈదవలసిన చేపలు గెరిల్లాలని ఈ క్షణంలో అక్షరాలా నిజం.

చైర్మెన్ మావో. ఆయనిక్కడ కూడా ఉన్నాడు. బహుశా కాస్త ఒంటరిగా. కాని ఉండటమైతే ఉన్నాడు. పైన ఎర్రటి గుడ్డ తెర మీద అతని ఫోటో ఉంది. మార్క్స్‌ది కూడా. ఇంకా నక్సలైట్ ఉద్యమ సిద్ధాంతకర్త చారుమజుందార్. సూదంటురాయిలా తాకే అతని భావాలు హింసను, రక్తపాతాన్ని, అమరత్వాన్ని ఉసిగొల్పుతాయి. అతను ఉపయోగించే భాష తరచుగా ఎంత దూకుడుగా ఉంటుందంటే దాదాపు జాతి నిర్మూలనా భాషలాగ. భూంకాల్ రోజున ఇక్కడ నిలబడి ఈ విప్లవ నిర్మాణానికి జీవం పోసిన అతని విశ్లేషణ, దీని భావోద్వేగానికి, రూపానికి ఎంత విడదీసినట్టుగా ఉందోనని నేను ఆలోచించకుండా ఉండలేను. ఒక నిర్మూలనా కార్యక్రమం మాత్రమే మరణాన్ని కూడా సవాలు చేసి, అన్నిరకాల వ్యక్తిగత స్వార్థ ప్రయోజనాల నుండి విముక్తి పొందిన ఒక నూతన మానవుని సృష్టిస్తుందని అతనన్నప్పుడు రాత్రి సమయంలో నృత్యం చేస్తున్న ఈ ఆదివాసీ ప్రజల్నే అతను ఊహించుకొని ఉంటాడా? తన కలలు విశ్రమించేది వీళ్ళ భుజాలపైననని అనుకొని ఉంటాడా?

ఇక్కడింత జరుగుతున్నా బైటి ప్రపంచం మాత్రం ఒక సమస్యాత్మక గతం నుండి ఉద్భవించిన కఠినమైన మొండి వాదనల్లాంటి పార్టీ సిద్ధాంతాలను మాత్రమే చూడటం జరుగుతున్న దానికంతటికీ చాలా పెద్ద అన్యాయం. చారుమజుందార్ అతని ప్రసిద్ధి చెందిన "చైనా చైర్మెనే మన చైర్మన్, చైనా బాటే మన బాట" నినాదాలను అతనెంత దూరం తీసుకుపోడానికైనా సిద్ధపడ్డాడు. ఎంతదాకా నంటే తూర్పు పాకిస్తాన్ (బంగ్లాదేశ్)లో జనరల్ యోగ్యాఖాన్ జాతిహననం గావించినప్పుడు చైనా పాకిస్తాన్ మిత్రదేశం కాబట్టి నక్సలైట్లు మౌనంగా ఉండిపోయే దాక.

కమెర్ రూగ్‌పట్ల, కంబోడియాలో దాని హత్యాస్థలాల పట్ల మౌనమే. చైనా, రష్యా విప్లవాల దిగ్భ్రాంతికరమైన క్రూరత్వాల పట్ల కూడా మౌనమే. టిబెట్ పట్లా మౌనం. నక్సలైట్ ఉద్యమం లోపల కూడా హింసాత్మకమైన విపరీత ప్రవర్తనలున్నాయి. వాళ్ళు చేసిన ఎన్నో వాటిని సమర్థించడం అసాధ్యం. కాని వాళ్ళు చేసింది ఒక్కటైనా కాంగ్రెస్, బీజేపీలు పంజాబ్‌లో, కాశ్మీర్‌లో,

ఢిల్లీలో, ముంబైలో.... చేసిన నీచమైన చర్యలతో పోల్చగలమా? తీవ్రమైన విభేదాలెన్ని ఉన్నప్పటికీ చారుమజుందార్ చెప్పిన మాటల్లో, రాసిన రాతల్లో చాలా వరకు ఆయనో ఊహాస్వర్గ దార్శనికుడు. ఆయన స్థాపించిన పార్టీ (దాన్నుండి విడిపోయిన ఎన్నో గ్రూపులు) ఆ విప్లవ స్వప్నాన్ని భారతదేశంలో, వర్తమానంలో వాస్తవంగా నిలబెట్టింది. ఆ స్వప్నం లేకుండా ఒక సమాజాన్ని ఊహించండి. కేవలం ఆ ఒక్కదాన్ని గురించే మనం అతనిపై మొరటు అంచనాలకొస్తామా?

"ధనవంతుడికి అతని సంపదను ఉంచుకునే అధికారం ఇవ్వాలి. దానిలో అతని వ్యక్తిగత అవసరాల కోసం న్యాయంగా కావల్సిన దాన్ని అతను ఉపయోగించుకుని, మిగిలిన దానికి ధర్మకర్తగా వ్యవహరిస్తూ సమాజ బాగుకోసం ఉపయోగించాలి".

అని చెప్పే గాంధీ ధర్మకర్తృత్వ భావన, అతని "అహింసా మార్గా"ల పితలాటకంలో చేతులూ కాళ్ళు కదలకుండా కట్టేసుకొని కపటభక్తి నటిస్తూ మోసం చేసుకుంటున్న సందర్భంలో మనం చారుమజుందార్ గురించి అంచనా వెయ్యలేము.

చాలా ఆశ్చర్యంగా చైనా మార్గమే మన మార్గమని చారుమజుందార్ ఎంతో కాలం క్రితం చెప్పిన దాన్నే నక్సలైట్లను నిర్దాక్షిణ్యంగా అణిచేసిన ఇప్పటి భారత రాజ్యాంగ ప్రభువులు చెప్తూ ఉండొచ్చు.

తలకిందులుగా, తిరగేసినట్లుగా.

చైనా మార్గం మారిపోయింది. చైనా ఇప్పుడు సామ్రాజ్యవాద శక్తి అయి ఇతర దేశాలమీద, ఇతర దేశాల ప్రజల వనరుల మీద పడి తింటోంది. కాని పార్టీ ఇప్పటికి సరైనదే. కేవలం పార్టీ ఆలోచన మారిందంతే.

పార్టీ ఒక ప్రేమికుడిగా ఉన్నప్పుడు (ఇప్పుడు దండకారణ్యంలో ఉన్నట్లు) జనాన్ని ఆకర్షిస్తున్నప్పుడు, వాళ్ళ ప్రతి అవసరాన్ని చూసుకుంటున్నప్పుడు అది అచ్చంగా ప్రజల పార్టీ, దాని సైన్యం అచ్చంగా ప్రజాసైన్యం. కాని విప్లవం తర్వాత ఈ ప్రేమ బంధం ఎంత సులువుగా చేదు కాపురం కాగలదు. ఎంత సులువుగా ప్రజా సైన్యం ప్రజల మీదికే రాగలదు. ఈ రోజు దండకారణ్యంలో పార్టీ బాక్సైట్‌ని పర్వతంలోపలే ఉంచాలనుకుంటోంది. రేపది దాని ఆలోచన మార్చుకుంటుందా? కాని భవిష్యత్తును గురించిన మన భయం వర్తమానంలో మనల్ని స్తబ్దంగా ఉంచడాన్ని అనుమతించగలమా?

ఈ నృత్యాలు రాత్రంగా కొనసాగుతూనే ఉంటాయి. నేను తిరిగి క్యాంపుకు నడిచాను. మాసే అక్కడే ఉంది. మేల్కొని ఉంది. రాత్రి పొద్దు పోయే దాకా మేం కబుర్లు చెప్పుకున్నాం. నేనామెకి నా దగ్గరున్న నెరుడా నావికుని గీతాలు (ఎందుకైనా పనికొస్తుందేమోనని దాన్ని నాతో పాటు తెచ్చుకున్నా) ఇచ్చాను. ఆమె మళ్ళీ మళ్ళీ అడుగుతుంది. "బైట మా గురించి ఏమనుకుంటుంటారు? విద్యార్థులు ఏమంటారు? మహిళా ఉద్యమాల గురించి చెప్పండి. ఇప్పటి విశేషాలేమిటి?" నా గురించి, నా రచనల గురించి అడుగుతుంది. నా గందరగోళ పరిస్థితిని గురించి నిజాయితీగా వివరించే ప్రయత్నం చేశాను. తర్వాత ఆమె తన గురించి చెప్పడం మొదలు పెట్టింది. పార్టీలో ఎలా చేరిందో చెప్పింది. పోయిన మేలో ఒక బూటకపు ఎన్‌కౌంటర్‌లో తన సహచరున్ని చంపేశారని చెప్పింది. అతన్ని నాసిక్‌లో పట్టుకున్నారు. తర్వాత వరంగల్ తీసుకెళ్ళి చంపేశారు. "వాళ్ళతన్ని ఘోరంగా చిత్రహింసలు పెట్టి ఉంటారు". ఆమె అతన్ని కలుసకోవడానికి వెళ్తున్నప్పుడే అతన్ని అరెస్టు చేశారని వినింది. అప్పటినుండి ఆమె అడవిలోనే ఉండిపోయింది. దీర్ఘ నిశ్శబ్దం తర్వాత చెప్పింది. ఆమె అంతకు ముందే కొన్నేళ్ళ క్రితం ఒక సారి పెళ్ళి చేసుకుందని "అతను కూడా ఎన్‌కౌంటర్‌లో చనిపోయాడు". అంటూ గుండె పగిలే విషాదంతో దానికి కొసమెరుపు జోడించింది. కానీ నిజమైన ఎన్‌కౌంటర్‌లో".

నేను నా ఝుల్లీలో పడుకొని నిద్రపోకుండా ఆలోచిస్తున్నాను. మాసే సుదీర్ఘ విషాదం గురించి ఆలోచిస్తున్నా. మైదానం నుండి డోలు శబ్దాలను, సుదీర్ఘమైన సంతోష ధ్వనులను వింటూ మావోయిస్టు పార్టీ అవగాహనకు కేంద్రమైన చారుమజుందార్ చెప్పిన దీర్ఘకాలిక యుద్ధం గురించి ఆలోచిస్తున్నా. మావోయిస్టుల శాంతి చర్చల ప్రతిపాదన ఒక వ్యూహమని, తిరిగి సమీకృతం కావడానికి, సాయుధంగా బలపడి దీర్ఘకాల యుద్ధాన్ని కొనసాగించడానికి వాళ్ళు పన్నిన పన్ను గమని జనం అనుకునేది ఇందువల్లేనా? దీర్ఘకాలిక యుద్ధమంటే ఏమిటి? అది దానంతటదే అంత భయంకరమైనదా లేక అది యుద్ధ స్వభావం మీద ఆధారపడి ఉంటుందా? ఒక వేళ ఇక్కడ దండకారణ్యంలోని ప్రజలు గత 30 ఏళ్ళగా ఈ దీర్ఘకాలిక యుద్ధాన్ని చేయకపోయి ఉంటే వాళ్ళిప్పుకెక్కడుంటే వాళ్ళు?

ఇంతకీ దీర్ఘకాలిక యుద్ధంలో విశ్వాసముండేది ఒక్క మావోయిస్టులకేనా? దాదాపు భారతదేశం సర్వసత్తాక దేశమైన క్షణం నుండి అదొక వలసవాద శక్తిగా మారి యుద్ధం చేస్తూ పొరుగు సీమలను కలిపేసుకుంటోంది. రాజకీయ సమస్యలతో వ్యవహరించేటప్పుడు - కాశ్మీర్, హైదరాబాద్, గోవా,నాగాల్యాండ్ మనిపూర్, తెలంగాణ, అస్సాం, పంజాబ్‌లతో పాటు పశ్చిమ బెంగాల్, బీహార్, ఆంధ్రప్రదేశ్, ఇప్పుడు మధ్య భారతంలోని ఆదివాసీ ప్రాంతాలలోని నక్సలైట్ ఉద్యమాలు - సైనిక జోక్యాన్ని ఉపయోగించడానికి అది ఎన్నడూ మొకాడలేదు. కొన్ని పదుల వేలమందిని చంపారు. వందల వేలమందిని చిత్రహింసలు పెట్టారు. శిక్ష నుండి మినహాయింపు పొందుతూ వాళ్ళీ నేరాలన్నీ చేశారు.

ఇదంతా చేసింది చాలా అనుకూలమైన ప్రజాస్వామ్య ముసుగులోనే. ఈ యుద్ధాలన్నీ ఎక్కుపెట్టింది ఎవరిపైన? ముస్లింల ? క్రైస్తవులు, కమ్యూనిస్టులు, దళితులపైన. అన్నిట్లోనూ ఎక్కువగా పేద ప్రజలపై. ఎవరైతే కలవాళ్ళు విసిరేస్తున్న మెతుకుల్ని ఏరుకోకుండా వాళ్ళను ప్రశ్నించే సాహసం చేస్తున్నారో వాళ్ళపైన. భారత ప్రభుత్వాన్ని అవశ్యంగా అగ్రకుల హిందూ రాజ్యంగా (ఏ పార్టీ అధికారంలో ఉందన్నదాంతో సంబంధం లేకుండా) చూడకుండా ఉండటం అసాధ్యం. అది పరస్పర శతృత్వాలకు ఆశ్రయమిస్తూ ఒక దాని మీదికొకటి ప్రయోగిస్తుంది. అది సిసలైన వలసవాద ధోరణిలో ఛత్తీస్‌ఘఢ్‌లో పోరాడటానికి నాగాలను, మిజోలను, పంపుతుంది. ఇంకా కాశ్మీర్‌కు సిక్కులను, కాశ్మీరీలను ఒరిస్సాకు, తమిళులను అస్సాంకు ఇలా ఎన్నో ఉదాహరణలు. ఇది దీర్ఘకాలిక యుద్ధం కాకపోతే మరేమిటి?

మనోహరమైన నక్షత్ర కాంతుల రాత్రివేళ ఆందోళనకరమైన ఆలోచనలు. సుఖ్‌దేవ్ తనలోతనే నవ్వుకుంటున్నాడు. అతని ముఖం కంప్యూటర్ తెర వెలుతులో వెలిగిపోతోంది. అతను పనిని వ్యసనంగా చేస్తుంటాడు. ఎందుకు నవ్వుతున్నారని అతన్నడిగాను. పోయినేడాది భూంకాల్ ఉత్సవాల కొచ్చిన విలేకర్ల గురించి ఆలోచిస్తున్నా. వాళ్ళొకరోజుకో, రెండ్రోజులకో వచ్చారు. ఒకరు నా ఏకే పట్టుకుని ఫోజుపెట్టి ఫొటో దిగాడు. తిరిగి వెళ్ళిపోయాక మమ్మల్ని చంపుడు యాంత్రాలనో ఏమిటో అన్నాడు.

తెల్లారింది కాని నృత్యాలింకా ఆగలేదు. ఆ వరుసలు అలాగే సాగిపోతున్నాయి. వందలకొద్దీ యువజనులు ఇంకా నృత్యం చేస్తున్నారు. "వాళ్ళాపరు, మేము సర్దుకొని బయలుదేరే ముందు వరకూ ఆపరు" అన్నాడు రాజు.

మైదానంలో నాకు కామ్రేడ్ డాక్టర్ ఎదురుపడ్డాడు. నృత్యం చేసే స్థలానికి ఒక మూల అడనో చిన్న మెడికల్ క్యాంపు నడుపుతున్నాడు. నాకతని బొద్దు చెంపలను ముద్దాడాలనిపించింది. అతను కేవలం ఒక్కడు కాక కనీసం ముప్పై మంది ఎందుకు కాకూడదు? అతను ఒక వెయ్యిమంది ఎందుకు కాకూడదు.? నేనతన్ని దండకారణ్య ఆరోగ్యం ఎలా ఉంది అనడిగా. అతని జవాబు నా రక్తాన్ని గడ్డకట్టించింది. అతను చూసిన చాలామందికి, పి.ఎల్.జీ.ఏలో ఉన్న వాళ్ళతో సహా రక్తంలో హిమోగ్లోబిన్ శాతం 5నుండి 6 వరకు ఉంది. (భారతదేశ

మహిళల్లో ఉండాల్సిన సాధారణ శాతం 11కాగా). రెండు సంవత్సరాల కన్నా ఎక్కువ కాలం రక్తహీనత ఉండటం వల్ల వచ్చే క్షయవ్యాధి ఉంది. చిన్న పిల్లల్లో పోషకాల లోపం వల్ల ప్రోటీన్ల హీనత ఏర్పడుతోంది. వైద్య పరిభాషలో దీన్ని క్వాషియోర్కర్ అంటారు (నేను దాని గురించి తర్వాత కనుక్కున్నాను. ఘనా తీర ప్రాంతపు 'గా' భాష నుండి వచ్చిన పదమది. దాని అర్థం బిడ్డ పుడితే దానికి ముందు పుట్టిన బిడ్డకు వచ్చే జబ్బు. ఇంకో బిడ్డ పుట్టడం వల్ల పెద్ద బిడ్డకు తల్లి పాలు దొరకవు. పోషణకు సరిపడేంత తిండీ ఉండదు). "ఏక కాలంలో చాలా మందికి ఈ జబ్బు ఉంటుందిక్కడ (ఎపిడెమిక్), బయర్నాలో ఉన్నట్లు" అన్నాడతను. "నేనింతకు ముందు గ్రామాల్లో పనిచేశాను. కాని ఇలాంటి దొకటి ఎప్పుడూ చూడలేదు".

దీనికి తోడు ఇక్కడ మలేరియా, ఆస్టియో పోరోసిస్ (ఎముకలు పెళుసు బారటం) యేటికపాము, విపరీతమైన చెవి, పంటి ఇన్ఫెక్షన్లు ఉన్నాయి. యౌవనంలో అడుగుపెట్టిన అమ్మాయిలకు పోషకాల లోపం వల్ల బహిస్టు రాకపోవడం, పూర్తిగా ఆగిపోవడం (ఏమెనోరియా) కూడా ఉంది.

"ఈ అడవిలో ఆసుపత్రులు లేవు, గడ్చిరోలిలో ఒకటి, రెండు తప్ప. డాక్టర్లు లేరు, మందులు లేవు".

ఇప్పుడతనొచ్చాడు. ఎనిమిదిరోజుల అబుజ్‌మాడ్ పర్యటన కోసం అతని జట్టుతో వచ్చాడు. యూనిఫాంలోనే ఉన్నాడు. కామ్రేడ్ డాక్టర్. కాబట్టి వాళ్ళకతను కనపడితే చంపేస్తారు.

ఇక్కడ క్యాంపు కొనసాగించడం అంత సురక్షితం కాదన్నాడు కామ్రేడ్ రాజు. ఇప్పుడు మేమిక్కడి నుండి కదలాలి. భూంకాల్‌ని వదలటం అంటే ఎంతో సమయం వరకు విస్తరించే ఎన్నెన్నో వీడ్కోలు.

లాల్‌సలాం లాల్‌సలాం

జానేవాలే సాథియోకో లాల్‌సలాం

(వెళ్ళిపోతున్న కామ్రేడ్స్‌కు లాల్ సలాం)

ఫిర్ మిలేంగే, ఫిర్‌మిలేంగే

దండకారణ్య జంగల్ మే ఫిర్ మిలేంగే

(మనం మళ్ళీ కలుస్తాం, దండకారణ్యంలో ఏదో ఒక రోజు)

ఇక్కడ రావడం పోవడం అనే వేడుకను ఎప్పుడూ తేలిగ్గా తీసుకోరు. ఎందుకంటే "మనం మళ్ళీ కలుస్తాం" అని వాళ్ళంటున్నారంటే దానర్థం నిజానికి "మనం ఎప్పటికీ కలవకపోవచ్చు" అని అందరికీ తెలుసు. కామ్రేడ్ నర్మద, కామ్రేడ్ మాసే, కామ్రేడ్ రూపీ వేరు వేరు దారుల్లో పోతున్నారు. నేను వాళ్ళని మళ్ళీ చూస్తానా?

ఇక మళ్ళీ మా నడక. రోజు రోజుకూ వాతావరణం వేడెక్కుతోంది. మొదటి తునిక పండును కమల నాకోసం తెంపింది. అది పుల్లగా ఉంది. నేను చింతపండుకు పెద్ద అభిమానినైపోయాను. ఈసారి మేము ఒక కాలువ దగ్గర విడిది చేశాం. ఆడవాళ్ళు, మగవాళ్ళు వంతుల వారిగా స్నానాలు చేశారు. సాయంకాలం కామ్రేడ్ రాజుకు ఒక పెద్ద 'బిస్కెట్ల' పొట్లం అందింది.

2010 జనవరి చివర్లో మిడ్నాపూర్ డివిజన్‌లో అరెస్టైన 60 మందిని ఇంకా కోర్టులో హాజరు పరచలేదు.

దక్షిణ బస్తర్‌లోకి భారీ పోలీసు బలగాలు ప్రవేశించాయి. విచక్షణా రహిత దాడులు మొదలు

2009 నవంబర్ 8న బీజపూర్ జిల్లా కచ్‌లారం గ్రామంలో డిర్కో మడ్కా (60) కోవాసి సుక్కు (68) లను హత్య చేశారు.

నవంబర్ 24న పంగోడి గ్రామంలో మాదవి బామన్‌ను (15) హత్య చేశారు.

డిసెంబర్ 3న కోరంజాడ్‌కు చెందిన మాదవి బుద్రామ్‌ను కూడా హత్య చేశారు.

డిసెంబర్ 11న దార్బాడివిజన్‌లోని గుమియాపాల్ గ్రామంలో 7మందిని (పేర్లు తెలియాల్సి ఉంది) హత్య చేశారు.

డిసెంబర్ 30న వేచపల్ గ్రామంలో పూనెమ్ పాండు, పూనెమ్ మోటును (తండ్రీ కొడుకులు) హత్య చేశారు.

2010 జనవరిలో (తేదీ తెలీదు) కైక గ్రామ జనతన సర్కారు నాయకుడు గంగలార్‌ను హత్య చేశారు.

జనవరి 9న జగర్ గొండ ఏరియా సూర్పన్ గూడెన్ గ్రామంలో 4గురిని హత్య చేశారు.

జనవరి 10న పుల్లెల పుల్లాడి గ్రామంలో ముగ్గుర్ని (పేర్లు ఇంకా రాలేదు) హత్య చేశారు.

జనవరి 27న ఇంద్రావతి ఏరియా, తాకిలాడ్ గ్రామంలో 7గురిని హత్య చేశారు.

ఫిబ్రవరి 10న (భూంకాల్ రోజు) అబుజ్‌మాడ్‌లోని డుమ్నార్ గ్రామంలో కుమ్లిని అత్యాచారం చేసి చంపేశారు. ఆమెది పైవార్ అనే గ్రామం.

రాజ్‌నంద్ గావ్ అడవుల్లో 2000 భారత టిబెట్ సరిహద్దు గస్తీ (ఐటిబిపి) బలగాలు క్యాంపు వేశాయి. కాంకేర్‌లోకి అదనపు బియస్‌యఫ్ బలగాలు ప్రవేశించాయి.

ఇక తర్వాత

పి.ఎల్.జి.ఏ కోటా నిండింది.

కొన్ని ఇటీవలి వార్తా పత్రికలు కూడా వచ్చాయి. నక్సలైట్ల గురించి చాలా వార్తలున్నాయి. కొట్టొచ్చినట్లు కనపడుతున్న ఒక వార్తా శీర్షిక రాజకీయ వాతావరణాన్ని సరిగ్గా వ్యక్తం చేస్తోంది. ఖాదేవ్, మారో, సమర్పన్ కరావ్ (నిర్మూలించు, చంపు, లొంగదీసుకో). దానికింద వార్తా కేలియే లోక్ తంత్రకా ద్వార్ ఖులాహై (చర్చలకు ప్రజాస్వామ్య తలుపులు ఎప్పుడూ తెరిచే ఉంటాయి.) రెండోది నిధులకోసం మావోయిస్టులు గంజాయి పండిస్తున్నారని చెప్తోంది. మూడో దాంట్లో మేం విడిది చేసిన ప్రాంతం, మేం నడుస్తూ వస్తున్న ప్రాంతం మొత్తం పోలీసు నియంత్రణలో ఉందని చెప్పే సంపాదక వ్యాసం ఉంది.

చిన్నారి కమ్యూనిస్టులు చదవడం సాధన చేయడానికి పేపర్లను తీసుకెళ్ళారు. వాళ్ళు క్యాంపు చుట్టూ తిరుగుతూ రేడియో అనౌన్సర్ గొంతులో మావోయిస్టు వ్యతిరేక వార్తలను గట్టిగా చదువుతున్నారు.

మరో రోజు మరో ప్రాంతం. ఉసిర్ గ్రామ శివార్లలో భారీ మహువా వృక్షాల కింది మా క్యాంపు. మహువా అప్పుడే పూత మొదలుపెట్టింది. అది అడవినేలపై దాని లేక ఆకు పచ్చ పువ్వుల్ని ముత్యాల్లా జార విడుస్తోంది. దాని ఘాటు పరిమళాలతో గాలి కొంచెం మత్తుగా ఉంది. భాత్‌పాల్ స్కూలు విద్యార్థులకోసం మేము ఎదురుచూస్తున్నాం. ఆగ్నార్ ఎన్‌కౌంటర్ తర్వాత అది మూత పడింది. దాన్ని పోలీసు క్యాంపుగా మార్చేశారు. నెల్వాడ్, మూజ్‌మెట్ట, ఏడ్కా, వేదోమకోట్, ధనోరా స్కూళ్ళ విషయంలోనూ ఇదే జరిగింది.

భాత్‌పాల్ స్కూలు పిల్లలు రాలేదు.

స్థానిక జనతన సర్కార్ నిర్మించిన నీటి పారుదల నిర్మాణాలను సాగునీటి చెరువుల్ని చూపించడానికి మమ్మల్ని తీసుకెళ్ళారు కామ్రేడ్ నితి, కామ్రేడ్ వినోద్‌లు. ఒక సుదూర్ నడకతో అక్కడికి చేరుకున్నాము. కామ్రేడ్ నితి వరుస పెట్టి వాళ్ళు పరిష్కరించవలసిన వ్యవసాయ సమస్యల్ని గురించి చెప్తోంది. రెండు శాతం భూమికే మాత్రమే సాగునీరందుతోంది. అబుజ్‌మాడ్‌లో పది సంవత్సరాల క్రితం వరకు దున్నడం తెలీదు. మరో వైపు గడ్చిరోలిలో సంకర జాతి విత్తనాలు, రసాయన పురుగు మందులు క్రమంగా ప్రవేశిస్తున్నాయి. "వ్యవసాయ విభాగంలో మాకు సహాయం అత్యవసరం"గా కావాలంటాడు కామ్రేడ్ వినోద్. "మాకు విత్తనాల గురించి ప్రకృతి సహజ వ్యవసాయ విధానాల (పెర్మాకల్చర్) గురించి తెలిసిన వాళ్ళు కావాలి. కొంచెం సహకరిస్తే మేం చాలా చెయ్యగలం.

కామ్రేడ్ రాము జనతన సర్కార్ ప్రాంతానికి రైతు బాధ్యుడిగా ఉన్నాడు. అతను పొలాల్లో పండిస్తున్న వరి, వంకాయ, గోంగూర, ఉల్లి, ఒక రకం క్యాబేజి (కోల్‌రాబి) పంటలను గర్వంగా చూపించాడు. అంతే గర్వంగా మాకు ఒక పెద్ద చెరువును చూపించాడు. కాని అది పూర్తిగా ఎండిపోయి ఉంది. ఏమిటిది? "దీనికి వర్షాకాలంలో కూడా నీళ్ళుండవు. దీన్ని తవ్విన స్థలం సరైందికాదు" అన్నాడు. ఓ చిరునవ్వు అతని ముఖాన్ని చుట్టేసింది. ఇది మాది కాదు. దీన్ని లూటీ సర్కార్ (లోటీ చేసే ప్రభుత్వం) తవ్వింది. ఇక్కడ రెండు సమాంతర ప్రభుత్వాలున్నాయి. జనతన సర్కార్, లూటీ సర్కార్.

కామ్రేడ్ వేణు చెప్పిందాన్ని గురించి ఆలోచిస్తున్నాను. వాళ్ళు మమ్మల్ని అణిచేయాలనుకుంటున్నది. ఖనిజాల కోసమే కాదు. మేం ప్రపంచానికి ఒక ప్రత్యామ్నాయ నమూనా చూపెడుతున్నాం కాబట్టి.

తుపాకీతో గ్రామ స్వరాజ్య భావన. ఇది ఇంకా ప్రత్యామ్నాయం కాలేదు. ఇక్కడ విపరీతమైన ఆకలి, విపరీతమైన అనారోగ్యం ఉంది. కాని ఇవి కచ్చితంగా ప్రత్యామ్నాయానికి అవకాశాలను కల్పించింది. ప్రపంచానికంతటికీ కాదు, అలాస్కాకీ, న్యూ ఢిల్లీకీ కాదు. బహుశా మొత్తం ఛత్తీస్‌ఘడ్‌కు కూడా కాదు. దానికి మాత్రమే. అంటే దండకారణ్యానికి. ఇది ప్రపంచంలోనే అతి పెద్ద రహస్యం. అది దాని వినాశనానికే ప్రత్యామ్నాయాన్ని స్థాపించుకుంటున్నది. అది చరిత్రను తిరస్కరించింది. అన్ని వ్యత్యాసాలకు వ్యతిరేకంగా దాని మనుగడ కోసం అది ఒక ప్రణాళికను రచించుకుంది. దానికి సహకారం, సృజనాత్మకత అవసరం. దానికి వైద్యులు, ఉపాధ్యాయులు, రైతులు అవసరం.

దానికి యుద్ధం అవసరం లేదు.

కాని దానికి వచ్చేదంతా యుద్ధమే అయితే, అది పోరాడుతుంది.

తర్వాత కొన్ని రోజులు నేను కే.ఎ.ఎం.యస్‌లో పనిచేసే మహిళల్ని జనతన సర్కార్‌కు సంబంధించిన వివిధ కార్యనిర్వాహకుల్ని, దండకారణ్య ఆదివాసీ కిసాన్ మజ్దూర్ సంఘటన (డి.ఏ.కే.ఎం.యస్) సభ్యుల్ని, చనిపోయిన వారి కుటుంబాల్ని, ఈ భయానక పరిస్థితుల్లో మనుగడకు ప్రయత్నిస్తున్న సామాన్య ప్రజల్ని కలుస్తాను.

నారాయణ్‌పూర్‌కు చెందిన ముగ్గురు అక్కచెల్లెళ్ళు సుఖియారి, సుక్డాయ్, సుక్కాలిలను కలిశాను. యువతులు కారు. బహుషా వయసు నలభైలలో ఉంటుంది. 12 సంవత్సరాలుగా వాళ్ళు కేఏఎంయస్‌లో ఉంటున్నారు. గ్రామస్తులు పోలీసులతో వ్యవహరించడానికి వీళ్ళ మీద ఆధారపడతారు. "రెండు మూడు వందల మంది పోలీసులు గుంపులుగా వస్తారు. అన్నీ దోచుకుంటారు. నగలు, కోళ్ళు, పందులు, కుండలు, పెనాలు, విల్లు, బాణాలు అన్నీ" అంది సుక్కాలి. "ఒక కత్తిని కూడా వదిలిపెట్టరు". ఇన్నార్‌లో ఆమె ఇంటిని రెండుసార్లు తగలబెట్టారు. ఒకసారి నాగా బెటాలియన్, ఒకసారి సిఆర్.పి.ఎఫ్. సుఖియాని అరెస్టు చేసి 7 నెలలు జగదల్‌పూర్ జైల్లో పెట్టారు.

"ఒకసారి వాళ్ళు మగవాళ్ళందర్నీ నక్సలైట్లని చెప్పి మొత్తం ఊరందర్నీ తీసుకుపోయారు. ఆడవాళ్ళు, పిల్లలందరితో సుఖియారి వాళ్ళననుసరించింది. వాళ్ళంతా పోలీసు స్టేషను చుట్టుముట్టి మగవాళ్ళనందర్నీ విడిచిపెట్టేదాకా కదలమన్నారు. "ఎప్పుడైనా వాళ్ళు ఎవరి నన్నా పట్టుకపోతే మీరు వెంటనేపోయి వాళ్ళను వెనక్కి లాక్కురావాలి. వాళ్ళేదైనా రిపోర్టు రాయకముందే. ఒకసారి వాళ్ళు పుస్తకంలో రాస్తే, అప్పుడది చాలా కష్టమైపోతుంది".

సుఖియారిని చిన్నప్పుడు ఆమె కంటే వయసులో చాలా పెద్దవాడు ఎత్తుకుపోయి బలవంతంగా పెళ్ళి చేసుకున్నాడు. ఆమె పారిపోయి వాళ్ళక్క దగ్గరికిపోయింది. ఇప్పుడామె పెద్ద పెద్ద ఊరేగింపులను నడిపిస్తోంది. సభల్లో మాట్లాడుతుంది. మగవాళ్ళు రక్షణకోసం ఆమె మీద ఆధారపడతారు. మీ దృష్టిలో పార్టీ అంటే ఏమిటని నేనామెనడిగాను. "నక్సల్ వాచ్‌కాద్‌మత్‌ల హమ్‌రా పరివార్ (నక్సలైట్లంటే మా కుటుంబం) ఎప్పుడైనా దాడి జరిగిందని విన్నప్పుడు, మా కుటుంబానికే కష్టమొచ్చినట్లుంటుంది" అంది సుఖియారి.

ఆమెకు మావో గురించి తెలుసేమోనని అడిగాను. ఆమె సిగ్గుపడుతూ నవ్వింది "ఆయన మా నాయకుడు. ఆయన ఆశయం కోసం మేం పని చేస్తున్నాం".

కామ్రేడ్ సోమారి గాన్డీవి కలిశాను. ఆమెకు ఇరవై ఏళ్ళు. ఆమె అప్పటికే జగదల్‌పూర్‌లో రెండేళ్ళు జైలుశిక్ష అనుభవించింది.

2007 జనవరిలో 740 మంది పోలీసులు చుట్టుముట్టిన ఇన్నార్ గ్రామంలో ఆమె ఉంది. కామ్రేడ్ నితి ఉన్నట్లు సమాచారమందుకొని (ఆమె ఉండింది కాని వాళ్ళొచ్చే సమయానికే వెళ్ళిపోయింది) పోలీసులక్కడికొచ్చారు. కాని గ్రామ మిలిషియా అందులో సభ్యురాలైన సోమారి ఇంకా అక్కడే ఉన్నారు. తెల్లవారుజామును పోలీసులు కాల్పులు మొదలుపెట్టారు. సుక్‌లాల్ గాన్డీ, కచ్రో గోటా అనే ఇద్దరబ్బాయిలను చంపేశారు. తర్వాత వాళ్ళు మరో ముగ్గుర్ని పట్టుకున్నారు. వాళ్ళు సోమారి, ఇంకో ఇద్దరబ్బాయిలు దస్రీ సలాం, రనాయ్‌లు. దస్రీ, రనాయ్‌లను కట్టేసి కాల్చి చంపారు. సోమారిని దాదాపు చచ్చేదాకా కొట్టారు. ఒక ట్రాక్టర్‌ను తీసుకొచ్చి దాని ట్రాలీలో మృతదేహాలను పడేశారు. సోమారిని మృతదేహాల పక్కన కూర్చోబెట్టి నారాయణ్‌పూర్ తీసుకెళ్ళారు.

2009 జూలై 6న కాల్చి చంపబడిన కా.దిలీప్ తల్లి చమ్రిని కలిశాను. తన కొడుకును చంపేశాక అతని శవాన్ని జంతువుని కట్టేసినట్లుగా పొడవాటి కర్రకు కట్టేసి పట్టుకుపోయారని ఆమె చెప్పింది. (వాళ్ళు నగదు బహుమతుల కోసం శవాల్ని చూపించాలి. అది కూడా వేటాడిన మాంసంకోసం ఇంకొకరు రాకముందే). ఆమె వాళ్ళ వెనకే పోలీసుస్టేషన్‌కు పరిగెత్తుకుంటూ వెళ్ళింది. వాళ్ళక్కడికి చేరుకునే వరకు మృతదేహం పైన నూలుపోగు కూడా లేదు. చమ్రి చెప్పింది. దారిలో డాబాలో టీ, బిస్కెట్లు తినడానికి (వాటి డబ్బులివ్వ లేదు) ఆగినపుడు వాళ్ళు శవాన్ని రోడ్డుపక్కన ఉంచారు. ఒక్క క్షణం ఊహించుకోండి. అడవి దారిలో కొడుకు శవం వెంట పరిగెత్తుతూ కొంత దూరంలో ఆగి హంతకులు టీ తాగే దాకా ఎదురు చేసే దృశ్యం. వాళ్ళామెకు కొడుకు శవాన్ని కూడా దక్కనివ్వలేదు. సక్రమంగా అంత్యక్రియలు చేయడానికి కూడా. ఆ రోజు అతనితోపాటు వాళ్ళు చంపిన మిగతా వాళ్ళ శవాలతోపాటు అతన్ని పూడ్చి పెట్టేటప్పుడు ఆ తల్లికి పిడికెడు మట్టిని మాత్రం గుంతలో పోసే అవకాశాన్నిచ్చారు. ఆమెకు ప్రతీకారం కావాలంటుంది. బద్లాకు బద్లా, రక్తానికి రక్తం.

ఆరు గ్రామాలకు సారధ్యం వహించే మార్స్ కోలా జనతన సర్కార్‌కు ఎన్నికైన సభ్యులను కలిశాను. వాళ్ళొక పోలీసు దాడిని గురించి వివరించారు. వాళ్ళు రాత్రిపూట వస్తారు. 300, 400 ఒక్కోసారి 1000 మంది. వాళ్ళు ఒక గ్రామాన్ని చుట్టు ముట్టి కనిపించకుండా దాక్కుంటారు. ఉదయాన్నే మొదట పొలాల్లోకి పోయే వాళ్ళను పట్టుకొని మానవ కవచాలుగా పెట్టుకొని ఊర్లోకొస్తారు. బూబీట్రాప్స్ (తాకితే పేలిపోయే ఒక రకం ఉచ్చు) ఎక్కడున్నాయో చూపించడానికి వాళ్ళను పట్టుకుంటారు. (బూబీ ట్రాప్స్ ఇప్పుడు గోండు పదమైపోయింది. దాని గురించి మాట్లాడుతున్నప్పుడు, విన్నపుడు అందరూ నవ్వుతారు. అడవి మొత్తం బూబీ ట్రాప్స్‌తో నిండిపోయింది. కొన్ని నిజమైనవి, కొన్ని నకిలీవి. చివరికి పిఎల్‌జీఏ కూడా గ్రామాల్లోకి రావాలంటే గ్రామస్తులు దారి చూపాల్సిందే). ఒక్కసారి పోలీసులు ఊర్లోకి ప్రవేశిస్తే వాళ్ళు లూటీలు, దోపిడీలు చేసి ఇళ్ళను తగలబెడతారు. వాళ్ళు కుక్కల్ని తీసుకొని వస్తారు. పారిపోవడానికి ప్రయత్నించే వాళ్ళను కుక్కలు పట్టుకుంటాయి. కోళ్ళను, పందులను వెంబడించి పట్టుకొని, పోలీసులు వాటిని చంపి పెద్ద పెద్ద సంచుల్లో వేసుకొని పోతారు. పోలీసులతోపాటు యస్పీవోలొస్తారు. ప్రజలు డబ్బు, నగలు ఎక్కడ దాచుకుంటారో తెలిసినోళ్ళు వాళ్ళే. జనాన్ని పట్టుకొనిపోయి డబ్బులు తీసేసుకొని విడిచి పెడతారు. వాళ్ళెప్పుడూ కొన్ని నక్సలైట్ దుస్తుల్ని వెంట తీసుకెళ్తారు. ఒక వేళ వాళ్ళు చంపాల్సిన మనుషులు దొరికితే అవి పనికొస్తాయి. నక్సలైట్లను చంపితే వాళ్ళకు డబ్బులొస్తాయి.

అందుకోసం వాళ్ళు కొన్నింటిని కుట్టించుకొని పెట్టుకుంటారు. ఇళ్ళలో ఉండటానికి గ్రామస్తులు విపరీతంగా భయపడి పోతున్నారు.

ప్రశాంతంగా కనిపించే ఈ అడవిలో జీవితం మొత్తంగా ఇప్పుడు యుద్ధమయమైపోయింది. ప్రజలకు కార్డన్, సెర్చ్, ఫైరింగ్, అడ్వాన్స్, రిట్రీట్, డౌన్, యాక్షన్ వంటి పదాలు తెలుసు. వాళ్ళ పంటకోతలకు గస్తీ తిరుగుతూ సెంట్రీ చేసే పీఎల్‌జీఏ కావాలి. సంతకు పోవడం కూడా ఒక మిలిటరీ కార్యక్రమం. మార్కెట్లన్నీ ముఖ్‌బీర్ (ఇన్ఫార్మర్లు)లతో నిండి ఉంటాయి. గ్రామాల నుండి వాళ్ళను పోలీసులు డబ్బు ఎరకు (నెలకు 1500 రూపాయలు) చిక్కించుకుంటున్నారు. నారాయణ్‌పూర్‌లో ఒక ముఖ్‌బీర్ మొహల్లా - ఇన్ఫార్మర్ల కాలనీ ఉందని నాకు చెప్పారు. అక్కడ కనీసం నాలుగువేల మంది ముఖ్‌బీర్లుంటారు. ఏదైనా కొంచెం ఎక్కువ కొనుక్కున్నా నక్సలైట్ల కోసం కొన్నారని పోలీసులు ఆరోపిస్తారు. మందుల దుకాణం వాళ్ళకు ప్రజలకు చిన్న చిన్న ప్రమాణాల్లో తప్పితే మందులు అమ్మకూడదని ఆదేశాలున్నాయి. ప్రజా పంపిణీ వ్యవస్థ నుండి తక్కువ ధరలో అందాల్సిన చెక్కెర, బియ్యం, కిరోసిన్ రేషన్లు పోలీసు స్టేషన్లలోనో, వాటి దగ్గరో నిలువ చేసి చాలా మంది ప్రజలకు వాటిని కొనుక్కోవడం అసాధ్యం చేశారు.

జాతి హననాన్ని నివారించేందుకు, ఆ నేరంపై చర్య తీసుకునేందుకు ఉద్దేశించిన ఐక్యరాజ్యసమితి ఆర్టికల్ 2 జాతి హననాన్ని ఈ విధంగా విశదీకరిస్తుంది.

ఒక దేశ ప్రజల లేదా, సాంస్కృతిక తెగల లేదా, జాతి, మత సమూహాలను మొత్తంగా గాని, పాక్షికంగా గాని నిర్మూలించే ఉద్దేశంతో పాల్పడిన ఏవైనా ఈ కింది చర్యలు జాతి హననం కిందికొస్తాయి. ఒక సమూహంలోని సభ్యులను చంపటం; తీవ్రమైన శారీరక లేదా మానసిక హింసకు గురిచేయడం; మొత్తంగా కాని, పాక్షికంగాకాని ఒక సమూహాన్ని భౌతికంగా ధ్వంసం చేయడానికి ఉద్దేశించిన నియమాలను వారి జీవితంపై బలవంతంగా రుద్దటం; ఒక సమూహం లోపల జననాలను నివారించే చర్యలకు పాల్పడటం; లేదా బలవంతంగా ఒక సమూహంలోని పిల్లలను ఇంకో సమూహంలోకి తరలించటం.

నడిచి నడిచి నా పనైపోయింది. బాగా అలసిపోయాను. కమల నాకోసం కుండ నిండా వేణ్ణీళ్ళు తెచ్చిచ్చింది. నేను చీకట్లో ఒక చెట్టు వెనక స్నానం చేశాను. కాని భోజనం చేసే ఓపిక లేక నిద్రపోవడానికి నా పక్కలోకి జారుకున్నా కామ్రేడ్ రాజు మేం బయలుదేరాలని ఆదేశించాడు.

ఇది తరచుగా జరుగుతుండడం మామూలే గాని ఈ రోజు చాలా కష్టంగా ఉంది. మా క్యాంపు పచ్చిక బయలులో వేశాం. కొంత దూరంలో పేలుడు శబ్దం వినబడింది. మేము 104 మందిమి. మరోసారి రాత్రి గుండా ఒకే వరుసలో నడక. కీచురాళ్ళు. ఏదో లావెండర్‌లాంటి వాసన. రాత్రి గడపడానికి మెమో చోటికొచ్చేసరికి పదకొండు గంటలు దాటింది. బండరాళ్ళు మొలకెత్తినట్టున్న నేల. వరుసగా నిలబడ్డాం (ఫార్మేషన్). యధావిధిగా రోల్‌కాల్. ఎవరో రేడియో పెట్టారు. పశ్చిమబెంగాల్ లోని లాల్‌ఘడ్‌లో ఈస్టర్న్ ఫ్రాంటియర్స్ రైఫిల్స్ క్యాంపు మీద దాడి జరిగిందని బిబిసి చెప్తోంది. 60 మంది మావోయిస్టులు మోటార్ సైకిళ్ళ మీద వచ్చారు. 14 మంది పోలీసులు చనిపోయారు. 10 మంది గల్లంతయ్యారు. ఆయుధాలు అపహరించబడ్డాయి. సభ్యుల్లో సంతోషపు గొల గొల ధ్వనులు. మావోయిస్టు నేత కిషన్‌జీని ఇంటర్వ్యూ చేస్తున్నారు. ఈ హింసను ఆపి మీరు చర్చలకెప్పుడొస్తారు? ఆపరేషన్ గ్రీన్‌హంట్‌ను నిలిపేశాక, ఎప్పుడైనా. మేం చర్చిస్తామని చిదరంబరంకు చెప్పండి. తర్వాతి ప్రశ్న : చీకటి పడింది. మీరు మందుపాతరలు (ల్యాండ్ మైన్స్) అమర్చారు. అదనపు బలగాలను పిలిపించారు. మీరు వారిపై కూడా దాడి చేస్తారా? కిషన్ జీ : ఔను. సహజంగానే, లేకపోతే ప్రజలు నన్ను కొడతారు. సభ్యుల్లో నవ్వులు. సుఖ్‌దేవ్ వివరణ ఇస్తూ అన్నాడు. "వాళ్ళెప్పుడూ ల్యాండ్ మైన్స్ అంటుంటారు. మేం ల్యాండ్ మైన్స్ వాడము, మేం వాడేది ఐఇడిలు".

వేయి నక్షత్రాల హోటల్లో ఇంకో ఆడంబరమైన విడిది. నాకు వంట్లో బాగోలేదు. వర్షం మొదలైంది. అక్కడ ముసి ముసి నవ్వులు. కమల నాపైకి ఝుల్లీ విసిరింది. నాకింకేం కావాలి? మిగతా వాళ్ళు కూడా వాళ్ళ ఝుల్లీ లోపలికి దూరిపోయారు.

ఉదయానికల్లా లాల్‌ఘడ్‌లో మృతుల సంఖ్య 21కి పెరిగింది. 10 మంది గల్లంతు.

ఈ ఉదయం కామ్రేడ్ రాజు కొంత దయ చూపించాడు. సాయంత్రం దాకా మేం కదలం.

ఒక రాత్రి పూట అందరూ వెలుతురు చుట్టూ చిమటల్లా గుమిగూడారు. అది సౌరశక్తి బ్యాటరీతో నడిచే కామ్రేడ్ సుఖ్‌దేవ్ చిన్న కంప్యూటర్. తుపాకీ గొట్టాలను ఆకాశం వంక ఎక్కుబెట్టి వాళ్ళంతా 'మదరిండియా' చూస్తున్నారు. కమల నిరాసక్తంగా కనబడింది. ఆమెకు సినిమాలంటే ఇష్టం లేదేమోనని అడిగా. "నహీ దీదీ సిర్ఫ్ ఆంబుష్ వీడియో" (లేదక్కా ఆంబుష్ విడియోలే చూస్తా). ఈ అంబుష్ విడియోల గురించి తర్వాత కామ్రేడ్ సుఖ్‌దేవ్‌నడిగా. కన్నార్పే లోపే ఒకటి పెట్టాడు నా కోసం.

అది దండకారణ్య దృశ్యాలతో మొదవుతుంది. నదులు, జలపాతాలు, క్లోజప్‌లో ఆకులు రాలిన చెట్టుకొమ్మ, జెముడుకాకి (కుకూ పక్షి) పిలుపు.

ఉన్నట్లుండి ఓ కామ్రేడ్ ఒక ఐఇడికి వైర్లు తగిలించి వాటిపై ఎండిపోయిన ఆకులు కప్పి దాచేస్తున్నాడు. ఒక మోటార్ సైకిళ్ళ వరుసను పేల్చేశారు. అక్కడ ముక్కలైన శరీరాలు, కాలిపోతున్న బైకులు. ఆయుధాలు అపహరించారు. బిక్క చచ్చిపోయి ఉన్న ముగ్గురు పోలీసుల్ని కట్టేశారు.

ఎవరు దీన్ని చిత్రీకరిస్తున్నారు? ఎవరు దర్శకత్వం వహిస్తున్నారు? పట్టుబడిన పోలీసులు లొంగిపోతే విడుదల చేస్తామని ఎవరు భరోసా ఇస్తున్నారు? (వాళ్ళను వదిలేశారు, నేను తర్వాత ధృవపరుచుకున్నాను).

నాకా సౌమ్యమైన, విశ్వసనీయమైన గొంతు తెలుసు. అది కామ్రేడ్ వేణుది.

"అది కూడూర్ అంబుష్" అన్నడు సుఖ్‌దేవ్.

అతని దగ్గర తగలబెట్టిన ఊళ్ళు, ప్రత్యక్ష సాక్షుల, మృతుల బంధువుల కథనాల వీడియో సేకరణ కూడా ఉంది. ఒక కాలిపోయిన ఇంటి సగం కాలిన గోడ మీద 'నాగా! చంపడానికే పుట్టింది!' అని రాసుంది. ఆపరేషన్ గ్రీన్‌హంట్ బస్తర్ అధ్యయనానికి నాందిగా వేళ్ళు నరికేయబడ్డ చిన్న పిల్ల వాడి దృశ్యాలున్నాయి. (చాలా విచిత్రం. నా టి.వి. ఇంటర్వ్యూ కూడా ఉంది. నా అధ్యయనాలు, నా పుస్తకాలు)

రాత్రి రేడియోలో ఇంకొక నక్సల్ దాడిని గురించిన వార్త. ఇది బీహార్‌లోని జమాయ్‌లో. 125 మంది మావోయిస్టులు ఒక గ్రామంపై దాడి చేసి కోయ జాతి ఆదివాసులను చంపారు. పోలీసులకు సమాచారమందించి ఆరుగురు మావోయిస్టుల చావుకు కారణమయ్యారని ప్రతీకార దాడికి దిగారని ఆ వార్త చెప్పింది. మాకు తెలుసు. అది నిజం కావొచ్చు. కాకపోవచ్చు. కాని నిజమైతే ఇది క్షమించరానిది. కామ్రేడ్ రాజు, సుఖ్‌దేవ్‌లు బాగా అసహనంగా కనపడుతున్నారు.

జార్ఖండ్ నుండి, బీహార్ నుండి వస్తున్న వార్తలు ఆందోళన కలిగిస్తున్నాయి. పోలీసు అధికారి ఫ్రాన్సిస్ ఇందువర్ తల నరికేసిన బీభత్సం ఇంకా అందరి మనసుల్లో పచ్చిగానే ఉంది. ఒక క్రమశిక్షణాయుత సాయుధ పోరాటం ఎంత సులభంగా నేరపూరిత లంపెన్ హింసగాను, కులాలు, తెగలు మతాల సమూహాల మధ్య వికారమైన ఆధిపత్య పోరుగాను ఎలా చెదిరిపోగలదో అన్నదానికి ఇదో హెచ్చరిక. భారత ప్రభుత్వం దాని విధానాలలో అన్యాయాన్ని వ్యవస్థీకృతం చేసి ఈ దేశాన్ని తీవ్రమైన అలజడులతో నిప్పుల కుంపటిగా మార్చేసింది. ప్రభుత్వం ఒక వేళ సి.పి.ఐ (మావోయిస్టు) పార్టీ

ముఖ్యులను గురి చూసి చంపుతూ దానికి నాయకత్వం లేకుండా చేస్తే హింసను అంతం చేయవచ్చనుకుంటే అది దారుణమైన పొరపాటు. దానికి విరుద్ధంగా హింస ప్రబలిపోయి తీవ్రతరమవుతుంది. ప్రభుత్వానికి చర్చలు జరపడానికి కూడా ఎవరూ ఉండరు.

నా చివరి కొద్ది రోజుల్లో మేము చిక్కగా పచ్చదనం సమృద్ధిగా ఉన్న మనోహరమైన ఇంద్రావతి లోయగుండా సంచరించాము. మేము కొండ పక్కగా నడుస్తున్నప్పుడు అదే దిశలో నడుస్తున్న మనుషుల వరుసను ఇంకోదాన్ని చూశాను. వాళ్ళు నదికి ఆవలి పక్కనున్నారు. వాళ్ళు కూడూరు గ్రామంలో డ్యామ్‌కు వ్యతిరేకంగా జరిగే సభకు పోతున్నారని చెప్పారు. వాళ్లు నేల విడిచి ఉన్నారు. నిరాయుధులు. నేను పడవలోకి దూకి వాళ్ళను కలుసుకున్నాను.

మేము కొద్దిరోజులుగా నడుస్తున్న ప్రాంతాన్నంతే బోధ్‌ఘాట్ డ్యాం ముంచేస్తుందంట. ఆ అడవినంతటినీ, దాని చరిత్రనంతటినీ, ఆ కథలనన్నింటినీ. 100కు పైగా గ్రామాలు. ప్రజలందరినీ ఎలుకల్లా ముంచిసి, లోహండి గూడలో సమీకృత ఉక్కు కర్మాగారాలకు, కేశ్‌కాల్ పర్వతాల్లో బాక్సైట్ గనికి, అల్యూమినియం శుద్ధి కేంద్రానికి నదిని తీసుకుపోతారా? అయితే అదా ప్రణాళిక ?

సభకు మైళ్ళ దూరం నుండి వచ్చిన ప్రజలు మేం సంవత్సరాలుగా వింటున్నదాన్నే చెప్పారు. మేం మునిగిపోతాం, కాని ఇక్కడి నుండి కదలం. ఎవరో ఢిల్లీ నుండి వచ్చిన వ్యక్తి వాళ్ళతో ఉందని ఉత్సాహపడ్డారు. ఢిల్లీ చాలా దుర్మార్గమైన నగరమని, దానికి వీళ్ళు తెలియదని, తెలిసినా పట్టించుకోదని నేను వాళ్ళతో చెప్పాను.

దండకారణ్యానికి రావడానికి కొన్ని వారాల ముందే నేను గుజరాత్ వెళ్ళాను. సర్దార్ సరోవర్ డ్యాం కొంచెం అటో ఇటో పూర్తి ఎత్తుకు పెరిగిందిప్పుడు. నర్మదా బచావో ఆందోళన (ఎన్‌బిఏ) ఏమేం జరుగుతుందని జోస్యం చెప్పిందో దాదాపు ప్రతి ఒక్కటి జరిగిపోయింది. నిర్వాసితులైన ప్రజలకు పునరావాసం కల్పించలేదు. అది మామూలే. కాలువలు ఇంకా కట్టలేదు. డబ్బుల్లేవు. కాబట్టి నర్మద నీటిని వట్టిపోయిన సబర్మతి (చాలా కాలం క్రితం దీనికి ఆనకట్ట కట్టారు) నదిలోకి మళ్లించారు. చాలా వరకు నీటినంతా నగరాలు, పెద్ద పరిశ్రమలు పీల్చేస్తున్నాయి. ఆ ప్రవాహం ప్రభావాలు - నదిలేని సరస్సులోకి వచ్చే ఉప్పునీరు - దాన్ని తగ్గించడం అసాధ్యమైపోతోంది.

భారీ ఆనకట్టలు ఆధునిక భారతదేశానికి దేవాలయాలని నమ్మే కాలంలో ఈ పొరపాటును అర్థం చేసుకోవచ్చు. కాని ఈ రోజు, అంతా జరిగి పోయాక కూడా మనమేం చేస్తున్నామో అర్థమయ్యాక భారీ ఆనకట్టలు మానవత్వానికి ద్రోహమని చెప్పాలి.

1984లో స్థానిక ప్రజల ఆందోళన తర్వాత బోధ్‌ఘాట్ ఆనకట్టను నిలిపేశారు. ఇప్పుడెవరు దాన్ని ఆపుతారు? పునాది రాయి వెయ్యకుండా ఎవరు నిరోధిస్తారు? ఇంద్రావతిని దొంగిలించకుండా ఎవరు ఆపుతారు? ఎవరో ఒకరు ఆపాలి.

చివరి రాత్రి మా క్యాంపు ఉదయాన్నే మేం ఎక్కాల్సిన నిటారు కొండ కింద. ఉదయం దాన్నెక్కి రోడ్డు మీద తేలితే నన్ను తీసుకెళ్ళాల్సిన మోటార్ సైకిల్ అక్కడికొస్తుంది. నేను మొదట ప్రవేశించినప్పటి అడవి కొంచెం మారింది. చిరోంజి, పత్తి, మామిడి చెట్లు పూతకొచ్చాయి.

కూడూర్ గ్రామస్తులు నాకోసం ఒక పెద్ద కుండ నిండా తాజాగా పట్టిన చేపల్ని క్యాంపుకు పంపించారు. ఇంకా నాకోసం వాళ్ళ పొలాల్లో పండించేవి, అడవిలో దొరికేవి 71 రకాల పళ్ళు, కూరగాయలు, పప్పుధాన్యాలు, పురుగులు వాటి మార్కెట్ ధరతో సహా ఒక జాబితా కూడా ఇచ్చారు. అది కేవలం జాబితా కాదు. వాళ్ళ ప్రపంచ పటం.

జంగిల్ పోస్ట్‌వచ్చింది. నాకు రెండు బిస్కెట్లొచ్చాయి. కామ్రేడ్ నర్మద నుండి ఒక కవిత, ఒక వొత్తి పెట్టిన పువ్వు. కామ్రేడ్ మాసే న అందమైన ఉత్తరం (ఎవరీమె? నేనెప్పటికైనా తెలుసుకోగలనా?)

నా ఐపాడ్ నుండి తన కంప్యూటర్‌లోకి పాటలు డౌన్‌లోడ్ చేసుక కామ్రేడ్ సుఖ్‌దేవ్ అడిగాడు. జియా ఉల్‌హక్ రోజుల్లోని భయ నిర్బంధంలో లాహోర్ లో జరిగిన ఒక సంగీత కార్యక్రమంలో ఇక్ బ పాడిన ఫయాజ్ అహ్మద్‌ఫయాజ్ 'హమ్‌దేఖ్‌లేంగే' ( ఆ రోజును మేం చ పాటను వింటున్నాము.

జబ్ అల్ - ఎ-సఫా - మరదద్ -ఎ-హరామ్
మస్‌నద్ పే బిఠాయే జాయేంగే
దుర్మార్గులు తిరస్కరించబడ్డవారు
గద్దెనెక్కి కూర్చున్న
సబ్ తాజ్ ఉచ్‌లే జాయేంగే
సబ్ తఖ్త్ గిరాయే జాయేంగే
ఎప్పుడో ఒకప్పుడు వారి కిరీటాలు తొలగించబడటాన్ని
వారి సింహాసనాలు పడిపోవటాన్ని
హమ్ దేఖ్‌లేంగే
మేం తప్పక చూస్తాము.

అప్పుడు, అక్కడ పాకిస్తాన్‌లో యాభైవేలమంది ప్రేక్షక జనం ఇ జిందాబాద్! ఇంక్విలాబ్ జిందాబాద్ అంటూ ధిక్కార పదం పాడా సంవత్సరాల తర్వాత ఆ పాట ఈ అడవి చుట్టూ ప్రతిధ్వనిస్తోం చిత్రంగా ఏర్పడింది, ఈ సంబంధం.

హోంమంత్రి "మావోయిస్టులకు బౌద్ధిక, భౌతిక మద్దతునిస్తూ ప చేసేవాళ్ళను నర్మగర్భంగా హెచ్చరిస్తున్నాడు. ఇక్ బాల్‌బానో అభి పంచుకోవటం కూడా దీని కిందికే వస్తుందా?

సూర్యోదయం వేళ కామ్రేడ్ మాధవ్, కామ్రేడ్ జూరీలకు మంగ్తుకు, అందరికీ వీడ్కోలు చెప్పాను. కామ్రేడ్ చందు ఏర్పాటుచేయడానికి వెళ్ళాడు. అతను నాతోపాటు ప్రధాన రహద వస్తాడు. కామ్రేడ్ రాజు రావటం లేదు (పై కెక్కడం అతని మె నరకప్రాయమౌతుంది). కామ్రేడ్ నితి (మోస్ట్ వాంటెడ్), కామ్రేడ్ కమల, మరో ఐదుగురు నన్ను కొండపైకి తీసుకెళ్ళారు. మే మొదలుపెట్టాక నితి, సుఖ్‌దేవ్‌లు యథాలాపంగా, ఇద్దరూ ఒకేస ఏకేల సేఫ్టీ క్యాచ్‌లను తొలగించారు. వాళ్ళలా చేస్తుండగా మొదటిసారి. మనం 'సరిహద్దు'ను సమీపిస్తున్నాం. "ఒక వేళ వ కాల్పులు జరిగితే ఏం చేయాలో మీకు తెలుసా" అంటూ ఇదేదో చాలా సహజమైన విషయమైనట్టు యథాలాపంగా అడిగాడు సుఖ్

"తెలుసు" అన్నాను "వెంటనే నిరవధిక నిరాహార దీక్షను ప్రక

అతనో బండమీద కూర్చోని నవ్వాడు. దాదాపు ఒక గం పైకెక్కుతూ వెళ్ళాము. రోడ్డుకు కొంచెం కింద ఒక రాతి మం కూర్చున్నాము. ఆంబుష్ దళం లాగా పూర్తిగా కనిపించకుండా దాక్కొ శబ్దాన్ని నిరీక్షిస్తున్నాం. అది విన్నపడినప్పుడు వీడ్కోలు త్వరగా అయ లాల్‌సలామ్ కామ్రేడ్స్.

నేను వెనక్కి తిరిగి చూసినప్పుడు వాళ్ళక్కడే ఉన్నారు, చేతుల చిక్కుముడేం కాదు. విషయం చాలా చిన్నది. మిగతా ప్రపంచమంతా బతుకుతుంటే, వీళ్ళు భవిష్యత్ స్వప్నాలతో బతికేవాళ్లు. ప్రతి ర ప్రయాణాన్ని గురించి ఆలోచిస్తాను. ఆ రాత్రి ఆకాశం, ఆ అడవి నా టార్చ్ వెలుగులో కామ్రేడ్ కమల బిగుతు చెప్పుల్లోని ఆమె కాలి చూడగలుగుతున్నా. ఆ నడక కేవలం ఆమె కోసమే కాదు. మనంద ఆశల్ని సజీవంగా ఉంచడానికి.

(29 మార్చి 2010 ఔట్‌లుక్‌లోని అరుంధతిరాయ్ "వాకిం

వ్యాసం

◆ నల్లూరి రుక్మిణి

# పేదలు సంతోషంగా వుండటం చిదంబరానికి ఎందుకు నచ్చదో!

ఇండియన్ విమెన్స్ ప్రెస్ కార్ప్స్‌లో (ఢిల్లీ) 20-2-10 నాడు కేంద్ర హోంమంత్రి చిదంబరం మాట్లాడుతూ (ఆంధ్రజ్యోతి, శనివారం) “ఆయుధాలు వీడాలనలేదు” హెడ్డింగు కింద మావోయిస్టుల కార్యకలాపాల గురించి వ్యాఖ్యానిస్తున్న సందర్భంలో “ప్రభుత్వ అణిచివేత విధానాలతోనే మావోయిస్టుల హింస మళ్ళీ పెరుగుతుందన్న జర్నలిస్టుల వ్యాఖ్యలకు జవాబిస్తూ ‘ప్రభుత్వం ఎటువంటి చర్యలూ చేపట్టకపోతే, మావోయిస్టులు సంతోషంగా వుంటారని, తమ ఉద్యమాన్ని విస్తరించుకుంటారని’ వ్యాఖ్యానించారు”.

ఇందులో చిదంబరానికున్న బాధేమిటో అర్థంకాదు. పైగా మావోయిస్టులు సంతోషంగా వుంటారన్న దుగ్ధ ఒకటి. నిజానికి ఆ గిరిజనులకు ఆ మావోయిస్టులు ఏం చేస్తున్నారూ? అది వాళ్ళకు ఇబ్బంది కలిగిస్తోందా? మేలు చేస్తోందా? ఆ విషయం వాళ్ళు గదా చెప్పాల్సింది?

నిజానికి సాల్వాజుడుం, కోబ్రాలు, గ్రీన్‌హంట్ ఏర్పాటువల్ల ప్రభుత్వం ఆదివాసీలకు చేసిన అభివృద్ధి, పురోగతి ఏమిటో చిదంబరం చెప్తే సంతోషిస్తాం గదా! అదలా వుంచుదాం.

ఆయనకు తను సాధించిన విజయాలను గురించి సొంత డప్పు కొట్టుకోవడానికి మొహమాటంగానూ, బిడియంగానూ వుందేమో పాపం! అందుకే ఆయన ఘనత గురించి మనమే లోకానికి చెప్పడం మంచిది కదా! ఆయన హోంమంత్రి అయినప్పటినుండి చేసిన ఘనకార్యాలు మరొకప్పుడు చూద్దాంగానీ ఇప్పుడు మాత్రం ఛత్తీస్‌ఘఢ్‌లో ఆయన ఏర్పాటు చేసిన ‘గ్రీన్‌హంట్’ నిర్వాహకం గురించి చెప్పుకుందాం.

గ్రీన్‌హంట్ వ్యతిరేక కమిటి ఆధ్వర్యంలో ఫిబ్రవరి 12,13 తేదీలలో ఛత్తీస్‌ఘడ్‌కూ, ఆ రాష్ట్ర సరిహద్దు ప్రాంతాలయిన చింతూరు, చర్ల, ఖమ్మం, భద్రాచలం ప్రాంతాలలో నిజనిర్ధారణ కమిటి పర్యటించి, చూసిన వాస్తవాలు ఎంత ‘అందంగా’ వున్నాయో చెప్పుకుంటే చిదంబరం ‘ఘనత’ కొంత అర్థమవుతుంది. ఈ కమిటీలో దాదాపు నలభై ఐదుమంది ఢిల్లీ, కర్నాటక, నాగాలాండ్, కేరళ, తమిళనాడు, ఆంధ్ర ప్రదేశాలకు చెందిన వారు రెండు రోజుల పాటు మూడు టీంలుగా ఆ ప్రాంతాలలో తిరిగి ఆదివాసీలను కలిసి తెలుసుకున్న నిజాలు.

మా ‘టీం’లో ఇతర రాష్ట్రాలనుండి వచ్చిన ప్రీతి, ఓం ప్రకాశ్, గోపాలన్ తదితర మిత్రులతోపాటు మన రాష్ట్రానికి చెందిన మరికొంతమంది కలిపి మొత్తం పదిహేను మందిమి వున్నాం.

మొదటిరోజు చింతూరు మండలం తాటిలంక గ్రామం వైపు ఆదివాసీలున్నారన్న సమాచారంతో అటువెళ్ళాం. చింతూరు ఛత్తీస్‌ఘడ్ బోర్డరు గ్రామం అయిన కుంట అక్కడికి నాలుగైదు మైళ్ళే. ఆదివాసీలున్నారన్న ప్రాంతానికి చాలా దూరంలోనే మా వాహనాలు ఆగిపోయాయి. దాదాపు మూడు కిలోమీటర్లు లోపల అడవిలోకి నడిచి వెళ్ళితేగానీ ఆ ఆదివాసీల గుంపు కనబడలేదు. వీరు దంతెవాడ జిల్లా ‘ఓంనార్’ ‘మకునార్’ ‘అర్లంపల్లి’, ‘నీరుడిపెంట’ గ్రామాల నుండి వచ్చామని చెప్పారు. వీరిలో రేగుల గుట్ట పంచాయితీ సర్పంచ్ సోడి కాశయ్య కూడా వున్నాడు. ఇతనికి ముప్పై ఎకరాల భూమి కూడా వుంది. ఆ గ్రామంలో అతనికే కాదు అక్కడ వున్న మడవి ఇడియాకు నాగేశ్‌కి, దూలయ్యలకు కూడా, భూమి వుంది. అయినా అన్నీ

వదులుకుని చెట్టుకొకరు పుట్టకొకరుగా వచ్చేశారు. ఎందుకు వ దాదాలకు అన్నం పెడుతున్నామని జుడుం వాళ్ళు హింసపెడుతున్నా కాల్చేశారని చెప్పారు.

సోడి కాశయ్యకైతే ఇంకా రేగుల గుట్టలో సగం కుటుంబం వుంది. వాళ్ళు బిక్కుబిక్కుమంటూ గడుపుతున్నారని మిలిట్రిని చ అడవుల్లోకి పరిగెత్తున్నారని చెప్పుకొచ్చారు.

అట్లాగే ‘బలిమెడ’ గుంపులోనూ పదహారు కుటుంబాల వాళ్ళు రేగడి గుట్ట, ఉసకవాలు, బెజ్జి, ఏలమడుగు తదితరగ్రామాల నుండి వాళ్ళు తరిమితే నాలుగు నెలలకింద వచ్చామని చెప్పారు. మీరం వచ్చారా? అంటే! “అట్లా తిరుగుతూ తిరుగుతూ ఎక్కడో ఒకరికొకరం వుంటాం గదాని ఇక్కడ చేరాం”, అన్నారు. వీళ్ళకూ ఒక ఐదెకరాల భూమి,అందరికీ ఇళ్ళూ వున్నాయన్నారు. దాదాలక పెడుతున్నామని పోలీసులు మా వూళ్ళమీద దాడి చేశారు. అంద వదిలిపెట్టి వచ్చాం. కానీ మా ముసలివాళ్ళు అక్కడే వుండి ఇళ్ళని చూ చెప్పారు.

‘బండారు గుంపు’ గూడెం వాళ్ళూ అంతే. వాళ్ళు బూర్గుంపా చేరారు. నలభై కుటుంబాలున్నారు. ‘కుంట మండలం’ సున్నంగూ పార ఏట్పాల్, పెండెల్ వాడ, కోట్రిపాల్, గొర్లి గ్రామాలనుండి వ వచ్చారు. వీళ్ళు ‘సాల్వాజుడుం’ అకృత్యాలకు భయపడి నాలు వచ్చినవాళ్ళు, ముందు భోనగిరిలో వుంటే ఫారెస్టోళ్ళు ఎళ్ళగొట్టారు. రాజనగరం చేరారు. అక్కడ స్థానికులు భూమి విషయమై పే ఇప్పుడు‘బూరుదాయ వూరు’ చేరామని చెప్పారు. వీళ్ళకీ ఛత్తీ ఒక్కొక్కరికి ఐదెకరాల భూమి ఎడ్లు, ఇళ్ళు వున్నాయి.

‘జుడుం’ వాళ్ళు అప్పట్లో ముగ్గురు ముసలి వాళ్ళను చ (పరిగెత్తలేక పోవడంవల్ల) దానితో భయపడివచ్చేశామన్నారు. పొ ఆమెకు ఇరవై ఎడ్లున్నాయని పోలీసులు పది ఎడ్లను కాల్చేశారని ఎంతో బాధపడుతూ చెప్పింది. ధాన్యం, ఇళ్ళు, అన్నీ కాల్చివేశారు ఆ మా పర్యటనలో రెండో రోజు “వెంకటం చెఱువు” గుంపు వె మండలంలో ఛత్తీస్‌ఘడ్‌కు అతి దగ్గరకు వున్నారీ గుంపువాళ్ళు. నిజా ఆ దారంట వెళ్తుంటే ట్రాక్టర్లెక్కి పదుల సంఖ్యలో కూలీలు ఛత్తీస్‌ఘ చర్ల ప్రాంతానికి వస్తున్నారు. వాళ్ళను నిలిపి వివరాలడిగాం. రోజు రూపాయలు కాడికి మిరప కోతకు వెళ్తున్నామని చెప్పారు. వా ఛత్తీస్‌ఘడ్ వెళతామన్నారు. మరి వాళ్ళుండే గ్రామాలలో ‘జుడుం’ ఎలా వుందో తెలియదు. ఒకటిమాత్రం మాకు తెలిసిందేమిటీ అం ఏర్పాటు చేసిన తొలి దశలో సాగించినంత దాడులు తరవాత సాగలేదేమోననిపించింది. అందువల్లే కొన్ని ప్రాంతాలలో, అక్కడ ఆంధ్రా బోర్డరుకు వచ్చిన వాళ్ళ కుటుంబాలలోని వ్యక్తులు కొంద వారి ప్రాంతాలకు వెళ్ళారు. గ్రామాలను, మొండి గోడలను కని వుండటానికి.

ఈ ‘వెంకట చెరువు’ గుంపు ఆదివాసీలది కమలాపురం గ్రా ఆవుపల్లి తాశీలు, బీజపూర్ జిల్లాలోనిది. కమలాపురంలో అరవై కు వుండేవి. అందులో పది కుటుంబాల వాళ్ళు ఆ గుంపులో వుండగా ఇరవై ఇళ్ళు దాకా కాల్చివేశారు. ఇంక కమలాపూర్‌లో మిగిలి పదిహేను ఇళ్ళేనన్నారు. ఈ గుంపులో వున్న మిగిలిన వాళ్ళు మారేడుబాక నుండి వచ్చినవాళ్ళు.

వీళ్ళంతా ఇటీవలి రెండునెలల క్రితం వచ్చారు. అట్లాగే భ దగ్గర అల్లిగూడెం వాళ్ళు కూడా ఈ కాలంలో గొంపోసి ప్రాంత వచ్చారు. వీళ్ళంతా చెప్పింది ఒక్కటేమాట. మీ గ్రామాలువదలి

చంపేస్తున్నారు. అందుకే పారిపోయాం. మరి 'సాల్వాజుడుం' రోజుల్లో నంటే అప్పుడు జనాన్ని కొట్టి, ఇళ్ళు కాల్చేవారు - కొద్దిరోజుల తరవాత తిరిగి పోయేవారు. వాళ్ళు మామూలు మా లాంటి వాళ్ళే గనక ఎదురుతిరగ్గగాం.ఇప్పుడు వీళ్ళు మిలిట్రి కదా! తుపాకులున్నాయి గదా! చచ్చిపోతున్నాం ప్రాణభయంతో అన్నీ వదులుకుని పారిపోయొచ్చామన్నారు.

'పూజారి కాంకేర్'లో గ్రామంమీద బడి జ్వరంతో వున్నవారిని అప్పుడే కట్టెలుకొట్టి అడవినుండి వచ్చిన వాడిని అందరూ చూస్తుండగానే కాల్చి చంపారు. ఇంకో ముసలమ్మను కాల్చివేశారు. అది చూసి 'కాంకేర్' నుండి అడివినిబడి పరిగెత్తాం. అట్లా ఒకర్నిచూసి ఒకరు గుంపులన్నీ చెల్లాచెదరయ్యాం. ఎవరు కలిసినా ఇట్లాంటివే భయానకంగా వార్తలు చెప్పసాగేరు. మారేడు బాన్‌లోకి కృష్ణ, బండారు భీమయ్యలను, గుంజార్‌లో వెల్లంచందులను అరెస్ట్ చేసి ఎన్నో రోజులు స్టేషన్లో పెట్టి చిత్రహింసలు పెట్టారు. అందుకే తిరిగి గ్రామాల్లోకి పోలేక పోయాం. ఇదంతా నవంబరు 2009 ప్రాంతంలో జరిగింది.

దీనికి నెలముందు అక్టోబరులో 'గోంపాడు' ఘటన 'ఛత్తీస్‌ఘడ్' ఆదివాసీలనే కాదు యావత్ సమాజాన్నీ కదిపివేసింది. ఇదంతా 'చిదంబరం' 'గ్రీన్‌హంట్' పుణ్యమే. అక్టోబరు నెలలో ఒక తెల్లవారుజామున 'గ్రీన్‌హంట్' మిలిట్రి పోలీసులు వూరిమీదబడి దొరికిన వాళ్ళను దొరికినట్లు ముసిలీ ముతకా, పిల్లా, పాప అని చూడకుండా చితకబాదడం చూసి మిగిలినవాళ్ళు కకావికలైపారిపోయారు. ఇది చూసిన పోలీసులు పారిపోతున్న ప్రజలను వెనకనుండి కాల్చివేశారు. జనం చూస్తుండగా తొమ్మిదిమందిని పిట్టల్ని కాల్చినట్లు కాల్చేశారు. అందులో కట్టం కన్నమ్మను సామూహికంగా రేప్ చేసి చంపి ఆమె ఏడాదిన్నర బిడ్డ కట్టం సురేష్‌ని వేళ్ళు నరికి తల్లి శవం మీద పడేసి పోయారు. ఇంత దయగల 'గ్రీన్‌హంట్'ని చూసి చిదంబరం సంతోషించగలడుగానీ మనిషి అనేవాడు సంతోషపడగలడా? అదలా వుంచుదాం. ఎన్ని వూళ్ళు తిరిగాం. ఎవరేం చెప్పారన్నది ఏకరువు పెట్టను, గానీ అన్ని గ్రామాలూ ఛత్తీస్‌ఘడ్ నుండి దంతెవాడ జిల్లానుండి - భూములూ ఇళ్ళూ, పంటలు, వదులుకుని బతుకు భయంతో పారిపోయి వచ్చినవాళ్ళు. అయినా దంతెవాడ మీద ప్రేమను వదులుకోని వాళ్ళు.

మీకు దంతెవాడలో ఏముంది? ఎట్లా బతికారూ! అంటే....అందరూ ఒకటే సమాధానం - మాకు ఐదెకరాల భూమి వుంది. వడ్లు పండించుకున్నాం. జొన్నలు రాగులూ పండేవన్నారు. పశువులు వున్నయ్యన్నారు. (నిజానికి మేము తిరిగిన చెల్లా చెదురుగా కుదురుకున్న ఆ గుంపులల్లో కూడా 'ఎడ్లు' చాలా కనిపించాయి. ఛత్తీస్‌ఘడ్ ఆదివాసుల్లో 'ఎడ్లు' ఎక్కువగా వుండటానికి కారణమేమిటో తెలియదు.) కడుపునిండా తినగలిగాం. ఇప్పుడేమో కూలికోసం ఆంధ్రాలో మైళ్ళు కొద్ది నడిచి కూలికిపోతున్నాం. రైతులుగా బతికి కూలీలమయ్యాం. చెట్టు నీడన బతుకులు వెళ్ళదీస్తున్నామని విచారం నిండిన గొంతులతోచెప్పేవాళ్ళు.

"మరి మీ అందరికీ ఒకే రకంగా ఐదెకరాలెలా వుంది?" అంటే కొందరు మా పూర్వీకుల నుండి వచ్చిందన్నారు. కొందరు ఆ ప్రశ్నకు మొహమొహాలు చూసుకున్నారు''. నిజానికి పూర్వీకులకు భూములుంటే 'భూంకాల్' పోరాటాలెందుకు జరిగాయి. అంటే 'ఐదెకరాల' భూమి ఎలా వచ్చిందో చెప్పడానికి భయపడుతున్నారు.

కానీ 'వెంకట చెఱువు గుంపు' 'బండారుగూడెం'లోని స్త్రీలను విడిగా కూర్చోబెట్టి మాట్లాడినప్పుడు వాళ్ళకైవాళ్ళు చెప్పలేదుగానీ మీకెట్లా వచ్చిందీ భూమి అందరికీ ఒకేరకంగా ఐదెకరాలూ? అని "ఎవరైనా దున్నుకోవడానికి సహాయం చేశారా?'' అంటే అవునని తలలూపారు.

మరి మీకు వరి వుందంటున్నారు అలాగే పెసలు, చిక్కుళ్ళు మినుములు పండించుకుంటున్నామంటున్నారు. మరి అడవిలో ఆదివాసీలకు ఈ పంటలన్నీ ఎవరు నేర్పించారా? (నిజానికి ఛత్తీస్‌ఘడ్ వెళ్ళిన 'టీం' ఆ రాత్రి అడవిలోనే వుండి పోవాల్సి వస్తే ఆ రాత్రి ఆటీం వాళ్ళకు పెసరపప్పు టమాటా కూర వండి పెట్టారంట కూడా.) వాళ్ళు మమ్మల్ని నమ్మి మాకు ఏమీ చెప్పలేదు. కానీ మాతో రెండోరోజు కోయభాష తెలిసినతన్ని తీసికెళ్ళినప్పుడుగానీ మాతో ఆ మాటలైనా మాట్లాడటానికి ఇష్టపడలేదు.

మాకు ముప్పై ఎకరాల పంటకు సరిపోయే చెరువు వుంది. మధ్యకాలంలో అందరం చందాలు వేసుకుని మరో చెరువు తవ్వుకున్నామన్నారు. మరి అట్లా చందాలు వేసుకుని మరో నీటివనరు ఏర్పాటు చేసుకోవాలన్న అవసరాన్ని గుర్తింపచేసింది ఎవరు? అదంతా ఆర్గనైజు చేసిందెవరు? అది వాళ్ళు చెప్పరు. మౌనమే వాళ్ళభాష. ఆ విషయం ఒకప్పుడు గర్వంగా చెప్పగలిగేవారుగానీ ఇప్పుడు పైకి చెప్పలేరు.

విత్తనాలు వ్యవసాయపు ఖర్చులూ ఎట్లా అంటే? మాకు సొసైటి వుంది. అక్కడ తెచ్చుకుని తిరిగి తీర్చేవారం. ఏం సొసైటీ? అది ప్రభుత్వం వారిదా? సమాధానం రాదు వారి దగ్గర నుండి. మీరు అక్షరాలు నేర్చుకున్నారా? చదవను వచ్చా? అంటే రాదు అన్నారు. ఇంతలో ఒకామె ఓ పిల్ల భుజం పొడిచి "నువ్వు బడికి పోయేవుగా? చెప్పవేందీ"? అన్నది. "మా అమ్మ తరవాత పోనివ్వలేదుగా'' అంది. అంటే అక్కడ చిన్నపాటి చదువు ఏర్పాటు జరిగినట్లు, సంతకాలో, పదాలో నేర్చుకునే దాకా సాగిందని తెలుస్తోంది. ఇదంతా ఆడవాళ్ళు చెప్తుండగా మొగవాళ్ళు వచ్చి భాషలో ఏదో చెప్పగానే తిరిగి మౌనంలోకి పోయారు.

వేం మా గురించి చెప్పినా వాళ్ళు నోరు విప్పడానికే భయపడుతున్నారన్నమాట. గ్రీన్‌హంట్ తరవాత అంతగా భయపడిపోయారు. అక్కడిజనం.

ఈ ఆదివాసీ స్త్రీలు మాకు రెండు రకాలుగా కనిపించారు. పెద్దవాళ్ళు మోకాలిపైకి అంత లుంగీ గుడ్డో, తెల్లటిగుడ్డో, చుట్టుకుని పైన జాకెట్టు వేసుకున్నారు. మమ్మల్ని చూసి ఓ తుండు అడ్డంగా 'పమిట' లాగా వేసుకున్నారు. ఆ పారిపోయి వచ్చిన చోట సౌకర్యాలు లేకపోయినా చిన్న చిన్న ఇళ్ళు గానీ ఇంటి చుట్టూ శుభ్రంగా చిమ్మి 'అలుకుడు' పెట్టుకున్నారు.

మరీ లోపలికున్న గుంపుల్లో వారు మాత్రం లేమివల్ల మారు మార్చుకోవడానికి లేక కొంత ఇబ్బందిగా వున్నట్లనిపించారు. గ్రామాలు వదలడం వల్ల తినడానికి లేక కూలీ కూడా సరిగ్గాలేక అవస్థలు పడుతున్నారు.

మరి చిదంబరం'గ్రీన్‌హంట్' దళాలను పంపి ఆదివాసీలకు ఏం మేలు చేస్తున్నట్లు? మిగిలిన 'టీం' లు సేకరించిన వివరాల ప్రకారం 'ఏకపాడు' లో 'సాల్వాజుడుం', పోలీసులు దాదాపు 300 మంది డిశంబరులో గ్రామం మీద దాడి చేసి ఇళ్ళు లూటీ చేశారు. ఇద్దరు గిరిజనుల్ని చంపేశారు.

'టెక్కమడుగు' గ్రామంలో 60 ఇళ్ళు తగలబెట్టారు.4గురు మహిళలపై అత్యాచారం జరిపారు. 4 గురు గిరిజనుల్ని తీసికెళ్ళి కిష్టారంలో కాల్చివేశారు 'పాలడుగు' గ్రామం మీద దాడిచేసి, 40 ఇళ్ళు తగలబెట్టారు. జోగయ్య అనే అతన్ని తీసికెళ్ళి కాల్చి చంపారు. 'ఎర్రి' అనే యువతిమీద సామూహిక అత్యాచారం వేశారు.

ఇదంతా చిదంబరం ఎందుకు చేస్తున్నట్లు? 'సాల్వాజుడుం' కాలంలో మావోయిస్టుల ప్రభావ ప్రాంతాలకు వెళ్ళలేని వాళ్ళు గ్రీన్‌హంట్ వచ్చాక నిర్భయంగా దాడులు జరిపి కాల్చి వేయడమే గాదు దాడుల ప్రాంతాల పరిధిని కూడా పెంచేశారు. సరిహద్దుల్లో శత్రువుల గ్రామాలను తగులబెట్టినట్టు దంతెవాడలో గ్రామాలకు గ్రామాలను తగులబెట్టారు. గోంపాడు, పూజారికాంకేర్, గుంజారు, మారేడుబాక వంటిఘటనలు గ్రీన్‌హంట్ వచ్చాక జరిగినవి.

'జుడుం' మీద నైతిక విజయం సాధించిన గిరిజనులు 'గ్రీన్‌హంట్'ను ఎదిరించే స్థాయికి రాలేదు. ఆ పోరాటం ఎట్లా చేయాలో అర్థం కాలేదు. కనుకనే

***(మిగతా 62వ పేజీలో....)***

వ్యాసం

◆ సాధన

# దండకారణ్యాన్ని కాపాడుకుందాం

## దేశంలో అనేక దండకారణ్యాలను సృష్టిద్దాం

### కవులు, కళాకారులు, రచయితల అవసరం చాలా వుందిక్కడ

మనం ఏదైనా చదివినప్పుడు లేదా విన్నప్పుడు కొందరు వ్యక్తులు చటుక్కున గుర్తుకొస్తారు. లేదా కొందరు వ్యక్తుల్ని చూసినప్పుడు మనం ఎప్పుడో చదివినవో, విన్నవో తటాలున మదిలో మెదులుతాయి. అతన్ని చూసినప్పుడు నాకెందుకో శ్రీశ్రీ పాటలోని ఈ పదాలు తళుక్కున మెరిసేవి. 'ఏదీ తనంత తానై నీ దరికి రాదు, శోధించి సాధించాలి, అదియే ధీరగుణం'. సాధన పేరు సరిపోయిందనిపించేది. తనను తాను తెల్సుకుని పెట్టుకున్న కలం పేరో? అడిగితే గానీ తెలీదు. ఇంకా ఇలాంటివి అడగాల్సినవెన్నో. ఈసారి నిశ్చయించుకునే వున్నా కలుస్తాడని తెలిసినప్పటినుండే వదలద్దనీ, శోధించి సాధించాలనీ. దొరకకపోయేవాడే. దొరకకపోవడమూ చాలా సకారణమూ, సహేతుకమూ కూడా. సల్వాజుడుం విప్లవ ప్రతీఘాతుక ఫాసిస్టు రాజకీయ, సైనిక క్యాంపెయిన్‌ను ఎదుర్కొని అగ్నిసరస్సున వికసించిన వజ్రంలా పైకి లేచిన దండకారణ్య ఉద్యమం. బీహార్ - ఝార్ఖండ్‌నీ, దండకారణ్యాన్నీ విముక్తి ప్రాంతాలుగా చేయడానికి 'గెరిల్లా యుద్ధాన్ని చలనయుద్ధంగా మార్చాలి', 'పిఎల్‌జిఎని పిఎల్‌ఏగా మార్చాలి' - పార్టీ అంతటికీ కేంద్ర కర్తవ్యం- ఆ కర్తవ్య నిర్వహణ కేంద్రంలో అతనూ. 15వ లోక్‌సభ ఎన్నికల సమయం - పిఎల్‌జిఎ - అందులో భాగమైన ప్రజా మిలీషియా మొత్తంగా డికె అంతటా దింపిన శత్రు బలగాల్ని ఎదుర్కోడానికి సర్వసన్నద్ధంగా వుండగా, ప్రతిరోజూ ప్రతిదాడుల వార్తలే చుట్టూ. వార్తలే కాదు ఎన్నికల రోజు మేం కలిసి వున్నప్పుడే మిలీషియా చేసిన దాడుల శబ్దాలు వీనులవిందుగా వినిపిస్తూనే వుండినాయి. ఈ నేపథ్యగానంలో 'నవరసాల్లో మీకేది ఇష్టం' అని అడగడం ఎలా వుంటుందీ?

ఏదేమైనా నాకు నేనే సెన్సార్‌షిప్పులు విధించుకోడం మానేయాలి. లేకుంటే కొన్ని అంతరంగ దర్శనాలు ఎలా సాధ్యం? యుద్ధం మధ్యనే అతను రాస్తున్నప్పుడు యుద్ధం మధ్యనే అడగడానికి వెనకడుగు ఏల?

'నాకో మూడు గంటల సమయం ఇవ్వాలి, ఎందుకనేది అడక్కోడదు' చాలా దృఢంగా కన్నార్పకుండా చూస్తూ అడిగాననుకున్నా.

'ఇంగో' చిరునవ్వుతో.

నమ్మకం కుదర్లే.

'ఎందుకనేది తెలిశాక వెనకడుగు వేయకోడదు'.

చిన్నగా తలను వూచి ఆమోదం.

ఇదేంటీ ఇంత సులభంగా అయిపోయింది. ఏం తిరకాసు లేదు కదా. ఆలోచించేంత తీరిక ఎవరికుంది? మధ్యలో ఎలాగో సమయం చూసుకుని ఎడాపెడా కొన్ని ప్రశ్నలు గీకి పెట్టుకున్నా. తనిచ్చిన సమయం రానూ వచ్చింది, అయిపోనూ పోయింది. కాంతి కంటే వేగంగా సమయం పరిగెట్టేది ఒక్క విప్లవ విశ్వంలోనేనేమో. అప్పుడిక చెప్పకుంటే అవకాశం పోయేట్లుందని 'ఇందుకు' అని విషయం చెప్పాను.

'నేనా, నన్నా?!' అని ఫెళఫెళా ఒక నవ్వు. సాధనే కాదు డికెలోని చాలామంది కామ్రేడ్స్ ఇలాగే నవ్వుతారు. ఆంక్షలు లేని, మనదైన అడవిలో, ఆదివాసీల సహచర్యంలో మాత్రమే అలవడగలదనిపించే, నోరారా నిండి తలనెగరేయించే ఓ నవ్వు.

'ఆ - మీరే, మిమ్మల్నే అడగాలి, ఇంకెవర్ని' అన్నా అంతే మొండిగా.

ఒప్పుకోక తప్పలేదు. వెనకముందాడుతూనే మెల్లగా

'ప్రశ్నలివ్వండి, చూసుకుంటా' అన్నాడు.

హమ్మయ్య మొదటి అడుగు పూర్తయ్యింది. ఇక మొదలు సమయంతో పరుగుపందెం. చివరి నిమిషంలోని చివరి సెకనులో మాట్లాడ్డం మొదలుపెట్టాం.

ఇప్పుడిక ధాం ధూంలు దగ్గర్లో లేవు. చిరుమువ్వల సవ్వడి చేస్తూ పారే ఓ సన్నటి పాయ పక్కన, వేసవి కాలమైనా చల్లని నీడనిస్తున్న కొన్ని చెట్ల కింద, పేరు తెలీని ఉదారంగుపూల రెక్కలు ఆ నీళ్లలో పడి వలయాలయాలుగా తిరుగుతూ మెలమెల్లగా కొట్టుకుపోతూ, ఏ సలీం అలీని కూడా కరుణించాయో లేదో అనిపించే వన్నెవన్నెల పిట్టలూ, పక్షులూ పురుగులు ఏరుకుంటూ, ఎవరో తీరిగ్గా కూచుని రంగులేసినట్టుగా ఉండే ఏవేవో కీటకాలు తీరిక లేకుండా అటూ ఇటూ పరుగులు పెడుతూ, కుచ్చు, కుచ్చు తోకలతో కొమ్మల మీంచి బెట్టుడుతలు చెంగు చెంగున దూకుతూ...ఊం( ఫర్వాలేదు, ఇక్కడ 'మీ రచనల్లో మీకేది ఇష్టం' అని అడగడం మరీ వింతగా వుండదేమో.

ఊహు కాదు. ఆ యుద్ధ మోతలూ, ఈ ప్రకృతీ, ఆదివాసీ అస్తిత్వం విడదీయరాని సంబంధంలో వున్న సందర్భంలోనే వున్నట్లున్నాం. యుద్ధం విధ్వంసానికి కాక నూతన జీవితానికి దారి తీయగల ఏకైక సందర్భం. అంతే కాదు యుద్ధం మాత్రమే జీవితాన్నివ్వగల సందర్భం. నిజమైన ప్రజాసాహిత్యానికీ ఇప్పుడిక కేరాఫ్ చిరునామా ప్రజాయుద్ధమే అవ్వదా - అది అడవిలోగానీ, మైదానాల్లో గానీ, నగరాల్లో గానీ? వైరుధ్యపూరితంగా కనిపించినది నిజానికి అత్యంత సమన్వయం గలిగిన, గతితార్కిక సంబంధం కలిగిన విషయమే అని తేలిపోతోంది. ఆగే బఢో మాసె!

సమయం విలువను మనుషుల ప్రాణాలతో కొలుచుకునే స్థలకాలాల్లో అతను మాట్లాడ్డానికి సిద్ధమయ్యాడు. గుర్తెరిగి పని ముగించుకోవాలి. నేను అడగాలనుకున్నవీ వాటిని అందరికీ తెలియజేయాలనే దాంట్లో ఒకానొక భాగమే కదా.

ఎక్కడ మొదలుపెట్టాలి? అంతకు ముందే మాటల్లో అన్నాడు 'అమ్మ పత్రికాముఖంగా చెప్పినదానికి ఇద్దరం పత్రికాముఖంగానే జవాబు రాసి పంపాం, వచ్చిందో లేదో తెలీదింకా' అని. అక్కడే మొదలుపెడదాం, అమ్మనుంచీ, బాపునుంచీ...ఎవరికైనా 'మొదలు' అదే కదా....

**ఇంటిలో సాహిత్య వాతావరణం ఉండిందా?**

మా ఇంట్లో నిరంతరం రాజకీయ వాతావరణం ఉండేది. మా బాపు కాంగ్రెస్‌వాది. ఆయన మిత్రులెందరో ఇంటికి వచ్చేవారు. సమకాలీన రాజకీయాలు చర్చించుకుంటూ ఉండేవారు. అంతేకాకుండా ఆనాటి కమ్యూనిస్టు విప్లవకారులతోనూ మా బాపుకు మంచి స్నేహం ఉండేది. వాళ్లూ ఇంటికి వచ్చేవారు. 1960లు వచ్చేవరకు మా బాపు, దాదాపు ఆయన మిత్రులందరూ కమ్యూనిస్టులతో సహా, క్రియాశీల రాజకీయాల నుంచీ తప్పుకున్నారు. నెహ్రూ చివరి రోజుల నుంచీ కాంగ్రెస్ రాజకీయాలు భ్రష్టుపట్టిపోతున్నాయని వీళ్లంతా భావించేవారు. ధన బలం, కుల బలం, స్వార్థం, అవినీతి కాంగ్రెస్‌లో ప్రవేశించాయనీ, నిజాయితీపరులకు, నిష్టాపరులకు, రాజకీయ విలువలకు, వ్యక్తి స్వాతంత్ర్యానికీ, వ్యక్తిత్వానికీ విలువ లేకుండా పోయిందని భావించి ఆ రాజకీయాలంటేనే అసహ్యించుకోవడం పెరిగింది. మరో వైపు కమ్యునిస్టులు రివిజనిస్టులైపోయారు. ఆ సమయంలోనే కొద్ది తేడాతో నక్సల్బరీ రాజకీయాలు భారతదేశాన్ని ఒక కుదుపు కుదిపాయి.

కమ్యూనిస్టుల సహచర్యం, మైత్రి, దేశభక్తి, ప్రజాస్వామిక భావాలు ఉన్న మా బాపు నక్సల్బరీ రాజకీయాలను ఎన్నడూ వ్యతిరేకించలేదు. దాని ఫలితంగా ఆయన శేషజీవితంలో చివరివరకూ రాజ్యహింసకు గురవుతూ వచ్చాడు. ఇంతేకాదు. మా బంధువర్గమంతా బాపు వెనుకాతల గొణిగేవారు - 'తండ్రి ఇంట్లో పుస్తకాలు తెచ్చిపెట్టి పిల్లలను చెడగొట్టాడు' అనేదే ఇప్పటికీ మా బంధువర్గంలో స్థిరపడిన అభిప్రాయం. ప్రగతిశీల సాహిత్యం మా బాపు చదవడమే గాకుండా అమ్మను కూడా చదవమంటూ ప్రోత్సహించేవాడు. తర్వాత అన్నయ్య విప్లవ సాహిత్యం ఇంటికి తెచ్చి బాపుతో చదివించేవాడు. గోర్కి 'అమ్మ' నవలను మా అమ్మతో అన్నయ్య పట్టుబట్టి చదివించాడు. ఆ నవలలో ఏం ఉందో అమ్మ నాకు చెప్పేది. అమ్మ బడికి పోయి చదువుకున్నదేమి కాకపోయినా బాపు ప్రోత్సాహంతో శ్రద్ధగా చదువు నేర్చుకుంది. అక్షరాలు కూడబలుకుతూ 'అమ్మ' నవలను ఆమె చదవడం నాకు ఇప్పటికీ గుర్తే.

అలాంటి వాతావరణంలో పెరిగిన నన్నూ, మా అన్నయ్యనూ అమ్మ ఇప్పటికీ తన 80 ఏళ్ల వయస్సులో కూడా 'నమ్మిన రాజకీయాలు విడవ వద్దు. మీ రాజకీయాలు చాలా మంచివి' అంటూ పత్రికాముఖంగా ఆదేశిస్తోంది. అమ్మ ఆదేశాన్ని చివరి వరకూ పాటిస్తామని మొన్నీ మధ్య మేం మా అమ్మకు పత్రికాముఖంగా జవాబు పంపాం. అంటే ఇంట్లో ఒక రాజకీయ, సాహితీ వాతావరణంలో పెరిగిన మమ్మల్ని గత మూడు దశాబ్దాలుగా ముఖం చూపులైనా లేకుండా ఎక్కడో దూరంగా ఉంటున్న మమ్మల్ని ఆ పేగుబంధం శాసించడం ఎన్నటికీ మరువలేనిది.

ఒక్కసారిగా ఆ చిన్ని, చురుకైన కళ్లలో జ్ఞాపకాల నీడలు, కన్నుమూసిన బాపు, ముసలి అమ్మను తలచుకునే కావచ్చు....

**మీకు సాహిత్యం పట్ల మక్కువ ఎప్పుడు, ఎలా కలిగింది?**

సాహిత్యం చదవడం పట్ల చిన్నప్పటి నుండే మక్కువ ఉండేది. ఇంట్లో మా బాపు మంచి సాహితీ ప్రియుడు. ఆయన భారత స్వాతంత్ర్యోద్యమ కాలంలో ఒక కాంగ్రెస్ పార్టీ రాజకీయ కార్యకర్తగా అందులో పాల్గొన్నాడు. తర్వాత కాలంలో స్వతంత్ర్య సేనాని పెన్షన్ కూడా దొరికిందని విన్నాను. ఆయన నుంచే నేనూ, మా అన్నయ్య పుస్తకాలను చదవడం నేర్చుకున్నాం. ఆయన మాకు చాలా విషయాలు చెప్పేవాడు. రాజకీయాలు, సాహిత్యం సహా జీవితానుభవాన్ని అందించిన వాడు మా బాపు. ఆయన మాకు ఒక గురువు, మరో రకంగా మాతో మా భావాలను పంచుకునే మంచి మిత్రుడుగానూ ఉండేవాడు. ఆయన ద్వారానే మాకు ప్రగతిశీల భావాలు అబ్బాయి. ప్రగతిశీల సాహిత్యం పట్లా మక్కువ గలిగింది. మాలో సాహిత్యం పట్ల గట్టి పునాది వేసిన వాడు మా బాపు. అయితే దాని అభివృద్ధికి ఎంతగానో దోహదపడింది మన విప్లవోద్యమమే. అది లేకుండా ఇదిలేదు. ఇది లేకుంటే ఆ పునాదికి అర్థమే ఉండేది కాదు.

**రాయడానికి ఏది ప్రేరణ?**

నేను సాహిత్యం రాయడానికి విప్లవోద్యమమే ప్రేరణ. ఇంట్లో మొదట ప్రగతిశీల సాహిత్య అనుబంధం తర్వాత విప్లవ సాహిత్యంతో సాన్నిహిత్యం పెరిగిన ఫలితంగా వర్గపోరాటం నాచే రచనలు చేయించింది. నా రచనలకు ప్రేరణ వరవరరావు సారు ఉపన్యాసాలు, గద్దర్, సాహు, అల్లం రాజయ్య, నారాయణ, వీరయ్య గార్ల పాటలు, బి.ఎస్.రాములు గారి కథలు నాకే కాకుండా ఆనాడు మా ప్రాంతంలోని యువతకు ఒక పెద్ద ప్రేరణ అని నిస్సందేహంగా చెప్పుకోవచ్చు. అలాగే లక్ష్మారెడ్డి గారి (పౌరహక్కుల ఉద్యమ నాయకుడు, ఈయన్ని పోలీసులే హత్యచేశారు) వివేచనాత్మక ఉపన్యాసాలు చాలా ఆలోచింపచేసేవి. వయసులో పెద్దవాడే అయినప్పటికీ నన్ను ఒక 'యంగ్ ఫ్రెండ్' (యువ మిత్రుడు)గా సంభోదిస్తూ అనేక విషయాలు బోధించిన మంచి కమ్యూనిస్టు, ఆంత్రోపాలజిస్టు అమరభారతి గారి నుంచీ నేనెంతో తెలుసుకున్నాను. పోతే, మా ఊళ్లో నిజాం వెంకటేశం గారు (సిరిసిల్లా వాస్తవ్యుడు) ఇంజనీర్‌గా పనిచేస్తుండేవాడు. నాతో వేమనవాదం మొదలు అనేక హేతువాద, ప్రగతిశీల, విప్లవసాహిత్యం చదివించినాడు. ఇవన్నీ ఒక ఎత్తుకాగా ఇంటికి వచ్చే అన్నయ్య మిత్రులు ఆదిరెడ్డి, కంది లచ్చిరెడ్డి, చంద్ర ప్రభాకర్, ముప్పాళ లక్ష్మన్‌రావు, మంతెన రాజిరెడ్డి, కృష్ణారెడ్డి, అల్లం సోదరులు, నారాయణసారు మొదలైన వాళ్లంతా ఇంట్లో చేసే చర్చలు నాకు ఒక పెద్ద ప్రేరణగా చెప్పుకోవచ్చు. వీటన్నింటితో పాటు 'సృజన' పత్రిక అంటే ఎంతో ప్రాణం. నాలో ప్రేరణ కలిగించడానికి దాని పాత్ర దాని కుంది.

**మొదటగా చేసిన రచన? దానిపై లభించిన ప్రోత్సాహం ఎలాంటిది?**

నేను మొదటగా చేసిన రచన అంటే కోనరావుపేట పట్వారిపై జనం చేసిన దాడి గురించి రాసిందే. నేను ఆ ప్రాంతంలో ఆర్గనైజర్‌గా పనిచేశాను. అమరుడు వడకపురం చంద్రమౌళి నా వెంట ఉండేవాడు. కోనరావుపేట పట్వారి పెద్ద దుర్మార్గుడు. అక్కడి యువత అంతా పట్వారిని శిక్షించాల్సిందే అని డిమాండ్ చేసేవారు. నిజానికి ఆ ప్రజాద్రోహి పట్వారి శిక్షార్హుడే. ఆయన్ని శిక్షించిన ఘటనను కథానిక రూపంలో రాసి సృజన పత్రికకు పంపాను. ఆ పత్రికలో ఆ కథానిక అచ్చయింది. అచ్చు రూపంలో నా తొలి అక్షరాలను చూసుకొని ఎంత మురిసిపోయానో! ఆ ప్రాంత ప్రజలకు దాన్ని చదివి వినిపించేవాడిని. జనం కూడా 'బాగుంది' అని మెచ్చుకునేవాళ్లు. 'నా బోటి వాడు రాసినా పత్రికలో అచ్చేస్తారన్న మాట' అన్నదే నన్ను ఎంతగానో ప్రోత్సహించింది. ఆ పట్వారిని శిక్షించిన యువ కిశోరాలలో భూపతిరెడ్డి అనే యువకుణ్ని తర్వాత కాలంలో పట్వారి వర్గం వాళ్లు హత్య చేశారని తెలవడంతో నేను ఆయన స్మృతిలోనే దండకారణ్య విప్లవ ప్రజానీకానికి భూపతిగా పరిచయమయ్యాను. నేను ఒక ఆర్గనైజర్‌గా పనిచేయగలనని నాలో విశ్వాసం నింపిన వారిలో భూపతీ ఒక ముఖ్యుడే. నా ఈ మొదటి రచనను 'సూర్యం' పేరుతో రాసినట్టు గుర్తుంది.

భూపతి, చంద్రమౌళిల ప్రస్తావన వాతావరణాన్ని బరువెక్కించింది. ఇరు హృదయాల భారమూ రెండు జతల కళ్లల్లో నాలుగు కన్నీటి చుక్కలుగా మెరిసి మాయమైంది. దాన్నుండి బైటకొద్దామన్నట్లుగా

**మీ రచనలకు మొదటి పాఠకులెవరు, సాధారణంగా?** అని అడిగాను గానీ అది మళ్లా ఐవి మాష్టారు దగ్గరకే తీసుకెళ్లచ్చని ఎందుకో ఆ క్షణం మరిచాను.

నా రచనలకు మొదటిపాఠకులు అంటే ఒక్కొక్క పీరియడ్‌లో ఒక్కొక్కరున్నారు. నిర్దిష్టంగా చెప్పాలంటే నేను 'అడవిలో అన్నలు' నవల రాసినపుడు దాని తొలి పాఠకుడు బేతి శ్రీరాములు గారే. ఆయన ఉండేది ఆంధ్రలో ఎక్కడో - ఇక్కడ నేను ఉండేది దండకారణ్యంలో. అయినప్పటికీ ఆయన నాతో చాలా విస్తృతంగా ఉత్తర, ప్రత్యుత్తరాలు జరుపుతుండేది. ప్రతీ చిన్న విషయాన్ని కూడా నాతో చర్చించి ఆ నవలకు పుష్టి చేకూర్చడంలో ఒక మంచి మిత్ర పాత్ర పోషించాడు. నాకు ఇప్పటికీ కొన్ని ఘటనలు గుర్తున్నాయి. తెలంగాణాలో పలకరించడాన్ని సాధారణంగా మందలించడం అంటారు. అయితే దానికి ఉన్న మరో అర్థాన్ని కూడా ఆయన చెప్పితే ఆ పదాన్ని పలకరించడంగా మార్చాను. ఇంకా చాలా ఘటనలున్నాయి.

ఇక నా 'రాగో' నవలకు వస్తే మొదటి పాఠకుడు మా ప్రియమైన ఐ.వి. మాస్టారు. అమరులు సాంబశివరావు మాస్టారు మాతో దండకారణ్యంలో ఉన్నప్పుడు నేనా నవల రాశాను. ఆయన ఎంతో శ్రద్ధగా నాతో ఆ నవలలోని పద-పదం విన్పించుకొని దానిని చక్కదిద్దడంలో ఎంతో బాధ్యతగా వ్యవహరించారు. 'రాగో' పేరును ఆ నవలకు పెట్టిందాయనే. ఆ నవలకు పేరు పెట్టే సందర్భంగా ఎన్నెన్నో విషయాలు చర్చించారు. ఫ్రాన్స్‌లో తలెత్తిన పోరాట జ్వాలలపై వచ్చిన నవలను శ్రీశ్రీ అనువదించి 'రెక్కవిప్పిన రివల్యూషన్' అనే పేరు పెట్టడం వెనక గల చరిత్ర మొదలుకొని చాలా విషయాలు చెప్తుతూ 'రాగో' పేరు నిశ్చయించాడు. ఆ నవలను హిందీలోకి అనువదించే నాటికి మాస్టార్ కన్నుమూశారు. ఆపై ఆ నవలను ఆయనకే అంకితం చేశాను. ఆ నవలలోని లొసుగులను చూపుతూ నాతో మళ్లీ కొంత రాయించింది సాహితీ మిత్రుడు వేణుగోపాల్. ఈ రెండు నవలల అనుభవం ఇలా ఉండగా చాలా విషయాల్లో ఎనభైల చివరి వరకు ఇంకొందరు విరసం మిత్రులు నా రచనలు చదువుతూ తమ అభిప్రాయాలు వెలిబుచ్చుతూ ఉండేవారు. వీరే గాకుండా నా ప్రతీ రచనా శ్రద్ధగా వినేది మా కడార్ల సత్యనారాయణే. గత 30 ఏళ్లుగా మేం ఇద్దరం కామ్రేడ్స్-ఇన్-ఆర్మ్స్‌గా జీవిస్తున్నాం. నా ప్రతీ రచనను చదివి, లేదా ఇద్దరం కలసి చదివి చర్చించుకున్నాకే నేను దాన్ని పది మంది ముందు పెడతాను. ఇప్పటికీ ఇంతే. గోండీలో రాయడం మొదలుపెట్టాక నా ఆదివాసీ సహచరులతో ముందు వాటిని పంచుకొని తర్వాతే పత్రికలకు పంపిస్తున్నాను.

**మీ కిష్టమైన సాహిత్య ప్రక్రియ ఏది? మీరు రాసే వాటిల్లో ఏ ప్రక్రియలను ఎక్కువ ఇష్టపడతారు?**

నేను పలు సాహితీ రూపాలలో ఉద్యమ అనుభవాలను, సమస్యలను పాఠకులతో పంచుకున్నాను. కథలు, కథానికలు, నవలలు, వ్యాసాలు, పాటలు, కవితలు, అనువాదాలు మొదలైన రూపాలలో నా ఉద్యమ భావాలను పాఠకులతో పంచుకున్నాను. పంచుకుంటున్నాను. ఈ అన్ని రూపాలలో కెల్లా కవితలు రాయడమే నేను కొంత ఎక్కువ ఇష్టపడుతాను. మిగితా అన్ని

ప్రక్రియలకన్నా ఈ ప్రక్రియ కొంత తక్కువ టైంలో, సులువుగా రాయొచ్చనిపిస్తోంది. దండకారణ్య ప్రజా విప్లవోద్యమంలో మనసును కదలించే, తీవ్ర ఉద్విగ్నతకు లోను చేసే ఘటనలు విన్నపుడు, చూసినపుడు, స్వయంగా పాల్గొన్నపుడు మనసులోని భావాలు తన్నుకుంటూ బయటకు వస్తుంటాయి. నడకలో నన్ను సతాయిస్తుంటాయి. ఆ భావాలను అక్షరాల్లోకి మారిస్తేనే మనసు తేలికవుతుంది. అయితే ఉద్యమ బాధ్యతలు పెరుగుతున్న కొద్దీ ఇవన్నీ వదలుకోక తప్పడం లేదు.

**మీ శైలిని మెరుగువర్చుకోడానికి మీరు ఎలా కృషి చేసినారు? చేస్తున్నారు?**

నా శైలిని మెరుగుపర్చుకోవలసింది ఇంకా ఎంతో ఉంది. దండకారణ్య రచనల్లో శైలి లోపం ఉంటుందనే సాధారణ విమర్శ ఒకటి '80లలో తెలుగు విమర్శకుల నుంచీ ఎక్కువగానే విన్నాం. తర్వాత్తర్వాత కొంత అధ్యయనంపై శ్రద్ధపెట్టి శైలిని మెరుగుపరచుకోవడానికి కృషి చేశారు. మరోవైపు మా శీనన్న (ఎల్.ఎస్.ఎన్.మూర్తి) నా శైలి లోపాలను ఎంతో చక్కగా ఎత్తిచూపుతూ రచనలకు మెరుగులు దిద్దేవాడు. అలాగే నా సహచరులు, మా దండకారణ్యంలో మంచి విమర్శకులు 'స్వాతీ' (తిరుపతి), అమన్ లు నా రచనల శైలిని మెరుగుపరచుకోవడంలో తోడ్పడుతున్నారు. ఈ రకంగా నా రచనల శైలిని అధ్యయనం, విమర్శకుల సూచనలు, సలహాల ద్వారా మెరుగుపరచుకుంటున్నాను.

**ఉద్యమ బాధ్యతలను, రచనా వ్యాసంగాన్ని బాలెన్స్ చేసుకోవడం కత్తి మీద సాములా ఉంటుందేమో కదా? ఎలా సాధించారు?**

ఉద్యమ బాధ్యతలను, రచనా వ్యాసంగాన్ని నేను బాలెన్స్ చేసుకోలేకపోతున్నాను. నా శక్తి సరిపోవడం లేదు. నా మొత్తం సమయాన్ని ఉద్యమ బాధ్యతల నిర్వహణలోనే వెచ్చించాల్సి వస్తోంది. ఎప్పుడో సుక్క తెగిపడ్డట్టు కవి 'కలానికి' పని తగులుతోంది. గెరిల్లా జీవితంలో ఉండే సాధకబాధకాలు, అతి తరచుగా వచ్చే మలేరియా జ్వరం, పెరుగుతున్న పలు బాధ్యతల మధ్య వ్యక్తిగా నా అభిరుచి ఏమైనా నేను మాత్రం సమిష్టి బాధ్యతల నిర్వహణకే మొదటి ప్రాధాన్యత ఇస్తున్నాను.

**ఈ రెండింటి మధ్య ఖచ్చితంగా త్రాసు ఉద్యమ బాధ్యతల వైపే మొగ్గుతుంది కదా - విప్లవ సాహిత్యానికి ఆ మేరకు లోటుగానే మిగిలిపోయిందేమో - మీ వ్యాఖ్య?**

ఉద్యమ బాధ్యతల వైపే త్రాసు మొగ్గాలి. అలా కాకుండా ఉన్నత బాధ్యతల నిర్వహణ చాలా కష్టమవుతుంది. లక్షలాది, కోట్లాది ప్రజల జీవితాలకు బాధ్యతపడుతూ అత్యంత నిర్దాక్షిణ్యమైన వర్గపోరాటంలో నిలిచి పనిచేస్తున్నపుడు ఒక రచయితగా తన వ్యాసంగాన్ని కొనసాగించడానికి దొరికే సమయం ఎవరికైనా చాలా తక్కువ ఉంటుంది. అందులో దండకారణ్యం లాంటి వెనుకబడిన ఆదివాసీ ప్రాంతాలలో పనిచేస్తున్నపుడు ఏ కొద్ది సమయం దొరికినా సహచరులకు విద్య గరపుకోవడంపై శ్రద్ధ పెట్టాల్సి ఉంటుంది. కాబట్టి ఉద్యమ బాధ్యతలను, రచనా వ్యాసంగాన్ని త్రాసులో పెట్టి మొగ్గు ఎటు ఉంటుంది? అంటే బాధ్యతల స్వభావాన్ని బట్టి త్రాసు మొగ్గడం ఉంటుంది. ఇలా ఉండకుంటే ఎవరైనా తమ బాధ్యతలకు న్యాయం చేకూర్చలేరేమో! ఉన్నత నాయకత్వం ప్రధానంగా, ప్రథమంగా భావజాల, సిద్ధాంత, రాజకీయ విషయాలపైనే కేంద్రీకరించాలి. అందులో భాగంగానే సాహితీ రంగాన్ని నిర్వహించాలి.

**పై బాధ్యతల్లో ఉన్న అజ్ఞాత రచయితలందరి పరిస్థితీ ఇంతేనా? ఎలా అధిగమించవచ్చు అంటారు?**

పై బాధ్యతల్లో ఉన్న అజ్ఞాత రచయితలందరి పరిస్థితీ దాదాపు ఒకేలా ఉంది. ఇలా ఉండడం సహజం కూడా. మీరు ఏ విప్లవోద్యమ చరిత్రను చూసినా గొప్ప, గొప్ప రచయితలు ఎవరూ విప్లవోద్యమ ఉన్నత బాధ్యతల్లో ఉన్నవారు కారు. ఉన్నత నాయకత్వం అన్ని రంగాలను బలంగా పనిచేయిస్తూ ప్రజాయుద్ధాన్ని పురోగమింపచేయడానికి ఆ రంగాలన్నింటినీ ఐక్యశక్తిగా నడిపించ గలిగినపుడు విప్లవోద్యమం అన్ని రంగాలలో పెంపొందుతుంది. ఉన్నత బాధ్యతల్లో ఉన్నవారు చేయాల్సిందిదే. తామే నిరంతరం రచనలు చేస్తూ ఉన్నత బాధ్యులెవరూ ఉండలేరు కదా! కానీ మన దగ్గరికి వచ్చేసరికి ఉన్నతమైన బాధ్యతల్లో ప్రతిరంగం నుంచీ దాని ప్రతినిధులంటూ నిర్దిష్టంగా లేకపోవడమనే లోపం కొట్టొచ్చినట్టు కనబడుతోంది. కారణాలు ఏమైనప్పటికీ ఇప్పటి పరిస్థితి అలా లేదు. అనేక రంగాలకు ఈనాడు విప్లవోద్యమం ప్రాతినిధ్యం వహించలేకపోతోంది. దీనితో ఎక్కడికక్కడే అనేక పెడధోరణులు ప్రబలంగా పొడసూపుతున్నాయి. ఇక్కడ మనం నిర్దిష్టంగా సాహితీ రంగం గురించి చర్చించుకుంటున్నాం కాబట్టి ఈ రంగం కూడా ఏమాత్రం అపవాదు కాదు.

**మీరు అనేక పేర్లతో రాస్తూ ఉంటారు. కొన్ని.. కొన్నేంటి బహుశా చాలా రచనలు మీ పేరు లేకుండానే కూడా రాస్తుంటారు. కా.ఐ.వి.మాస్టర్ రచనల్ని ఒక దగ్గర సేకరించడంలో ఇదే సమస్య వచ్చిందని విన్నాను. మీదీ అలా కాకుండా ఉండాలంటే మీ పేరుతోనే రాయవచ్చు కదా. అలాగే, మీ రచనలు ఒక దగ్గర చేర్చే ప్రయత్నం ఏమైనా ఉందా?**

ఐ.వి. మాస్టర్‌తో నన్ను పోల్చడం భావ్యం కాదు. ఆయన ఒక పెద్ద మేధావి. మంచి చేయి తిరిగిన రచయిత. నేను గతంలో అనేక పేర్లతో రాసిన మాట నిజమే. నిర్దిష్ట కారణమంటూ ఏం లేదు. ఏదో ఒక సందర్భంగా ఒక మిత్రుడు ఇదే ప్రశ్న వేసినప్పటి నుంచీ సాధన, రాగో పేర్లతోనే రాస్తున్నాను. నా రచనలను ఒక్క దగ్గరికి చేర్చే ప్రయత్నం మాట అటుంచి ఇప్పటివరకు ఆ ఆలోచన కూడా రాలేదు. అరుణతార సంపాదకులు సహకరిస్తే తప్ప ఆ పని కాని పనే.

**మీ రచనల్లో మీకు అన్నింటి కంటే ఇష్టమైనది ఏది?**

నా రచనల్లో నాకు ఇష్టమైనది నా రాగోనే.

**ఎందుకని?**

ఎందుకంటే దండకారణ్య ఉద్యమ చిత్రణకు సజీవ రూపం రాగో.

**మీరు రాసిన రాగో నవలని రిఫరెన్స్ పాయింట్‌గా తీసుకొని బాలగోపాల్ రాగోల ప్రయాణం ఎటు అంటూ రాశారు కదా. దీనిపై మీరేమనుకున్నారు?**

రాగోల ప్రయాణం ఎటు అంటూ బాలగోపాల్‌గారు తన మడిమ తిప్పిన రాజకీయాలను మరోసారి ముందుకు తెచ్చారు. ఇప్పటికైనా రాగోల గురించి ఆయన తెలుసుకోవాలనుకుంటే రాగోల మధ్యకు వస్తే గాని తెలియదు. ఒక్కటి మాత్రం నిజం. 1980ల చివర్లలోని రాగోలు తమ తర్వాతి తరాల్లో 'కర్దె'లు లేకుండా చేశారనీ, ఆ పోరాటంలో వారు గొప్ప విజయాన్ని సాధించారనీ, ఆదివాసీ సంప్రదాయ బంధనాల నుంచీ భవిష్యత్ తరాల మహిళలకు కర్దెల ప్రమాదం లేకుండా రాగోలే చేశారని నేటి తరం గర్వంగా చెప్పుకుంటున్నది. రాగోల పోరాటం అంతటితో ఆగలేదనీ, అంతిమంగా మహిళా విముక్తికై వాళ్ల పోరాటం సాగి తీరుతుందని దండకారణ్య మహిళ నిరూపిస్తోంది. బాలగోపాల్ గారి ప్రశ్నలతో రాగోల ప్రయాణం ఆగింది లేదు, వాళ్ల పోరాటాలు దారి తప్పింది లేదు.

**మీ అభిమాన రచయితలు ఎవరు?**

ఆదివాసీ ప్రజా జీవితాల వెతలను వెలికితీసే రచయితలందరినీ నేను అభిమానిస్తాను.

**నచ్చిన రచనలు?**

మహాశ్వేతాదేవి రచనలు ఇష్టపడుతాను.

**నవరసాల్లో ఏ రసాన్ని ఇష్టపడతారు?**

స్థల, కాల, పరిస్థితులనుబట్టి ఇష్టాయిష్టాలుంటాయి. ఇప్పుడు నిండా యుద్ధంలో మునిగి ఉన్నాం. వీర రసాన్నే నిత్యం సేవించాలి. డాంటన్ చెప్పినట్టుగా డేర్..... డేర్...... డేర్..గానే ఉండాలి. అయితే ఒక కమ్యూనిస్టుగా నేను శాంతినే కోరుకుంటాను. కరుణ రసాన్నీ ప్రేమిస్తాను.

**అజ్ఞాత రచయితలని ప్రోత్సహించడానికి ఏం చేస్తున్నారు? ఇంకా ఏం చేస్తే బాగుంటుంది?**

ఎవరి విషయంలో ఆజ్ఞాత రచయితలని అంటున్నారో గాని మాకైతే అంతా జ్ఞాత రచయితలే కదా.

**సరే, సరే, నా ఉద్దేశ్యం అజ్ఞాత జీవితంలో ఉన్న రచయితలనే**

(తెలుసు అన్నట్లు నవ్వి) వారిని ప్రోత్సహించడానికి మేం ఇక్కడ దండకారణ్యంలో దాదాపు దశాబ్దంన్నర క్రితం ఒక సాహితీ పత్రికను - ఝంకార్ - ప్రారంభించాం. ఇది మా తొలి చర్య. పోతే, తొలినాళ్లలో రచయితలను, కళాకారులను ప్రోత్సహించడానికి 'కవి సభ'ల్లాంటివి నిర్వహించేవాళ్లం. ఆ తర్వాత్తర్వాత చాలా విషయాలను అధ్యయనం చేసి, చర్చించి, గత సాహితీ, సాంస్కృతిక ఉద్యమ అనుభవాలను సమీక్షించుకొని విప్లవోద్యమంలోని రచయితలకు, కళాకారులకు ఒక సంఘటిత రూపం ఇవ్వడానికి నిర్ణయించుకున్నాం. ఇందుకు 2002 మేలో రచయితలు, కళాకారులతో కలసి మా పార్టీ నిర్వహించిన కార్యశాల ఎంతగానో తోడ్పడింది. ఫలితంగా, ఇక్కడి 'చేతనా నాట్య మంచ్'కు ఒక విశాల ప్రజా సంఘ రూపం ఇచ్చుకోగలిగాం. దీని ఫలితాలు చాల గొప్పగా ఉన్నాయి. ప్రస్తుతం దేశంలోనే రచయితల, కళాకారులతో కూడిన అతి పెద్ద సంస్థగా నిలిచి ఒక పెద్ద బ్రేక్ త్రూ ను సాధించింది. వేలాది మందితో సభ్యత్వం ఉంది. వీళ్లను ఉద్యమ అవసరాలకు తగిన విధంగా మలచుకోవడానికి మేం తరచుగా కార్యశాలలు నిర్వహిస్తున్నాం. పాటలు రాయడం, కథలు రాయడం, ఉపన్యాసాలు ఇవ్వడం. ఆదివాసీ కళారూపాలలో నృత్యం-గానం-సంగీతం ల మేళవింపు లేదు. కాని నేడు వీటి మేళవింపుతో కళారూపాలను ప్రదర్శించడం అనేది చేతనా నాట్య మంచ్ కళాకారులకు అతి సాధారణమైంది. అయితే ఇది ప్రజల్లో సాధారణం కాలేదు ఇంకా. ఇంకో ముఖ్య విషయం ఏమంటే, ఆదివాసీ జన జీవితాలలో నేటికీ సామూహిక జీవన విధానానికి చాలా ప్రాముఖ్యత ఉంది. ఇందులో భాగంగానే లేదా దీని కొనసాగింపుగానే మనం ఇక్కడి కవుల, రచయితల రచనలు సమిష్టిగా వెలువడడాన్ని చూడాల్సి ఉంది. గత కొద్ది సంవత్సరాలుగా అంటే సిఎన్ఎమ్‌కు ఒక సంఘటిత రూపం ఇచ్చినప్పటి నుంచీ వ్యక్తులు - వాళ్లు కవులైనా, రచయితలైనా ముఖ్యంగా రచయితలనుకోండి - వాళ్లు సామూహికంగానే తమ రచనలు చేయడం అనేది ముందుకొచ్చి కొనసాగుతోంది. ఈ వికాసం వెనుక ఇక్కడ మేం 2003 ఏప్రిల్ /మే లలో ఏర్పరచుకున్న దండకారణ్య సాంస్కృతిక సబ్ కమిటీ (డి.సి.ఎస్.సి.) కృషి చాలా ఉంది. ఇది ఇప్పటివరకు చేసిందిది. ఇంకా చేయాల్సింది చాలానే ఉంది.

2009 ప్రారంభం నుంచీ మేం ఝంకార్ పత్రికను రెండు లిపులలో తేవడం ప్రారంభించాం. ఒకటి - తెలుగు, రెండు - దేవనాగరి. దాదాపుగా స్థానిక కామ్రేడ్స్ అందరూ దేవనాగరి లిపిలోనే రాస్తుంటారు. వారి రచనలను మరింతగా ప్రోత్సహించడానికి మేం చేపట్టిన తొలి చర్య ఇది. పోతే స్థానిక రచయితలను ఇంకా అనేక రూపాలలో తమ రచనలను వెలువరించడానికి ప్రోత్సహించాల్సిన అవసరం సీరియస్‌గా ఉంది. ఇక్కడి ఉద్యమంలో మరో మాటలో ప్రజాయుద్ధంలో అనేకానేక నూతన, ఉన్నత స్థాయి అనుభవాలు ముందుకు వస్తున్నాయి. వీటిని లిపిబద్ధం చేసి ప్రపంచానికి అందించడంలో చాలా వెనుకబడి ఉన్నాం. స్థానిక ఆదివాసీ ప్రజాసాహిత్యంలో వారి సమాజ వికాస దశననుసరించి పలు సాహితీ, కళా రూపాలు ఉనికిలోకి వచ్చాయి. వీటికే పరిమితమై జన జీవితాలు కొనసాగుతున్నాయి. కానీ ఆ జీవితాలను విప్లవంలోకి లాగుతున్న ఒక భౌతిక వాస్తవికతను అనేక నూతన సాహితీ ప్రక్రియలలో విప్లవీకరించడం జరగాలి. పునాది మార్పులకై సాహితీరంగం చేస్తున్న కృషి తిరిగి ఆ ఉపరితల మార్పులను తగినంతగా ప్రతిబింబించలేకపోతోంది. ఇది జరగాలి. యావత్తు విప్లవ ప్రజల జీవితాలను గత నాలుగేళ్లుగా భారీగా అతలాకుతలం చేస్తున్న ఫాసిస్టు సల్వాజుడుం దాష్టీకాలను వీసమెత్తు కూడా ప్రపంచం ముందుంచలేకపోతున్నాం. ఈ మధ్య కాలంలో మిత్రులు బి.డి.దమయంతి తీవ్రమైన రిస్క్‌కు సిద్ధపడి ఒక ప్రజా రచయితగా వెలువరించిన రెండు రచనలు తెలుగు పాఠకులకు ప్రజల యాతనలను, వెతలను ఓ మేరకు చెప్పగలిగాయి. తక్షణం ఆమె రచనను మిత్రులు అమన్ హిందీలోకి అనువదించడం ద్వారా హిందీ పాఠకులలోకి విషయం వెళ్లింది. మిత్రులిద్దరినీ ఈ సందర్భంగా నేను అభినందిస్తున్నాను.

ఫాసిస్టు సల్వాజుడూం దాష్టీకాలనే కాకుండా యావత్తు విప్లవ ప్రజానీకం తమ అసమాన త్యాగాలతో ఒక నూతన చరిత్రకు ప్రాణం పోస్తున్న ఒక గొప్ప జీవన్మరణ పోరాటాన్ని వివిధ సాహితీ, కళా ప్రక్రియల ద్వారా జనాలలోకి తీసుకెళ్లడంలో కూడా మేం చాల వెనుకబడి ఉన్నాం.

**పార్టీ నాయకులుగానూ, అజ్ఞాత రచయితలుగానూ కూడా మీరు బైటి విప్లవ రచయితల నుండి ఏం ఆశిస్తున్నారు? ప్రత్యేకించి డికె విప్లవోద్యమ నేపథ్యంలో ఏం ఆశిస్తున్నారు?**

నేను, ముందు ఒక ఉద్యమ కార్యకర్తగా, తర్వాత ఒక రచయితగా బైటి విప్లవ రచయితల నుంచీ ఎంతో మద్దతును ఆశిస్తున్నాను. విప్లవ సంఘీభావాన్ని కోరుకుంటున్నాను. ప్రత్యేకించి డి.కె. ఉద్యమ నేపథ్యంలో యావత్తు రచయితలను, కళాకారులను ఉద్యమం వైపు, ప్రజాయుద్ధం పక్షం గట్టిగా నిలబడండనీ కోరుతున్నాను. ఈ రోజు అనేక ప్రాంతాల్లో విప్లవోద్యమం కొనసాగుతున్నప్పటికీ ముఖ్యంగా ఆంధ్ర రాష్ట్ర విప్లవోద్యమం ఎదుర్కొంటున్న సెట్‌బ్యాక్ పరిస్థితులలో ఐ.వి. మాస్టార్ లాంటి వాళ్లను కోరుకోవడం బహుశ అత్యాశే అవుతుందేమో గానీ అక్కడి రచయితల నుంచీ, కళాకారుల నుంచీ సంపూర్ణ సజీవ క్రియాశీల మద్దతును కోరుకుంటున్నాను.

ప్రపంచ వ్యాప్తంగా తీవ్ర ఆర్థిక, ద్రవ్య సంక్షోభ పరిస్థితులు నెలకొని మరింత తీవ్రం అవుతూ ఉన్న నేటి తరుణంలో యావత్తు రచయితలు, కళాకారులు ప్రజాయుద్ధం వైపు ధైర్యంగా, దృఢంగా, ఎలాంటి ఊగిసలాటలు లేకుండా నిలబడాల్సిన అవసరం ఉంది. మార్క్సిజానికి కాలం చెల్లిపోలేదని పరిస్థితులు పదే పదే నిరూపిస్తున్న వర్తమాన పరిస్థితులలో రచయితలు తమ కలాలకు పదనుబెట్టాల్సిన అవసరం గతం కన్నా అనేక రెట్లు పెరిగింది. కాళ్లు కదిపినా, కలాలు నడిపినా, తుపాకుల మాట పక్కన బెడుదాం, రాజ్యం ససేమిరా సహించనంటూ హింసోన్మాదాన్ని సృష్టిస్తూ విరుచుకుపడుతున్న నేటి పరిస్థితుల్లో రచయితలు, కళాకారులు ఈ దుష్ట రాజ్యాన్ని, రాజ్యహింసను సవాలు చేయాల్సిన అవసరం ఉందని పరిస్థితులు మరీ మరీ డిమాండ్ చేస్తున్నాయి. కానీ నేటి రచయితలు, కళాకారులు విప్లవ దృఢ సంకల్పంతో ప్రజాయుద్ధం వైపు నిలబడి దానిలో పాలు పంచుకోవడంలో ఎంతగానో వెనుబడి ఉన్నారు. నేటి విప్లవోద్యమానికి ఇదెంతో ప్రతికూలాంశంగానే ఉంది. 1970లలో '80లలో లేదా 2000కు ముందులా రచయితలు, కళాకారులు మరోసారి విజృంభించేలా చేయాల్సిన అవసరం, కర్తవ్యం పార్టీ ముందు సీరియస్‌గా ఉంది.

దండకారణ్య ప్రజాయుద్ధాన్ని, దండకారణ్యంలో నెలకొంటున్న ప్రజా రాజ్యాధికారాన్ని గురించి నేడు మన దేశ ప్రజానీకానికే కాకుండా ప్రపంచ పీడిత ప్రజానీకానికీ మరీ ముఖ్యంగా మడిమ తిప్పిన నేపాల్ పరిస్థితులలో, అతి భయంకరమైన జాతి వినాశనానికి పాల్పడుతూ నిర్దాక్షిణ్యంగా శ్రీలంక తమిళ జాతి నిర్మూలనను కొనసాగిస్తున్న పరిస్థితులలో దక్షిణాసియా శ్రామిక జనావళికి చాటి చెప్పాల్సిన అవసరం ఉంది. దండకారణ్యంలో పెంపొందుతున్న ప్రజా గెరిల్లా సైన్యాన్ని, వికసిస్తున్న ప్రజా రాజ్యాధికారాన్ని మొగ్గలోనే దెబ్బతీయాలని వేలాది సంఖ్యలో పోలీసు, అర్ధ సైనిక బలగాలను మోహరించి ప్రత్యక్షంగా భారీ విధ్వంసాన్ని, సామూహిక మానవ సంహారాన్ని కొనసాగిస్తున్న వైనాన్ని జనం ముందుంచి వారి క్రియాశీల మద్దతును కూడగట్టడానికి రచయితలు, కళాకారులు పూనుకోవలసిన అవసరం ఎంతో సీరియస్‌గా ఉంది. విశాల ప్రజారాశులకు ఆశాకిరణంగా కాంతిరేఖలను ప్రజ్వరిల్ల చేస్తున్న "దండకారణ్యాన్ని కాపాడుకుందాం, దేశంలో అనేకానేక దండకారణ్యాలను సృష్టిద్దాం" అనే సందేశాన్ని ప్రభావయుతంగా ప్రజల ముందుంచే పనిని కవులు, కళాకారులు, రచయితలు తప్ప మరెవరూ అంత శక్తివంతంగా చేయలేరు కదా! అందుకే వారిని సాంస్కృతిక సైనికులు అన్నాడు మావో. సాయుధం-సాంస్కృతిక సైనికుల మధ్య గట్టి సమన్వయాన్ని సాధించి పరమ రియాక్షనరీ వర్గాల ఆర్థిక, రాజకీయ, సైనిక, సాంస్కృతిక, మానసిక యుద్ధ దాడులను, వారి ఎల్ఐసి విధానాలను ఓడించకుండా ఇటు

దండకారణ్య విప్లవోద్యమం కానీ, అటు బీహార్-ఝార్ఖండ్ విప్లవోద్యమం గానీ తమ లక్ష్యాలను సాధించలేవు.

ఒక ప్రవాహంలా గుండెలోతుల్లోనుండి వెలువడిన ఈ మాటల్లో ఒక ఆవేదన, ఒక ఆకాంక్ష, ఒక విజ్ఞప్తి, ఒక పిలుపు. స్వీకరించడానికి సిద్ధంగా వుంటే ఒక ఆదేశం. సాధనతో కాక భూపతితో మాట్లాడుతున్నట్లు అనిపించింది ఆ క్షణాల్లో.

**వారికి మీరిచ్చే సందేశం గానీ, సలహా గానీ ఏమన్నా ఉందా?**

బైటి రచయితలకు దండకారణ్య రచయితల తరపున నేను చెప్పాలనుకుంటున్నదేమంటే, వర్తమాన సంక్షోభ పరిస్థితులలో ఎక్కడికక్కడే ప్రజలు అనివార్యంగా వీధుల్లోకి రాక తప్పడం లేదు. కాబట్టి రచయితలు సంఘర్షిస్తున్న ప్రజల వెంట సాగుతూ వారిలో ఒకరై ఆ పోరాటాలను దేశంలోని పలు ప్రాంతాలలో పెంపొందుతున్న ప్రజాయుద్ధంతో అనుసంధానించడంలో తమ వంతు పాత్ర తాము పోషించాల్సి ఉంది. ఎక్కడి పోరాటాలైనా దండకారణ్య, బీహార్-ఝార్ఖండ్‌లను విముక్తి ప్రాంతాలు చేయడంపై ప్రత్యేక శ్రద్ధ పెట్టాలి. దండకారణ్య, బీహార్-ఝార్ఖండ్‌లలోలా అన్ని పోరాటాలలో సమరశీలతత్వాన్ని పెంచడానికి తప్పక తోడ్పడేలా రచయితలు చేయాలి.

**అజ్ఞాత రచయితల్ని మరింతగా తయారు చేయడానికీ, రచనలు మెరుగుపర్చుకోవడానికీ బైట విప్లవ రచయితలు ఎటువంటి తోడ్పాటునిస్తే బాగుంటుందని భావిస్తున్నారు?**

దండకారణ్య ప్రజా విప్లవ జీవితంలో పాలుపంచుకుంటున్న మా 'అజ్ఞాత' రచయితలకు అనేక విధాలుగా బైటి రచయితలు తమ తోడ్పాటును అందించాల్సిన అవసరం ఉంది. ఇక్కడ పలక, బలపం పట్టి చిన్నపుడు చదువుకోని వాళ్లు ఈనాటి ఉద్యమావసరాల రీత్యా రచనా రంగంలోకి ప్రవేశిస్తున్నారు. అయితే ఆశువుగా చెప్పే కళ వీరిలో నరనరాన జీర్ణించుకొని ఉన్నందున కొన్ని అద్భుత ప్రయోగాలు చేస్తున్నారు. వాటిని సరిదిద్దాల్సి ఉంది. ఈ పనిని బైటి రచయితలు గొప్పగా చేయగలరు. ఉదా. ఇక్కడ ఒక పాట వర్క్ షాపు (కార్యశాల) నడిచినప్పుడు దానికి వారు హాజరై పాటను రాయడంలోని మెలకువలను చెప్పొచ్చు. పాటలు పాడడంలో రస ప్రాముఖ్యతను వివరించి పాటను ఎక్కడ ఎత్తుకోవాలో, ఎక్కడ దించాలో వివరించవచ్చు. ఏ రచనకైనా ప్రజా సమస్యలే ఆక్సిజన్‌లా ఎలా పని చేస్తాయో అర్థం చేయించవచ్చు. అలాగే ఒక కథా కార్యశాలకు హాజరైనా అనేక రకాలుగా చెప్పి, చూపి కథకులను సృష్టించడంలో మంచి పాత్ర పోషించగలరు. ఇంతకన్నా కూడా రిస్క్‌కు సిద్ధపడిన వారు ఉంటే ఒక విలియం హింటన్‌లా ఎన్నెన్నో 'విముక్తి' లాంటి లేదా చౌలి పో రాసిన 'ఉప్పెన' లాంటి ఉద్యమ రచనలను సృష్టించవచ్చు. ఇవాళ వీటి అవసరం చాలా చాలా ఉంది. లాంగ్ మార్చ్ కథల లాంటివి, యుద్ధ అనుభవాల పిక్టోరియల్స్ లాంటివి, ఇంకా ఎన్నెన్నో సృష్టించవచ్చు. తాము రచనలు చేస్తూ, తమ రచనల ద్వారా ప్రజాపోరాటాలకు న్యాయం చేస్తూ, ప్రజలకు అండగా నిలబడి తోటి ప్రజల సంఘీభావాన్ని కూడగట్టడంలో కృషి చేస్తూ యుద్ధ రంగం నుంచీ భూమిపుత్రులనూ, భూమిపుత్రికలనూ మంచి కవులుగా, కళాకారులుగా, రచయితలుగా ముందుకు తేవడంలో బైటి రచయితలు, కవులు, కళాకారులు అద్వితీయమైన పాత్రను పోషించవచ్చు. గోర్కి, లూసన్‌లు ఎక్కడి నుండి వచ్చారు? ఇవాళ కాకున్నా రేపైనా భారత గోర్కిలు, భారత లూసన్‌లు ఉద్యమంనుండి ఉద్భవించి తీరుతారు.

**ఇతర రాష్ట్రాల్లో సాహిత్య కృషి ఎలా ఉంది?**

ప్రజా పోరాటాలతో సంబంధం లేకుండా, విప్లవ పోరాటాల గతిశీలతతో నిమిత్తం లేకుండా, విప్లవోద్యమాల ఆటు-పోట్ల ప్రభావం లేకుండా విడివడిన సాహిత్యం అంటూ ఎలా ఉంటుంది? ఎక్కడుంటుంది? కాబట్టి ఈ నేపథ్యంలో ఆలోచించినపుడు వివిధ రాష్ట్రాలలోని విప్లవ పరిస్థితులకు ప్రతిబింబంగానే సాహిత్య కృషి సాగుతోంది. కానీ దండకారణ్యంలోనే ఈ కృషి విలోమానుపాతంలో ఉంది. దీనిని అనులోమానుపాతంలోకి మార్చడానికి తీవ్ర కృషి చేయాల్సి ఉంది.

**విప్లవ జీవితంలో సాహిత్య పఠనం, రచన మీకు ఏ విధంగా ఉపయోగపడిందను కుంటున్నారు?**

విప్లవ జీవితంలో సాహిత్య పఠనానికి కావాల్సినంత సమయాన్ని కేటాయించుకోలేక పోతున్నాను అయితే జరిగిన పఠనం మేరకు నేను దానిని అంటే నా సాహితీ పఠనాన్ని పలురూపాలలో రచనలు చేయడానికి సరిగానే ఉపయోగించుకున్నాను. ఇంకా ఉపయోగించుకుంటున్నాను. నా రచనలను నా జనాల వద్దకు తీసుకెళ్లడంలో సాహితీ మిత్రులే కాకుండా నా సహచరులందరూ సహాయపడుతున్నారు. ఇలా వెళుతున్న క్రమంలో వస్తున్న నూతన అనుభవాల వెలుగులో మళ్లీ అధ్యయనం - సాహితీ పఠనం - పై దృష్టి పెడుతున్నాను. ఈ రకంగా పఠనం - రచన - పఠనం అనే ప్రక్రియ కొనసాగుతూ 'ఉడుతా భక్తిలా', 'చంద్రునికో నూలుపోగు'లా విప్లవోద్యమానికి ఉపయోగపడుతోంది. అయితే ఇదేదీ నా విప్లవాచరణతో విడివడినది మాత్రం కాదని మరోసారి స్పష్టం చేస్తున్నాను.

**మీ కలం పేరు 'సాధన'కు ప్రేరణ?**

కలం పేరు సాధన గా పెట్టుకోవడానికి ఒక చిన్నారి కారణం. నేను కరీంనగర్ జిల్లా మహదేవపూర్ అటవీ ప్రాంతంలో తొలి రోజుల గెరిల్లా జీవితం గడుపుతున్నపుడు మా దళం ఎప్పుడు ఆ చిన్నారి వాళ్ల ఊరికెళ్లినా ఆమె రెక్కలు కట్టుకొని ఊడిపడేది. తన లేత రెక్కలతో దళానికి ఎన్నెన్నో సేవలు అందించి మా అందరి ప్రేమను మూటకట్టుకునేది. ఆమె పేరు సాధన. నాకు నచ్చిన ఆ చిన్నారి పేరునే నా కలం పేరుగా మార్చుకున్నాను.

తను అంతకు ముందే నాకు చూపించిన చిన్నారి పాప ఫొటో కళ్లముందు మెదిలింది. ఇక్కడి గ్రామాల్లో చలికి మంట పక్కనే పడుకుని ఒళ్లు కాలిపోయినవాళ్లెందరో, చనిపోయిన చంటిపిల్లలెందరో. ఈ పాప వయసు 8 సంవత్సరాలు వుండచ్చు, వీపంతా కాలిపోయింది. తమ దగ్గరే వుంచుకుని ప్రజాడాక్టర్లు చికిత్స చేసి పంపారు. పురోగమనం పుస్తకంలో డా.జాషువా హార్న్ రాసిన ఘటన గుర్తుకొచ్చింది. చైనాలో ఒకసారి వారి కోసం విమానంలో వెళ్లాలని పిలుపు వస్తే ఏ అతి ముఖ్యమైన వ్యక్తి కోసమో అనుకుంటారు హార్న్. తీరా చూస్తే ఈ పాప లాంటి పేద పశువుల కాపరే ఆ పాప కూడా. అగ్నిప్రమాదంనుండి గొర్రెల్ని కాపాడుతూ తాను కాలిపోతుంది. అవును, దండకారణ్యంలోనూ జనచైనాలో వలే 'అత్యంత ప్రముఖ వ్యక్తులు'' ఇప్పుడు ప్రజలే. వారి ప్రయోజనాల తర్వాతే ఏదైనా. 'చిన్నారి సాధన' ప్రస్తావన కలిగించిన ఈ భావసంచలనంలో ఓ క్షణం మునిగిపోయా....

ఇంతలో ఇక లేద్దామా అన్న తన శరీర భాష నాకర్థమైంది.

**'వుండండి వుండండి, చివరిగా ఇదొక్కటి'**

'అడగండీ' అంటూనే సగం లేచాడు.

**రచయితగా 'సాధన'ను నిర్వచించండి.**

'ప్రజలనే గురువులుగా నమ్మి, వారి సేవకే జీవితాన్ని అంకితం చేసి పోరుపథంలో నిలిచిన ఒక సాయుధ-సాంస్కృతిక సేనాని సాధన' అతనితో పాటు ఈ అక్షరాలూ గొప్ప గర్వంతో మహా నిటారుగా కవాతుకు సిద్ధపడినట్లు నిల్చున్నాయి.

ఒక్క క్షణం కంటే ఎక్కువ ఆలోచించినట్లుగా కూడా అనిపించలేదు. ఆ సమాధానం విన్నాక ఇక అడగడానికేం మిగల్లేదు అని కూడా అనిపించింది - అప్పటికి.

'దండకారణ్య విముక్తి ప్రాంతాన్ని నిర్మిద్దాం, నిర్మిద్దాం' అంటున్న అరచేతుల సంభాషణ. ఓ పిడికిలి బిగింపు, ఓ లాల్‌సలాం. 'మళ్లీ తప్పక రావాలి' అనే ఆహ్వానం కలగలసిన వీడ్కోలు.

'ఇంగో'

**(ఈ మాటల పొగడ పూలను రాల్చుకుని, ఏరుకుని, పదిలంగా పొదువుకొని మీ దాకా తెచ్చినది మాసె)**

*

**వ్యాసం** ◆ శ్రీనివాసరావు

# ఆపరేషన్ గ్రీన్‌హంట్ ఎవరి కోసం? ఎందుకోసం?

ఇప్పుడు మనం అతి చెడ్డ కాలంలో ఉన్నాం. ఈ చెడ్డకాలంలో అతి కష్టంగా కాలం వెళ్ళదీస్తున్నాం. అంటే పరిస్థితి రోజు రోజుకీ పెనం మీద నుండి పొయ్యిలోకి పడుతున్నట్టుగా ఉంది. దేశంలో సుమారు రెండు లక్షల మంది రైతులు ఆత్మహత్యలు చేసుకున్నారు. అధికార మార్పిడి కాలం నాటి కంటే ప్రజల పోషకాహార లోపం ఎక్కువగా ఉంది. అర్జునసేన్ గుప్తా నివేదిక ప్రకారం డెబ్బై ఏడు శాతం జనాభా రోజుకి రూ.20/-ల వేతనంతో జీవిస్తున్నారు. యూనిసెఫ్ నివేదిక ప్రకారం భారత దేశంలో ప్రతి రోజు ఐదువేల మంది ఐదేళ్ళ లోపు బాలలు పోషకాహార లోపంతో చనిపోతున్నారు. వీరిలో 96 శాతం మంది ఆదివాసుల బాలలు. అత్యంత విషాదకరమైన విషయమేమిటంటే ఈ అత్యంత కటిక పేదరికం అనుభవిస్తున్న భారత ప్రజలపై నేడు భారత ప్రభుత్వం యుద్ధం ప్రకటించింది. దీన్ని మావోయిస్టులపై యుద్ధం అంటోంది. దీనకి 'ఆపరేషన్ గ్రీన్‌హంట్' అని నామకరణం చేసింది.

ఒక భూతం నేడు భారత పాలక వర్గాలను ఆవహించింది. అది మావోయిస్టు భూతం. అన్ని పాలక వర్గ శక్తులు ఒక కూటమిగా ఏర్పడి ఈ భూతాన్ని ఎదుర్కోడానికి సిద్ధమైనవి. పి. చిదంబరం, మోహనభగత్, మన్మోహన్‌సింగ్, రమణసింగ్, బుద్ధదేవ్ భట్టాచార్య, తరుణ్ విజయ్, ఎన్.రామ్, అర్నాబ్ గోస్వామి అందరూ దేశంలోపల దేశం వెలుపల వేరువేరు వేదికల మీది నుండి ఉద్ఘాటిస్తున్నారు. మావోయిస్టు భూతం భారతదేశ అంతర్గత భద్రతకు, అభివృద్ధికి పెనుసవాలుగా తయారైంది. కార్పోరేట్ సంస్థల దన్ను కలిగిన ప్రధాన స్రవంతి ప్రచార సాధనాలు అసత్యాలు, అర్థ సత్యాలతో కథనాలు వ్రాస్తూ ఉన్నాయి, చెప్తూ ఉన్నాయి. గత కొన్ని నెలలుగా ఈ ఆపరేషన్ గ్రీన్‌హంట్‌లో భాగంగా ప్రతిరోజు ఎంతో మంది ఆదివాసులు భారతసైన్యం తుపాకి గుళ్ళకు బలౌతున్నారు.

ఆపరేషన్ గ్రీన్‌హంట్ నేపథ్యం : 1991లో ఇప్పటి ప్రధాని మన్మోహన్ సింగ్ ఆర్థిక మంత్రిగా ఉన్నపుడు సరళీకృత ఆర్థిక విధానాలకు తెరతీయడం జరిగింది. ప్రపంచీకరణ పేరుతో భారత మార్కెట్‌ను బహుళజాతి సంస్థలకు అప్పజెప్పారు. ఇక్కడి సహజ వనరులను దోచిపెట్టడం కోసం అనుమతులిచ్చారు. ఇదంతా భారత ఆర్థిక వ్యవస్థను బలోపేతం చేయడం పేరుతో జరిగింది. ఫలితంగా దేశంలోకి విదేశీ బహుళజాతి సంస్థల పెట్టుబడులు ఇబ్బడిముబ్బడిగా వచ్చి పడ్డాయి. వీటితో స్వదేశీ పెట్టుబడులు మిలాఖత్ అయ్యాయి. ఇందువల్ల నిరంకుశ బహుళజాతి పెట్టుబడుల ఆధిపత్యం దేశంలో పెరిగిపోయింది. ఫలితంగా సంక్షేమ రాజ్యంగా ఉన్న భారత రాజ్య స్వభావం క్రమంగా మారిపోయి లాభాపేక్ష కలిగిన కంపెనీ స్వభావాన్ని సంతరించుకుంది. తను బాధ్యత వహించాల్సిన విద్య, వైద్యం నుండి పూర్తిగా తప్పుకుంటూ వచ్చింది. ప్రైవేటీకరణ ఫలితంగా క్రమంగా దేశంలో నిరుద్యోగ నిర్వాసిత సమస్య పెరుగుతూ వచ్చింది. ఈ విధమైన భారత ప్రభుత్వ ప్రజావ్యతిరేక విధానాలకు పరాకాష్టగా తూర్పు, మధ్య భారతంలోని అపారమైన అటవీ, భూగర్భ సహజ వనరులను బహుళజాతి సంస్థలకు కట్టబెట్టేందుకు వేలాది ఒప్పందాలు కుదుర్చుకుంది.

మరోవైపు సామ్రాజ్యవాద దేశాలు మున్నెన్నడూ లేని విధంగా 1929 తరహా ఆర్థిక సంక్షోభాన్నెదుర్కొంటున్నాయి. సామ్రాజ్యవాద దేశాలకు చెందిన బహుళజాతి గుత్త సంస్థలు తీవ్ర ఆర్థిక సంక్షోభంలోకి కూరుకుపోయాయి. అందువల్ల తమ సంక్షోభ భారాన్ని అభివృద్ధి చెందుతున్న మనలాంటి దేశాల మీదికి నెట్టేందుకు కుట్రలు చేస్తున్నాయి. ఇందులో భాగమే భారత ప్రభుత్వంతో కుదుర్చుకొన్న వేలాది అవగాహన ఒప్పందాలు

2001 అంతకు ముందు అయినా రాష్ట్ర ప్రభుత్వాలు విదేశీ బహుళజాతి సంస్థలకోసం ఒకదానికొకటి పోటీ పడ్డాయి. వందలాది ఒప్పందాలు, అవగాహనలు కుదుర్చుకొన్నాయి. జార్ఖండ్‌లో వందకు పైగా అవగాహన ఒప్పందాలపై ప్రభుత్వం సంతకం చేసింది. మిట్టల్, జిందాల్, టాటా, రియోటింటో ఇవికాక విదేశీ, స్వదేశీ గుత్త సంస్థలు ఈ ఒప్పందాలు కుదుర్చుకున్న వాటిలో ఉన్నవి. గత తొమ్మిది సం.రాలుగా ప్రాజెక్టులు, స్టీల్, అల్యూమినియం ప్లాంట్లు, ఎలక్ట్రిసిటీ ప్లాంట్లు, డామ్‌ల కొరకు ఈ ఒప్పందాలు జరిగాయి. ఒరిస్సాలో కూడ వేదాంత, పోస్కో, రియోటింటో, టాటా, హిందాల్కో, జిందాల్ , మిట్టల్ వంటి సంస్థల కన్ను అక్కడి సహజ వనరులపై బడింది. ఛత్తీస్‌ఘడ్‌లో బిజెపి ప్రభుత్వం ఇప్పటికే ఎన్నో బహుళజాతి సంస్థలతో ఒప్పందాలు కుదుర్చుకొంది. మైనింగ్ సెక్టార్‌లో ప్రత్యేక ఆర్థిక మండలాలకు అనుమతులిచ్చింది. ఈ మూడు రాష్ట్రాలు కుదుర్చుకున్న ఒప్పందాల విలువ రూ.8,73,896 కోట్లు. ఇది సెప్టెంబర్ 2009 వరకు మాత్రమే. ఇవికాక బెంగాల్, మహారాష్ట్ర ప్రభుత్వాలు కుదుర్చుకున్న అవగాహన ఒప్పందాలు చాలా ఉన్నాయి. ఎకనామిక్ అండ్ పొలిటికల్ వీక్లీ పత్రిక ఏప్రిల్ 24,2004 సంచికలో ప్రచురించిన దేవరంజన్ సారంగి మైనింగ్, డెవలప్‌మెంట్ అండ్ ఎమ్ఎన్‌సిస్ అనే నివేదికను గమనిస్తే పరిస్థితి అర్థమవుతుంది.

టేబుల్ 1997 - 2002 మధ్య సంతకాలు జరిగిన ఒప్పందాలు.

| కంపెనీ | మినరల్ | ఏరియా చ.కీ.మీ | జిల్లా/రాష్ట్రం | సం. |
|---|---|---|---|---|
| బి.హెచ్.బిల్లిటన్ (ఆస్ట్రేలియా) | కాపర్ లెడ్ | 2,532.14 | తొంక్, అజ్మీర్, బుండి భిల్వారా - రాజస్థాన్ | 1997 |
| బి.హెచ్.బిల్లిటన్ | కాపర్ లెడ్ | 2,637.58 | తొంక్, సవాయ్, మాధోపూర్ బుండి - రాజస్థాన్ | 1997 |
| బి.హెచ్.బిల్లిటన్ | కాపర్ లెడ్ | 903.84 | భిల్వారా - రాజస్థాన్ | 1997 |
| ఫిల్ప్ డోడ్జ్ | కాపర్ | 2472.00 | సింగ్ భూమి (ఈస్ట్) సింగ్ భూమి (వెస్) (బీహార్ | 1998 |
| ఆస్ట్రేలియన్ ఇండియన్ గోల్డ్ రీసోర్సెస్ (ఎఐఆర్) | కాపర్ | 2692.30 | సోంభద్ర / యుపి | 1998 |
| ఎఐఆర్ | గోల్డ్ | 196.5 | లలిత్‌పూర్ / యుపి | 1999 |
| బి.హెచ్.పి. బిల్లిటన్ | కాపర్ | 568,389 | భివాని, మోహిందర్ గఢ్ హర్యానా | 1999 |
| అడ్మాస్ ఇండియా | డైమండ్ | 1966.22 | బళ్ళారి, చిత్రదుర్గ / కర్ణాటక | 2000 |
| ఎసిసి రియోటింటో | డైమండ్ | 2480 | చిత్రదుర్గ, తుమ్‌కూర్, బళ్ళారి దేవనాగరి / కర్ణాటక | 2000 |
| పిల్ప్‌డోడ్ (యుఎస్) | కాపర్ | 963.585 | లలిత్ పూర్ / యుపి | 2000 |
| హుట్టిగోల్డ్‌మైన్స్ | గోల్డ్ | 2240 | బాగల్‌కోడ్ / కర్ణాటక | 2000 |
| డి బీర్స్ (ఎస్ఎ) | గోల్డ్ | 300,233,843 | కర్నూల్, అనంతపూర్ ప్రకాశం / ఆంధ్రప్రదేశ్ | 2000 |
| ఎన్ఎండిసి ఇండియా | డైమండ్ | 2300 | అనంతపూర్ / ఆంధ్రప్రదేశ్ | 2000 |
| ఎసిసి రియోటిండో | డైమండ్ | 1202.6 | రాయచూర్, బళ్ళారి / కర్ణాటక | 2001 |
| ఫిల్ప్ డోడ్జెస్ | కాపర్ | 1869 | ఈస్ట్‌సింగ్ భూమి / జార్ఖండ్ | 2002 |
| ఎక్స్‌ప్లోరేషన్ | గోల్డ్ | 3453 | బెల్గాం, ఉత్తర కన్నడ, ధార్వాడ్, హావేరి మరియు గడగ్ /కర్ణాటక | 2001 |
| ఆంగ్లో అమెరికన్ | కాపర్, నికెల్ | 2487 | గుంటూరు / ఆంధ్ర ప్రదేశ్ | 2002 |

ఎక్స్‌ప్లోరేషన్

| | | | | |
|---|---|---|---|---|
| డీబీర్స్ | డైమండ్ | 2000 | నవరంగ్‌పూర్ / ఒరిస్సా | ఏప్రిల్ 19 2002 |
| డీబీర్స్ | డైమండ్ | 2000 | నౌపడ, బోలంగిర్/ఒరిస్సా | ఏప్రిల్ 19 2002 |
| డీబీర్స్ | డైమండ్ | 2000 | కలహండి, నవరంగ్‌పూర్ / ఒరిస్సా | ఏప్రిల్ 19 2002 |
| డీబీర్స్ | డైమండ్ | 1733 | కలహండి, బోలంగిర్, నౌపడ / ఒరిస్సా | ఏప్రిల్ 19 2002 |
| ఆంగ్లో అమెరికన్ | లెడ్, జింక్ | 453 | రాజస్థాన్ | మే 20 2002 |
| డీబీర్స్ | డైమండ్ | 679 | ఆంధ్రప్రదేశ్ | మే 20 2002 |
| బిహెచ్‌పి | నికెల్, కోబాల్ట్ గోల్డ్ | 2293 | నర్సింగపూర్, హోషంగాబాద్ బింద్వారా / మధ్యప్రదేశ్ | మే 31,2002 |
| ఎసి రియోటింటో | డైమండ్, గోల్డ్ | 2450 | ఛత్తర్‌పూర్, సాగర్ డ్మోహ్, తికమ్‌గఢ్/ మధ్యప్రదేశ్ | జూన్ 12,2002 |
| ఆంగ్లో అమెరికన్ | కాపర్,నికెల్ | 2701 | ఆంధ్రప్రదేశ్ | జూన్ 12,2002 |
| ఎసిసి/ఆర్‌టిజడ్ | డైమండ్ | 3000 | ధమ్‌తారి, మహాసముంద్ చత్తీస్‌ఘడ్ | జూలై 30 2002 |
| డీబీర్స్ | డైమండ్ | 9000 | రాయ్‌పూర్, కాంకేర్, మహాసముంద్, జోస్పూర్, దుర్గ్/ చత్తీస్‌ఘడ్ | జూలై 30 2002 |
| ఎసి ఆర్‌టిజడ్ | డైమండ్, గోల్డ్ | 5200 | మధ్యప్రదేశ్ | అక్టోబర్ 24 2002 |
| ఎసి ఆర్‌టిజడ్ | డైమండ్ | 3000 | చత్తీస్‌ఘడ్ | అక్టోబర్28 2002 |

ఈ విధంగా పదిహేనేళ్ళ కాలం నుండి దేశీయ, అంతర్జాతీయ బహుళ జాతి సంస్థలతో భారత ప్రభుత్వం అనేక అవగాహనలు, ఒప్పందాలు కుదుర్చుకుంది. అత్యంత దుర్మార్గమైన కుట్ర ఏమిటంటే ఎన్‌డిఏ ప్రభుత్వం అధికారంలో ఉన్నపుడు ఖనిజ తవ్వకాలకోసం భూసేకరణ నిమిత్తం పార్లమెంటులో ఒక అమెండ్‌మెంటును ప్రవేశపెట్టింది. 1957 మైన్స్ అండ్ మినరల్స్ ఆక్ట్‌ను కలిగి ఉన్న కేంద్ర ప్రభుత్వం తన అధికారాలను రాష్ట్ర ప్రభుత్వాలకు బదిలీ చేయడం జరిగింది. అంతేకాదు కేంద్రంలో ఉన్న ఎన్‌డిఏ ప్రభుత్వం ఎన్నో విదేశీ బహుళజాతి సంస్థలకు అనుమతులిచ్చింది. వాటి కొనసాగింపే నేడు యుపిఏ ప్రభుత్వం చేస్తున్నది. ఏ ప్రభుత్వం అధికారంలో ఉన్నా పెట్టుబడిదారులు బహుళజాతి సంస్థల పక్షమే తప్ప ప్రజల పక్షాన లేవు.

లక్ష్మీ మిట్టల్ అధిపతిగా ఉన్న 'ఆర్సెలర్' సంస్థ జార్ఖండ్, ఒరిస్సా రాష్ట్రాల్లోని ఐరన్ ఓర్ వెలికితీసి ఉక్కు తయారుకు గాను పరిశ్రమల స్థాపనకు నిర్ణయించింది. ఇందుకు 24 మిలియన్ డాలర్ల పెట్టుబడి అంటే ఒక లక్షకోట్ల రుపాయల పెట్టుబడి పెట్టాలని నిర్ణయించింది. ఇది పూర్తిస్థాయి ఉత్పత్తికి చేరుకుంటే సంవత్సరానికి 24 మిలియన్ టన్నుల ఉత్పత్తి జరుగుతుంది. సమకేంద్ర దాస్, ఫిలిక్స్ పేడన్‌లు చెప్తున్న దాని ప్రకారం ఒరిస్సాలో నిక్షిప్తమై ఉన్న బాక్సైట్ ఖనిజం విలువ 2.27 ట్రిలియన్ డాలర్లు. అంటే భారతదేశ మొత్తం దేశీయోత్పత్తి కంటే రెండు రెండు రెట్లు కన్నా ఎక్కువ. ఇది 2004 సంవత్సరపు విలువ. ప్రస్తుత విలువ నాలుగు ట్రిలియన్ల డాలర్లు ఇవికాక ఛత్తీస్‌గఢ్, జార్ఖండ్ రాష్ట్రంల్లోని విలువైన ఇనుప ముడి ఖనిజం, యురేనియం, లైమ్‌స్టోన్, డోలమైట్, బొగ్గు, టిన్, గ్రానైట్, మార్బుల్, కాపర్, డైమండ్, బంగారం, క్యాబ, కొరండమ్, బిరైక, అలెగ్జాడ్రైట్, సిలికా, ఫ్లోరైట్ మరియు గార్నెట్ వంటి 28 రకాల విలువైన ఖనిజాల వెలికితీత కోసం లక్షలకోట్లు విలువైన ఒప్పందాలు కుదిరాయి. ఇంకా పవర్‌ప్లాంట్లు, డ్యాంలు, హైవేరోడ్లు, స్టీలు, సిమెంటు పరిశ్రమలు, అల్యూమినియం స్మెల్టర్లు మరియు అన్ని రకాల మౌలిక సదుపాయాల ప్రాజెక్టులు అన్నీ ఈ ఒప్పందాల్లో భాగమే. ఒక్క జార్ఖండ్‌లోనే వందకుపైగా సంతకాలు జరిగాయంటే పరిస్థితిని అర్థం చేసుకోవచ్చు. 1970లో ఒక్క శాతంగా ఉన్న జనాభా పద్దెనిమిది శాతం సంపదను కలిగి ఉన్నాయి. 1996లో అదే ఒక్కశాతంగా ఉన్న జనాభా మొత్తం ఉత్పన్నైన సంపదలో నలభై శాతం వాటాను కలిగి ఉన్నారు. ఏభై సంవత్సరాల అధికార మార్పిడి తర్వాత 26 శాతం మంది ప్రజలు దారిద్ర్యరేఖకు దిగువన ఉన్నారు. 50.56 శాతం మంది ప్రజలు నిరక్షరాస్యులుగా ఉన్నారు. ఇప్పటికీ ప్రతికూల అనేక కారణాల రీత్యా ప్రతిరోజూ ప్రతి 1000మందికి 98 మంది బాలలు చనిపోతున్నారు. కేంద్ర ప్రభుత్వ ఖనిజాభివృద్ధి మంత్రిత్వశాఖ అధికారిక గణాంకాల ప్రకారం (1996-97లో ప్రచురించిన) భారతదేశంలో లభ్యమయ్యే సహజవాయు నిక్షేపాలు రాబోయే 23 సంవత్సరాలలోను, క్రూడాయిల్ 15 సంవత్సరాలలోను, బొగ్గు 213 సంవత్సరాలలోను, కాపర్ 64 సంవత్సరాలలోను, బంగారం 47 సంవత్సరాజలోను, ఇనుప ఖనిజం 135 సంవత్సరాలలోను, క్రోమైట్ 52 సంవత్సరాలలోను, మేంగనీస్ 36 సంవత్సరాలలోను, బాక్సైట్ 125 సంవత్సరాలలోను వినియోగం పూర్తికానున్నదని తెలియజేస్తున్నది. సహజ సంపదలన్నీ పెట్టుబడిదారులకు, సామ్రాజ్యవాదులకు అప్పజెప్తుంటే దేశంలోని సాధారణ ప్రజలు, బాలలు ఆకలి, అనారోగ్యాలు, ఆత్మహత్యల మధ్య కాలం వెళ్ళదీస్తున్నారు. మెజారిటీ దేశ సహజ సంపద అంతా తూర్పు, మధ్య భారతంలోని దండకారణ్యం, జంగిల్ మహల్‌లలో నిక్షిప్తమై ఉంది. ఇక్కడ నివసించే ఆదివాసులు ఇక్కడి అడవి మీద ఆధారపడి బ్రతుకుతున్నారు. కేంద్రం ఆయారాష్ట్ర ప్రభుత్వాలు బహుళజాతి సంస్థలతో కుదుర్చుకున్న ఒప్పందాల మేరకు ఇక్కడి సంపదను దోచిపెట్టడానికి నిర్ణయించాయి. ఇంకో విషయం ఏమిటంటే ప్రస్తుత ఆర్థిక మంత్రి పి. చిదంబరం ఇంతకు ముందు ప్రపంచంలోనే అతి పెద్ద మైనింగ్ సంస్థలలో ఒకటైన ట్విన్‌స్టార్ హోల్డింగ్స్‌లో భాగస్వామిగా ఉన్న వేదాంత కంపెనీ డైరెక్టర్లలో ఒకరుగా ఉన్నారు. ఈ ప్రాంతంలో ఖనిజ తవ్వకాలకోసం ఈ కంపెనీ అనేక ఒప్పందాలు కుదుర్చుకుంది. ఈయన తర్వాత ఇప్పుడు ఈయన భార్య డైరెక్టరుగా వ్యవహరిస్తుంది.

ఐతే గత మూడు దశాబ్దాలుగా ఇక్కడి ఆదివాసులు కేంద్రంగా వారి విముక్తి లక్ష్యంగా పనిచేస్తున్న మావోయిస్టు ఉద్యమం ప్రస్తుత కేంద్రరాష్ట్ర ప్రభుత్వాలకు తలనొప్పిగా మారింది. అధికార మార్పిడి జరిగినప్పటినుండి ఏమాత్రం పట్టించుకోని ఆదివాసుల జీవితాలు నేడు ఈ ప్రభుత్వాలకు అడ్డంకిగా మారాయి. 26 అక్టోబర్ 2009 అవుట్‌లుక్ పత్రికలోని అప్పటి మధ్యప్రదేశ్ ముఖ్యమంత్రి, కాంగ్రెస్ జనరల్ సెక్రటరీ అయిన దిగ్విజయ్‌సింగ్ వ్యాఖ్యలు చూస్తే ఆదివాసుల పట్ల వారి దుర్మార్గ వైఖరి అర్థమవుతుంది. "ఆదివాసుల కొరకు ఆమోదించిన ట్రైబల్ బిల్లు అమలుకు నోచుకోక పోవడం వల్లనే మావోయిస్టుల ప్రభావం పెరిగింది. ఆదివాసీ ప్రాంతాలలో నిక్షిప్తమై ఉన్న సహజ వనరులపై ఆదివాసులకు ఏ మాత్రం హక్కులేదు. కేవలం మైనరు, మేజరు అటవీ ఉత్పత్తుల ఫలసాయం మీదనే వారికి హక్కు" అంతేకాదు "దేశంలోని అన్ని ప్రాంతాలకు వామపక్ష తీవ్రవాదం విస్తరించి అభివృద్ధి చెందితే అద్భుతమైన సహజ వనరులైన ఖనిజ సంపద వెలికితీతకు, వాటి ద్వారా తయారయే ఉత్పత్తుల పరిశ్రమల స్థాపనకు రాబోయే పెట్టుబడులపై దీని ప్రభావం ఉంటుంది. కనుక నేడు దేశం ఎదుర్కొంటున్న అతి పెద్ద సవాల్ వామపక్ష తీవ్రవాదమే అని 9 జూన్ 2009న పార్లమెంటులో ప్రధాని మన్మోహన్‌సింగ్ ప్రకటించారు. కనుకనే దేశంలోని ఆదివాసులు వారికి అండగా నిలుస్తున్న మావోయిస్టులు లక్ష్యంగా పెట్టుబడిదారులు, బహుళజాతి సంస్థల

ప్రయోజనాల కోసమే "ఆపరేషన్ గ్రీన్ హంట్" ప్రకటించబడింది.

**యుద్ధం మొదలైంది :** ప్రజలపై తలపెట్టిన ఈ ఆపరేషన్ గ్రీన్‌హంట్ ద్వారా తూర్పు, మధ్య భారత రాష్ట్రాలైన ఒరిస్సా, జార్ఖండ్, పశ్చిమబెంగాల్, చత్తీస్‌ఘడ్, మహారాష్ట్ర, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాల్లో ముఖ్యంగా ఆదివాసి నివాసిత ప్రాంతాల్లో యుద్ధం నిర్మాణమయ్యే పరిస్థితి తలెత్తుతున్నది. ఇప్పటి వరకు జమ్ముకాశ్మీర్, ఈశాన్య రాష్ట్రాల్లో జాతి విముక్తి పోరాటాలపైన యుద్ధం చేసింది. ఇప్పుడు ఈ ప్రభుత్వం ఆదివాసులపై యుద్ధం ప్రకటించింది. ఇప్పటి వరకు అక్కడ ఉన్న భద్రతా దళాలను ఉపసంహరించి ఇక్కడ కేంద్రీకరిస్తున్నది. 1,00,000కు మందికి పైగా బలగాలను ఆయా ప్రాంతాల్లో మోహరించింది. ఈ బలగాలు 2,50,000 లకు పెంచాలని భావిస్తున్నది. సిఆర్‌పిఎఫ్, ఐఆర్‌బి, ఐటిబిపి, సిఐఎస్ఎఫ్ (గ్రేహౌండ్స్), కోబ్రా ఇంకా ఇతర ప్రత్యేక బలగాలు, స్థానిక పోలీసులు ఈ బలగాల్లో ఉన్నారు. ఇవికాక ప్రభుత్వాలు చట్ట వ్యతిరేకంగా ప్రోత్సహిస్తున్న ప్రైవేటు సైన్యాలైన సల్వాజుడుం, సేంద్ర, నాగరిక్ సురక్ష సమితి, త్రితియ ప్రస్తుతి సమితి, హర్మద్ వాహిని, సన్‌లైట్‌సేన తదితర మూకలున్నాయి. భారత సైనిక ప్రత్యేక యూనిట్లైన రాష్ట్రీయ రైఫిల్స్, ఎయిర్‌ఫోర్స్‌కు చెందిన హెలికాప్టర్లు సిద్ధంగా ఉన్నాయి. అంతేకాదు భారతప్రభుత్వం అమెరికా సైనికబలగాలు ఉపయోగించే శాటిలైట్లను కూడ ఉపయోగించడానికి అమెరికాతో ఒప్పందం కుదుర్చుకుంది.

ఈ ఆపరేషన్ గ్రీన్‌హంట్ జార్ఖండ్, పశ్చిమబెంగాల్, ఒరిస్సా, బీహార్ తదితర రాష్ట్రాల్లో ఇప్పటికే ప్రారంభమైంది. చత్తీస్‌ఘడ్ ఈ మొత్తం ఆపరేషన్‌కు కేంద్రంగా ఉంది. మొత్తంగా కేంద్రీకరించిన బలగాలు కేంద్రీకరించబోయే బలగాలు ఒక మిలియన్‌లో నాలుగవవంతు. ఇది అమెరికా ఇరాక్ దురాక్రమణలో ఉపయోగించిన బలగాలకు రెట్టింపు. ఆస్ట్రేలియా, నెదర్లాండ్స్, దక్షిణాఫ్రికాల సైనిక బలగాలకంటే ఎక్కువ. అంతేకాదు భారత ప్రభుత్వం తన ప్రజలపై తలపెట్టిన యుద్ధానికి అనుసరిస్తున్న తన వ్యూహం గమనిస్తే ప్రభుత్వ స్వభావం అర్థం అవుతుంది. రాబోయే ఐదు సంవత్సరాల వరకు ఈ యుద్ధాన్ని విస్తరించాలనుకుంటుంది. అందులో భాగంగా బిలాస్‌పూర్ దగ్గర ఒక ప్రత్యేక బలగాల శిక్షణశాల, ఒక ప్రత్యేక బలగాల యూనిట్, ఒక ఆర్మీ బ్రిగేడ్ హెడ్‌క్వార్టర్ నెలకొల్పనుంది. భవిష్యత్తులో ఈ ఆర్మీ బ్రిగేడ్ హెడ్‌క్వార్టర్ మావోయిస్టు వ్యతిరేక ఆపరేషన్లలో పాలుపంచుకొంటుంది. ఈ నిర్మాణాల కోసం, మౌలిక సదుపాయాలకోసం 1800 ఎకరాలు భూమి సేకరణ భారత ప్రభుత్వం చేస్తున్నది. అంతేకాదు భారత వైమానిక దళం తన ఎయిర్ బేస్ కోసం 300 ఎకరాల స్థల సేకరణ చేస్తున్నది. కాశ్మీర్ నుండి రాష్ట్రీయ రైఫిల్స్ బలగాలను ఉపసంహరించి మావోయిస్టు ప్రభావిత ప్రాంతాలకు తరలిస్తున్నది. రాష్ట్రీయ రైఫిల్స్, సరిహద్దు భద్రతా దళాలకు ఇతర పారామిలిటరీ బలగాలకు మీడియా రేంజ్ మిషిన్‌గన్లు, మోర్టార్లు, రాకెట్ లాంచర్లు వంటి పెద్ద తరహా ఆయుధాలను అందించే ప్రయత్నాలు చేస్తున్నది. అంతేకాదు ప్రస్తుతం ఉన్న బలగాలకు మద్దతుగా ఆరు, ఎమ్ఐ - ఎమ్ ఐఎఫ్ హెలికాప్టర్లను ఉంచింది. ఈ హెలికాప్టర్ల ద్వారా దాడులు చేసేందుకు ఆత్మరక్షణ పేరుతో వైమానిక భద్రతా దళానికి అనుమతినిచ్చింది.

ఇంకా ఆదివాసులపై ఒక దాడిని ఏడు దశల్లో చేయడానికి నిర్ణయించింది. ఒక్కో దశలో ఒక్కో ప్రాంతంపై ధాడి చేయడానికి నిర్ణయమైంది. 26 అక్టోబర్ 09 అవుట్‌లుక్ సంచిక అందించిన వివరాల ప్రకారం మొదటి దశలో కాంకేల్ - చత్తీఘర్ నుండి ఉత్తర - దక్షిణ అక్షం గుండా ప్రారంభమై మహారాష్ట్రలోని గడ్చిరోలి నుండి తూర్పు పశ్చిమ అక్షం గుండా అబూజ్‌మడ్ వరకు ఉన్న ప్రాంతాన్ని ఆక్రమించాలని నిర్ణయించింది. అందులో భాగంగానే కేంద్ర ప్రభుత్వానికి సహకారంగా మహారాష్ట్ర ప్రభుత్వం రూ.100 కోట్లతో పథకం రూపొందించింది. మహారాష్ట్రలోని గడ్చిరోలి జిల్లాలో మొదటిదశ ఆపరేషన్ గ్రీన్‌హంట్ ప్రారంభమైనట్లు 2 నవంబరు 2009 టైమ్స్ ఆఫ్ ఇండియా పత్రిక పేర్కొంది.

ఆపరేషన్ గ్రీన్‌హంట్ కన్నా ముందు సల్వాజుడుం గురించి కొంచెం చెప్పుకోవాలి. కేంద్ర ప్రభుత్వం, చత్తీస్‌ఘడ్ ప్రభుత్వం ఎస్సార్, టాటా కంపెనీలతో అవగాహన ఒప్పంద పత్రాలపై సంతకాలు జరిగిన తర్వాత ఈ రెండు కంపెనీల ఆర్థిక సహకారంతో 2004లో సల్వాజుడుం ప్రారంభమైంది. అప్పటి నుండి ఆదివాసులు ప్రత్యేకంగా ప్రభుత్వానికి, సల్వాజుడుంకు లక్ష్యం అయ్యారు. ఆ తర్వాత వందలాది మంది ఆదివాసులు సల్వాజుడుం చేతిలో చనిపోయారు. ఎంతో మంది అదృశ్యం అయిపోయారు. వందలాది ఇళ్ళు కాల్చి వేశారు. ఏడు వందలకు పైగా గ్రామాలు నిర్వాసితమైపోయాయి. పసిపిల్లల తలలు నరికారు. ఆదివాసుల మృత దేహాలు మాయంచేశారు, చెట్లకు ఉరి తీశారు. ఆదివాసి మహిళలపై అత్యాచారం, హత్య రాజ్యహింసకు ఒక రూపమైంది. ఘవవారు మూడు లక్షల మంది ఆదివాసులు తమ గ్రామాలను వదలి వెళ్ళారు. ఏభై వేలకు మంది పైగా సల్వాజుడుం కేంపుల్లో బలవంతంగా నిర్బంధించబడ్డారు. ఇలా వలసపోయిన వారు పోగా, కేంపుల్లో నిర్బంధించబడినవారు నిర్బందించబడగా మిగిలిన వారికై ప్రభుత్వం ఇప్పుడు ఆపరేషన్ గ్రీన్‌హంట్ పేరుతో ప్రత్యక్ష యుద్ధం తలపెట్టింది.

సల్వాజుడుం లాంటి చట్ట వ్యతిరేక ప్రైవేటు సైన్యంతో చేసిన యుద్ధం ఇప్పుడు ఆపరేషన్ గ్రీన్‌హంట్ పేరుతో ప్రత్యక్షంగా ప్రారంభమైంది. 1 నవంబర్ 2009న ఈ యుద్ధం ప్రారంభమైన తర్వాత రోజురోజుకు తగలబడిపోతున్న గ్రామాల సంఖ్య పెరిగిపోతూ ఉంది. నిర్వాసితులౌతున్నవారు, గాయాల పాలవుతున్న వారు, అరెస్టు కాబడుతున్నవారు పెరుగుతున్నట్లుగా ప్రసార సాధనాల ద్వారా తెలుస్తున్నది. నవంబరు మధ్యకాలంలోనే 12 గ్రామాలకు పైగా పూర్తిగా ధ్వంసం చేయబడ్డాయి. అంతేకాదు ఈ మధ్యకాలంలో దంతెవాడ బీజాపూర్ జిల్లాల్లో జరిగిన సంఘటనలు ప్రభుత్వ క్రూర స్వభావాన్ని తెలియజేస్తున్నాయి. సెప్టెంబరు 16న సింగన మడుగు అటవీ ప్రాంతంలో మావోయిస్టులు ఒక టెంటు వేసుకొని సింగిల్ బోర్ తపంచాలు. తయారు చేస్తుండగా 150 మంది కోబ్రా' దళాలు దాడి చేశాయి. ఆ దాడి నుండి తప్పుకున్న మావోయిస్టులు 17వ తేది ఉదయాన అక్కడే ఉన్న కోబ్రాలపై దాడి చేశారు. అందులో 8 మంది కోబ్రాలు చనిపోయారు. పారిపోయిన కోబ్రాలు, సల్వాజుడుం కార్యకర్తలు (ఎస్‌పిఒ డబ్ల్యూ) దగ్గరలోని గుచ్చంపల్లి, గట్టంపాడు, పాలచెలమ గ్రామాలపై పడి 12 మంది గిరిజనులను కాల్చి చంపి ఎదురుకాల్పుల కథ అల్లారు. ఇక్కడ 70 సం.రాల వృద్ధురాలి స్థనాలు కోసి హత్య చేశారు. అలాగే అక్టోబర్ 1న గోంపాడు గ్రామంపై ప్రత్యేక బలగాలు, సల్వాజుడుం వాళ్ళు కలిసి దాడి చేసి 9 మందిని కాల్చి చంపారు. ఒకటిన్నర సం.ల పిల్లవాడి చేతి వేళ్ళను నరికి తల్లి శవంపై పడుకోబెట్టారు. డిసెంబరు నెలలో దోకపాడు గ్రామంపై దాడి చేసి ఇళ్ళను లూటీ చేసి, ఇద్దర్ని గిరిజనుల్ని చంపారు. డెక్కమడుగు గ్రామంపై దాడి చేసి 60 ఇళ్ళను తగులబెట్టారు. నలుగురు మహిళలపై అత్యాచారం చేశారు. నలుగురు గిరిజనుల్ని తీసుకెళ్ళి కాల్చి చంపారు. పాలడుగు గ్రామంపై దాడి చేసి 40 ఇళ్ళను తగుల బెట్టారు. జోగయ్య అనే గిరిజనుడిని తీసుకెళ్ళి కిష్టారం సమీపంలో కాల్చి చంపారు. ఎర్రి అనే యువతిపై సామూహిక అత్యాచారం చేశారు. అక్టోబర్ 24న కాంకేర్ గ్రామంపై దాడి చేసి ముగ్గురు ఆదివాసులను చంపారు. ఈ విధంగా కేవలం గిరిజనులను భయభ్రాంతులకు గురిచేయాలనే ఉద్దేశంతోనే ఈ హత్యాకాండ కొనసాగిస్తున్నారు.

దండకారణ్యంలో జరిగిన రెండు సంఘటనలలోను, ఒరిస్సాలో జరిగిన ఒక సంఘటనలోను కలిపి 17 మంది ఆదివాసులను ప్రభుత్వ బలగాలు హత్య చేశాయి. పశ్చిమ బెంగాల్‌లోని లాల్‌ఘడ్‌లో వందలాది మంది ఆదివాసుల ఇళ్ళను ధ్వంసం చేశాయి. జార్ఖండ్‌లోని గిరిధ్ జిల్లాలోని హర్దాలి

గ్రామంలోను రాంచికి దగ్గరలోని ఫతేపూర్ గ్రామంలోను పోలీసు పారామిలిటరీ బలగాలు ప్రజలను చిత్రహింసలకు గురిచేశాయి. విచక్షణ లేకుండా అరెస్టులు చేస్తున్నారు. అలాగే ఆంధ్ర, ఒరిస్సా సరిహద్దులో వాకపల్లి ఘటన మరువకముందే బల్లిగూడలో భద్రతాదళాలు నాలుగురు గిరిజన మహిళలపై అత్యాచారం చేసిన ఘటన అందరికీ తెలిసిందే. ఈ విధంగా కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ఆదివాసులకు వ్యతిరేకంగా మిలిటరీ పరిష్కారాన్ని ఎంచుకొని హత్యాకాండ కొనసాగిస్తున్నాయి.

**నల్ల చట్టాలు - క్రూర అణిచివేతలు :** ఆపరేషన్ గ్రీన్‌హంట్ భారత ప్రభుత్వం తన ప్రజలపై ప్రకటించిన ప్రత్యక్షయుద్ధం అయితే అంతకుముందు నుండే ప్రశ్నించే వారి నోరు మూసేందుకు అనేక నల్ల చట్టాలు రూపొందించబడ్డాయి. లాల్‌ఘడ్‌లో పోలీసు అత్యాచారాలకు వ్యతిరేకంగా జరిగిన ఉద్యమం మనమందరం ఎరిగిందే. ప్రభుత్వాల ప్రజావ్యతిరేక విధానాలకు వ్యతిరేకంగా మాట్లాడిన మానవ హక్కుల కార్యకర్తలపై జరిగిన అణిచివేతకు బినాయక్ సేన్ ప్రత్యక్ష ఉదాహరణ. 2005లో చత్తీస్‌ఘడ్ ప్రభుత్వం రూపొందించిన చత్తీస్‌ఘడ్ స్పెషల్ పబ్లిక్ సెక్యూరిటీయాక్ట్ కింద బినాయక్ సేన్‌ను అరెస్టు చేసి రెండు సం.లు జైలులో నిర్బంధించారు. 2006లో సునీత నారాయణ్ అనే ప్రచురణకర్తను ప్రశాంత రాహి అనే సామాజిక కార్యకర్తను అరెస్టు చేశారు. ఇంకా ఆంధ్ర ప్రదేశ్ స్పెషల్ పబ్లిక్ సేఫ్టీ యాక్ట్ కింద చేనేత నాయకుడు మాచర్ల మోహన రావును అరెస్టు చేశారు. మే, 2009లో మావోయిస్టులపై యుద్ధం పేరుతో దంతెవాడ జిల్లాలో వనవాసి చేతన ఆశ్రమంను నెలకొల్పి గాంధేయవాద విధానాలతో గిరిజనులకు సేవ చేస్తున్న హిమాంశు కుమార్ ఆశ్రమాన్ని పూర్తిగా నాశనం చేశారు. ఆంధ్రప్రదేశ్‌లో పౌరహక్కుల సంఘం రాష్ట్ర కమిటి సభ్యుడు సుగుణానందంను యుఎపిఎ చట్టం కింద అరెస్టు చేసి జైలులో పెట్టారు. పశ్చిమ బెంగాల్‌లో లాల్‌గఢ్ ఉద్యమ నేత ఛత్రధర్ మహతోను జర్నలిస్టుల వేషంలో వెళ్ళి అరెస్టు చేసి జైలులో పెట్టారు. కలకత్తాలో విస్థాపన విరోధి జనవికాస్ ఆందోళన నేత టింకుదాను యుఎపిఎ కింద అరెస్టు చేసి జైలులో పెట్టారు. జార్ఖండ్‌లో కె ఎన్ పండిట్‌ను ఇదే చట్టం కింద అరెస్టు చేసి జైలులో పెట్టారు. అంతేకాదు కోల్‌కతాలో నాలుగు నెలల కింద యుఎపిఎ చట్టం కింద అరెస్టు చేయబడిన పీపుల్స్‌మార్చ్ పత్రిక సంపాదకులు స్వపన్‌దాస్ గుప్తా పోలీసు కస్టడీలో వైద్యం అందక చనిపోయారు. ఇలా చట్ట వ్యతిరేకంగా రాజకీయ కార్యకర్తల, పౌర మానవ హక్కుల కార్యకర్తలపై అణిచివేత, హత్యలు కొనసాగుతున్నాయి. ప్రముఖ ఆర్థిక వేత్త పాల్ స్వీజీ మూడవ ప్రపంచ దేశాలు ఒక విధమైన మిలిటరీ, పోలీసు రాజ్య స్వభావాన్ని సంతరించుకోవడంలో అభివృద్ధి చెందిన పెట్టుబడిదారి దేశాల సరసన చేరుతున్నాయి అని వ్యాఖ్యానించారు.

రోజురోజుకీ భారతదేశం ప్రపంచ అతి పెద్ద ప్రజాస్వామ్య దేశం ముసుగులో దేశ అత్యధిక ప్రాంతంలో పోలీసు రాజ్యాన్ని అమలు చేస్తున్నది. ఇది తయారు చేసిన ఎఎఫ్ఎస్‌పిఎ, యుఎపిఎ, ఎంసిఒసిఎ, అఫిషియల్ సీక్రెట్స్ యాక్ట్, చత్తీస్‌ఘడ్ పబ్లిక్ సెక్యూరిటీ యాక్ట్ వంటి ప్రజల అణిచివేత కోసం చేసి ఈ నల్ల చట్టాలే ఇందుకు ఉదాహరణ.

**ముగింపు :** భారతదేశంలో 1951 నుండి ఆరు కోట్ల మంది ఆదివాసులు మెగా ప్రాజెక్టుల వల్ల నిర్వాసితులయ్యారు. వీరిలో 20 శాతం మందికి మాత్రమే పునరావాసం కల్పించబడింది. అధికార మార్పిడి జరిగినప్పటి నుండి ప్రభుత్వాలు ఆదివాసుల పట్ల అనుసరించిన వివక్ష, దోపిడి, నిర్లక్ష్య పూరితమైన విధానాల వల్లనే ఆయాప్రాంతాల్లో మావోయిస్టు ఉద్యమం బలపడింది 1960లో నక్సల్బరీ ఉద్యమం బలవంతంగా అణిచివేయబడింది. అది ఒక పోలీస్‌స్టేషను, ఒక జిల్లా, ఒక రాష్ట్రం నుండి 560 పోలీసు స్టేషన్ల, 160 జిల్లాల, 14 రాష్ట్రాలకు విస్తరించింది. తన కాలంలో పోలీసు బడ్జెట్ 1000 రెట్లు పెరిగింది. కారణం ఈ దేశంలో సమానత్వం, న్యాయం అనేది పేద ప్రజలకు, ఆదివాసులకు అంటరానిదిగా తయారైనందు వల్లనే. ఈ దేశంలో ప్రజాస్వామ్యం మృగ్యమైనందువల్లనే ప్రజలు మావోయిస్టులతో కలసి ఆయుధాలు పట్టుకోవడానికి సిద్ధమవుతున్నారంటే కారణం మరో ప్రత్యామ్నాయం లేకనే.

ఈ రోజు మనందరం విఫలమైన ఈ ప్రజాస్వామ్యానికి సాక్షులుగా నిలబడ్డాం. ఒక ప్రజాస్వామ్యం యొక్క యోగ్యత అనేది అక్కడి అణగారిన, నిర్లక్ష్యానికి గురైన ప్రజల పట్ల అది ఎలా వ్యవహరించిందనేదాన్ని బట్టి ఉంటుంది. ప్రజలు ఇలాంటి ప్రజలకు ఏ మాత్రం న్యాయం అందనందువల్లనే కల్సి మావోయిస్టులతో ఆయుధాలందుకుంటున్నారు.

మొత్తం ప్రపంచ వ్యాప్తంగానే అమెరికా, బ్రిటన్‌ల నేతృత్వంలో ఉగ్రవాదంపై యుద్ధం పేరుతో ప్రజాస్వామిక, విప్లవ సాయుధ ఉద్యమాల మీద యుద్ధం కొనసాగుతున్నది. అందులో భాగమే నేటి భారత ప్రభుత్వం తలపెట్టిన ప్రజలపై యుద్ధం. నిజానికి భారతదేశంలోని ప్రతి పర్వత శిఖరం మీద ఏదో ఒక కంపెనీతో అవగాహన ఒప్పందం పై సంతకం జరిగింది. దండకారణ్యం నుండి నేపాల్ వరకు మావోయిస్టు రెడ్ కారిడార్ ఏర్పాటు జరుగుతున్నదని మీడియా ఊదరగొడుతున్నది. నిజానికి ఇప్పటికే అక్కడ ఏర్పడింది. ఎంఒయు ఇష్ట్ కారిడార్. ఈ ఒప్పందాల కారిడార్‌ను రద్దు చేసుకునే వరకు ప్రజలు, ప్రజాస్వామిక వాదులు, ఆదివాసులు భారతదేశంపై యుద్ధం ప్రకటించాలి. ఈ యుద్ధం మొత్తం సామ్రాజ్యవాదానికి దానికి దన్నుగా ఉన్న బహుళ జాతి గుత్త సంస్థలకు వ్యతిరేకంగా జరగాలి. ఈ యుద్ధంలో విజయం గాంధేయవాది హిమాంశుకుమార్ గారన్నట్లు మావోయిస్టులది, అంతిమంగా ప్రజలది.

*

*(.... 53వ పేజి తరువాయి)*

స్వంత భూమి నుండి, ఇళ్ళు, భూమి, బతుకులను వదిలి పారిపోవాల్సి వచ్చింది.

కనక నిజంగా ప్రభుత్వం యుద్ధం చేస్తోంది మావోయిస్టుల మీదనా? ఆదివాసీల మీదనా? వీరు చంపిన వందలమందిలో మావోలు ఎంతమంది?

గోంపాడులో 'గ్రీన్‌హంట్' చంపిన తొమ్మిదిమంది పేర్లు సుప్రీమ్ కోర్టు దాకా పోయాయి కదా? పారిపోతున్న గిరిజనుల్ని కాల్చి చంపారని ప్రపంచం తెలుసుకుందిగదా? ఇంకా మావోయిస్టులను మాత్రమే చంపుతున్నారని ఎందుకు బుకాయిస్తున్నారూ?

మావోయిస్టులను ఏరివేయడానికే ఛత్తీస్‌ఘడ్ పై యుద్ధం చేస్తున్నామన్న ప్రభుత్వం గిరిజనులను ఆవాసాలనుండి బీభత్సం సృష్టించి, ఇళ్ళు కూల్చేసి వారిని కాల్చేసి ఎందుకు అడవినుండి తరిమేస్తున్నారు. ఆ విలేకర్లు అడిగినట్లు ఈ పైశాచిక దాడులు, విధ్వంసం మీరు కల్పించుకున్నాక జరిగినవేకదా! పేదల బతుకులు బాగుచేస్తామని మీరు చెప్తున్నదే గదా! వారు చేస్తున్నది? ఇందులో మీరు చింతించాల్సింది ఏమిటీ?

ఆనాటి రామరాజునో, బిర్సాముండానో కొమురంభీంనో 'కప్పం' కట్టమన్న బ్రిటీష్‌వాడి రాజనీతి మీకు ఆదర్శ ప్రాయమా? ఈ దేశపు 'మూలవాసులయిన' ఆదివాసీలను మారుమూల అడవుల్లోకి, కొండ గుహల్లోకి నెట్టివేసిన 'ఆర్య' సంస్కృతికి మీరు వారసులా? ఆదివాసీలను అక్కడనైనా వుండకుండా ఇంకా ఇంకా కాళ్ళకింద నేల కూడా లేకుండా తరిమి వేస్తున్నారేమి? ఎందుకు?

"మేం ఏమీ అనకుండా వుంటే వాళ్ళు సంతోషంగా ఉద్యమం వ్యాపింపచేసుకుంటారని" మీ సొత్తేదో దొంగిలించుకుపోయిన్నట్లు ఎందుకీ బాధ? ఆ మాత్రం కూడా ఆదివాసీలకు, గిరిజనులను ఆ తిండి కూడా వద్దనా? గుడ్డలుకట్టుకోవద్దనా? అందుకేనా గిరిజనుల మీద యుద్ధం ప్రకటించింది ఈ ప్రభుత్వం? ఈ హోంమంత్రి?

లేదూ... మీకేమైనా ప్రత్యేక ప్రణాళికలున్నాయా? అందుకేనా ఈ చింత, ఈ దుగ్ధ అవేవో బయటపెడితే సంతోషిస్తుంది లోకం మరి.

*

వ్యాసం ◆ ఎం.ఎ. బాసిత్

# ఆదివాసీలపై యుద్ధమే గ్రీన్‌హంట్

ఇటీవల కొంతకాలంగా మన రాష్ట్రంలోని ఖమ్మం జిల్లా భద్రాచలం చుట్టుప్రక్కల మండలాల్లోని వివిధ అటవీ గ్రామాల్లోకి ఛత్తీస్‌ఘడ్, ఒరిస్సా రాష్ట్రాల అటవీ గ్రామాల నుంచి పెద్ద సంఖ్యలో ఆదివాసుల వలసలు కొనసాగుతుండడం తెలిసిందే. ఎందువల్ల ఈ వలసలు కొనసాగుతున్నాయి? ఈ వలసల వెనుక ఉన్న రాజకీయార్థిక కారణాలు ఏమిటి? ఒక అటవీ గ్రామం నుంచి ఇంకో అటవీ గ్రామానికి, అదీ తమ రాష్ట్ర సరిహద్దుల్ని సైతం దాటి ఆదివాసులైన ఆ రాష్ట్ర ప్రజలుఎందుకు ఇక్కడికి వచ్చి చేరుతున్నారు? ఏ ముప్పు ముంచుకు రాకపోతే వీళ్లంతా ఎందుకు ఉన్నపళంగా ఇక్కడి వస్తారు? ఇటువంటి ప్రశ్నలకు సమాధానాలు వెతుక్కునే క్రమంలో ఛత్తీస్‌ఘడ్ రాష్ట్రంలోని బాధిత గ్రామాలను, సరిహద్దుకు ఈవల ఆంధ్రప్రదేశ్‌లోని ఖమ్మం జిల్లా, భద్రాచలం, కుక్కునూరు, బూర్గంపాడు, చర్ల మండలాలకు చెందిన వివిధ అటవీ గ్రామాలను ఫిబ్రవరి 12,13వ తేదీలలో దేశంలోని వివిధ హక్కుల సంఘాలు, మన రాష్ట్రంలోనూ ఏర్పడిన ఆపరేషన్ గ్రీన్‌హంట్ వ్యతిరేక కమిటీలు సంయుక్తంగా సందర్శించడం జరిగింది. 45మంది సభ్యుల ఈబృందం రెండు భాగాలు విడిపోయి, ఒకటి ఛత్తీస్‌ఘడ్‌లోని బాధిత గ్రామాల్ని, మరోటి సరిహద్దుకు ఈవల మనరాష్ట్రంలోని పునరావాస గ్రామాల్ని సందర్శించింది. ఈ బృందంలో దేశ వ్యాప్తంగా ఉన్న హక్కుల కార్యకర్తలతో పాటు ఇద్దరు యూరోపియన్ ప్రతినిధులు కూడా ఉన్నారు.

ఈశాన్య, మధ్య భారతంనుండి, అట్లా దిగివస్తే దక్షిణాదికి తూర్పున బంగాళాఖాతం అంచుల దాక పశ్చిమ బెంగాల్, జార్ఖండ్, ఛత్తీస్‌ఘడ్, ఒరిస్సా, ఆంధ్రప్రదేశ్, మహారాష్ట్ర గడ్చిరోలి తదితర ప్రాంతాల దాక దట్టమైన అడవులు విస్తరించి ఉన్నది. ఇట్లా విస్తరించి ఉన్న అటవీ ప్రాంతాల్లోని ఓ మోస్తరు ఎత్తునుంచి బల్లపరుపు కొండలు, గుట్టల్లో విస్తారంగా పరుచుకొని భూగర్భం నిండా వైవిధ్యభరితమైన అపార ఖనిజ సంపద నిక్షిప్తమై ఉన్నదన్న సంగతి వివిధ మైనింగ్ సంస్థల అధికారిక, అనధికారిక సర్వేలలో వెల్లడైన విషయం తెలిసిందే.

అయితే ఇంత పెద్ద మొత్తంలో ఖనిజ వనరులు కొండల గర్భంలో దాగి ఉన్నందుకు మనం గర్వపడాలో లేక ఇవన్నీ పరాయిదేశాలకు అప్పగించడానికి మన దేశ పాలకులు ఒప్పందాలు కుదుర్చుకుంటున్నందుకు బాధపడాలో పాలుపోని పరిస్థితి.

విభ్రాంతికరమైన విషయం ఏంటంటె 2005లోనే ఇటువంటి ఒక అవగాహనా పత్రం మీద భారత ప్రభుత్వం సంతకం పెట్టింది! ఈ అవగాహనా పత్రాన్నే ఎంఓయు అంటున్నారు. దీన్ని విస్తరించి మెమొరాండమ్ ఆఫ్ అండర్‌స్టాండింగ్ (ఎంఓయు) అని పిలుస్తున్నారు.

ఈ ఒప్పందం కుదుర్చుకున్నాక పెద్ద ఎత్తున ఛత్తీస్‌ఘడ్ ఒరిస్సా రాష్ట్రాల నుంచి ఆదివాసులు ప్రధానంగా గుత్తికోయలు, ఆ రాష్ట్రాల సరిహద్దుల్ని దాటి ఆంధ్రప్రదేశ్ లోని ఖమ్మంజిల్లా భద్రాచలం చుట్టుప్రక్కల మండలాల్లోని వివిధ గ్రామాల్లోకి ప్రాణాలరచేత పట్టుకొని, శరణార్థులై వచ్చి చేరుతుండడాన్ని గమనించాలి.

ఇట్లా వచ్చినవే భద్రాచలం మండలం చోడవరం గ్రామ పంచాయితి పరిధిలోని ఎర్రగుంటపాడు అనే అటవీ గ్రామానికి చేరిన 43 కుటుంబాలు. మావడిసోమరాజు కథనం ప్రకారం: ఛత్తీస్‌గఢ్ దంతేవాడ జిల్లాలో కాంటగట్టు, ఏటిగట్టు గ్రామాలకు చెందిన వీళ్ల స్త్రీల గర్భాల్ని చీల్చి పిల్లల్ని బయటికి లాగి గొంతుకు పిసికి చంపి వేసిన సంఘటనల్ని చూసి బెదిరి అక్కడ్నించి పారిపోయి వచ్చారు.

అటువంటి దుర్భరస్థితిలోంచి పారిపోయి వచ్చిన ఆ కుటుంబాల్ని ఇక్కడి పోలీసులు, అటవీ శాఖాధికారులు కూడా ఇక్కడ బ్రతకనిచ్చె పరిస్థితి కనబడలేదు.

దంతేవాడ జిల్లా కొక్కనార్ గ్రామం నుంచి తాము వ్యవసాయం చేసుకుంటున్న భూమిని, ఇంటిని, పుట్టిన ఊరు మీది మమకారాన్ని సైతం వదలి సల్వాజుడుం అకృత్యాలకు జడిసి, అక్కడ బ్రతకలేని స్థితిలో రాయనిపేట గ్రామ పంచాయతి పరిధిలోని కొత్తకొండపల్లికి బ్రతుకుజీవుడా అంటూ వచ్చి చేరిన 18 గుత్తికోయల కుటుంబాల ఈతిబాధలు వర్ణనాతీతం. ఈ కుటుంబాలు వేసుకున్న 18 పాకల్ని ఇక్కడి అటవీశాఖ అధికార్లు కాల్చి బూడిద చేశారు. వాళ్ల కాళ్లావేళ్లాపడి మరోసారి వేసుకున్న పాకల్ని ఈసారి పోలీసులు నిర్దాక్షిణ్యంగా కాల్చి పారేసారు. వీళ్ల కష్టాల్ని 'ముందు నుయ్యి, వెనుక గొయ్యి' సామెతతో పోల్చి చేతులు దులుపుకుంటె సరిపోతుందా! అక్కడ ఛత్తీస్‌ఘడ్‌లో ఎస్పీవోలుగా భుజకీర్తులు ధరించిన సల్వాజుడుం ఇక్కడ రకరకాలుగా కోరలు సాచిన పోలీసు జులుంతో ఇక పాకల్ని వేసుకోవడమే మానేసి చెట్టుకొకరు, పుట్టకొకరు బిక్కు, బిక్కుమంటూ క్రూర మృగాల దయాబిక్షకి తమ ప్రాణాల్ని వదిలి జీవిస్తున్నారు. ఇట్లా గాలిలో దీపం లాంటి వీళ్ల జీవితాలకి ఓ ఆపన్న హస్తం సాయం లభించింది.

బాలగోపాల్ ఉన్నప్పుడు ఎర్రగుంటపాడు, కొత్తకొండపల్లికి వచ్చినవాళ్లు హైకోర్టులో పిటిషన్ వేసి పాకల్ని కూల్చకుండ ఉత్తర్వులను కూడా అష్టకష్టాలు పడిసాధించుకున్నారు. ఎప్పుడో ఒకసారి, నూటికో, కోటికో ఒక తీర్పులో పీడితులకు ఆనుకోకుండా ఒక అనుకూల తీర్పు హైకోర్టు చెప్పితే ఆ తీర్పును కూడా పోలీసులు, అటవీ శాఖాధికారులు ఖాతరు చేసిన పాపానపోలేదు. ఇటువంటి స్థితిలో ఆదివాసులు తమగోడును ఎవ్వరికి చెప్పుకోవాలి?

ఇక, ఇస్పాపురం గ్రామ పంచాయితి పరిధిలోని సాలెబుడుప అటవీ గ్రామానికి బ్రతుక వచ్చిన 33 కుటుంబాల గాథ మరో విధంగా ఉంది. అయితే పోలిక ఏమిటంటె పోలీసులు వీళ్ల పాకల్ని కూడా కాల్చి పారేశారు. వీళ్ల మీద పోలీసుల నిఘా ఉత్తర తెలంగాణా తరహాలో ఉంది. మలుపులు కూడా అట్లాంటివె. "మావోయిస్టులు మీ దగ్గరికి వస్తున్నారా?", "మీరు వాళ్లకు సహకరిస్తున్నారా?", "మేం వచ్చిపోయినట్లు వాళ్లకు చెప్తున్నారా?" వంటి ప్రశ్నలతో పోలీసులు వేధిస్తుంటారని వాళ్లు చెప్పారు. అంతేకాదు 'అన్నలకు భోజనాలు పెడ్తున్నారు' వంటి కేసులు పెట్టి ముప్పుతిప్పలు పెడ్తున్నారని చెప్పారు. ఇప్పటికి మెట్టు దేవయ్య, మడక మాసయ్య, కట్టం భద్రయ్యలను అరెస్టు చేసి భద్రాచలం పోలీసు స్టేషన్‌లో టార్చర్ పెట్టి అంతిమంగా వరంగల్ జైలుకు తరలించారని ఊళ్లో వాళ్లంతా భయం భయంగా చెప్పారు.

ఒక దశలో ఊళ్లో వాళ్లు నిజనిర్ధారణకు వెళ్లిన బృందాన్ని ఒక పట్టాన నమ్మలేదు. దీనికి ఒక నేపథ్యం ఉంది. ఆ ఊళ్లో శంకర్ అనే పోలీస్ ఇన్‌ఫార్మర్ ఉన్నాడని, వివిధ రూపాల్లో వ్యవహరిస్తాడని, తానే రకరకాల కేసుల్లో ఇరికించి మళ్ల తనే దళారిగా వ్యవహరించి బెయిల్ ఇప్పిస్తాడని చెప్పారు. సందర్శకులను వాళ్లు అనుమానించడానికి కారణం శంకర్ తాలూకు అని అపోహ పడడమేనని తెలిసింది. తప్పుడు కేసుల్లో వరంగల్ జైలులో మగ్గుతున్న వాళ్ల విషయంలో ఇతడు ఇరవై వేలు లంచం తీసుకుని బెయిల్ ఇప్పించాడని గుట్టువిప్పారు.

ఈ ఊరి కథ ఇంతటితో అయిపోలేదు. ఊరి మీద డేగకళ్లపోలీసు నిఘా ఉందనటానికి ఇంకో ఉదాహరణ. ఊళ్లోకి కొత్త వాళ్లెవరు వచ్చి చేరకుండా

ఉండేందుకు ఇప్పటికే చేరి ఉన్న 33 కుటుంబాల సకుటుంబ సమేత ఫోటోలు భద్రాచలం పోలీసు స్టేషన్‌లో భద్రంగా ఉంచుకున్నారని వాళ్లు చెప్పారు.

బండారుగుంపు గ్రామంలో శరణుజొచ్చిన వారి పరిస్థితి మరోవిధంగా ఉంది. ఛత్తీస్‌ఘడ్ సాల్వాజుడుం ఎస్పీవోల హంతక చర్యలు, స్త్రీలపై అత్యాచారాల వంటి దురాగతాల మాదిరిగానే ఒరిస్సా పోలీసుల, సాయుధ బలగాల హింసాకాండకు బలైన కుటుంబాల నుంచి ప్రాణం మీదితీపితో వచ్చిన వీళ్లు అక్కడి చిత్రహింసల్ని చెప్పటానికి సైతం విపరీతంగా జంకుతున్నారు. బూర్గుంపాడ్ మండలం, అల్లిగూడెం గ్రామ పంచాయితి పరిధిలోని బండారుగుంపుకు 72 కుటుంబాలు ఛత్తీస్‌ఘడ్, ఒరిస్సా రెండు రాష్ట్రాలకు చెందిన సరిహద్దు గ్రామాల నుంచి వచ్చారు.

అక్కడి పీడకలను మర్చిపోయే ప్రయత్నం చేస్తున్న వీళ్లు కేవలం భూమి కోసం వచ్చామని చెప్తున్నారు. నిజనిర్ధారణకు వచ్చిన బృందం పోలీసులకు సంబంధించింది కాదని నిర్ధారించుకున్న తదుపరి పేరు చెప్పడానికి ఇష్టపడని వ్యక్తి "ఒరిస్సా పోలీసులు, పారామిలిటరీ సిబ్బంది, మమ్మల్ని మావోయిస్టులకు సహకరిస్తున్నారని చిత్రహింసలు పెట్టారు. మా స్త్రీలను నడిరోడ్డుమీద అత్యాచారం జరిపి, నగ్నంగా ఊరేగించి, ఎదురు తిరగినవారిని నిర్దాక్షిణ్యంగా కాల్చివేసారు. అక్కడ ప్రాణాలు తీయడం సర్వసాధారణం" అని చెప్పారు.

ఛత్తీస్‌ఘడ్ నుంచి వచ్చిన వాళ్లు "ప్రాణభయం వల్లనే అక్కడి 20,30 ఎకరాల భూముల్ని ఇండ్లను, పశువుల్ని వదలి వచ్చామని" చెప్పారు. వీళ్లు దంతేవాడ జిల్లా ఫుల్‌పకడి గ్రామం నుంచి ఇక్కడికి వచ్చారు.

చీపురు గూడెంకు బ్రతుకుకోసం వచ్చిన మడికె ఐతు, రవ్వఐతు, కోండ్రి జోగయ్య "సల్వాజుడుం ఎస్పీవోలు కత్తులు, కటార్లతో పాల్పడే ఊచకోచకు భయపడి, దంతేవాడ జిల్లా నుండి ఇక్కడికి బ్రతుక వచ్చామని" అన్నారు.

"స్త్రీలను గర్భిణీలని కూడా చూడకుండా వారి పొట్టల్ని చీల్చి పిల్లల్ని బయటికి తీసి సాల్వాజుడుం ఎస్పీవోలు చంపేసారు. పశువుల్ని, ఇండ్లను కాల్చేసారు. మా మగాళ్లను వెంటాడి, వెంటాడి చంపేశారు. దిక్కు లేక పారిపోయి వచ్చామని అందరిలోకి వృద్ధురాలైన స్త్రీ వజ్ర చెప్పారు. వీళ్లు ఛత్తీస్‌ఘడ్, గోంపాడు నుంచి వచ్చారు.

"మా పిల్లల నాలుకల్ని ఎస్పీవోలు కోసారు. వయస్సులో ఏ ఆడపిల్లనైనా వారు చెరుసారు. అత్యాచారం చెయ్యందే ఏ ఆడపిల్లను వదలరు". గొంపాడు నుంచే వచ్చిన జోగి అనే ఆదివాసి యువతి చెప్పింది. ఈ చుట్టుప్రక్కల ఊళ్లల్ల తనను జ్యోతి అని పిలుస్తున్నారని కూడా చెప్పింది.

కుక్కునూరు మండలంలోని గొట్టపుతోగుకు మడకం జోగయ్య, తన కొడుకు భీముడుతోపాటు 33 కుటుంబాలు ప్రాణభయంతో నాలుగైదు వీళ్ల క్రితం వచ్చామని చెప్తున్నారు.

"బందూకులు పట్టుకొని పోలీసులు, ఎస్పీవోలు బెదిరిస్తే చేతనైన వారు పారిపోగా, దొరికినోళ్లను దొరికినట్లుగా పోలీసులు కాల్చేశారు. ఆడవాళ్లను దొరకబట్టి అత్యాచారం చేసి ఆ తర్వాత ఏం చేశారో ఇప్పటి వరకు కూడా తెలియని పరిస్థితి" అని ఆయన చెప్పారు.

"వీళ్ల నిట్లా బందూకులు పట్టుకొని ఎందుకు వెంటాడుతున్నారు? వీళ్ల ఆడాళ్లను ఎందుకు అత్యాచారం జరిపి చంపివేస్తున్నారు? వీళ్లందర్ని వీళ్లున్న ప్రాంతం నుంచి ఎందుకు తరిమివేస్తున్నారు? వీళ్లు చేసిన నేరమేమి? వీళ్ల పుట్టిన గడ్డన వీళ్లకు ఎందుకు ఉండే అర్హత లేదు? వాళ్లను ఎందుకు తరిమివేస్తున్నారో వాళ్లకు అర్థం అయినట్లు లేదు". అని నిజనిర్ధారణ బృందంలో ఉన్న యూరోపియన్ ప్రతినిధి ఎన్‌రికో తన ఇటాలియన్ సహచరి ఇస్తెపానియాలో రోమన్ ఆక్సెంట్‌తో తన భావాల్ని పంచుకోవటం విన్పించింది.

కుక్కునూరు మండలంలోనె బంజారుగూడకు 35 కుటుంబాలు బ్రతుకవచ్చాయి. వీటిలో కొన్ని మరియా తెగకు చెందిన కుటంబాలు. మిగతావి గుత్తికోయలవి. "గుత్తికోయల్లాగే మీరు కూడా మావోయిస్టులకు సహకరిస్తున్నారేంటని?"సల్వాజుడుం ఎస్పీవోలు, పోలీసులు వేధించారని మరియా తెగకు చెందిన బాధితుడు చెప్పాడు.

పేద ఆదివాసీలెవరైనా సల్వాజుడుంకు అనుకూలంగా పనిచేయకపోతె ఏంజరుగుతుందో, వాళ్ల చర్యల్ని కొన్నింటిని ఉదాహరణలుగా చెప్పాడు.

మహిళల్ని సైతం ఎస్పీవోలుగా చేరమని బలవంతపెడ్తారని చెప్పాడు. ఒకసారి ఒక ఆదివాసీని ఎస్పీవోగా చేరమని బలవంతం చేస్తె ఆమె ఒప్పుకోకపోతె చంపి గోదావరి నదిలో మృతదేహాన్ని పడవేసి మిగతావాళ్లని భయకంపితుల్ని చేశారని చెప్పాడు.

నిజనిర్ధారణ బృందం సందర్శించిన ఏకైక గిరిజనేతర గ్రామం దామెరచెర్ల. అయితే బ్రతుక వచ్చిన వాళ్లంతా ఆదివాసులె. వీళ్లు దంతెవాడ జిల్లా గావిరాజ్ గ్రామం నుంచి మొదట 8 కుటుంబాలు బ్రతక వచ్చాయి. వీళ్లు కేవలం కూలి కోసం వచ్చామని చెప్పారు. అయితే తదుపరి వచ్చిన మరో 4 కుటుంబాల ఆదివాసులు సల్వాజుడుం దురాగతాలకు భయపడే వచ్చామని చెప్పారు. వీళ్లు ముప్పిడి గ్రామం నుంచి వచ్చారు.

"కత్తులు బందూకులతో వీళ్ళ బంధువుల్ని నరికి చంపడాన్ని కళ్లతో చూసి ఇంకా అక్కడ ఉంటె ప్రాణాలతో నిలువలేమని పారిపోయి వచ్చామని" మడక గంగయ్య చెప్పాడు.

దంతేవాడ జిల్లా గొల్లపల్లి, కిస్టారంల నుంచి వచ్చిన 12 కుటుంబాలు కుక్కునూరు మండలం కవ్వాక గ్రామంలో పాకలు వేసుకున్నారు. వీటిలో 5 పాకలు ఫిబ్రవరి తొమ్మిదవ తేదీన అక్కడికి చేరుకున్న బాధిత ఆదివాసులు వేసుకున్నారు. అంటే నిర్ధారణ బృందం వెళ్లిన (ఫిబ్రవరి13) రోజు నాటికి మూడు రోజుల క్రితం అన్నమాట.

వీళ్లంతా అక్కడ కోబ్రా పోలీసుల హింసాకాండకు తట్టుకోలేక గత్యంతరం లేక అప్పటిదాక పుట్టిన గడ్డమీది మమకారాన్ని వదులుకోలేని స్థితి నుంచి బయటపడి పారిపోయి వచ్చారు.

అక్కడ ఉన్నవాళ్లలో కాస్తంత చదువుకున్న వాడిలా ఉన్న సాముముదిరాజ్ కథనం ప్రకారం దంతెవాడ జిల్లా డెట్పెమడుగు గ్రామానికి చెందిన నలుగురిని, పాలుడి గ్రామానికి చెందిన ఒక్కరిని ఈ మధ్యనే సాల్వజుడుం ఎస్పీవోలు అకారణంగా చంపి వేసారు.

గచ్చినపల్లిలో అయిదుగుర్ని ఇదే ఎస్పీవోలు దుర్మార్గంగా హతమార్చారు. ఫిబ్రవరి 9న పారిపోయి వచ్చినవాళ్లు చెప్తున్నదాని ప్రకారం "అదే రోజు కుంటకిస్టారం ప్రాంతంలో 20మంది గుత్తికోయల్ని కోబ్రా పోలీసులు ఎత్తుకెళ్లారు. వీళ్ల జాడ ఇప్పటివరకు తెలియ రాలేదు. వీళ్లను కాల్వాయగూడెం వైపుగాని, పోలంపల్లి సల్వాజుడుం బేస్ క్యాంపు వైపునకు గాని తరలించి ఉండవచ్చని" చెప్తున్నారు.

"వీళ్లకు ఇక రెండే మార్గాలు. ఒకటి వీళ్లను సల్వాజుడుంలో చేరమని బలవంతపెడ్తారు. రెండోది, అట్లా చేరకుంటె నిర్దాక్షిణ్యంగా చంపివేస్తారు". ప్రక్కనున్న సోడి రమేష్‌తో నిర్ధారించుకొని సాముముదిరాజ్ చెప్పాడు.

ఆయనే ఇంకొంచెం వివరంగా "బేస్ క్యాంప్‌లో చంపేసినట్లయితె ఆ 20 మందిని డోర్నపల్లి ప్రక్కనుంచి ప్రవహించే శబరి నదిలో మృతదేహాల్ని పడేస్తారు." అన్నాడు.

శబరి నదిలోనే ఎందుకు వేస్తారన్న ప్రశ్నకు సమాధానంగా

"శబరి నదిలో వేస్తే శవాలు దొరకవు"

"శవాలు దొరికితే వాళ్లకేం ఇబ్బంది?"

"శవాలు దొరికితే పంచానామాలు, పోస్ట్‌మార్టమ్‌లు, వాటిని పట్టుకొని బంధువుల ఆందోళనలతో పోలీసులకు చాలా చికాకు కల్పిస్తారు. అందుకనే

పోలీసులు తాము చంపిన శవాలను గోదావరిలో కాకుండా శబరి నదిలో వేస్తారు". సామ ముదిరాజ్ చెప్తున్నది వింటుంటె ఒక్కసారిగా భయం ఆవహించింది.

ఇంకా అక్కడి దురాగతాల గురించి స్త్రీలు చెప్పిన విషయాలు వింటుంటె పోలీసుల దుష్టత్వానికి హద్దులేదా? అన్పిస్తుంది. పాలచెలిమ ఊరికి చెందిన శాంతిని ఆమె సోదరుణ్ని, బావని ఇంకో గ్రామస్తుణ్ని పాశవికంగా కాళ్లేతులు కట్టేసి కాల్చి చంపివేశారు. ఇంతటి దురాగతాన్ని చూసి కూడ ఏమి చెప్పలేని స్థితి అక్కడి స్త్రీలది. ఒకవేళ చెప్తే స్త్రీలను నగ్నంగా ఊరి మధ్యలో నిలబెట్టి అత్యాచారం చేస్తారు. ఇంతకు ముందు జరిగిన ఇట్లాంటి మరికొన్ని సంఘటనలను గుర్తుచేసుకొని స్త్రీలంతా విలవిలలాడిపోయారు.

"కంచర్ల ఎన్‌కౌంటర్ సందర్భంలో ఏడేళ్ల అబ్బాయిని, రమాదేవిని, ఆమె స్నేహితురాల్ని మరో వృద్ధ మహిళను సల్వాజుడుం ఎస్పీవోలు ఎత్తుకెళ్లారు. వీళ్ల ఏమయ్యారో తెలియరాలేదు. ఈ 5,6 నెలల కాలంలోనే 70మంది స్త్రీలను మాయం జేశారని" సామ ముదిరాజ్ తన నోటు పుస్తకంలో రాసుకున్న వివరాలు చూసి చెప్పాడు.

"మొత్తం మీద ఈ 5,6 ఏళ్లలో వేయిమందికి పైగా యువతులు మాయం అయ్యారని" తన లాంగ్ బుక్‌లో ఏవో గుర్తులు రాసుకున్నవి ఒక చాకలి పద్దుల్ని చదివినట్లు చదివి లెక్క అప్పచెప్తున్నట్లు అన్పించింది. ఈయన నిజనిర్ధారణ బృందం సభ్యులు అడిగిన ప్రశ్నలకు ఓపికగా పేజీలు తిప్పుతూ అంకెల్ని సంఘటనల్ని నిర్ధారించుకొని చెప్తున్నాడు.

ఎందుకో ఆ అంకెలు, సంఘటనల్లోని వివరాలు అతనికెంతో అపురూపమనిపించాయి. అవి ఎంత అమూల్యామో ఆ నోటు పుస్తకాన్ని అతను పొదివి పట్టుకున్న తీరు,అత్యంత పవిత్ర గ్రంధంగా దాన్ని తన చిరుగుల వైరు సంచిలో దాచుకుంటున్న తీరు చెప్పకనె చెపుతాయి. ఇప్పుడాయనకు ఆ లెక్కలె, తను ప్రాణాధికంగా ప్రేమించిన గాయపడ్డ గుండెలకు మిగిలి ఉన్న ఆనవాల్లవ్వడం ఎంతటి విషాదం!

ఏ అదృశ్య హస్తాలు తమది అనుకున్న జల్ జమీన్, జంగల్ మీద తమకే హక్కులేకుండా చేస్తున్నాయి? ఎందువల్ల ఊరుగాని ఊరువచ్చి తలదాచుకోవాల్సి వస్తున్నది? భౌగోళికంగా పశ్చిమ బెంగాల్, జార్ఖండ్, ఛత్తీస్‌ఘడ్, ఒరిస్సా, ఆంధ్రప్రదేశ్, మహారాష్ట్ర రాష్ట్రాలలో విస్తరించియున్న అడవుల్లోని బల్లపరుపు కొండల గర్భంలో ఏదో ఒక ప్రాంతాన్ని తీసుకున్నను ఈ దేశ బడ్జెట్‌ను మించిన విలువైన ఖనిజ సంపద ఉన్నట్లు మినరల్ ఎక్స్‌ప్లోరేషన్ కార్పొరేషన్ లిమిటెడ్ వంటి సంస్థల సర్వేలో తేలినది. ఒకవేళ నిజమే అయితె ఇంత సంపదను ముందస్తు అంగీకార పత్రాలతో బహుళ జాతి సంస్థలకు ధారాదత్తం చేయడానికేనా ఆదివాసుల్ని తమ కాళ్లకింద నేలను తమకే దూరం చేస్తున్నది.

ఈ నేపథ్యంలోనే, దేశంలో వనరులున్న ప్రాంతాల్ని బహుళజాతి సంస్థలకు పెద్ద ఎత్తున గనుల త్రవ్వకాల కోసం లీజుకివ్వడాన్ని అర్థం చేసుకోవాలి. అందుకనే దీన్ని సాయుధంగా ప్రతిఘటిస్తున్న మావోయిస్టు పార్టీని మట్టుబెట్టాలని కేంద్ర హోంశాఖమంత్రి చిదంబరం నేతృత్వంలో కేంద్ర ప్రభుత్వం తలపెట్టింది. ఇందుకోసమె నిజానికి ఆపరేషన్ గ్రీన్‌హంట్ అను మనుషుల వేటను కేంద్ర ప్రభుత్వం ప్రారంభించింది. అయితే మావోయిస్టుల ఏరివేత పేరిట అమాయకులైన ఆదివాసీ ప్రజల్ని ప్రభుత్వ సేనలు నిర్దాక్షిణ్యంగా చంపివేస్తున్నవి. సింగనమడుగు 'ఎన్‌కౌంటర్' తదనంతర పరిణామాల్ని ఇందుకు తార్కాణంగా చెప్పవచ్చును.

నిజనిర్ధారణ బృందంలోని సీనియర్ పౌరహక్కుల కార్యకర్త గుంటిరవి, మిగతా హక్కుల కార్యకర్తలతో పాటు సెప్టెంబర్ 17న 'ఎన్‌కౌంటర్' జరిగిందని చెప్తున్న ఛత్తీస్‌ఘడ్‌లోని సింగనమడుగు అటవీ గ్రామాన్ని ఫిబ్రవరి 12,13 తేదీలలో పర్యటించి, ఫిబ్రవరి 14వ తేదీన భద్రాచలంలో ప్రెస్ మీట్‌లో పౌరహక్కుల సంఘం రాష్ట్ర కార్యదర్శి క్రాంతి చైతన్యతోపాటు సంఘటన పూర్వపరాలు వివరించాడు. ఆయన కథనం ప్రకారం సింగన మడుగు అటవీ ప్రాంతంలో టెంట్ వేసుకొని సింగిల్ బోర్ తపంచాల విడిభాగాల్ని లేత్‌మిషన్ మీద తయారు చేసుకుంటున్న మావోయిస్టుల స్థావరంపై సెప్టెంబరు 16వ తేది నాటి రాత్రి 150 మంది కోబ్రా పోలీసులు, వందమంది సల్వాజుడుం ఎస్పీవోలు ఏకపక్షంగా దాడి చేశారు. ఆ దాడిలో తప్పించుకున్న మావోయిస్టులకు అడవిలో చెల్లాచెదురుగా విస్తృతంగా గాలిస్తున్న కోబ్రా పోలీసులు ఎదురైన సందర్భంలో అనివార్యంగా ఎన్‌కౌంటర్ జరిగింది. ఈ ఎన్‌కౌంటర్‌లో 8మంది కోబ్రా పోలీసులు చనిపోయారు. ఈ అవమానాన్ని పోలీసులు తట్టుకోలేకపోయారు. ఇందుకు ప్రతీకారంగా సింగనమడుగుతోపాటు, గచ్చంపల్లి, గట్టంపాడు, పాలచెలమ, ఎండపాడు, ఎత్రాజ్‌పాడు మొత్తం ఆరు గ్రామాలమీద కోబ్రా పోలీసులు, సల్వాజుడుం ఎస్పీవోలతో జమిలిగా దాడిచేసి అమాయకులైన 12మంది ఆదివాసి యువకులను కాల్చి చంపి ఎదురుకాల్పుల్లో 12మంది మావోయిస్టులు చనిపోయారని ప్రకటించారు. వీరిలో కారంసోమ్లు అనే యువతి తప్ప ఎవరూ మావోయిస్టులు కారు.. ఈ 12 మందితో పాటు కాళ్లు చచ్చుబడిపోయి కదలలేని స్థితిలో ఉన్న 70 ఏళ్ల వృద్ధురాల్ని ఆమె స్తనాల్ని కోసి కిరాతకంగా చంపేసారు కోబ్రాలు. ఈమెను ఎందువల్లనో మావోయిస్టు అని ప్రకటించలేదు. బహుశా, ఇంత ముసలి దాన్ని మావోయిస్టు అని తమకు అత్యంత విధేయంగా ఊడిగం చేస్తున్న మీడియాను సైతం నమ్మించలేమని కాబోలు!

ఈ వృద్ధురాల్ని మినహాయిస్తే మిగతా అమాయకులైన నిస్సహాయ ఆదివాసీ యువకులంతా వాళ్ల దృష్టిలో మావోయిస్టులే. అయితె ఇట్లా అమాయకులను చంపి మావోయిస్టులపై పైచేయి సాధించినట్లు తమ 'విశ్వసనీయ' బంటు పత్రికల్లో ప్రకటించుకోవటం ఎటువంటి రాజనీతి?

ఇట్లా మావోయిస్టులను బూచిగా చూపెట్టి ఎంతమంది అమాయకులైన ఆదివాసీలను చంపివేస్తారు? పాలు త్రాగేపసిపిల్లల నుంచి కాటికి కాళ్లుజాపుకున్న ముసలి వగ్గుల వరకు స్త్రీ పురుష విచక్షణ లేకుండా చంపివేయడం ద్వారా తాము సంతకం చేసిన అవగాహనా పత్రం (ఎంఓయూ) ను అమలు పరుస్తున్నారన్న మాట. ఏమైతేనేం ఆదివాసుల్ని తమ భూమి నుంచి, తమకాళ్లకింది, తమకు దక్కవలసిన ఖనిజ వనరులనుండి బేదఖలు అయ్యేలా జినోసైడ్‌కు పాల్పడుతూ, వాళ్ల వనరుల మీద పెత్తనాన్ని బహుళజాతి సంస్థలకు దఖలు పరిచడమే గ్రీన్‌హంట్ లక్ష్యమన్నది, ఇవ్వాళ కేంద్రప్రభుత్వం ఎన్ని కవరింగ్‌లు ఇచ్చుకున్నా దాని నయవంచనా శిల్పం ఎవరికైనా అర్థం కాకుండా ఉంటుందా?

1947కు పూర్వం బ్రిటిష్ వలస పాలకులు సామ్రాజ్య వాదంతో ఈ దేశ సంపదను తరలించుకుపోతే, ఇవ్వాళ మన పాలకులే వివిధ సామ్రాజ్యవాద దేశాలకు దాసోహమై ఈ దేశ సంపదకు హక్కుదారులైన తమ ప్రజల్ని అడ్డుతొలగించి తామే అప్పగించే దళారి పాత్రకు ఎంత చక్కగా ఒదిగిపోతున్నారు! ఆదివాసుల ఊచకోతను కళ్లతో చూస్తున్న వాళ్లకు ఇది ఒక భౌతిక వాస్తవంగా సాక్షాత్కరించకుండా ఉంటుందా? 'మెమోరాండం ఆఫ్ అండర్‌స్టాండింగ్' అనే పదబంధానికి ఈ దేశ వనరుల్ని బహుళ జాతి సంస్థలకు తరలించే ఒప్పందం అని అర్థం చేసుకోవాల్సి రావటం ఎంతటి దిగ్భ్రాంతికరమైన విషయం!

ఏమైతేనేం, ఈ దేశపాలకులు చెప్తున్న కళ్లు బైర్లు కమ్మే ఈ 'అభివృద్ధి' కోసంఈదేశ ప్రజలకు అయితె సూసైడ్, లేకుంటె పాలకుల జీనోసైడ్ తప్ప గత్యంతరం లేదా? బహుశా, ఇక్కడి అసహజ మరణాల పెరుగుదల సంఖ్యను కూడా ఈ దేశాభివృద్ధికి సూచికగా భావించాలేమో!

*

## వ్యాసం

◆ బి.డి. శర్మ ఇంటర్వ్యూ

తెలుగు : గీతాంజలి

# "ఆదివాసీల అభివృద్ధి అంటే వారిని దోచుకొనడమే!"

(For Tribals, development means exploitation)

ఆదివాసీలు, వారి జీవన విధానం, వారిపై జరిగిన దోపిడీ స్వరూపాలకై చాలా లోతయిన అవగాహన ఉన్న భారత ఆదీవాసీ అధ్యయనకారుల్లో ముఖ్యమైనవారు బి.డి.శర్మ. ఛత్తీస్‌ఘడ్‌లోని అవిభాజ్య బస్తర్ జిల్లాకి ఆయన కలెక్టర్‌గా, తర్వాత షెడ్యూల్ కులాలు, తెగల కమీషనర్‌గా పని చేయటమే కాదు ఆదివాసీల హక్కుల రక్షణ కోసం ఉద్యమించిన ఆఫీసరు.

ప్రస్తుతం భారత్ జన ఆందోళన్ సంస్థకు కో-ఆర్డినేటర్ (అనుసంధాన కర్తగా) వ్యవహరిస్తున్నారు. మావోయిస్టుల సాయుధ పోరాటం వల్లనే ఆదీవాసీల అభివృద్ధి కొద్ది మాత్రమైన సాగుతున్నదంటారు శర్మ.

**ప్ర. మీరు కలెక్టర్‌గా ఉన్నప్పుడు.... బస్తర్‌లో ఏం మార్పుని చూసారు?**

జ. అది 40 సం.ల క్రితం మాట. బైలదిల్లా కంపెనీ తప్ప బయటి వారి ప్రభావం బస్తర్‌లో లేకుండింది. కలెక్టర్‌గా ఏ మైనింగ్ కంపెనీలకూ నేను అటవీ భూమిని లీజుకి ఇవ్వలేదు. ఎప్పుడైతే ప్రభుత్వం అటవీ భూమిని ఖనిజాలకోసం కంపెనీలకు ధారదత్తం చేయడం మొదలైందో - 1980లలో మావోయిస్టులు అడవికి రావటం మొదలైంది.

**ప్ర. మావోయిస్టులని ఇప్పుడు ప్రభుత్వం ఒక పెద్ద సమస్యగా భావిస్తోంది కదా?**

జ. నేను ఎస్సీ-ఎస్టీ కమీషనర్‌గా ఉన్నప్పుడు ఆదివాసీలను మావోయిస్టుల గురించి అడిగాను. "దాదాలు చాలా మంచివాళ్ళు వాళ్ళు మమ్మల్ని స్థానిక అప్పులిచ్చే పట్వారీల నుంచి విముక్తుల్ని చేసారు" అని ఆదివాసీలు సమాధానం చెప్పారు. ఆ విధంగా ఆదివాసీల విశ్వాసాన్ని ప్రేమను చూరగొన్న మావోయిస్టులు 1980 నుంచీ బలంగా ఎదిగి దండకారణ్యంలో మంచి పట్టు సాధిస్తూ వచ్చారు. బస్తర్ అవతల అభివృద్ధికి సంబంధించిన పావులు కదులుతున్నప్పటికీ... లోపల అవేమీ ఫలించలేదు. నేను గొప్పలు చెప్పుకోవడం లేదుకానీ బస్తర్‌లోపల నేను చాలా మైనింగ్ కంపెనీలు శాంక్షన్ కాకుండా ఆపగలగడంతో బస్తర్‌లో శాంతి నెలకొందని మాత్రం చెప్పగలను.

**ప్ర. అభివృద్ధికి సంబంధించిన ఈ అయోమయాల్ని, భ్రమల్ని ఎలా పోగొట్టాలి?**

జ. భగవంతుడు ఆదివాసీలకు అన్నీ ఇచ్చాడు. ఇంద్రవతీ నదీ తీరంలో కూర్చుని వారు నాతో అనేకసార్లు చెప్పినదేంటో తెలుసా? "మా ఆదివాసీలకు ముగ్గురు అప్పులిచ్చే వ్యాపారస్థులు ఉన్నారు. వాళ్ళు సంవత్సరమంతా మమ్మల్ని చూస్కుంటూ ఉంటారు. వారెవరంటే - "ఒకటి - అడవి, రెండు - నదులు, మూడు - అటవీ భూమి" వీరికి సం.నికి కేవలం నాలుగే నాలుగు నెలలు దూరంగా ఉంటాం. ఎంత గొప్పగా చెప్పారో కదా? ఆదివాసీలు ఎప్పుడు కూడా కరువు బాడిన పడలేదు. వర్షపాతం తక్కువగా ఉందనుకోండి? ఆ సం.రం అడవి కందమూలాలను దుంపలను ఎక్కువగా ఇస్తుంది. గోండీ ఆదివాసీలకు భవిష్యత్తు గురించి ఆందోళనా, బెంగా ఉండవు. వారు వర్తమానంలోనే తృప్తిగా, ఆనందంగా జీవిస్తారు. వారికి బయట నించి ఎవరూ అభివృద్ధి ఫలాలు అందించవలసిన అవసరమే లేదు. వారు అభివృద్ధి చెందే ఉన్నారు. వారి వద్ద అన్నీ ఉన్నాయి. వారికోసం బయట నుంచి అభివృద్ధిని అందించడం అంటే - వారిని దోచుకోవడం తప్ప ఇంకేం కాదు. రాజ్య ప్రతినిధులైన పట్వారీలు, వ్యాపారస్తులు, అటవీ గార్డులు, అధికారంలో ఉన్నవారు ఈ ఆలోచన చేయడానికే సంకోచించాలి లేదా భయపడాలి. వారిని దోపిడీ చేయడం మోసగించడం మానుకుని ఆదివాసీలకు విద్యా ఆరోగ్య సదుపాయాలు కలిగించాలి ఈ ప్రభుత్వం.

**ప్ర. ప్రభుత్వం దీనికి ఒప్పుకుంటుందా ?**

జ. దొంగలు దోచుకోటం ఆపటాన్ని ఇష్టపడతారా ? ప్రభుత్వం ఒకటి ఒప్పుకోవాలి - ఏ వనరులనైతే వారు దోచుకుంటున్నారో అవి సమాజానికి చెందినవి. ప్రభుత్వ సిద్ధాంతం రాజ్యానికి అనుమతి లేకుండా ఎవరి ఆస్తినైనా కొల్లగొట్టే అధికారాన్ని ఇస్తుంది. కానీ.... ఆదివాసీలలో అలా చెయ్యలేం. ఎందుకంటే ఆదివాసీలు అడవికి తామే రాజులం, నాయకులం అనుకుంటారు కాబట్టి! కానీ ప్రభుత్వం వారిని కూలీలుగా మార్చచూస్తుంది.

రాజ్యాంగంలోని ఐదవ షెడ్యూలు ప్రకారం అడవిలోని వనరులు గిరిజనులవి మాత్రమే. గవర్నర్‌కి ఈ విషయంలో పూర్తి హక్కు, అధికారాలున్నాయి. ఏ గవర్నర్ అయినా రాష్ట్ర ప్రభుత్వాలకు దీనికి సంబందించిన సరైన దిశా నిర్దేశం చేసారా? 1995లో భూరి కమీషన్‌లో అటవీ ప్రాంతాల్లో నెలకొల్పే పరిశ్రమల్లో 50 శాతం అక్కడి ఆదీవాసీ సమాజానికి చెందుతోంది అని స్పష్టంగా ఉంది. అలాగే 20 శాతం అక్కడి భూమి యజమానికి పోతోంది. కేవలం 30 శాతం మాత్రమే అక్కడ పెట్టుబడి పెట్టే బయటి వారికి చెందుతుంది అని చెప్తుంది భూరి కమీషన్. అలాగే 1996లోని విప్లవాత్మకమైన పెసా షెడ్యూల్ ప్రాంతాల పంచాయితీ ఎక్స్‌టెన్షన్ చట్టం గ్రామ సభకి అక్కడి సహజ వనరులను ఉపయోగించాలా వద్దా, బయటి వారికి ఇవ్వలా వద్దా అన్నదాంట్లో పూర్తి నిర్ణయాధికారం ఇచ్చింది. ఈ చట్టాలేవీ కూడా సక్రమంగా అసలు అమలు పరచడం లేదు. అంతా నిజాయితీలేని తనమే నడుస్తోందిక్కడ. ఆదివాసీలకు చేసిన వాదాలు (ప్రమాణాలు) పూర్తిగా ఉల్లంఘించబడ్డాయి. ఈ రకమైన విధ్వంస పూర్వకమైన అభివృద్ధి నమూనాల అమలు వల్ల ఒకనాటికి ఆదివాసీల జాతి అంతమవుతుంది.

*(మార్చి 9, టైమ్స్ ఆఫ్ ఇండియాలో ప్రచురితం.)*

## రచయితలకు విజ్ఞప్తి

అరుణతారకు రచనలు పంపండి.

కథలు, కవిత్వం, పుస్తక సమీక్షలు, విమర్శా వ్యాసాలు, సామాజిక రాజకీయ సిద్ధాంత వ్యాసాలు, యితర భాషల్లోనుండి తెలుగు పాఠకులకు అవసరమైన అనువాదాలు పంపించండి.

అరుణతారలో అచ్చవుతున్న రచనలపై ఉత్తరాలు రాయండి. రచనలను మెచ్చుకునే ఉత్తరాలకంటే గుణదోషచర్చలు చేయగల ఉత్తరాలు పత్రిక ప్రమాణాలు పెంచుతాయి. పాఠకుల విమర్శనాత్మక ఉత్తరాలు పత్రికా నిర్వహణకూ తోడ్పడుతాయి.

మీ రచనలు అరుణతార సాహిత్య, సిద్ధాంత స్థాయిని పెంచుతాయని నమ్ముతూ - - సంపాదకవర్గం

వ్యాసం

◆ హిమాంశుకుమార్ ఇంటర్వ్యూ

తెలుగు : గీతాంజలి

# చిదంబరం నిర్ణయం దేశ శాంతిని, ఐక్యతను భగ్నం చేస్తుంది

హిమాంశుకుమార్‌కు కచ్చితంగా తన ఫోను టాప్ చేశారని తెలుసు. అలాగే తనకు పోలీసుల వలన ముప్పు వుందనీ, అది ఒక్క ఛత్తీస్‌ఘడ్‌లోనే కాదు బాంబేలో కూడా తనపై నిఘా కళ్ళున్నాయనీ తెల్సు. ఆయన బాంబేలో జరిగిన ఒక సెమినార్, అదీ సాయుధ పోరాటం మరియు సాయుధ పోరాట అణిచివేత అనే విషయం మీద ప్రసంగించి తిరిగి వచ్చాక ఈ నిఘా మరీ ఎక్కువైంది.

ఛత్తీస్‌ఘడ్‌లోని బీజేపీ ప్రభుత్వం ఈ మధ్యనే హిమాంశు వనవాశి చేతన ఆశ్రమాన్ని కూల్చి వేసింది. అదీ 1,000 మంది సాయుధులైన పోలీసు దళాలతో ఈ ఆశ్రమంలో ఉంటూనే హిమాంశు బస్తర్, కన్వల్‌నర్‌లోని ఆదివాసీలతో కలిసి పనిచేశారు. హిమాంశు ప్రసన్న డిజోర్‌కి - తనను ఆదివాసీల జీవితంలోని ఏఏ అంశాలు వారితో కలిసి పని చేయడానికి పురికొల్పాయో... అలాగే ప్రభుత్వం యొక్క వివిధ పారామిలిటరీ బలగాలు బస్తర్‌లోని ఆదివాసీలపై ఎటువంటి దురాగతాలు చేసాయో చెప్తూ - భారతదేశంలో మావోయిస్టు సమస్య పరిష్కారానికి ఏం చేయవచ్చో సూచించారు.

బస్తర్‌లో ఆశ్రమం ఎందుకు నెలకొల్పారు? ప్రేరణ ఏమిటి?

మహాత్మాగాంధీ యువకులను గ్రామాల్లో పనిచేయమని చెప్పడం నన్నాకర్షించింది. 1988లో బస్తర్‌కి వచ్చిన నాకు ఇక్కడి పరిస్థితి దారుణంగా అన్పించింది.

1992లో నేను ఇక్కడే ఉండి పోవాలని నిర్ణయించుకున్నాను. ఆదివాసీల కోసం పనిచేయడమే లక్ష్యంగా ఆశ్రమం మొదలుపెట్టాను. అదీ వారిచ్చిన భూమే. ఇక్కడ ఆదివాసీ అమ్మాయిలకు, అబ్బాయిలకు వ్యక్తిగత పరిశుభ్రత, వైద్యం, విద్యలాంటి విషయాల్లో శిక్షణ ఇస్తాము.

**ప్ర. ఛత్తీస్‌ఘడ్ ప్రభుత్వం మీ ఆశ్రమాన్ని ఎందుకు బుల్‌డోజర్లతో కూల్చింది?**

ఎందుకంటే మేం ఆదివాసీ సంబంధిత సమస్యలను లేవనెత్తి ప్రశ్నించడం మొదలుపెట్టాము. ముఖ్యంగా ప్రభుత్వంచే నడపబడుతున్న మావోయిస్టు వ్యతిరేక సల్వాజుడుం దాడుల గురించి ప్రశ్నించడం ప్రభుత్వానికి నచ్చలేదు.

ఒక పక్క మేం నిర్వాసిత ఆదివాసీల పునరావాస కార్యక్రమాలు చేపడుతుంటే మరోపక్క ప్రభుత్వమే వాటిని మళ్ళీ నాశనం చేసి ఆదివాసీలను తమ స్వస్థలాల నుంచి దూరానికి తరమసాగింది. దాంతో మమ్మల్ని ప్రభుత్వంతో ప్రత్యక్షంగా ఘర్షణలోకి లాగినట్లయ్యింది.

**ప్ర. కానీ రాష్ట్ర ప్రభుత్వం ఎందుకు ఇలా చేస్తుందంటారు?**

కేవలం ఆదివాసీల భూమిని కార్పొరేట్ సంస్థలు తవ్వుకొని ఖనిజ సంపదను దోచుకోడానికే.

**ప్ర. మీరు కార్పోరేట్ సంస్థలకు - రాష్ట్ర ప్రభుత్వానికి మధ్య ఉన్న సంబంధాన్ని చెపుతున్నట్లుంది ?**

అవును! ఇది చాలా స్పష్టమైన విషయం. అవుట్‌లుక్ పత్రికలో ప్రభుత్వ రిపోర్టు ఒకటి వచ్చింది. దానిలో టాటా, ఎస్సార్ కంపెనీలు నేరుగా సాల్వాజుడుమ్‌కు డబ్బు అందిస్తున్నాయని అక్కడ మేం రెండు కంపెనీలు పోటీ పడటం గమనించాం. వాళ్ళకు అక్కడి భూమి కావాలి. నక్సల్స్ కార్యకలాపాలు ఉండకూడదు. ఎందుకంటే కార్పొరేట్ సంస్థలు అప్పుడు మాత్రమే అక్కడి ఖనిజ సంపదని ప్రశాంతంగా - ఏ అడ్డంకీ లేకుండా తవ్వుకుని పోగలవు. అందువల్లనే వాళ్ళిదంతా ఉనికిలో ఉంటూనే చేయసాగారు.

**ప్ర. అంటే.... ఈ ఎంఎన్‌సిల వల్లనే ఒజిహెచ్ వచ్చిందంటారా? కేంద్ర ప్రభుత్వం మావోయిస్టు వ్యతిరేక మిలిటరీ కేంప్ మొదలు పెట్టిందంటారా ?**

ఖచ్చితంగా ఒజిహెచ్ - ఆదివాసీలను వారి స్వంత గ్రామాల నుంచి బయటకు తరిమే ఆపరేషన్. పారామిలిటరీ దళాలు, పిల్లలు ముసలివారు, స్త్రీలపైన పాశవిక దాడులు చేస్తున్నారు.

**ప్ర. ఈ రిపోర్టులన్నీ మీకెలా అందుతాయి? ఇవి ఒట్టి ఆరోపణలు మాత్రమే కావచ్చు కదా?**

మేం ఇక్కడి బాధిత ఆదివాసీలలో నేరుగా కలుస్తున్నాం. గాయపడ్డ వారిని అడిగి తెల్సుకుంటున్నాం. మేం ఈ బాధిత ఆదివాసీ క్షేత్రాల్లో వీళ్ళతో కలసి ఉన్నాం. మేం ఇక్కడ పని చేస్తూ విషయసేకరణ చేస్తాం. బయటి రిపోర్టులను నమ్మము.

**ప్ర. మీడియాలో చెప్పబడినట్లుగానే ఒజిహెచ్ కొనసాగుతున్నదా ?**

అవును ఒజిహెచ్ ఒక ప్రభుత్వ అధికార ప్రక్రియ. అందుకే ఆ స్వభావంతోనే కొనసాగుతోంది.

**ప్ర. ఎప్పట్నించి ?**

మొదట, దంతెవాడ ఎస్పీ, విషాపాల్ అనే గ్రామాన్ని దాడిలో ధ్వంసం చేసినప్పుడు తెలిసింది. ఎస్పీ, ఇతర పోలీసులు ఇది ఒజిహెచ్ అని చెప్పారు. ఇప్పుడు మన కేంద్ర హోం మంత్రి పి. చిదంబరం ఈ ఒజిహెచ్ అనే పదం మీడియా సృష్టి మాత్రమే అంటాడు. ఛత్తీస్‌ఘడ్ పోలీసులే మొదట ఆ పదాన్ని వాడారు.

**ప్ర. ప్రభుత్వం ఈ మధ్య మావోయిస్టులు జార్ఖండ్ ఇంటెలిజెన్స్ ఆఫీసర్ ఫ్రాన్సిస్‌ను శిరచ్ఛేధం చేసిన తర్వాత ఒజిహెచ్‌ని ప్రారంభించాల్సి వచ్చిందని చెప్పుకోవడం ఎంతవరకు సబబు? అటువంటి దారుణమైన శిరచ్ఛేదాలు ఎంతవరకు న్యాయబద్ధమైనవి?**

హింస ఎవరు చేసినా నేను ఖండిస్తాను. కానీ మావోయిస్టులు మన బలగాలు కాదు. వారు మనకు జవాబుదారీ కాదు. కానీ కోబ్రాలు మొత్తం జాతికి రాష్ట్ర ప్రభుత్వానికి జవాబుదారీగా ఉండాలి. 11 సంవత్సరాల ఆదివాసీ బాలుడి తలని కోబ్రాలు ఒక నెల కిందటే నరకడం నాకు తెల్సు.

**ప్ర. దీనికి సంబంధించిన ఫోటోలు లాంటి సాక్ష్యాధారాలున్నాయా మీ వద్ద ?**

ప్రత్యక్ష సాక్షి ఉన్నాడు. అతని తాతయ్య తను చూసిందంతా చెప్పాడు. కోబ్రాలు ఆదివాసీ బాలుడి చేతులు వెనక్కి విరిచి చెట్టుకు కట్టి - తల నరికేసారని చెప్పాడు. చిన్నపిల్లల తలలు నరికేస్తున్నా పట్టించుకోని ఈ ప్రభుత్వం... ఈ పన్లు చేయడానికే ఉన్నట్లుగా అనుకోవచ్చా? ప్రతిరోజూ వాళ్ళు అమాయకులను దోచుకుంటూ చంపుతున్నారు.

**ప్ర. మరి ఈ దారుణాలన్నీ మీడియాలో ఎందుకు చూపించరు?**

ఎందుకంటే మీడియావాళ్ళు కూడా ఈ బడా వ్యాపార సంస్థ ప్రభావంలో పడ్డ వాళ్ళే. పైగా మధ్య తరగతి ప్రజలు అసలు ఈ ఆదివాసీలనే పట్టించుకోరు. ఆదివాసీల జీవితాలు వ్యాపారానికి పనికి వచ్చే వార్తా కథనాలు కాదు. వాళ్ళు కనీసం వస్తు వినియోగదారులూ కారు. వారి గురించి మనం కంగారు పడవల్సిన అవసరమే లేదు.

**ప్ర. మీరు ఏం చెప్పదల్చుకున్నారు? ఒక వైపు ఆదివాసీలు, మీ లాంటి వారుంటే, వారికి పూర్తి వ్యతిరేక దిశలో మిగిలిన భారతం ఉందంటారా ?**

అలా అని కాదు. భారతదేశంలోని ప్రధాన స్రవంతిలో ఉండడం మా కిష్టమే. మేం కోరుకునేదంతా భారతదేశంలోని ప్రజలంతా అడవుల్లో, గ్రామాల్లో ఆదివాసీలపై జరుగుతున్న అత్యాచారాలను తెల్సుకోవాలనీ ఖండించాలనీ మాతో పాటే ఉండాలనీ మాలో భాగం కమ్మని మాత్రమే. అప్పుడే వాళ్ళు

ఎక్కడ నివసిస్తున్నా భారతదేశంలోని అంతర్భాగమవుతారు.

ఆదివాసీలు మాత్రం తాము భారత దేశవాసులుగా అనుకోవటం లేదు ఎందుకంటే - తమ మీదే దేశం ఒక శత్రువులా దాడి చేస్తుంటే వారు విభ్రాంతికి గురి అవుతున్నారు.

**ప్ర. ఈ రకమైన హింసను చూస్తుంటే ఒక పక్క సాల్వాజుడుం, మరోపక్క మావోయిస్టులు ఇద్దరూ నాణానికి ఇరువైపులా ఉన్నారని అన్పించడం లేదా ?**

అలా కాదు! ఇది ఒక రకమైన ప్రతిఘటన మాత్రమే. అయినా నక్సల్స్ హింస చాలా తగ్గిందిప్పుడు. ఇప్పుడు రాజ్యహింసను ప్రతిఘటిస్తున్నవారు నేరుగా దాన్ని ఎదుర్కొంటున్న ప్రజలే.

**ప్ర. ఫ్రాన్సిస్ ఇందువర్‌ను శిరచ్ఛేదం చేసింది ఆదివాసీలా? నక్సలైట్లా?**

నక్సలైట్లే !

**ప్ర. మరి సల్వాజుడుం చేసేదే నక్సలైట్లు చేస్తున్నట్లు కాదా ?**

ముందు మీరు హింస ఎందుకు ఈరూపం తీస్కుంటుందో తెల్సుకోవాలి. 11 ఏళ్ళ బాలుడి తల నరికిన పోలీసులు ఆ కుటుంబ సభ్యుల చేతికి చిక్కితే వారు నరక్కుండా ఒదిలి పెడతారా ? ముందు ఎవరు హింస మొదలుపెట్టారు ? ఈ ప్రతిచర్యలను, ప్రతిస్పందనలను అర్థం చేస్కోవాలి. అలాగే ఇదే సందర్భంలో ప్రతి ఒక్కరూ హింసను వీడే విధంగా వాతావరణాన్ని సృష్టించాలి.

**ప్ర. దానికోసం మీరు ఎలాంటి చర్యలు తీస్కుంటున్నారు ?**

సాల్వాజుడుం, రాష్ట్ర ప్రభుత్వాల వలన నిర్వాసితులైన ఆదివాసీలను మళ్ళీ వారి సాధారణ జీవన స్రవంతిలోకి వెళ్ళడానికి పునరావాస చర్యలను మొదలు పెట్టాం. వారి కేసులను హైకోర్టుకు తీస్కెళ్ళడం ద్వారా... ప్రజాస్వామిక పద్ధతుల ద్వారా పోరాడ్డం నేర్పిస్తూనే వారిలో ఆ చర్యకు ప్రతిగా హింసాత్మక ప్రతి చర్యలు చెలరేగకుండా చూస్తున్నాం.పౌరపరిపాలనే (సివిల్ అడ్మినిస్ట్రేషన్) మళ్ళీ గ్రామాల్లో కొనసాగేలా చేసి, ఇక్కడి ఆదివాసీ పౌరులు రేషన్, ఆహారం, వైద్యసేవలు, అందుకునేలా... మళ్ళీ వాళ్ళు సాధారణ జీవనాన్ని గడిపేలా చేయగలుగుతున్నాం.

**ప్ర. తలలు నరకడాలు, న్యాయం కోసం హింస, ధ్వంస రచనలు మానుకోమనీ చెప్తున్నారా లేదా మరి ?**

అవును ఎందుకు చెప్పం? ప్రతి రోజూ - ప్రతిసారీ ఆదివాసీలతో మేం కల్సినప్పుడల్లా... సభలు పెట్టినప్పుడల్లా ప్రతి హింసని మానుకోమని చెబుతూనే ఉంటాం.

**ప్ర. మీరు ఒకసారి నక్సలైట్లు నిజమైన అభివృద్ధి కారకులను అడ్డుకోలేదని చెప్పారు. మరి నక్సల్స్ ఎందుకు రోడ్లు - బ్రిడ్జిలు కట్టే ప్రజలపై దాడులకు దిగుతున్నారు ?.**

ఏ రోడ్ల గురించి మీరు మాట్లాడుతున్నారు ? ఆ రోడ్లు ఆదివాసీ బాలలు వాళ్ళ బడులకు వెళ్ళడానికి కాదు! అవి కేవలం ఇక్కడ పరిశ్రమలు పెట్టాలనుకునే పారిశ్రామిక వేత్తల కోసం, ప్రభుత్వం కోసం. అలాగే అదే స్వంతంగా నడిపే సల్వాజుడుం, ఒజిహెచ్‌ల కోసం! ఆదివాసీలు ఎప్పుడూ తమకు 80 అడుగుల వెడల్పున్న రోడ్లు కావాలని అడగలేదు. వాళ్ళు మొట్టమొదట తమ రేషన్ కోసం (బియ్యం) అడుగుతారు, స్కూల్స్, వైద్య సదుపాయాల కోసం అడుగుతారు. కానీ ఇవన్నీ వారికి అందాయా? దంతెవాడలో 80 అడుగుల వెడల్పున్న రోడ్లు అతి వేగంగా నిర్మించబడుతున్నాయి కానీ స్కూల్సు మాత్రం పశువుల కొట్టాల్లో నడుస్తున్నాయి. ప్రభుత్వం ప్రాధాన్యత కూడా రోడ్లకే ఇస్తుంది ఎందుకంటే వాటి మీదుగా అది ఖనిజ సంపదని అత్యంత సులువుగా దోచుకోవచ్చు కాబట్టి.

**ప్ర. ఆపరేషన్ గ్రీన్‌హంట్ భారతదేశాన్ని 10% జిడిపి పెరుగుదల రేటుకు అవలకు తీసుకుపోవడానికే అన్న దాంట్లో ఎంత వాస్తవం ఉంది?**

జ. అటువంటి అభివృద్ధి రేటు ప్రక్రియ నిజంగానే ఇబ్బందికరమైనది, ఉత్పత్తి ప్రక్రియను కుంటు పరిచేది. ఇటువంటి అభివృద్ధి ప్రక్రియ (ఒజిహెచ్) అంటే నాకు భయం నిజానికి. ఎందుకంటే మీరు ఆదివాసీల మీద దాడి చేస్తే... వారిపై నక్సల్స్ ప్రభావం ఎక్కువై... వాళ్ళ కేడర్ కూడా పెరిగిపోతుంది. వారి కేడర్ పెరిగితే వారు మరింత విస్తరిస్తారు వాళ్ళు విస్తరించారనుకోండి ఈ రకమైన అభివృద్ధి కుంటుపడదూ మరి?

**ప్ర.ఛత్తీస్‌ఘఢ్ ప్రభుత్వం మీ నుంచి మరొక బినాయక్ సేన్‌ను తయారు చేస్తుందని ఏమైనా భయపడ్తున్నారా ?**

జ. నన్నా? చేస్కోనివ్వండి.... నాకే సమస్యాలేదు.

**ప్ర. బెదిరింపులు ఏమీ రాలేదా?**

జ. ఎందుకు రాలేదు? వచ్చాయి. రానివ్వండి, నా మీద ఎన్నో ఎఫ్ఐఆర్‌లు నమోదయ్యాయి. నా ఆశ్రమం, ఇల్లు ధ్వంసం చేసారు. ప్రతి రోజూ ఇలాంటివి వుంటూనే ఉన్నాయి అయినా ఫర్వాలేదు.

**ప్ర. మిమ్మల్ని చంపుతామని బెదిరింపులు వచ్చాయా ?**

జ. అవును. వాటి గురించి నేనూ విన్నాను. నాలాంటి కార్యకర్తలను చంపడానికి ఎప్పుడూ ప్రయత్నాలు జరుగుతూనే ఉంటాయి. కానీ ఆ హత్యలన్నీ నక్సలైట్ల మీద మోపబడతాయి.

**ప్ర. మీ తదుపరి కార్యాచరణ ఏమిటి?**

జ. ఈ హింసను ఆపడానికి పాదయాత్ర ప్రారంభిస్తాను.

**ప్ర. హింస అంటే గవర్నమెంటుదా - నక్సల్స్‌దా? ఎవరిది ?**

జ. ఇద్దరిదీ.

**ప్ర. స్పష్టంగా చెప్పండి.**

జ. అవును! రెండు పార్టీలు చేసే హింసకు వ్యతిరేకంగా - నక్సల్స్, రాజ్యం రెండూ హింసను ఆపాలి.

**ప్ర. మన హోం మినిస్టర్‌కి ఏమన్నా సందేశం ఇస్తారా ?**

జ. చిదంబరం చేస్తున్న పని, అదే ఒజిహెచ్ వలన దేశంలో శాంతి, ఐక్యత రెండూ నాశనం అవుతున్నాయి. దీనికంతా అతను పరిహారం చెల్లించి తీరాలి.

**ప్ర. భారతదేశంలో నక్సల్ సమస్య పోవడానికి అదొక్కటే మార్గమా ?**

జ. అవును. నా నమ్మకం అది.

**ప్ర. మీరు మావోయిస్టు సానుభూతి పరులనే ఆరోపణ వుంది. దీని మీద మీ వ్యాఖ్య ఏమిటి ?**

జ. నేను ప్రతీసారీ నక్సల్స్ హింసను తగ్గించే సూచనలు వారికి ఇస్తూ వచ్చాను. నేను నక్సలైట్లకు ఎన్నడూ సహాయం చెయ్యలేదు. అందువల్ల నక్సలైట్లకు నా మీద కోపం వచ్చి ఉండాల్సింది.

**ప్ర. కానీ మీ మీద ఆరోపణ అది కాదు. నక్సల్స్‌కు మీ మీద కోపంలేదు. వారు బస్తర్‌లో మిమ్మల్ని ప్రశాంతంగా పని చేసుకోనిచ్చారు కదా ?**

జ. కాని... అది సరైంది కాదు. ఆదివాసీలు మమ్మల్ని ప్రేమించడం వలన, వాళ్ళకు మేము అక్కడ ఉండడం ఇష్టం కావడం వలన మా మీద నక్సలైట్లు రెండుసార్లు దాడులు చేసారు. మేం శాంతియాత్రలో ఉన్నప్పుడు మా వస్తువులన్నీ తీస్కెళ్ళిపోయారు. మరోసారి మా ఆశ్రమ కార్యకర్తల్ని చావబాదారు. ఇది చాలా స్పష్టంగా నక్సల్స్ మమ్మల్ని ఇష్టపడరన్న దాన్ని చెబుతోంది. ఆదివాసీ ప్రజలే మేం అక్కడ ఉండడానికి, పని చేయడానికి నక్సల్స్ మీద ఒత్తిడి తీస్కొచ్చారు.

**ప్ర. చివరగా... మీరు రాసిన పద్యాన్ని చదువుతారా ?**

జ. ఎప్పుడైతే చిట్ట చివరి చేప చనిపోతుందో, మిగిలిన నీరు కూడా కలుషితమైపోతుంది. ఎప్పుడైతే.... ఈ భూమ్మీది చిట్టచివరి చెట్టు నరకబడుతుందో, అప్పుడే మనకు జ్ఞానోదయం కలుగుతుంది. మనం కేవలం ఒక్క డబ్బు మాత్రమే తింటూ బతకలేమని. ✱

వ్యాసం ◆ గీతాంజలి

# 'ఖనిజాల వేటకై ఆదివాసీ జాతి నిర్మూలన - ఆపరేషన్ గ్రీన్‌హంట్'

ఆదివాసీలు అడవిలోని జంతువులకు ఎప్పుడూ భయపడలేదు. కనీసం 5,6 సం.ల పసివాళ్ళు కూడా.... తల్లిదండ్రులు పోడు వ్యవసాయానికి వెళితే.... ఈ పిల్లలు - డబ్బా - కత్తి పట్టుకుని అడివిలోని చెట్ల నుంచి బంక తీస్కోడానికో, ఇప్ప పూలు - ఏరడానికో బయలుదేరి వెళతారు. అంత పసివాళ్ళను పంపడానికీ తల్లిదండ్రులు వెరవరు. అడవిలోని క్రూరమృగాలు కూడా ఆదివాసీల సహవాసంలో.... వాళ్ళ సహచరులైపోయాయి.

కానీ.... ఆదివాసీలిప్పుడు అడవిలోకి నాగరిక సమాజం నించి ప్రవేశిస్తున్న మృగాలకు వెరుస్తున్నారు. ఈ మృగాలు వీళ్ళకు మరీ కొత్తవి కావు. వీటి నోట్ల కోరలు లేవు కానీ, కత్తులు ఈటెలు, రైఫిళ్ళు ఉంటాయి. ఈ నాగరిక అడవి జంతువుల పేర్లు బ్లాక్ క్యాట్స్, (నల్లపిల్లులు), (త్రాచులు) కోబ్రాలు, గ్రే హౌండ్స్ (తోడేళ్ళు), స్కార్పియన్ (తేళ్ళు), ఆక్టోపస్ - టైగర్స్! ఇవన్నీ అడవి నలుమూలలా కమ్ముకుని ఆదివాసీలను కాటువేస్తున్నాయి. వేటాడి చంపుతున్నాయి. ఇవన్నీ భారత సైనిక బలగాల పేర్లు. వీటితోపాటు బార్డర్ సెక్యూరిటీ ఫోర్సు, ఇండో-టిబెటిన్ - బోర్డర్ పోలీస్, సెంట్రల్ రిజర్వ్ పోలీస్ ఫోర్స్, ఆర్మ్‌డ్ - బోర్డర్ ఫోర్స్, నాగా బెటాలియన్, రాష్ట్రీయ రైఫిల్స్.... వీరంతా సాల్వాజుడు, అత్యంత ఆధునిక మారణాయుధాలతో ఇండియన్ ఆర్మీ - ఎయిర్‌ఫోర్స్ సహాయం తీస్కుంటూ వచ్చని అడవి మీద వేట కొనసాగిస్తున్నారు.

ఇంతకీ ఆదివాసీల మీద ఈ వేట ఎందుకు ఎవరి ప్రయోజనాల కోసం.... దేశం తన స్వంత ప్రజలతోనే యుద్ధం ఎందుకు చేస్తున్నది? తన స్వంత ప్రజలనే అత్యంత కిరాతకంగా చంపుతూ అడవిని ఖాళీ చేయిస్తున్నది? ఎందుకంటే.... భారతదేశంలోని ఈశాన్య రాష్ట్రాలు అత్యంత సంపన్నమైన ఖనిజాలకు నిలయాలు. ముఖ్యంగా ఒరిస్సా, ఛత్తీస్‌ఘడ్‌లలో ఈ ఖనిజ సంపద అనంతం. ఛత్తీస్‌ఘడ్‌లో 28 రకాల ప్రధాన ఖనిజాలు ఉండడమే కాదు అందులో వజ్రాలు 1.30 మిలియన్ టన్నులు ఉన్నాయి.

**ఛత్తీస్‌ఘడ్‌లో ఉన్న ఖనిజ సంపద - వాటి స్థానాలు**

టిన్ - 1వ స్థానం
కోల్ (బొగ్గు) - 2వ స్థానం
డోలమైట్ - 2వ స్థానం
బాక్సైట్ - 3వ స్థానం
ఇనుప రజను - 4వ స్థానం
సున్నపురాయి - 5వ స్థానం

అలాగే మొత్తం దేశంలోని ఖనిజ సంపద - ఛత్తీస్‌ఘడ్‌లోని ఖనిజ సంపద ఈ క్రింది స్థాయిలో ఉన్నాయి.

| ఖనిజం పేరు | టన్నుల్లో భారతదేశం | మిలియన్ ఛత్తీస్‌ఘడ్ |
|---|---|---|
| ఇనుప రజను | 14630 | 2781 (18.67%) |
| బొగ్గు గనులు | 253302 | 41442 (18.67%) |
| బాక్సైట్ | 3290 | 148 (4.50%) |
| సున్నపురాయి | 175345 | 9038 (5.15%) |
| డోలమైట్ | 7533 | 148 (450%) |
| క్వార్ట్జైట్ | 1145 | 26 (2027%) |
| టిన్ ఓర్ | 86.55 | 32.62 (37.69%) |
| బంగారం | 68 | 3 (4.41%) |
| వజ్రాలు | 4.58 | 1.30 (28.00%) |
| టిన్ మెటల్* | 101237* | 11449* (14.27%) |
| కోరండమ్* | 28337* | 25* |

వీటితోపాటు - తగరం, అభ్రకం, కించర్‌నైట్ లాంటి ఖనిజ సంపద ఉంది. ఈ గ్రీన్‌హంట్‌కు మూలం ఈ అటవీ సంపదే.

ఈ అటవీ సంపదను 1968 నుంచే జపాన్ బైలదిల్లా కంపెనీ ముఖ్యంగా ఇనుప రజనును తరలించుకుపోతూనే ఉంది. అప్పట్నించే మొదలైన ఖనిజాల దోపిడీ ఇప్పుడు విశ్వరూపం దాల్చింది, బహిరంగమైంది. టాటా - పోస్కో - ఎస్సార్ జిందాల్, రియో టింటో, బిహెచ్‌పి, మిట్టల్, వేదాంత రీసోర్సెస్ లాంటి సామ్రాజ్యవాద దేశాలకు చెందిన కార్పోరేట్ సంస్థలకు భారతదేశం ఈ అపారమైన ఖనిజసంపదని దోచుకొమ్మని 70 నుంచి 90,000 బిలియన్ కోట్లకు అమ్మేసింది. అమ్మేసాక అమ్మకందారు స్థలాన్ని ఖాళీచేసి కొనుగోలుదారుకు ఇవ్వాల్సిన దానికి సంబంధించిన 100 ఎంఒయూలపై (పరస్పర అంగీకార పత్రాలు) భారతదేశం సంతకాలు చేసేసింది. దాని ఫలితమే ఛత్తీస్‌ఘడ్‌లో టాటా స్టీల్ కంపెనీ 10,000 కోట్ల రూపాయలు పెట్టుబడి పెట్టింది - చర్ల గ్రామంలో కిలోమీటర్ల దూరాన పెరిగిన కలప అడవిని నరికి కాగితపు పరిశ్రమా వెలిసింది. 2001 సం. నుండి కేంద్ర ప్రభుత్వం అనేక ఉక్కు - స్టీలు కరెంట్ ప్లాంట్స్ 2010 కల్లా పూర్తి చేసే ఎంఓయూ పత్రాలపై సంతకాలు చేసింది. 100 ఎంఒయుఎస్ మొత్తం పెట్టుబడే 3.26 ట్రిలియన్లు ఉంటుంది. ఇంకొన్ని ఎంఒయుల పత్రాల సంతకాలకై కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాల మీద ఈ సామ్రాజ్యవాద దేశాల కంపెనీలు పెడుతున్న ఒత్తిడే ప్రభుత్వం చేత అమాయక ఆదివాసీలపైన సల్వాజుడుం ఇతర కిరాతక మిలిటరీ సైన్యాల రూపంలో - గ్రీన్ హంట్‌గా మార్చింది.

దీనికి స్థానిక ఆదివాసీలతో ప్రతిఘటన పోరాటం ఎదురవ్వడం - దీనికి 1980ల నుంచి దండకారణ్యంలో ప్రవేశించిన మావోయిస్టులు - అండ ఉండడంతో కేంద్ర ప్రభుత్వం తన అణిచివేత రూపాలను మారుస్తూ వచ్చింది. కొద్దిగా వెనక్కి వెళితే 1980లనించీ అడవిలోని ఆదివాసీలపై స్థానిక కంట్రాక్టర్లు - ఫారెస్టు ఆఫీసర్లు - స్థానిక భూస్వాముల దోపిడీకి వ్యతిరేకంగా ఆదివాసీలను విప్లవోద్యమం చైతన్యపరుస్తూ వస్తోంది. స్థానిక మార్కెట్ భూస్వామ్య పీడన నుంచి తప్పించుకోవడానికి, ఎదిరించడానికి స్థానిక ఆదివాసీ సమాజం విప్లవోద్యమంలోనికి కదల బారింది. స్త్రీలు భూస్వామిక - పితృస్వామిక పీడన అణిచివేతల క్రమంలో క్రాంతికార్ మహిళా సంఘాల్లోకి (కెఎమ్ఎస్) తర్వాత ఆర్థిక రాజకీయ పోరాటాల్లోకి సాగిపోయారు.

వీరంతా.... తమ అటవీ సంపదైన - చింతపండు - తునికాకు - బంక. వెదురు సామాను - కలప, పోడు వ్యవసాయంలో పండించే బియ్యం, నువ్వులు, కూరగాయలు లాంటి వాటిని గ్రామాల్లోని సంతల్లో దళారులు, కాంట్రాక్టుల చేత అత్యంత తక్కువ విలువ ఉన్న వస్తు వినిమయ పద్ధతుల్లో మార్చుకుంటూ దారుణంగా మోసపోవటాన్ని విప్లవోద్యమం నివారించింది. అడవిలోని ఆదివాసీల శ్రమకు సరైన మార్కెట్ విలువను అందుకునేలా ఆదివాసీలను చైతన్య పరచడంలో విజయం సాధించింది. ఇది దోపిడీ భూస్వామిక దళారీ వర్గాలకు కంటగింపై ఆదివాసీలపై అటవీ సంరక్షకాధికారులు - ప్రభుత్వ అధికారులతో దాడులు, దోపిడీ లైంగికాత్యాచారాలు చేయిస్తూ వస్తోంది. అందుకే ఆదివాసీలు నిరంతరం సాయుధులై యుద్ధం చేస్తూ రావటం, పార్టీ విప్లవోద్యమం - కలిగించిన చైతన్యంలో తమ అటవీ సమాజంలోనే సమృద్ధ ఆర్థిక వ్యవస్థను - విద్యా వైద్య వ్యవస్థలు ఏర్పాటు చేస్కోవడం జరుగుతూ వచ్చింది. ఈ క్రమంలోనే ఆదివాసీ ఆత్మగౌరవ పోరాటాలకు విప్లవోద్యమం అండగా జనతన సర్కార్.... ఆవిర్భావమూ జరిగింది. ప్రతి ఆదివాసీకి తమ పోడు చేస్కుంటున్న వ్యవసాయ భూమిపై హక్కు దొరికే స్థితి 2005లో డిసెంబర్ నుండి అమలులోకి వచ్చింది. అదే అటవీ సంరక్షణ హక్కు! ఇక్కడే ముందు నించీ ఉన్న జనజాగరణ్, సాల్వాజుడుం రూపంలో బీజేపీ రమణ్‌సింగ్, స్థానిక కాంగ్రెస్ ఎమ్ఎల్ఏలు..... చేతుల్లో పురుడు పోస్కుని అపుడే రమణ్‌సింగ్ ప్రభుత్వం దంతెవాడని.... దండకారణ్యంలోని చాలా అటవీ భూభాగాన్ని 70,000 కోట్ల రూపాయలకు టాటా - జిందాల్ లాంటి మల్టీనేషనల్ కంపెనీలకు అమ్మేసింది. అడవి మీద హక్కున్న ఆదివాసీని కదల్చడం కష్టం కాబట్టే అప్పటికీ

బలవంతపు భూ సేకరణ కొనసాగిస్తున్నపుడే.... 2005 జూన్ నుంచీ ఆదివాసీలను హత్యలు - దోపిడీలు - స్త్రీలపై లైంగిక అత్యాచారాలు సాల్వాజుడుంలో చేయిస్తూ అడవిని ఖాళీ చేయండే పనిని వేగవంతం చేసింది. అందుకే దండకారణ్యంలో 2005 జూన్ తర్వాత హత్యలు చాలా ఎక్కువగా జరిగాయి. దాదాపు 50,000 వేల మంది ఆదివాసీలు అదృశ్యమయ్యారు, అనేక మంది నిర్వాసితులైనారు.

గత మూడు సంవత్సరాల నుంచే 18 కంటే ఎక్కువ MOU లు 10,000 కోట్ల పెట్టుబడులపై సంతకాలు పెట్టవల్సినందున అవి ఇంకా పూర్తి కానందున.... మల్టీనేషనల్ కంపెనీలు కేంద్రప్రభుత్వంపై ఒత్తిడి చేస్తున్నందున.... ప్రభుత్వం ఆదివాసీలను ఖాళీ చేయించేందుకు వారికి అండగా ఉన్న మావోయిస్టులను నిర్మూలించేందుకు ఆపరేషన్ గ్రీన్‌హంట్‌కు రూపకల్పన చేసింది.

సల్వాజుడుంకు భయపడి ఎంతో మంది ఆదివాసీలు అడివి, ఇళ్ళు? పంటకొచ్చిన వ్యవసాయభూములు ఖాళీ చేసి పోయినప్పటికీ - మావోయిస్టు పార్టీ అండతో మళ్ళీ తమ తమ స్థానాలలో చేరుకోవడం సల్వాజుడుం బలహీన పడ్డం జరిగింది. తర్వాత 2010 సంవత్సరానికి మల్టీ నేషనల్ కంపెనీలతో కేంద్ర ప్రభుత్వం తమ ఎంఒయుల పత్రాల సంతకాలను పూర్తి చేస్కోవడానికి గడువు పూర్తి అవడంతో ఆదివాసీల ప్రతిఘటనా పోరాటానికి అండగా ఉన్న మావోయిస్టుల మీద యుద్ధానికి చేసిన కుట్రా రణతంత్రమే ఆపరేషన్ గ్రీన్‌హంట్! దీనికి కారణంగా ఉన్న ఖనిజాల దోపిడీని బయటపెట్టకుండా సోనియా - మన్మోహన్ - చిదంబరం దేశ అంతర్గత సమస్యగా మావోయిస్టు ఉద్యమాన్ని చూపిస్తూ దానికి పరిష్కారంగా ఆపరేషన్ గ్రీన్‌హంట్‌ను ప్రయోగిస్తోంది. దీనికి ప్రారంభంలో హక్కుల, ప్రజాస్వామికవాదుల, మేధావుల రచయితల సంఘాల నుంచి తీవ్రమైన ప్రతిఘటన ఎదురవడంతో 2009లో బలహీన పడ్డప్పట్కీ ఎప్పటిలాగే కంపెనీల ఒత్తిడికి ఒగ్గి 2009 సెప్టెంబర్ నుండి మళ్ళీ గ్రీన్‌హంట్‌ను మొదలు పెట్టడంతో దండకారణ్యంలోని గ్రామాల్లో దాదాపు 3 నెలల్లో 44 మంది ఆదివాసీలు చనిపోయారు. వందలమంది నిర్వాసితులైనారు. స్త్రీలు లైంగిక అత్యాచారాలకు లోనైనారు. పైకి ప్రభుత్వం గ్రీన్‌హంట్ లేదంటుంది. వాస్తవాలు అడవుల్లోకి వెళ్ళిన ప్రజాసంఘాలకు తెలుసు. బాధిత ఆదివాసీలకు తెలుసు.

పట్టణాల్లో సెజ్‌ల పేరిట భూమి దోచినా అక్కడ బెదిరింపులు పంటకొచ్చిన చేలను కాల్చయ్యడాలు ఎదురు తిరిగి పోరాడిన వారిని కొట్టి జైళ్ళల్లో నింపడాలు మాత్రమే చూసాం. ఎందుకంటే ఇక్కడ అడవుల్లో ఆదివాసీలకు - నాగరిక సమాజానికి దూరంగా ఉన్న వాళ్ళను అత్యంత కిరాతకమైన పద్ధతుల్లో చంపినట్లు చంపితే చాలా త్వరగా తెల్సిపోతుంది. అడవుల్లో ఎలా తెలుస్తుంది ? ప్రభుత్వానికి అమ్ముడు పోయిన మీడియా ఇది... ఈపారా మిలిటరీ బలగాలు సాల్వాజుడుంలు గ్రీన్‌హంట్‌లు చేసే హత్యలలో వెలుగులోకి తేవటం లేదు. ఆదమరిచిన ఆదివాసీలను ఎక్కడికక్కడ చంపి వృద్ధశవాలను వదిలేసి యువకులను తీస్కెళ్ళి మావోస్టుల చొక్కాలు వేసి ఎదురుకాల్పుల్లో చనిపోయారని ప్రభుత్వం నిస్సిగ్గుగా లెక్కలు చెపుతోంది.

అడవిలో తమ మానాన తాము బతుకుతున్న ఆద్వీసీలు తననెందుకు చంపుతున్నారో అర్థం చేస్కుంటూ తప్పనిసరై విప్లవోద్యమంవైపు కదలబారుతున్నారు.

మొన్న అరెస్ట్ అయిన మాడవి సింగన్న ఐతిలక్ష్మి లాంటివారంతా ప్లిటూన్, దళ కమాండర్‌లు.... సంవత్సరం క్రితంసల్వాజుడుం బాధితులై విప్లవోద్యమంలోకి వెళ్ళి తమ ఆదివాసీ జాతి సంరక్షణ చేస్తున్నవారు. అందుకే దండకారణ్యంలోవేలల్లో ఉన్న ఉద్యమకారుల సంఖ్య కోటిన్నరకు చేరిందంటే ఆదివాసీలపై ప్రభుత్వ ఫాసిస్టు దమకాండ ఎంత వేగంగా ఉందో అర్థం చేస్కోవచ్చు.

ఇంకో పక్క ప్రభుత్వం గ్రీన్‌హంట్ అమలులో లేదని బూకాయిస్తోంది. వాస్తవాలు తెల్సుకోవటానికి ఇతర ప్రజాహక్కుల సంఘాలతో విరసం కూడా దంతెవాడ పరిసర ప్రాంతాలకు నిజనిర్ధారణ కమిటీగా వెళ్ళినప్పుడు చాలా వాస్తవాలు వెలుగు చూసాయి. ఆదివాసీలు ఎప్పటిలాగే అడవిలో గ్రామ గ్రామానికి తరమబడుతున్నారు. చంపబడుతున్నారు. నరకబడుతున్నారు. క్రూరమైన లైంగిక అత్యాచారాలకు గురవుతున్నారు. పిల్లల్ని కూడా మరణాయుధాలతో దాడిచేసి అవిటివాళ్ళను చేస్తున్నారు. వారి సంపదను దోచుకుంటున్నారు. గుజరాత్‌లో జరిగిన ముస్లింల జీనో సైడ్‌ను తలపించే విధంగా ఆదివాసీ జాతి నిర్మూలన మరోపక్క మావోయిస్టు ఉద్యమాన్ని బలహీన పరిచే ప్రక్రియా ఏక కాలంలో జరుగుతున్నాయి. గర్భిణీస్త్రీల గర్భాలను తూట్లు పొడుస్తూ పిండాలు రాలిపోయే దాకా అత్యంత కిరాతకంగా వ్యవహరిస్తోంది సైన్యం. 60,70, సంవత్సరాల వృద్ధురాళ్ళను యిాలైంగిక అత్యాచారాలు చేసి అత్యంత కిరాతకంగా ఎదలనుకోసి, వారిలింగాలను ఛిద్రం చేసి చంపడమనే కిరాతక హత్యారూపాలతో కొనసాగుతుంది గ్రీన్‌హంట్.

స్త్రీలను ఎత్తుకుపోయి రాహత్ శిబిరాల్లో ఎస్పీవోలు అక్కడ వారిపై లైంగిక అత్యాచారాలు జరపడం నిత్యకృత్యం. అలాగే అనేకమంది స్త్రీలను నాగపూర్, జగదల్‌పూర్ జైళ్ళల్లో జీవిత ఖైదీలుగా మార్చారు. అనేకమంది స్త్రీలు గర్భవతులై గర్భస్రావాలు చేయించుకున్నారు. అడవి నుంచి ఎత్తుకొచ్చి అక్కడ వారికి కాలనీలు నిర్మించి వారిని సామాజికంగా విద్యాపరంగా ఆర్థికంగా అభివృద్ధి పరుస్తుందట ప్రభుత్వం. స్త్రీలకు ప్రభుత్వం అభివృద్ధి ఫలాలు అత్యాచారాలు - అవాంఛిత ఆకాంక్షిత గర్భస్రావాలు. పురుషులకీ అంతే!బలవంతపెట్టి ఎస్పీవోలగా మార్చి స్వంతజాతిమీదే అత్యాచారాలు చేయించడం! ఎదిరించిన వారిని కిరాతకంగా చంపడం. శబరినదిలో అదృశ్యం చెయ్యడం. రాహత్ శిబిరాల్లోకి వచ్చినవారు నాగరికులు! పారిపోయిన వారు మావోయిస్టులు వారికి!

ఈరోజు రాహత్ శిబిరాలను నిర్వహిస్తున్న కిరాతక మిలటరీ బలగాలటాటా/జిందాల్‌కు వేదాంత, మిట్టల్ కంపెనీల నుంచే నేరుగా జీతాల రూపంలో కోట్ల కొద్దీ డబ్బు దొరుకుతుందన్నది నగ్నసత్యం! దేశ విదేశీ కంపెనీలే భారతరాజ్యాన్ని శాసిస్తున్నాయి. రాజ్యాంగాన్ని వారిచేత మార్పించేస్తున్నాయి. కంపెనీలే ఆదివాసీలతో యుద్ధం చేస్తున్నాయి.

రాహత్ శిబిరాల్లో ఉండలేక పారిపోయి అడవుల్లోకి ఖమ్మలు బద్రాచలం డివిజన్ అడవుల్లోకి దండకారణ్యం చుట్టూ ఉన్న గోదావరి పరివాహక ప్రాంతాల్లోని తెలంగాణ జిల్లాలైన కరీంనగర్, ఆదిలాబాద్, వరంగల్ గద్వాల్‌ల్లోకి ఆదివాసీలు నిర్వాసితులై పారిపోయి వస్తున్నారు.తల్లుల్ని భార్యల్ని భర్తల్ని అన్నదమ్ముల్ని పిల్లల్ని కోల్పోయిన వాళ్ళే ఎక్కువ. అన్నీ ఛిద్రమైన కుటుంబాలే దారుణమైన శారీరక మానసిక గాయాల్ని మోస్కుంటూ కష్టపడి సంపాదించిన సంపదను అడవిలో వదిలేసో లేదా సైనిక మూకలలో దోపిడీకి గురయ్యో.... వేదనలో.... దరిద్రులుగా మారిన వాళ్ళే అందరూ!

భద్రాచలం అడవిల్లోకి వచ్చి కొత్తగా పాసాయ్యక పాయం పశువులు ఎప్పట్లాగే వెరాయి. ఉదా. తడికెళి బెయ్యడం, తునికాణ, ఇప్పపూల సేకరలోపడ్డ వీళ్ళకై ఫారెస్టు ఆఫీసర్లు అత్యంత ఆటవీయంగా వ్యవసరిస్తూ వారి పాకలను, వ్యవసాయ భూమినీ కొల్లేస్తున్నారు. వారినుంచి తప్పుకుంటూ వీరు బెట్టకొకరు పుట్టకొకరుగా తిరుగుతున్నారు. గర్భిణీస్త్రీలు కవటానికి దాపులేక చెట్లక్రింద ప్రసవిస్తున్నారు. మావోయిస్టులను అన్నం పెడుతున్నారనో ఆదరిస్తున్నారో వీరిపై దాడులు చేస్తుంటే భయపడి పారిపోయి వచ్చినవారే ఎక్కువ!

ఆదివాసీలు ఎదురు తిరగకుండా ఉండటానికి రాజ్యం ఉపయోగించే అణచివేత హింసారూపాలలో అత్యంత క్రూరమైంది స్త్రీలపై లైంగిక అత్యాచారాలు చెయ్యడం! అదీ అత్యంత పాశవిక పద్ధతుల్లో, ఇదంతా చూసిన అనుభవించిన ఆదివాసీ స్త్రీలు భద్రాచలం గ్రహాల్లో సంతకు వెళ్ళడానికి కూడా భయపడుతున్నారు. కానీ వెళ్ళాక తప్పదు! ఆదివాసీలను తర్వాత భయపెట్టటానికి వారి బలహీనత అయిన పసి పిల్లలను హించడం ఆయుధంగా పెట్టుకుంది ప్రభుత్వం. తొమ్మిదినెలల పసికందు చేతిపై మదమెక్కిన పోలీసులు తమ బూటు కాలిని అదిమి పాలు తాగే పసిబిడ్డ

నోటిలో తుపాకీ బాయ్‌నెట్ దూర్చి నొక్కితే చిగుళ్ళు తెగి తీవ్ర రక్తస్రావమైంది ఆ పసిబిడ్డకు. కన్నమ్మ అనే స్త్రీపై లైంగిక అత్యాచారం చేసి ఆమెను హత్య చేసి - శవంపై ఆమె ఒకటిన్నర సం. కొడుకు సురేష్‌ను పడుకోబెట్టారు, అదీ సురేష్ వేళ్ళు నరికి మరీ!

అడవిలో వ్యవసాయం చేస్కుంటున్న తల్లిదండ్రులకు ఇతర ఆదివాసీలకు సైనిక బలగాల జాడ చెప్పడానికై ఆ బాన 10 సం.ల సెంట్రీ రచిలుడి నాలుక తెగ నరికారు - ఆ రాక్షసులు.

ఈ రోజు కూడా భద్రాచలంలో పాల్వంచ మండలంతో దంతెవాడ నకిరిపేట, రెడ్డి గూడం నుంచి వలస వచ్చిన మడిని ఆదెమ్మ కొడుకు ఏడేళ్ళ రవి మనకు అక్కడి బడిలో పిచ్చి చూపులతో కనిపించిన వాళ్ళను నాతావ్ - అంటే కోయభాషలో నాన్నకావాలి అని అగుడుతా కన్పిస్తాడు. అడవిలో పోడు వ్యవసాయం చేస్కుంటూ ఉన్న మాడవి వీరాస్వామి మిలిటరీ బలగాలు మూడేళ్ళ క్రితం ఐదేళ్ళ రవి ముందే కొట్టి హింసించి తీస్కెళ్ళి పోయారు. అతని జాడ ఇప్పటికీ లేదు. ప్యాంటు చొక్కాలేస్కున్న వాళ్ళు తన తండ్రిని గుంజుకెళ్ళడం చూసిన పసివాడు. ఎవరు ప్యాంటు చొక్కా వేస్కున్న వాళ్ళు కన్పించినా మీద పడి రక్కి - కొడ్తూ ఏడుస్తూ నా తావ్. నాన్న కావాలి అని ఏడుస్తాడు.

ఇప్పటికీ తిరిగిరాని భర్తకోసం మాడవి ఆదెమ్మ ఎదురుచూస్తోంది. వ్యవసాయపు పనులకు వెళ్ళేటప్పుడు పిచ్చి చేష్టలు చేస్తూ మతి భ్రమణకు లోనైన కొడుకుని ఆ తల్లి గుడిసెలోని గుంజెకు తాళ్ళతో కట్టి బయటకు వెళ్తుంది. ఇప్పుడు రవి కొద్దిగా కోలుకుంటున్నడు. తండ్రిని ఎవరు - ఎందుకు తీస్కెళ్ళారో అర్థం చేస్కునే ప్రయత్నం చేస్తున్నాడు. ఎంతమంది నాన్నలు ఇలా అదృశ్యమయ్యారో.... అడవిలోని భూమిని తవ్వితే ఎన్ని వేల సంఖ్యల్లో పాతిపెట్టబడ్డ ఆదివాసీల శవాలు - అస్థిపంజరాలు దొరుకుతాయో.... చంపడం - అక్కడే పాతడం ఆదివాసీ దహన సంస్కార - సంస్కృతికి కూడా విలువ ఇవ్వకుండా - చివరి చూపులకు కూడా నోచుకోకుండా చేయడం - రాజ్యపు ఆటవిక సాంస్కృతికి నిదర్శనం.

అదృశ్యమైన భర్తలు బతికే ఉన్నారో. చనిపోయారో - ముత్తైదువుగా ఉండాలో - వితంతువుగా ఉండాలో తెలియని అయోమయ మానసిక స్థితిలో ఆదివాసీ స్త్రీలు కనిపించారు మాకు! భర్తల్ని - పిల్లల్ని కోల్పోయి దారుణంగా లైంగిక అత్యాచారాలకు లోనైన స్త్రీలు విపరీతమైన మానసిక ఒత్తిడితో - నిర్జీవమైన గాజుకళ్ళతో కన్పిస్తారు. అత్యాచారాలకు గురైన స్త్రీలను కొంతమంది భర్తలు నిరాకరిస్తే - చాలా మంది భర్తలు - దీంట్లో వీళ్ళదేం తప్పుందని - మానవీయ కోణంలో స్వీకరిస్తున్నారు. పెళ్ళికాని ఆదివాసీ అమ్మాయిల్నీ అదేకోణంలో పెళ్ళిల్లు చేస్కుంటున్నారు.

వ్యవసాయాధారిత ఫలాలు, ధాన్యాలు పండించడం - కూరగాయలు - పండ్లు, చింతపండు, ఇప్పపూవు - తునికాకు సేకరణ - వెదురు వస్తువుల తయారీ - ఆవులు - కోళ్ళు, పందులు, పావురాలు - మేకల పెంపకం, అమ్మకం... వీటితో రేపన్న దానిమీద బెంగలేని ఆదివాసీని - అడవి నించి - స్వయం సమృద్ధి ఆర్థిక వ్యవస్థ నుంచి లాక్కొచ్చి రాహుల్ శిబిరాల్లో - టెంట్‌లన బడే కాలనీల్లో బలవంతపు నిర్బంధంలో పెట్టి అదే అభివృద్ధి అని, దాన్ని మావోయిస్టులు అడ్డుకుంటున్నారని అందుకే మావోయిస్టులే దేశ అంతర్గత సమస్య అంటోంది రాజ్యం.

అసలైన దేశ అంతర్గత సమస్య.... సామ్రాజ్యవాద దేశాలకు అమ్ముడు పోయిన ప్రభుత్వమే... ఆ కంపెనీలే .... దేశీయ దళారులే... అడవి దోచుకుంటున్న స్థానిక - గిరిజనేతర, కాంట్రాక్టర్లు - అటవీ అధికారులు అటవీ పర్యాటక కేంద్ర అధికారులే....

వీళ్ళే - దేశంలోని బీద రైతులకు - భూమి లేని పేదలకు - దళితులకు - ఆదివాసీల అంతర్గత భద్రతను నాశనం చేస్తున్నవారు. భద్రంగా.... తమ సంస్కృతిని వ్యవసాయ పద్ధతుల్ని కాపాడుకుంటూనే విప్లవోద్యమం స్ఫూర్తితో దోపిడీలకు పీడనకు వ్యతిరేకంగా చైతన్యీకరించబడుతున్న ఆదివాసీల భద్రతకు వెల్లువెత్తుతున్న కంపెనీలు, దాని యజమానులు, వాటిని మోస్తున్న పాలక వర్గాలు ఎవరి శవాల మీది నించి, ఎటువంటి రక్తపాతాల నుండి ఆ అభివృద్ధి ఫలాలు వచ్చాయో తెలీని .... తెల్సుకొన నిరాకరించే మధ్య - ఎగువ మధ్య తరగతి ప్రజలే అంతర్గత భద్రతకు విఘాతం కలిగిస్తున్న వారు కాదా?

ఇదిలా వుంటే... నిర్వాసిత వలస ఆదివాసీ ప్రజల సమస్యలు మరొకరకంగా ఉన్నాయి. తెలంగాణ జిల్లాల్లోకి వలస వస్తున్న గుత్తి కోయలు అక్కడి స్థానిక ప్రజల నుంచి కొద్ది సమస్యలు ఎదుర్కొంటున్నారు. నీరు, వనరులు - స్థలం -- వ్యవసాయ భూములు వీరి సమస్య. వీరిని కొద్ది మంది ఆదరిస్తున్నారు. కొద్దిమంది నిరాకరిస్తున్నారు. ఫారెస్టు ఆఫీసర్లు వీరి పాకల్ని కాల్చేస్తున్నారు.

సంవత్సరాల తరబడి పోడు వ్యవసాయం చేస్తున్న వీరికి హక్కు పత్రాలు దొరకలేదు - రేషన్ కార్డులు లేవు. వీరి ఫోటోలు తీస్కుని, వీరిని ప్రతివారం పోలీస్‌స్టేషన్‌కొచ్చి సంతకాలు పెట్టమని వేధిస్తున్నారు పోలీసులు. నీళ్ళకోసం కొన్ని కిలోమీటర్ల దూరాన వెళ్ళాల్సి వస్తోంది. పారిపోయి వచ్చిన చాలా మంది బంధువుల ఇళ్ళల్లో తలదాచుకుని తర్వాత మళ్ళీ - భద్రాచలం అడవుల్లోకి వెళ్ళిపోయి పోడు వ్యవసాయం చేస్కుని బతుకుతున్నారు. భద్రాచలం నగరంలో వీరికి అన్ని పనులు రావు. వీరిలో కొంత మంది భద్రాచలం గ్రామాల్లో మిరపతోటల్లో రోజుకు 60 రూపాయల కూలీ పనికి వెళుతున్నారు. మిలటరీ బలగాలు పారిపోయివచ్చిన వీరి బంధువుల ఇళ్ళమీద దాడి చేసి, వారిని గాయపర్చి, ఆదివాసీలను మళ్ళీ అడవుల్లోకి ఎత్తుకెళ్ళి పోతుండడంలో స్థానికాలు భయానికి లోనవుతున్నారు. ఆదివాసీలు తలదాచుకొంటున్న తెలంగాణా జిల్లాలపై పోలీసులు కూంబింగ్‌ల పేరుతో దాడులు మరింత ఎక్కువ చేస్తున్నారు. ప్రజల అంతర్గత భద్రతకు హక్కులకు విఘాతం కలుగజేస్తున్నారు.

ఈ అడవుల లోపలి గ్రామాల్లో విద్య-వైద్యం రవాణా సౌకర్యాలు శూన్యం. మైళ్ళ కొద్దీ పోలీసుల బారినించి తప్పించుకుంటూ వీటికోసం కాలి నడకన పోవాల్సిందే! పిల్లల చదువులు అర్థాంతరంగా ఆగిపోయాయి. గ్రామం నుంచి గ్రామానికి తరమబడుతున్న ఆదివాసీ పిల్లలు తల్లిదండ్రులను "మనం అడవిలో ఎందుకులేం? ఇక్కడెందుకిలా ఉన్నాం?" అన్న ప్రశ్నకు ఎవరు సమాధానం చెబుతారు ?

ఒక పక్క గ్రీన్‌హంట్ లేదంటున్న ప్రభుత్వం ఫిబ్రవరి 2010, 9వ తారీఖున దంతెవాడలోని గచ్చనపల్లి నించి 20 మంది యువకులు కిడ్నాపైన విషయాన్ని ఎలా మరుగున పెడుతోంది? కివ్వాక గ్రామంలో మాడవి దుర్గారావు అక్కడి కొత్త కొత్త పాకలను చూపిస్తూ వీరంతా మొన్న మొన్ననే 5,6 రోజుల క్రితం దంతెవాడనించి అక్కడి మిలిటరీ దమన కాండనించి తప్పించుకుని వచ్చిన వారేనని చెప్పాడు. అతను కూడా అలా అన్నీ వదిలి వచ్చినవాడే! తన చేతిలోని పొడవైన నోటుబుక్కులో తప్పిపోయిన, చనిపోయిన ఆదివాసీల పేర్లు, ఊర్ల లిస్టు రాసి ఉంచాడు. ఫిబ్రవరి 9, 2010లో కిడ్నాపైన వారిని గచ్చెనపల్లిలో, బేస్‌కేంపులో ఉంచితే - అందులో ముగ్గురు తప్పించుకుని వచ్చారు - వాళ్ళు అక్కడి రేగడి గూడెం గ్రామంలో ఉన్నారు. బేస్ కేంపుల్లో కదలనివ్వరని - ఉచ్చకీ - దొడ్డికీ పోవాలన్నా డబ్బులిస్తారనీ ఆడవారిపై లైంగిక అత్యాచారాలు నిత్యకృత్యమని చెప్పారని మాడవి దుర్గారావు చెప్పారు.

కివ్వాకకి తప్పించుకుని వచ్చిన ఆదివాసీలు మధ్య మధ్యలో దంతెవాడలోని తమ ఊర్లకి పంటల పండుగలు చేస్కునేప్పుడు దొంగతనంగా వెళ్ళి వస్తుంటారని దుర్గారావు చెప్పారు. దాడులు 2010లో కూడా జరుగుతూనే ఉన్నాయని ప్రభుత్వం దాచి పెడ్తుందని - చంపిన వారి శవాలు గోదావరిలో వేస్తే తేలి పైకి కన్పిస్తాయని కాబట్టి, లోతైన - పైకి తేలని శబరి నదిలో వేస్తారని ఆ శబరి నదిలో వందల ఆదివాసీల శవాల గుట్టలు దొరుకుతాయని ఆవేదనతో చెప్తారు మాడవి దుర్గారావు. ఆయన ఇంకా ఇలా చెప్పారు. "దాదాలు (అన్నలు) మాకు అడవి భూమి మీద.శిస్తు కట్టద్దని చెప్పారు. అడవి దానంతట అదే పుట్టింది - అదే పంట పొలాలతో - పండ్లతో, వేర్లతో, దుంపలతో, జంతువులతో తయారయ్యింది. మీరూ అక్కడే పుట్టారు అందువల్ల అడవి మీది - దాని మీద హక్కు మీది అని చెప్పారు. - నిజమే కదా? అడవిలో ఉన్న మాపై పోలీసులు ఎందుకింత దౌర్జన్యం చేస్తున్నారు?" అని వచ్చీరాని తెలుగులో ఆ ఆదివాసీ ప్రశ్నించాడు.

2009 సెప్టెంబర్ నుంచి 2010 మార్చి దాకా దండకారణ్యంలో జరిగిన దాడులు హత్యలు ఎన్నో -- సెజ్‌ల పేరిట భూమి మీద - కోస్టల్ కారిడార్ సముద్రం మీద - ఆదివాసిలను అభివృద్ధి పథంలో నడిపిస్తూ నాగరికుల్ని చేసే నెపంతో అడవులమీదా, ఆదివాసీల మీదా - జులుం చేస్తున్నదీ రాజ్యం! ఒక వాకపల్లి అయ్యాక ఒక భల్లుగూడ.... ఎప్పుడూ.... దోపిడీ అస్థిత్వం కనపడ్తూనే ఉంటుంది.

విశాఖపట్నంలో భల్లుగూడ - అభ్రకం సున్నపురాయిలాంటి ఖనిజ సంపదలకు నిలయం. అలాగే అరకు కూడా! ప్రభుత్వం జిందాల్ కంపెనీకి ఎన్నడో ధారదత్తం చేసింది! బాలింతలపై అత్యాచారాలు చేసి వారి భర్తలపై అబద్దపు కేసులు బనాయించి జైలులో వారిని తలకిందులుగా వేలాడదీసి, వారిపై కుక్కలని తోలిందీ పాశవిక రాజ్యం! అత్యాచార సాక్ష్యం దొరకకుండా అత్యాచారం జరిగిన 6 రోజుల వరకూ బాధిత మహిళలు ఆస్పత్రికి పోకుండా బస్సులనే ఆపేసింది మోసకారి ప్రభుత్వం. విషాదం ఏమిటంటే అరుకులో అభ్రకం కోసం తవ్వకాలు సాగిస్తున్న జిందాల్ కంపెనీ అక్కడి నిర్వాసిత ఆదివాసీలకు వైద్య శిబిరాలు నిర్వహించడం, ఇతర స్వచ్ఛంద సంస్థలలో ప్రభుత్వంతో కల్సి ఆదివాసీ డోంగ్రియా తెగ పోరాటం పైనా గ్రీన్‌హంట్

ఒరిస్సాలోని పోయమ్‌గిరి కొండలను బాక్సైట్ ఖనిజాల కోసం వేదాంత రిసోర్సెస్ అనే లండన్ లిస్టెడ్ కంపెనీకి అమ్మేసింది ప్రభుత్వం. అటవీ హక్కుల్నీ ఆదివాసీ పర్యావరణ చట్టాల్నీ - అన్నింటిని తుంగలో తొక్కింది. కాబట్టి దీని తవ్వకాల్ని ఆపెయ్యాలన్న ఇంటర్‌నేషనల్ ఆమ్నెస్టీ రిపోర్ట్‌ను కూడా లెక్కపెట్టటం రాలేదు. అటు ప్రభుత్వం ఇటు వేదాంత రిసోర్సెస్ కంపెనీ (బాక్సైట్) గనుల తవ్వకాల వలన వేలమంది ఆదివాసీలు నిర్వాసితులు అవుతారు. గ్రామాలు ధ్వంసమవుతాయ్. నియమ్‌గిరి కొండలు అక్కడి అరుదైన గోండ్రియా తెగ ఆదివాసీలు పవిత్రంగా కొల్చుకునే కుల దేవత! వారి నమ్మకాన్ని, సంస్కృతినీ కూడా లెక్క చేయని తనంతో తవ్వకాలు సాగిస్తున్న వేదాంత కంపెనీపై, ప్రభుత్వ అణిచివేత రూపాలపై డోంగ్రియా తెగ ప్రతిఘటనా పోరాటం చేస్తోంది. ఇప్పటికీ అక్కడి గ్రామాల్లో బాక్సైట్ గనుల తవ్వకాల వలన పశువులు, ఇద్దరు ఆదివాసీలు చనిపోయారన్న రిపోర్టులున్నా తవ్వకాలు ఆగటం లేదు! అవును మరి కేంద్ర హోం మినిష్టర్ కావడానికి ఒకరోజు ముందు కూడా చిదంబరం వేదాంతకి డైరెక్టర్‌గా ఉండడమే కాదు అనేక మైనింగ్ కంపెనీలకు లీగల్ అడ్వైజర్‌గా ఉన్నవాడు ఉపా (అన్‌లాఫుల్ యాక్టివిటీస్ ప్రివెన్షన్ యాక్ట్) చట్టం తయారు చేయక ఏం చేస్తాడు ? నిజానికి మావోయిజం ఒక సామాజిక ఆర్థిక సంక్షోభంలోంచి పుట్టుకొచ్చిందని, సామాజిక అణిచివేతల్లోంచే ఆవిర్భవించిందని తెల్సు దానికోసం ఏం చెయ్యాలో తెల్సీ.... దాన్నొక దేశ ప్రధాన అంతర్గత సమస్యగా చిత్రీకరిస్తూ అణిచేయడానికి ఆపరేషన్ గ్రీన్‌హంట్‌ను ఎక్కుపెట్టిన ప్రభుత్వం వేలాది ప్రజల రాజ్యాంగబద్ధమైన ప్రజాస్వామిక హక్కుల్ని కాలరాస్తోంది... సాల్వాజుడుం నుంచి కోబ్రాలు - స్కార్పియన్లు (స్కార్పియన్స్ & కోబ్రాస్), సిఆర్‌పిఎఫ్ మండి వ్యవస్థీకృత హింసకు ఆదివాసీ ప్రజలను ఎరగావేస్తోంది. సామ్రాజ్యవాదానికి అమ్ముడుపోతూ చట్టాన్నీ - న్యాయాన్నీ - హక్కుల్నీ - ఆఖర్కి రాజ్యాంగాన్ని కూడా తనకనువైన రీతిలో తిరగరాస్తోంది.

ఏ మధ్య - ఎగువ మధ్య తరగతి సంపన్న వర్గాల ప్రయోజనాల కోసం, కంపెనీలనించి తమ వాటాల కోసం పాలక వర్గం దళిత, పేద - రైతాంగం, నోరులేని, నాగరిక భాషరాని ఆదివాసీల హక్కులను కాలరాస్తుందో ఆ తరగతి ప్రజలు ఎప్పటికైనా ఈ అభివృద్ధి ఫలాల కింద ఉన్న హింసా రూపాలను ఒక రెప్పపాటు కాలమైనా వీక్షిస్తారా? గ్రామాల్లో, అడవుల్లో ఉన్న ఒక హెటిరో, అరబిందో, టాటా-జిందాల్, పోస్కో, మిట్టల్ కంపెనీల్లో వేల, లక్షల జీతాలకు పని చేసే ఉద్యోగస్తులు...? నగరాలకు చుట్టుముట్టిన అడవంతా నరకబడ్డాక....

ఆకుపచ్చని చెట్ల నుంచి వచ్చే ఆక్సిజన్ అందకపోతే... వారికెలాగూ ఈ మల్టీనేషనల్ కంపెనీలు ఆక్సీజన్ సిలిండర్స్ అమ్మనే అమ్ముతాయి. కాబట్టి అభివృద్ధి ఫలాలు అందుకుంటున్న వీరికి, చంపబడుతున్న ఆదివాసీల హాహాకారాలు, కంపెనీల కోసం భూములు కోల్పోయిన రైతాంగపు కన్నీళ్ళు కనపడవు, వినపడవు. వీరికి కూడా మీడియా, ప్రభుత్వం చెబుతున్నట్లు ఆదివాసీల అభివృద్ధిని అడ్డుకుంటున్న మావోయిస్టులు దేశానికి అంతర్గత సమస్యగా, అత్యంత అవసరంగా నిర్మూలించవలసిన వారుగా కన్పిస్తారు.

అందుకే ఆదివాసీల హక్కులకై పోరాడుతున్న మావోయిస్టుల నిర్మూలనకు అత్యంత పాశవిక హింసా పద్ధతుల్లో శిక్షణ ఇచ్చిన మిలిటరీ బలగాల సయా సహకారంతో గ్రీన్‌హంట్‌ను ప్రయోగిస్తూ మావోయిస్టు అగ్రనాయకుల్ని వేటాడి వెంటాడి చంపుతోంది ప్రభుత్వం.

72 గంటలు కాదు - 72 రోజులు కాల్పులు ఆపుతాం, వారంలో చర్చించండి అని ఆహ్వానించినా మావోయిస్టు కేంద్ర కమిటి నాయకుల ఆహ్వానాన్ని కూడా లెక్క చేయట్లేదు అమ్ముడుపోయిన దళారీ ప్రభుత్వం!

72 గంటలు మావోయిస్టులు - తుపాకులు క్రిందపెడితే చర్చలకు సిద్ధమేనని ప్రకటించింది కేంద్ర మంత్రి చిదంబరమే. దాన్ని కాలరాస్తుందీ అతనే! అవును మరి కేంద్ర హోం మంత్రిగా!

అటు కేంద్ర ప్రభుత్వం నుంచీ - ఇటు మావోయిస్టుల నుంచీ వచ్చిన ఈ ప్రకటనను అన్ని ప్రజాస్వామిక పౌర, హక్కుల మేధావుల రచయితల ప్రజా సంఘాలు ఆహ్వానిస్తున్నప్పటికీ - కేంద్రం తన పారామిలిటరీ బలగాలను విరమించకపోగా -- ఏప్రిల్ నించి ఎఓబిలో మళ్ళీ గ్రీన్‌హంట్ ప్రారంభమని నిస్సిగ్గుగా ప్రకటన ఇవ్వటాన్ని ఎలా అర్థం చేసుకోవాలి.

సగటు అటవీ సంపద ఉన్న భారతదేశంలో ఆదివాసీలను మావోయిస్టుల అండ ఉన్నంతవరకూ అక్కడ కంపెనీలు పెట్టుబడులు పెట్టలేవు - అడవీ - దేశమూ ఆదివాసీ అభివృద్ధి కావు. కాబట్టి మావోయిస్టులు దేశం ఎదుర్కొంటున్న అంతర్గత సమస్యల్లో అతి ముఖ్యమైనదని ప్రకటిస్తున్నాడు ప్రధాని మన్మోహన్‌సింగ్. అందుకే అనుమానం వచ్చిన వెంటనే సాక్ష్యాల, వారెంట్‌ల అవసరం లేకుండా అరెస్ట్ చేసే అన్ లాఫుల్ యాక్టివిటీస్ ప్రివెన్షన్ యాక్ట్ (యుఎపిఎ)ని ప్రయోగిస్తూ... సల్వాజుడుం, గ్రీన్‌హంట్‌కి వ్యతిరేకంగా ఉద్యమిస్తున్న ప్రజాస్వామిక వాదుల, హక్కుల సంఘాల సభ్యులను అరెస్టు చేయిస్తున్నాడు.

అందుకే దేశ విదేశీ కార్పోరేట్ మైనింగ్ కంపెనీలలో దిగిన MOUలను అమలు చెయ్యడానికి రెండు లక్షల 50 వేల సాయుధ బలగాలలో వాటిని కోబ్రా ఫోర్సెస్‌గా ఐక్యం చేసి ఆపరేషన్ గ్రీన్‌హంట్ పేరులో చేసే దాడి దేశం తన ప్రజలపై చేసే అంతర్యుద్ధంగా భావించవచ్చు.

దీన్ని వ్యతిరేకిస్తూ వస్తున్న ప్రజా ఉద్యమకారులపై కుట్రకేసులు బనాయిస్తుంది ప్రభుత్వం. వీరిని మావోయిస్టు సానుభూతి పరులని ముద్రవేసి జైలుపాలు చేస్తోంది. దీనికి ఉదాహరణ - కోబార్ గాంధీ అరెస్ట్, అతనికి పాశవికంగా చేసిన నార్కో అనాలిసిస్ పరీక్షలు - హత్యలు చేస్తున్న వారిపై కాదు - హత్యల్ని ఆపమని నినదిస్తున్న వారిపై నార్కో అనాలిసిస్ టెస్ట్‌లు చేస్తోంది నిస్సిగ్గు ప్రభుత్వం.

ఏదేమైనప్పటికీ గ్రీన్‌హంట్ పేరుతో కొనసాగుతున్న మానవ హననాన్ని వెంటనే ఆపేదిశగా - ప్రజాస్వామిక రాజ్యాంగ విలువల పునాదిగా కేంద్ర ప్రభుత్వం మావోయిస్టులతో చర్చలు జరపడమే కాదు - దానికంటే ముందుగా అడవినంతా మోహరించిన కోబ్రా ఫోర్సెస్‌ని విరమించడంతోపాటుగా ఆదీవాసీ అటవీ ప్రాంతాల్లో ఖనిజ కంపెనీలు నెలకొల్పడానికి చేస్తున్న MOUలను రద్దు చేస్కోవాలి. లేకపోతే.... విప్లవోద్యమాన్ని తాత్కాలికంగా హత్యలతో, అణిచివేతలతో అణగదొక్కినా రేపు... (నాతాన్-) నాన్న కావాలి అనీ నాన్న కోసం వెతుక్కుంటున్న ఏడు సం.రాల రవి తన తండ్రి తావును కనుక్కునే క్రమంలో... తనూ సాయుధుడౌతాడు... నాలుక తెగ్గోయబడ్డ పది సంవత్సరాల బాల సెంట్రీ.... కోయభాషని నేర్చుకుని.... ఒక రచయితగా తన జాతి హననాన్ని లిఖిస్తాడు.

వేళ్ళు నరకబడ్డ ఒకటిన్నర సం.ల బాల సురేష్... నరకబడ్డ వేళ్ళ స్థానాన్నే విల్లంబులు అంటించుకుంటాడు. అడవితల్లి, చెట్టు చెట్టుకీ శాఖ శాఖకీ ప్రతిక్షణం ఒక కొత్త యుద్ధ శిశువుని కంటూనే ఉంటుంది. వారంతా అడవిలోని జనతన సర్కార్ నడుపుతున్న విప్లవ బడులలో కాబోయే విప్లవ విద్యార్థులే! అడవిని కమ్మిన రెండున్నర లక్షల కోబ్రా ఫోర్సెస్‌ని ఎదుర్కోవడానికి దండకారణ్యంలోని ప్రతి ఆదివాసీ లక్షలుగా - కోట్లుగా కదలబారుతారు! ✱

**వ్యాసం**

◆ రాధో డిసౌజ

తెలుగు సేత : అరుణ్

# ఆపరేషన్ గ్రీన్‌హంట్ అడకత్తెరలో పోక చెక్క సిద్ధాంతం

**"ది సాండ్ విచ్ థియరీ" (అడకత్తెరలో పోక చెక్క సిద్ధాంతం)**

ఢిల్లీ విద్యార్థుల నోటి వెంట నేను తొలిసారిగా అడకత్తెరలో పోకచెక్క సిద్ధాంతం (సాండ్ విచ్ థియరీ) మాటల్ని విన్నపుడు నా మనసు చివుక్కుమంది. చత్తీస్‌ఘడ్‌లో సాల్వాజుడుం, గ్రీన్‌హంట్‌లనే వివాదాస్పదమైన కార్యక్రమాలపై ఆ భావాల్ని, సమాజంలో స్వతంత్రంగా తమ భావాలు వ్యక్తీకరించగల వాటితో సమాజాన్ని ప్రభావితం చేయగల మధ్యతరగతిలో కొంతమంది ఢిల్లీ విద్యార్థులు పై 'సిద్ధాంతాన్ని' ఉటంకించారు. ఆ సిద్ధాంతం దాన్ని మనం సిద్ధాంతమని అనగలుగుతే, ఆదివాసీలు గ్రామీణ పేదలు సాయుధ మావోయిస్టు 'టెర్రరిస్టుల' సైనికీకరించబడ్డ భారత రాజ్యపు ఎదురుకాల్పుల మధ్య ఇరుక్కుపోతున్నారనే చెబుతుంది. (ఉదా : చూడండి, "రిపోర్ట్ ఆఫ్ సిటీజన్స్ ఇనిసియేటివ్ ఆన్ ఛండీఘర్") ఆ సిద్ధాంతం ప్రకారం, నిస్సహాయులైన ఆదివాసీలను, పేద గ్రామీణులను, పై ఇరువురి దాడుల నుండి రక్షించడం మధ్యతరగతి బాధ్యత. పై రెండు సాయుధ బలగాలకు, తనదైన స్వార్థ ప్రయోజనాలు, లక్ష్యాలూ వున్నాయి. మావోయిస్టులకు తుపాకి గొట్టం ద్వారా రాజ్యాధికారం, భారతరాజ్యం ఆదివాసుల భూమిని, ప్రకృతి వనరులను బలప్రయోగంతోనైనా స్వాధీనం చేసుకొని వాటిని దేశీయ, విదేశీయ కార్పోరేషన్లకు అప్పగించడం. ఆవిధంగా, ఈ అడకత్తెరలో పోక చెక్క సిద్ధాంతం దేశ మధ్యతరగతిని, దేశం సంరక్షకులుగా చూస్తుంది. మనకు పైకి కన్పడే, ఈసిద్ధాంతపు "నిష్పాక్షికత" అందర్నీ ఆకర్షిస్తుంది. అదే సమయంలో పై సిద్ధాంతం చాలా మందికి ఇబ్బందికరంగా తోస్తుంది. అది కేవలం సమస్యను 'హింసా - ప్రతిహింసల' సమస్యగా వారి ముందుంచుతూ, ఎటువంటి చర్చకూ తావీయకుండా వారెటు వైపు అని ప్రశ్నిస్తుంది. (ఉదా ఎన్‌డిటివిలో చర్చ 23/9/09; 07/10/09, 20/10/09) ఈ సిద్ధాంతాన్ని ప్రతిపాదించేవారి సామాజిక స్థాయి; విద్యారంగంలో, ప్రసార సాధనాల్లో, ప్రభుత్వ పాలనా రంగాల్లో వారి హోదా, ఇవన్నీ స్వాతంత్ర్యకాలం నుండి ఉన్నత వర్గాల పట్ల మధ్య భారతం పెంచుకున్న అపనమ్మకాన్ని మరింత బలోపేతం చేస్తుంది. "సాల్వాజుడుం" మరియు "ఆపరేషన్ గ్రీన్‌హంట్"ల పట్ల విస్తృతమైన వ్యతిరేకత వున్నా, మధ్యతరగతి వాటిని అర్థం చేసుకున్న తీరు, ఆ వర్గాన్ని నిలువుగా విడదీస్తున్నది.

**ప్రజాస్వామిక విలువలు - అడకత్తెరలో పోకచెక్క సిద్ధాంతం**

మధ్య భారతం ప్రజాస్వామ్యానికి విలువనిస్తుంది. ఇక, ప్రజాస్వామ్యమందే కుల, మత, లింగ, వర్గ ప్రాంతాలకతీతంగా ప్రతివ్యక్తికీ గౌరవమీయడమేనన్ని అందరూ అంగీకరిస్తున్నదే. ప్రతి వ్యక్తీ తమ భవిష్యత్తును నిర్మించుకోగలడనీ ప్రజాస్వామ్యం విశ్వసిస్తుంది. అదే నిజమైతే ఈ 'అడకత్తెరలో పోకచెక్క సిద్ధాంతం' మౌలికంగా అప్రజాస్వామికమైనది.

గత కొన్ని దశాబ్దాలుగా వివిధ కేంద్ర ప్రభుత్వాలు అమలు చేస్తున్న ఆర్థిక విధానాల పట్ల ఆదివాసులకు, గ్రామీణ పేదలకు న్యాయమైన వ్యతిరేకత వుందనే విషయం దేశ మధ్య తరగతిలో మెజారిటీ అంగీకరిస్తారు. "సాండ్‌విచ్ సిద్ధాంతం" ప్రకారం మావోయిస్టులు ఈ వ్యతిరేకతను తమ స్వంత లక్ష్యాలకై వినియోగించుకుంటున్నారు. కనీసం కొంతమందైనా ఆదివాసులు, గ్రామీణ ప్రజలు మావోయిస్టులతో కలిసి పని చేయడానికి సిద్ధపడ్డారనే విషయాన్ని, పై భావన తోసి పుచ్చుతుంది. పై వాదన ఆదివాసులు , గ్రామీణ ప్రజలకు తమకేది మంచిదో, కాదో నిర్ణయించుకునే శక్తి సామర్థ్యాలు లేవని, వారిని తాము ఎవరికి ఎందుకు మద్దతునివ్వాలో నిర్ణయించుకొనే సాధారణ తెలివి తేటలు లేవని చెబుతుంది. ఈ సిద్ధాంత దృక్పథం పేద ప్రజల పట్ల సానుభూతి అనే తెరచాటునగల నియంతృత్వ ధోరణికి అర్థంపడుతోంది. నిజమే, ఆదివాసులు, గ్రామీణ పేదలు తమ రాజకీయ ఎంపికలను, హర్వర్డ్, ఆక్స్‌ఫర్డ్, ఐఐటి, జైఎన్‌యు మేధావుల భాషలో వ్యక్తీకరించలేరు. అంతేగాక వారికి ప్రజాస్వామిక అభివృద్ధి, పౌరసమాజం కమ్యూనిస్టు అనంతర, మార్క్సిజపు అనంతర సమాజాల గురించి తెలియక పోవచ్చు. అంతమాత్రాన వారు స్వయం నిర్ణయాధికారం లేని నిర్లిప్త బాధితులు అని చెప్పడం తగదు. ఆదివాసులను, గ్రామీణ ప్రజలను మావోయిస్టులకు రాజ్యానికి బలిపశువులుగా చెప్పడం ద్వారా మధ్య భారతం వారిని తమ రాజకీయ సమానులుగా పరిగణించకుండా వుండే అవకాశం పొందుతున్నారు.

ఆదివాసులు, గ్రామీణ పేదలు నోరులేని బాధితులు అని చెప్పడం కొత్తేమీ కాదు. ఈ భావనను కనీసం దేశ స్వాతంత్ర్యం వచ్చిన నాటి నుండి అభివృద్ధి చేసారు. దానికి మెరుగులు దిద్దారు. ప్రపంచ యుద్ధాల అనంతరం జరిగిన అభివృద్ధి చర్చ 'పేదరికం' గురించే. అది ఒక మొరటు భావన, సులభంగా వుపయోగించబడేది కూడా. కాని, తొందరలోనే 'కన్పడని మార్కెట్ మాయాజాలం' వలె అభివృద్ధి యొక్క గోచరంగాని పద్ధతులు కొంత మందికి మేలు చేసాయి. ఎక్కువ మందిని పేదరికానికి నెట్టాయి. అభివృద్ధి పట్ల నిరాశ పెరిగే కొద్దీ, 'పేదలు' అనే పదం బదులు. మరింత నాజూకైన ఆకర్షణీయమైన పదాన్ని సమాజపు చివరి అంచున వున్నవారు వాడటం మొదలయింది. వీరు ఆధునికతకు, పౌర సమాజానికి దూరంగా వుంటున్న అమాయక జనం, ఈ భావన వలసవాదుల ఆలోచన, "ఉన్నతమైన అనాగరికుల"కు దగ్గరగా వుంటుంది. మనదేశం మధ్యతరగతిచేత ఎవరి ఆకాంక్షలైతే వివరించబడి, ప్రాతినిధ్యం చేయబడుతాయో వారే సమాజానికి చివరి అంచున వున్న ప్రజలు. ఇక అలాంటి వారిని బలిపశువులుగా చెప్పడం సులువు. ఆదివాసులు, గ్రామీణ ప్రజలు పేదరికంలో మగ్గుతున్నంతకాలం మధ్య భారతం, తన స్వంత పేరుతో, తన స్వంత ప్రయోజనాలకై, ఆకాంక్షలకై మాట్లాడాల్సిన అవసరం లేదు. వారి కొరకు వ్యాఖ్యానిస్తే చాలు. ఆదివాసులు, గ్రామీణ పేదలు పోరాటం సల్పుతున్న రెండు వర్గాల మధ్య ఇరుక్కుపోయారన్నది ఎంత నిజం?

**వాస్తవంగా 'అడకత్తెరలో పోకచెక్కగా' వున్నదెవరు ?**

వలసపాలన మొదలయినప్పటి నుండి, ఆధునిక భారత దేశ చరిత్ర కాలం మొత్తంలో రెండు శత్రు వర్గాలు ఒకరికొకరికి వ్యతిరేకంగా స్థిరంగా, యేమాత్రం మార్పు లేకుండా నిలబడుతూ వచ్చాయి. వలస పాలనకాలంలో, స్వాతంత్ర్యానంతరం 'గిరిజన తిరుగుబాట్లు', 'రైతాంగ పోరాటాలు' తరచుగా బద్దలవుతూ, రాజ్యాధికారమనే పునాదులను కదిలిస్తూ వచ్చాయి. ఈ తిరుగుబాట్లు పోరాటాలు తగ్గుముఖం పట్టినపుడు, అవి ఉపరితలం కింద బుడగలు బుడగలుగా పైకెగుస్తూ, అగ్ని పర్వతంలా బద్దలవడానికి సిద్ధంగా వుంటాయి. ఆదివాసీలు మాత్రం, తమ నిబద్ధత విషయంలో స్థిరత్వం ప్రదర్శిస్తూనే వున్నారు. 'నీరు, అడవి, భూమి' లాంటి డిమాండ్ల విషయంలో వారు యేమాత్రం సడలింపులివ్వలేదు. అదే విధంగా గ్రామీణ పేదలు, వారి డిమాండ్ల విషయంలో పట్టుదలతో వున్నారు. వాస్తవంగా, ప్రపంచ మొత్తంపైన మూలవాసులు తమ డిమాండ్లు "జల్, జంగల్, జమిన్" విషయాల్లో యే మాత్రం వెనక్కు తగ్గలేదని చెప్పవచ్చు.

అదే విధంగా, పై వర్గ డిమాండ్లకు వ్యతిరేకంగా వలస పాలన ఆ తర్వాత స్వతంత్ర భారత ప్రభుత్వాలు తమ వైఖరి విషయంలోనూ అదే విధమైన పట్టుదలను కన్పరచాయి. ఆ ప్రభుత్వాలు, లాఠీలు, తూటాలతో, తమ సాయుధ సంపత్తిని యావత్తు సంఘటితపరచి, గ్రామీణ పేదలను, ఆదివాసీలను జైల్లో పెట్టాయి. చిత్రహింసలకు గురి చేసాయి. లైంగిక

అత్యాచారాలకు వొడిగట్టాయి. వారి ఆస్తులను ధ్వంసం చేసాయి. ఎంతో మందికి ఉరిశిక్ష విధించాయి. భూమయ్య, కిష్టాగౌడుల ఉరిశిక్షలు మన కళ్ళ ముందు కదలాడుతూనే వున్నాయి. రాజ్యం కూడా మరింత భూమికోసం, మరిన్ని ప్రకృతి వనరుల కోసం, మరింత చౌకశ్రమ కోసం స్థిరంగానే వెంపర్లాడుతున్నది. ఈ రెండు ప్రత్యర్థి వర్గాల దృఢ సంకల్పం ప్రతి ఒక్కర్నీ, మధ్య భారతాన్ని రోజు రోజుకు అలజడిలోకి తోస్తున్నది. కొంతమంది యేమాత్రం సంకోచించకుండా, ఆదివాసుల గ్రామీణ పేదల పక్షం వహిస్తున్నారు. అలాంటి వారిని రాజ్యం వివిధ పేర్లతో అతివాదులని, టెర్రరిస్టులని పిలుస్తున్నది. వారికీ ఆదివాసుల గతే పడుతున్నది. ఇతరులు రాజ్యం వలసవాద ఇతర పక్షం వహిస్తున్నారు. వాళ్ళు అతివాదులు టెర్రరిస్టులనే వారికి వ్యతిరేకంగా రాజ్యయంత్రాంగాన్ని సమీకరించడంలో, చాలా చురుకైన పాత్ర వహిస్తున్నారు. మరి కొందరు ఏ పక్షం వహించలేక, కూరుకపోయినట్టు భావిస్తూ ఈ ఇద్దరి ప్రత్యర్థుల మధ్య 'అడకత్తెరలో పోకచెక్క' మాదిరి సతమతమవుతున్నారు. ఆ విధంగా, 'అడకత్తెరలో పోకచెక్క'గా యిరుక్కపోయింది మధ్య భారతమే.

సారంలో, కళింగనగర్, సింగూర్, నందిగ్రామ్, లాల్‌ఘర్, ఇప్పుడు నారాయణ పట్నంలో జరిగిన జరుగుతున్న పోరాటాలు ఒకే సాంప్రదాయంలోనే, కాని, మధ్య భారతం వాటిని గిరిజన తిరుగుబాట్లు లేక రైతాంగ తిరుగుబాట్లుగా పిలవడానికి సంకోచిస్తున్నది. ఇప్పుడు జరుగుతున్న చర్చ, గతంలో స్వాతంత్ర్య పోరాటాల కాలంలో జరిగిన చర్చలకు ప్రతిధ్వనిగా వుంది. "వ్యవసాయ సమస్యల"పై ఎం.ఎన్.రాయ్‌కు లెనిన్‌కు జరిగిన వాగ్వివాదం, హింసా పద్ధతుల నుండి అరవిందుని అహింసా మార్గానికి మార్పు, భగత్‌సింగ్ ఉరి మీద, చౌరి చౌరా లాంటి సంఘటనలపై జరిగిన చర్చలు నేడు జరుగుతున్న చర్చలతో పోలి వున్నవే. "అడకత్తెరలో పోకచెక్క సిద్ధాంత కర్తలు", నేటి సంఘర్షణ పట్ల వహిస్తున్న వైఖరి అ చారిత్రకమైనది. మావోయిస్టు ఉద్యమం 2004లో మొదలైందనే ప్రభుత్వ వాదనను చాలా మంది సమర్థిస్తున్నారు. 2004లో జరిగింది ఆ ఉద్యమంలో జరిగిన పునఃసమీకరణ మాత్రమే. మనకిష్టమున్నా లేకున్నా, పడిలేస్తూ నడిచిన మావోయిస్టు ఉద్యమానికి 2004 కన్నా ముందుగానే చాలా చరిత్ర ఉంది. అయితే, మధ్య భారతం నేడు ఎదుర్కొంటున్న పరిస్థితులకు, అంతకుముందు స్వాతంత్ర్య పోరాట కాలంలోనూ, ఆ స్వాతంత్ర్యానంతరం ఎదుర్కొన్న పరిస్థితులలో చాలా తేడా వుంది. ఆ తేడాకు 'ప్రపంచీకరణ'తో సంబంధం వుంది.

మధ్య భారతం-స్వాతంత్ర పోరాటం :

బోయర్స్ యుద్ధం ఆఫ్రికా ఖండపు వనరులకై పోటీ, ఇతర వలసవాదుల ఘర్షణలు చివరకు ప్రపంచ యుద్ధాలకు దారి తీసాయి. అప్పుడు బ్రిటన్ నాయకత్వ స్థానంలో వుంది. సైనికపరంగా బ్రిటన్ బలంగా వుంది, ఆర్థికపరంగా బలహీనంగా వున్న దశలో బ్రిటీష్ సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా స్వాతంత్ర్య పోరాటం జరిగింది. అపుడు ఆదివాసీలకు రాజ్యంతో సంబంధంలేని దేశం విభిన్న వర్గాలు, జాతులు, కులాలు స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొన్నాయి. వారిలో ప్రతి ఒక్కరికి వారి స్వంతమైన డిమాండ్ల ఆకాంక్షలు వున్నాయి. రెండు ప్రపంచ యుద్ధాల మధ్యకాలంలో పారిశ్రామికాభివృద్ధి పెద్ద ఎత్తున జరిగింది. ఆ కాలంలో పారిశ్రామిక వర్గం రెండు ప్రపంచ యుద్ధాలవల్ల లాభపడింది. దాంతో బలపడిన ఆ వర్గం రాజ్యాధికారం కోసం ఆకాంక్షించింది. స్వాతంత్ర్యపోరాటంలో పాల్గొనింది కూడా. హింస - అహింస, అతివాదం - ఉదార ప్రజాస్వామ్యం, సామాజిక న్యాయం - చట్టబద్ధపాలన లాంటి వాటిపైన విస్తృతమైన చర్చలు జరిగాయి. అయితే, పై చర్చలన్నీ విభిన్న వర్గాల, సమూహాల, కులాల, తెగల, జాతుల, మతాల భాషల మధ్య "ఒక సోషియల్ కాంట్రాక్ట్" 'సామాజిక ఒడంబడిక' ఏర్పరచే క్రమంలో జరిగాయి. ఆ తర్వాత, భారతదేశం రిపబ్లిక్‌గా అవతరించినపుడు ఆ సామాజిక ఒడంబడిక రాజ్యాంగంలో పొందుపరచబడింది.

ఈ సామాజిక ఒడంబడికకు 'భారతజాతి' అనే దార్శనికత పునాదిగా వుంది. ఆ దార్శనికత అందరినీ / అన్నిటినీ సమ్మిళితం చేసుకొనేది. అందువల్ల రాజ్యాంగం "మనం ప్రజలం" అనే పదాలతో ప్రారంభమవుతుంది. అది అందరికి సామాజిక, ఆర్థిక, రాజకీయ న్యాయాన్ని హామీ యిస్తుంది. అది, ఆదివాసులకు వారి 'జల్, జంగల్, జమీన్'లను, గ్రామీణ పేదలకు భూసంస్కరణల అమలును హామీ యిచ్చింది. అంతేగాక, విభిన్నజాతులకు, అస్సాం, మేఘాలయా, మిజోరాం, కాశ్మీర్‌లకు ప్రత్యేక హోదాను, పట్టణ ప్రాంత పనివారలకు ఉద్యోగాలు, సామూహికంగా బేరసారాలు సాగించే హక్కును, భాషా ప్రాతిపదికపైన రాష్ట్రాల ఏర్పాటును, ఆ సామాజిక ఒడంబడిక హామీ యిస్తుంది. అలాంటి దేశమనే దార్శనికతనే నేడు మధ్యభారతం ఎదుర్కొనే తికమకలో ప్రధాన అంశంగా చెప్పవచ్చు.

స్వతంత్ర భారతదేశం రెండు చివరల విభజన, మధ్య భాగాన తెలంగాణ సాయుధ పోరాటంతో ప్రారంభమైంది. ఇతర ఆదివాసీ, రైతాంగ పోరాటాలను అణచివేసినట్టుగానే, తెలంగాణ సాయుధ పోరాటాన్ని భారతసైన్యం అణచివేసింది. చాలా మంది చిత్రహింసలకు గురయ్యారు. జైళ్లపాలయ్యారు, చంపబడ్డారు. నూతన రాజ్యాంగం ఏర్పరచుకున్నాక, గిరిజన తిరుగుబాట్లకు, రైతాంగ ఉద్యమాలకు మూలాలు, దేశంలో ఇక యేమాత్రం లేవని మధ్యభారతం విశ్వాసంతో వుండింది. రాజ్యాంగ సభలో అతిపెద్ద ప్రతిపక్షపార్టీ అయిన కమ్యూనిస్టు పార్టీ యొక్క ముద్ర రాజ్యాంగ రచనలో సామాజిక ఒడంబడికగా మనకు కన్పడుతుంది. మధ్యభారతం తామూహించిన భారతదేశంపై నమ్మకముంచారు. కాలక్రమంలో, భారతదేశం సామాజిక న్యాయం, సమానత్వం విశ్శృంఖల లేకుండా వుండటం లాంటి వాటిపై ఒక జాతిగా నిర్మితమవుతుందనే విశ్వాసం నాడు కల్గింది.

కాని, రెండు దశాబ్దాల అనంతరం నక్సల్‌బరీ, శ్రీకాకుళ తిరుగుబాట్లు ఉవ్వెత్తున ప్రజ్వరిల్లడంతో, పై దార్శనికతో యేదో అతి పెద్ద తప్పు జరిగిందని తెల్సింది. ఆధునిక భారతానికి పునాది అయిన సామాజిక ఒడంబడికను ఇచ్ఛపూర్వకంగా ఉల్లంఘించబడింది. నక్సల్‌బరీ, శ్రీకాకుళం గిరిజనులపై భారతసైన్యం అమానుషంగా దాడి చేసినపుడు, తన చర్యలను రాజ్యం, నేటిలాగా ఆ యుద్ధం గిరిజనులపైన, రైతాంగంపైన కాదని సాయుధ మావోయిస్టు తిరుగుబాటు దారులపైన అని సమర్థించుకుంది. అది హింసకు, అహింసకు మధ్య ఘర్షణ అని రాజ్యం చెప్పనుంది. కాని, నాడు మధ్య భారతం ఆ రెంటి వర్గాల మధ్య తాము అడకత్తెరలో పోకచెక్క వలె నలిగిపోయామని చెప్పుకోలేదు. అలా నలిగిపోవడానికి మధ్య భారతం తిరస్కరించింది. వేలాది మంది విద్యార్థులు, యువజనులు నక్సల్‌బరీ, శ్రీకాకుళ గిరిజనులతో, రైతాంగంతో మమేకమయ్యారు. వారినీ పోలీసులు ఎత్తుకపోయారు. జైళ్ళో పెట్టారు. చిత్రహింసల పాలు చేసారు, చంపారు. ఇండియన్ ఇంగ్లీషు భాషకు కొత్త పదం చేరింది. అబద్ధపు "ఎదురు కాల్పులకు" అనేది ఎదురు బడటం అనే క్రియా పదానికి జతయ్యింది. మావోయిస్టు సిద్ధాంతానికి, మార్గానికి వ్యతిరేకులైన వారు కూడా, నాడు, 'అడకత్తెరలో పోక'వలె నలిగేందుకు తిరస్కరించారు. సమాజంలో గౌరవనీయ స్థానంలో వున్న జయప్రకాష్ నారాయణ, వి.ఎం. తార్కుండే, సత్యరంజన్ సాథ్, సమరసేన్ లాంటివారు. మావోయిస్టులు ఆదర్శవాదులనీ, సహనం కోల్పోయిన, సైద్ధాంతికంగా తప్పుదోవ పట్టిన యువకులనీ అంతేగాని, వారెంత మాత్రమూ నేరస్థులూ, టెర్రరిస్టులూ కారని గట్టిగా చెప్పారు. అంతేగాదు, అందరికీ వర్తించే 'చట్టాల అమలును వారికీ వర్తింప జేయాలని డిమాండ్ చేసారు. ఎవ్వరూ, రాజ్యంగూడా, వారిని టెర్రరిస్టు సానుభూతి పరులని ఆరోపణ చేయలేదు. నక్సల్‌బరీ అనంతరం, మధ్య భారతం, రాజ్యం సామాజిక ఒడంబడికను ఉల్లంఘించిందని, నిరాశపడింది, నిస్పృహ చెందింది. ఆగ్రహం చెందింది కూడా. వారు, ఇంకనూ, స్వాతంత్ర పోరాట కాలంలో ఊహించుకున్న

'దర్శనాన్ని', అది చెదరిపోతున్నా కూడా, అంటి పెట్టుకున్నారు. స్వాతంత్ర్యానంతర తరం "మా తల్లిదండ్రులు, తాతలు పోరాడింది ఇలాంటి దేశం కోసం కాదు" అని చెప్పడం కన్పడింది.

చాలా సామాజిక న్యాయ ఉద్యమాలు ఉద్భవించాయి. ఆధునిక భారతదేశంలో ప్రజాస్వామ్య హక్కుల ఉద్యమ, ఎన్‌కౌంటర్లు ఎక్కువ జరిగేకొద్దీ బలపడింది. విస్తృత మయింది. రాజ్యాంగ రక్షకులుగా న్యాయస్థానాలకు సామాజిక ఒడంబడిక అందరికీ వర్తించే విధంగా చూడాల్సిన బాధ్యత వుందని ప్రజాస్వామ్య హక్కుల ఉద్యమకారులు డిమాండ్ చేసారు. తన ప్రసంగంలో ఆనాటి ప్రధాన న్యాయమూర్తి, జస్టిస్ భగవతి 'చట్టమే విచారణ'లో వుందన్నాడు. ఒక నూతన న్యాయవిధానం "ఉత్తరాల ద్వారా న్యాయం" అనేది ప్రవేశ పెట్టబడింది. అన్యాయానికి గురైన వారు అతి పేదవారైనా ఒక ఉత్తరం ద్వారా సుప్రీంకోర్టుకు తెల్పుతే, ఆ విషయమై విచారణ జరుపబడుతుంది. విచిత్రంగా ఇలాంటి జోక్యాలు వ్యవస్థీకృత వివశ్యతను పదిలపరచి ఆదివాసీలు, గ్రామీణ పేదలను న్యాయవ్యవస్థ నుండి దూరం చేసాయి.

మధ్య భారతపు పై జోక్యాలు ఆదివాసుల, గ్రామీణ పేదలకు వారి ప్రాతినిధ్యం తిరస్కరించడమనే దానిపై ఆధారపడ్డాయి. వారు నిస్సహాయులైన బలిపశువులు, నోరులేని అట్టడుగు వర్గాలు. అందువల్ల, 'మనం' ఈ దేశ రక్షకులం ఏదో ఒకటి చేయాలి. నిజమే, మనం అంటే మధ్య భారతం చట్టబద్ధ పాలన రాజ్యాంగం వారి విషయంలో అమలవుతుందని రుజువు చేస్తాం. ప్రజాప్రయోజన సంరక్షణ పిటీషన్లను తీసుకోండి. రోజువారీ చట్టాలను అమలు చేయాలని కోర్టులు నిత్యమూ తీర్పులిస్తూనే వున్నాయి. ప్రభుత్వాలు కనీసవేతన చట్టాన్ని, ఆరోగ్య, రక్షణ చట్టాలను, బాలకార్మికులు, బానిస కార్మికులకు వ్యతిరేకంగా వున్న చట్టాలను, ఆస్తులను, గృహాలను ప్రభుత్వం స్వాధీనం చేసుకున్నందువల్ల నిర్వాసితులయిన వారికి పునరావాసం కల్పించాలనే చట్టాలను అమలు చేయాలనీ కోర్టులకు ఫిర్యాదిదారులకు మొరపెట్టుకున్నారు. కోర్టులు పరిపాలన, చట్టాల అమలు విషయంలో జోక్యం చేసుకున్నాయి. కాని, రాజ్యాంగబద్ధమైన విధులను నిర్వహించనందుకై ఇంతవరకు కోర్టులు యే ప్రభుత్వ అధికారిని శిక్షించలేదు. పాలనా వ్యవస్థకు, న్యాయవ్యవస్థకు మధ్యగల సరిహద్దులు కలుషితం కావడంతో, ప్రభుత్వాధికారులు రాజ్యాంగ బాధ్యతలను ఉల్లంఘించినా శిక్షపడకుండా తప్పించుకోగలుగుతున్నారు.

ఆధునిక భారత దేశ నిర్మాణం పేరుతో, సమాజపు చివరి అంచున వున్న ఆదివాసుల జల్, జంగిల్, జమీన్‌లను నేషనల్ థర్మల్ పవర్ కార్పోరేషన్, ది నర్మదా డామ్ లీక్, కొంకన్ రైల్వేలు, (పేర్లేవైతనేం) స్వాధీనం చేసుకుంటున్నాయి. వెను వెంటనే ప్రజాప్రయోజన వాజ్యాలు న్యాయవ్యవస్థ జోక్యాన్ని కోరుతాయి. దేశ సగం జనాభాను మినహాయించినా, 'అభివృద్ధి' అనే ప్రభుత్వపు 'దర్శనాని'కి కోర్టులు అడ్డుపడవని స్పష్టమవుతుంది.

'లోక్ అదాలత్'లను పరిశీలిద్దాం. ఈ భావనను ప్రచారం చేసింది మధ్య భారతమే. తర్వాత అది చట్టమయింది. పేదవాళ్ళకు తక్షణ న్యాయం అందించేందుకు, ఎంతోకాలంగా నిలువ వున్న వ్యాజ్యాయలను తగ్గించేందుకు సాక్షాలు, సివిల్, నేర సంబంధమైన క్రమాల్ని పక్కన బెట్టి పేదలకు న్యాయం అందించేందుకు 'లోక్‌అదాలత్' ఏర్పడింది. ఫలితంలో పేదలకు, సంపన్నులకు భిన్నమైన పద్ధతులననుసరించే ఒక వ్యవస్థను స్థిరపరిచింది. ధనవంతులు సాక్షాలకు సంబంధించిన నియమ నిబంధనలను, సివిల్, నేర సంబంధమైన పద్ధతుల ననుసరించి న్యాయాన్ని పొందుతారు. ఆక్రమానికి సంబంధమైన చట్టాలు మాత్రం పేదల విషయంలో విస్మరించబడుతాయి. ఏమైనా పేదలకు సంబంధించిన వాజ్యాలు విలువ తక్కువ. ఆ తక్కువ విలువే పేదలకు ఎంతో ఎక్కువ అనే విషయాన్ని పట్టించుకోవద్దు. మరి చట్టం ముందు అందరూ సమానులే?

నక్సల్బరీ, ఎమర్జెన్సీల తర్వాత స్వచ్ఛంద సేవా సంస్థలు, 'పౌర సమాజ' సంస్థలు ఇబ్బడిముబ్బడిగా పుట్టుకొచ్చాయి. అదే సమయంలో రాజకీయాలు నేరమయమయ్యాయి. "నేషనల్ ఎలక్షన్ వాచ్, అసోసియేషన్ ఫర్ డెమోక్రటిక్ రిఫార్మ్" లాంటి సంస్థల అంచనా ప్రకారం నేడున్న ఎం.పి. మరియు ఎం.ఎల్.ఎలలో 40% మందిపై హత్య, బలవంతపు సొమ్ము వసూలు, లైంగిక అత్యాచారం లాంటి తీవ్రమైన నేరారోపణలున్నాయి. సత్యమేవజయతి? రాజకీయాలు నేరమయం కావడంతో, ఆదివాసుల మరియు గ్రామీణ పేద రాజకీయ అవకాశాలను స్వచ్ఛంద సేవా సంస్థలాక్రమించాయి. మధ్య భారతం ఒక అద్భుతమైన ప్రతిపాదనతో ముందుకు వచ్చింది. అన్ని రాజకీయాలు పేదలకు వ్యతిరేకం, అవినీతి మయం, నేరమయం. అందువల్ల మనకు రాజకీయాలు లేకుండా ప్రజాస్వామ్యముండవచ్చు. నిజమే, ఆదివాసులు, గ్రామీణపేదలు,నిర్లక్ష్యం చేయబడ్డ సమూహాలు కావడం వల్ల అభిప్రాయాన్ని వెలిబుచ్చలేరు. ఆ బాధ్యత స్వచ్ఛంద సేవా సంస్థలపై పడింది.

స్వాతంత్ర్యోద్యమకాలంలో ఏర్పరచుకున్న జాతి దార్శనికతను మధ్య భారతం నిలబెట్టుకొనడానికి చాలా కష్టంగా ప్రయత్నిస్తుంటే, అటు బెర్లిన్ గోడ కూలింది. 'టైమ్స్' మేగజైన్ "కమ్యూనిజం మరణించిందని" పతాక శీర్షికన ప్రకటించింది. ఫుకు యోను, 'చరిత్ర ముగిసిందని' ప్రకటించాడు.

**'ప్రపంచీకరణ' నేపథ్యంలో దేశాన్ని దర్శించడం**

ఇండియా, మరొక్క మారు, 20 శతాబ్దపు తొలి నాటి పరిస్థితులకు చేరింది. రెండవ ప్రపంచ యుద్ధం తర్వాత అమెరికా సామ్రాజ్యవాద దేశాల నాయకత్వం పొందింది. అయితే అమెరికా కూడ, గతకాలపు బ్రిటన్ వలె ఆర్థికంగా బలహీనంగా వుండి, తనకే బరువైన సైనిక బలంపై ఆధారపడుతున్నది. మరొక్కమారు, సామ్రాజ్యవాద కళ్ళాలు సడలడంతో, భారతదేశం పారిశ్రామిక వేత్తలకు, ద్రవ్య సంస్థలకు తమ కార్యకలాపాల పరిధిని పెంచుకునే అవకాశం కల్గింది. మరిన్ని అణుకేంద్రాలు, గనులు, పరిశ్రమలు, ప్రత్యేక ఆర్థిక మండలాల వ్యాపారంలో పెట్టుబడులపైన ఆధారపడిన 10% ఆర్థికాభివృద్ధి దేశీయ పారిశ్రామిక వేత్తలకు, ద్రవ్య సంస్థలకు, ఒక కొత్త ప్రపంచాన్ని అందించినట్టయింది. వారు ఆ ప్రపంచాన్ని జయించడానికి సిద్ధపడాలి, అంతే వారి కలల నూతన ప్రపంచం ఆదివాసీలను, గ్రామీణ పేదలను జయించడం వలన వాస్తవమవుతుంది. వారు (ఈ పేదలు) ఎక్కడికి పోతారు? సామాజిక ఒడంబడిక మాటేమిటి ? ఈ ప్రశ్నలు మధ్య భారతానికి స్పష్టమయ్యాయి.

ఏమైనా, 'ప్రపంచీకరణ' అనేది 'జాతి అనే భావనను' రద్దు చేస్తుంది. జాతి రాజ్యాలు అనే భావన యింకెంత మాత్రము పనికిరాదు అనే దానిపై ప్రపంచీకరణ పని చేస్తుంది. ఒక వేళ జాతి రాజ్యాలకు యేమైనా ప్రాముఖ్యత వున్నా, అవి భిన్నత్వాన్ని కోల్పోయి ప్రపంచ మార్కెట్ అవసరాలకనుగుణంగా పనిచేస్తాయి. అందువల్ల యింకెంత మాత్రము సామ్రాజ్యవాదులతో అధికారానికై మధ్య భారతంతో కలసి బేరసారాలాడే పారిశ్రామిక, సంపన్న, కులీన వర్గం నేడు లేదు. అందుకు బదులుగా, అధికారంపై అన్ని బేరసారాలు నేడు అంతర్జాతీయ గోదాలో జరుగుతున్నాయి. ఆ బేరసారాలిప్పుడు ఐక్యరాజ్య సమితిలో, ప్రపంచ వాణిజ్య సంస్థల్లో జరిగిన సమావేశాల్లో, ప్రపంచ ఆర్థిక ఫోరంలలో జరుగుతున్నాయి. కాని, మొండి ఆదివాసులు, తమ డిమాండ్లు "జల్, జంగిల్, జమీన్ల"ను మాత్రం వదలడం లేదు. 'ప్రపంచీకరణ' తప్పనిసరి అని అంగీకరించాక, మధ్య భారతానికి ఒక జాతి దర్శనానికి అవసరమైన సైద్ధాంతిక పరికరాలు లేవు. వారి కలల భారతదేశం ఎలా వుంటుంది? తమ కలల భారతదేశాన్ని వాస్తవం చేసుకొనేందుకు వారు చెల్లించాల్సిన తక్షణ మూల్యమెంత?

1995లో జరిగిన ఐక్యరాజ్యసమితి సామాజిక అభివృద్ధిపై ప్రపంచ శిఖరాగ్ర సమావేశం ఒక పెద్దమలుపు. నాటి అమెరికా ఉపాధ్యక్షుడు ఆల్‌గోరే, అమెరికా, మూడవ ప్రపంచ దేశాలకు ఆర్థిక సహాయం, అభివృద్ధి చేయూత స్వచ్ఛంద సేవా సంస్థల ద్వారా అందిస్తుందని, ఆ విధంగా సుపరిపాలన నెలకొల్పుతుందని ప్రకటించాడు. 'సుపరిపాలన' అనేది వలసపాలన కాలంనాటి

'బాధ్యతాయుత ప్రభుత్వం' అనే దానికి జతపరిచారు. ఆదివాసులకు మరియు గ్రామీణ పేదలకు ఆల్‌గోరే, కోపెన్‌హగెన్ సమావేశ నిర్ణయాల వల్ల అందిన ఫలితాలేమిటి? 'చర్చల' భాష భారతదేశంలో మార్పు చెందింది. దేశంలోని స్వచ్ఛంద సేవా సంస్థలకు మరియు ప్రభుత్వేతర సంస్థలకు నిధులకు కొదవలేదు. అంతకన్నా ముఖ్యంగా అవి అంతర్జాతీయ సంస్థలు అభివృద్ధి చేసిన కొత్త సైద్ధాంతిక, భావనాపరమైన వనరులతో "సాధికారిక", "ప్రజాస్వామ్య అభివృద్ధి", 'సుపరిపాలన', 'పౌర సమాజపు పాత్ర' లాంటి వాటితో బలోపేతమయ్యాయి. న్యాయంగా చెప్పాలంటే, చాలా సంస్థలు తమ నిధులను "సామాజిక ఒడంబడిక"ను రక్షించేందుకు వినియోగించాయి. కాని, 'సామాజిక ఒడంబడిక' అనేది ఎప్పుడూ 'ప్రజాస్వామ్య అభివృద్ధి', 'సాధికారత' 'సుపరిపాలన' గురించి కాదు. సామాజిక ఒడంబడిక, స్వయం నిర్ణయాధికారము, సమానత్వం పంపిణీలో సమన్యాయం అధికారంలో భాగస్వామ్యం మరియు సమత, సత్యమేవ జయతే గురించి, అంతేగాని పారదర్శకత గురించికాదు.

మరిన్ని ప్రభుత్వేతర సంస్థలు, మరిన్ని స్వచ్ఛంద సేవా సంస్థలు, వాటికి మరిన్ని నిధులు, మరింత 'సాధికారత' మరియు 'సుపరిపాలన' ఇవన్నీ ఆదివాసులకు, పేదలకు మరింత ప్రాతినిధ్యం యివ్వడంతో సమానం కాదు అదేదైన అంటే దానికి (ఆదివాసులకు, పేదలకు ప్రాతినిధ్యం యివ్వడానికి వ్యతిరేకం. స్వచ్ఛంద సేవా సంస్థలకు, ప్రభుత్వేతర సంస్థలకు మరిన్ని నిధులు సమకూరేకొద్దీ మావోయిస్టుల ప్రభావం మరింత పెరిగింది. అయినా, పై రెండింటి మధ్యన సంబంధాన్ని రుజువు చేసేందుకు, యేసామాజిక సిద్ధాంతాలు యేపరిణామాత్మక, గుణాత్మక పరిశోధన పద్ధతులు లేవు.

ప్రభుత్వేతర సంస్థలు మరియు స్వచ్ఛంద సేవాసంస్థలు, ఆదివాసులు, పేదలు లేవనెత్తిన అన్ని సమస్యలను, అభివృద్ధి పంథా, సాంప్రదాయ నీటి వ్యవస్థలు; భూమి నిర్వహణ, అటవీ రక్షణ, లంచగొండితనం, రాజకీయాలు నేరమయం కావడం లాంటి వాటిని చేపట్టారు. కాని వారు, ఒక ప్రధానమైన సమస్య దగ్గర ఆగిపోయారు. అదే రాజకీయాధికారం. ఆ ఒక్క సమస్యనే మావోయిస్టులు చేపట్టారు. "తాము (మధ్య భారతం) ఆదివాసుల, పేదల పక్షాన వున్నామని చెబుతున్న మాటలకు" ఆదివాసులు, పేదలు విశ్వసించాలని మధ్యభారతం కోరుతుంది. కాని, వారిని నోరులేని సమాజపు చివరి అంచున వున్న వారిగా పరిగణిస్తున్నపుడు అంతేగాక వారెంత మాత్రం ప్రాధాన్యతగల రాజకీయ పౌరులుగా పరిగణించబడినపుడు ఆదివాసులు, పేదలు మధ్య భారతాన్ని యెలా, ఎందుకు విశ్వసించాలి?

అంతేగాక, ఒక జాతి దర్శనం అనేది లేక, మధ్యభారతంలోని చాలా మంది ఆ విశ్వాసం పొందేందుకు ముందుకు రావడం లేదు.

### ఎదురు కాల్పుల మధ్య భారతం ?

తాను ఎల్లప్పుడు పరిగణిస్తున్న మాదిరే, పై సమస్యను, హింస - అహింసల సమస్యగా భారత రాజ్యం పరిగణిస్తున్నది. 'ప్రపంచీకరణ చెందిన, 'ప్రైవేటీకరణ' చెందిన ప్రపంచంలో ప్రభుత్వేతర సంస్థలు పుట్టగొడుగుల్లా విస్తరించిన దేశంలో, భారతరాజ్యం 'దూరదర్శన్' ద్వారా తన ప్రచారాన్ని చేయాల్సిన అవసరం లేదు. రాజ్యపు అభిప్రాయాల్ని ప్రచారం చేయడానికి ఎన్నో ప్రైవేట్ ఏజెన్సీలుండనే వున్నాయి. ఉదాహరణకు "అడకత్తెరలో పోకచెక్క సిద్ధాంతం". ఈ సిద్ధాంతాన్ని ఎన్నో ప్రభుత్వేతర సంస్థలూ, స్వచ్ఛంద సేవా సంస్థలూ బహుళ ప్రచారం చేసాయి. ఉదాహరణకు జనవరి 2005లో 'అబ్జర్వర్ రీసెర్చ్ ఫౌండేషన్' తన 'ఇంటర్నేషనల్ టెర్రరిజం వాచ్ ప్రోగ్రాం' ఆధ్వర్యంలో రెండు రోజుల సెమినార్ "నక్సల్ సవాల్". అనే అంశంపై నిర్వహించింది. దీని పోషకులు గతంలో కాంగ్రెస్, బిజెపి ప్రభుత్వాలలో భాగమైన ప్రసిద్ధి చెందిన జర్నలిస్టులు. పై వర్క్‌షాప్‌లో చర్చించబడిన అంశాలతో వారు, "నక్సల్ సవాల్, కారణాలు, సంబంధాలు మరియు విధాన ప్రత్యామ్నాయాలు" అనే పేరుతో ఒక పుస్తకం ప్రచురించారు. దీని సంపాదకుడు నక్సలిజంపై ప్రత్యేక అధ్యయనం చేస్తున్న వ్యక్తి. అతని అధ్యయనం "టెర్రరిజం, అంతర్గత భద్రత" అనే అంశం కింద వస్తుంది కూడా. ఆ పుస్తకంపై సంక్షిప్త వ్యాఖ్య రాసిన వ్యక్తి జార్ఖండ్ మాజీ గవర్నర్ మరియు సైనిక ప్రధానాధికారి. మావోయిస్టులను టెర్రరిస్టుగా పరిగణించవచ్చునా? లేదా? అనే ప్రశ్నకు తావు లేకుండా అక్కడి చర్చ ప్రణాళిక రూపొందింపబడింది.

మధ్య భారతం తమ చర్చ యే చట్ర పరిధిలో చేయాలో నిర్దేశిస్తే మంచి వనరులున్న సంస్థలు వాటికి మద్దతునిస్తాయి. వాటికి ఎన్నో పరిశోధనా పత్రాలు, ఉన్నతశ్రేణి మీడియా - వీటి నుండి సహకారం అందుతుంది. అయితే ఇవన్నీ 'మేధావుల సంస్థల' ఊహలపై ఆధారపడుతాయి. 'సాల్వాజుడుం'పై 'ఇండిపెండెంట్ సిటిజెన్స్ ఇనిషియేటివ్' నివేదిక "అడకత్తెరలో పోకచెక్క సిద్ధాంతాన్ని" పోలి వుంటుంది. అందులోని సభ్యులు పేరొందిన పౌరులేగాక, కొంతమంది అధికారం వున్న వారికి సన్నిహితులు కూడా. వారి వైఖరి జయప్రకాష్ నారాయణ లేక వి.ఎం. తార్కుండే వైఖరులకు భిన్నమైనది. జె.పి, తార్కుండేలు అహింసపై తీసుకున్న వైఖరులు, స్వాతంత్ర్య పోరాటపు సామాజిక ఒడంబడిక పునాదిగా ఊహించుకొన్న జాతి దర్శనం నుండి ఉత్పన్నమయినవి ఆదార్శనికత మావోయిస్టులను, ఆదివాసులను సమ్మిళితం చేసుకుంది. నేడు, 'అహింస'పై తీసుకున్న వైఖరి ఉద్భవిస్తున్న ప్రపంచ శక్తిగా ఇండియాను భావిస్తూ, 'ప్రపంచీకరణకు' మానవత్వపు ముసుగు అవసరమనే భావనపై-ఆధారపడినది.

స్వచ్ఛంద సేవా సంస్థలకు, వివిధ పరిశోధనా సంస్థలకు, ప్రాజెక్టులకు, అందుతున్న విదేశీ నిధులకు ఆ విదేశీ సహాయ సంస్థలు పెట్టిన నియమ నిబంధనలు ఉదార ప్రజాస్వామ్యం, పార్లమెంటరీ పద్ధతి, న్యాయ నిబంధనలాంటివి పై వైఖరులకు చేర్చబడ్డాయి. దాంతో పై పద్ధతులన్నీ గతంలా ఎన్నో మార్లు ప్రయత్నం చేయబడ్డవేననీ, అదే శబ్దాలుగా అవి విఫలం చెందాయనీ, పార్లమెంట్, న్యాయ వ్యవస్థ, పాలనా వ్యవస్థ సామాజిక ఒడంబడికను ప్రపంచీకరణ అనే గాలిలో వదిలేశాయని మనం చెప్పేందుకు తావెక్కడుంది. ఇక మధ్య భారతం యెలాంటి నూతన భారతీయ దర్శనాన్ని రూపొందించగలదు ?

గతంలో ఎల్లప్పటిలాగే, ఆదివాసులు, గ్రామీణపేదలు తమ సమస్య నీరు, అడవి, భూమి అని పదే పదే చెబుతున్నారు. మావోయిస్టులు, వారి సైద్ధాంతిక, రాజకీయ, సైనికపరమైన లోటుపాట్లు ఎన్ని వున్నను, (అవి చాలా వుండనే వున్నాయి) వారి ఉద్దేశాలేమైనా ఆదివాసీల, గ్రామీణ పేదల తరపున నిలబడ్డారు. 'ప్రపంచీకరణ'కు మానవీయకోణం యివ్వడం సాధ్యమని మధ్యభారతం నమ్ముతుంది. దానికి భిన్నంగా, కళింగనగర్, సింగూర్, నందిగ్రామ్ లాల్‌ఘర్‌లలో కొత్త పోరాటాలు మొదలయ్యాయి. అవి సామాజిక ఒడంబడికపై తిరిగి చర్చలు జరపాలని సవాలు చేస్తున్నాయి. ఈ సవాలుకు నెదుర్కొనడానికి పునఃప్రారంభించిన భావనలు అవసరమవుతున్నాయి. లాల్‌ఘర్‌పై తీసిన ఒక సినిమాలో "మేమూ స్వాతంత్ర్య పోరాటం చేశాం". అని ఒక సంతాల్ యువకుడంటాడు. వాస్తవంలో వారాపోరాటం చేశారు. దానికి మన జవాబేమిటి ? మావోయిస్టులు దుర్మార్గులు అని చెప్పడంతో సరిపోతుందా? సంతాల్ జాతివారు సమాజపు చివరి కొనన వున్నవారని, వారి అవసరాల్ని గురించి చెప్పడానికి మధ్యభారతం అవసరమని చెప్పగలమా?

### భారతదేశ పునాదిలోనే లోపాలున్నాయి

స్వాతంత్ర పోరాటంలో ఏర్పరచుకున్న సామాజిక ఒడంబడిక ఒక అబద్ధ ఆలోచనపై ఏర్పాటు చేసుకున్నది. ఒక ఆధునిక ఉదార ప్రజాస్వామ్యాన్ని, పెట్టుబడిదారి దేశాన్ని వలస లేర్పరుచుకోకుండా నిర్మించుకోవచ్చనే తప్పుడు అవగాహనపై ఆ ఒడంబడిక కుదిరింది. గతంలోగాని, ఇప్పుడుగాని, మరెప్పుడుగాని వలస నేర్పరచుకోకుండా పెట్టుబడిదారీ వ్యవస్థ మనజాలదు. వాటి రూపాలు మారవచ్చు. కొలంబస్ సంపదకోసం సముద్ర ప్రయాణం

◆ లహర్

# బైలడిల్లా పై డేగకన్ను

## ఛిద్రమైపోతున్న ఆదివాసీ జీవితాలు!!

పచ్చని చెట్లు, ఎత్తైన పర్వతాలు, పారే సెలయేర్లు, ఎగిసిపడే జలపాతాలు, వీచే చల్లటి గాలులు, ఆసియాలోనే పెద్దవైన ఇనుప ఖనిజ గనులైన బైలడిల్లా కొండల మాట వినగానే మన మనస్సుల్లో - ఆ చక్కటి దృశ్యం మన కళ్లముందు మెదలాడుతుంది. కాని, ఇవన్నీ గత కాలపు ఇతిహాసంగా, శిలాఫలకాల మీద నమోదైన విషయాలుగా, గుర్తుంచుకోవల్సిన దృశ్యాలుగా మారడం పూర్తయ్యే కాలం ఎంతో కాలం పట్టదు.

అభివృద్ధికి - వినాశనానికి సజీవ సాక్షిగా ఉన్న శంకిని నది - తన అస్థిత్వానే ్న కోల్పోయి - ఒకప్పుడు తేటతెల్లగ పారే నది-నేడు గనుల తవ్వకం మూలంగా కాళకువేర్ (మురికినది)గా మారి బురద గుంటలో ఉన్న ఎర్రనీళ్ల వాగుగా మారింది.

1960 దశకంలో, జపాను సహాయంతో ప్రారంభమైన బైలడిల్లా గనుల తవ్వకం రోజూ దాదాపు ఎనిమిది కోట్ల రూపాయల విలువ చేసే, ఇనుప ఖనిజాన్ని పబ్లిక్ సెక్టర్ అయిన ఎన్ఎండిసి తవ్వి తరలించి జపాను, విశాఖ స్టీల్ ప్లాంట్, ఎస్సార్‌కు అందజేస్తుంది. బైలడిల్లా ఇనుప గనులపై జిందల్, టాటా లాంటి మైనింగ్ మాఫియా అయిన సిబిబి డేగకళ్లు కూడా పడ్డాయి. విలువైన ఈ గనులను దోచుకోవడానికి రాష్ట్ర ప్రభుత్వంతో 96 అవగాహన పత్రాలపై ఒప్పందాలకు రావడం యాదృచ్ఛికం కాదు.

భాజపా నాయకత్వంలోని రాష్ట్ర ప్రభుత్వం రక్షణలో ప్రయోజితమైన, సల్వాజుడుం పాశవిక దమనకాండ బీజాపూర్, దంతేవాడ జిల్లాలో ప్రారంభమైంది. వేలాది పోలీసు, అర్ధసైనిక బలగాల ఇనుప పాదాల మాటున ఈ దమనకాండ, విధ్వంసం కొనసాగింది. పెద్దయెత్తున గ్రామాలను తగులబెట్టి, పంటలను ధ్వంసం చేసి, మహిళలపై అత్యాచారాలు చేస్తూ, ప్రజలను సామూహికంగా హత్య చేయడం, గ్రామాల్లో విధ్వంసం సృష్టించి, ప్రజల్లో భయాందోళనలు సృష్టించి ప్రజలను రాహత్ శిబిరాలకు గెదమడం, అటవీ - ఖనిజ సంపదను అడ్డులేకుండా దోచుకోవడమే - ప్రజలపై - అర్ధసైనిక బలగాల్లో రాక్షస బలాన్నే - సల్వాజుడుం పేరుతో కొనసాగించడంలో ఉన్న నగ్నసత్యం మన ముందు కొనసాగుతున్న సజీవ చిత్రం.

మరోవైపు బైలడిల్లా గనుల తవ్వకం మూలంగా - బస్తర్ అభివృద్ధి పథంలో పురోగమిస్తున్నది. ఆదివాసుల జీవితాలో కొత్త వెలుగు నింపాయని, అందుకే దళారి బూర్జువా పార్టీలైన కాంగ్రెస్, బిజెపి పార్టీలు, మెయిన్ స్ట్రీమ్ మీడియా (ప్రధాన ప్రవంతి ప్రసార సాధనాలు) నిత్యం బస్తర్‌కు మావోయిస్టుల నాయకత్వంలో చెలరేగుతున్న ఆదివాసి పోరాటాన్ని సమూలంగా నిర్మూలించడానికి క్రూర దమనకాండతో పాటు - దల్లీ- రాజ్‌హరా నుండి జగ్దల్‌పూర్ వరకు రైల్వేలైను నిర్మాణం, లోహండిగూడాలో టాటా, నగర్‌నార్‌లో, ఎస్ఎండిసిలో, దుర్లీలో ఎస్సార్ స్టీల్ ప్లాంటు నిర్మాణం, బోద్‌ఘాట్ వద్ద ఇంద్రావతిపై హైడ్రో ఎలక్ట్రికల్ ప్రాజెక్టు నిర్మాణం, మౌలిక సదుపాయాల కోసం రోడ్లు, కమ్యూనికేషన్ అభివృద్ధి చేయాలని, పైలెట్ ప్రాజెక్టుగా ఎంచుకున్న కేంద్ర ప్రభుత్వం బీజాపూర్, దంతేవాడను ఎంచుకొని - అభివృద్ధి కోసం- ఈ రోడ్డు మ్యాప్ (అభివృద్ధి ప్లాన్)ప్రతి రోజూ ప్రచారం చేస్తుంది. ఈ అభివృద్ధితో బస్తర్‌లో పేదతనం, నిరక్షరాశ్యత, నిరుద్యోగం నిర్మూలించబడి, బస్తర్ సర్వోతోముఖాభివృద్ధి జరిగి క్రొత్త ప్రపంచంలోకి అడుగు పెడతారని - ఆదివాసుల అభివృద్ధిని అడ్డుకుంటున్న మావోయిస్టులు 'అభివృద్ధికి వ్యతిరేకులు' అంటూ ముద్రవేసి గేలిచేస్తూ దోపిడి పాలకవర్గాలు, ప్రభుత్వం చెప్పడం చూస్తున్నాము.

### బైలడిల్లా గనుల విస్ఫోటనాల ప్రకంపనలు ఆదివాసీల జీవితాలను ఛిద్రం చేస్తున్నాయి!

బైలడిల్లా ఇనుప గనుల తవ్వకం మూలంగా కిరందుల్, బచేలి, పాడాపూర్, కోడెం, కోడేనార్, మద్దాడ్ గ్రామాలు ప్రత్యక్షంగా ప్రభావితమయ్యాయి. పరోక్షంగా బైలడిల్లా చుట్టుపట్ల 50 గ్రామాలు ప్రభావితమవుతున్నాయి.

కిరందుల్ బచేలి గ్రామాల ఆదివాసులు - తమ పూర్వీకుల భూమి నుండి పూర్తిగా విస్థాపనకు గురయ్యి, చాలామంది కొండలకు దిగువున ఉన్న గ్రామాలకు వలసపోయారు. మరికొందరు గుడివాసులుగా, అర్ధాకలితో కాలే కడుపులతో ఒంటిమీద నిండు బట్ట కూడా కప్పుకోలేక అర్ధనగ్నంగా జీవిస్తున్నారు. భూములు కోల్పోయిన వీరు రోజు కూలీలుగా, మహిళలు ఇంటిలో అంట్లుతోమే పాచి పనిచేసేవారుగా మిలిగిపోయి జీవిస్తున్నారు. ఆదివాసుల అస్థిపంజరాలపై నేడు కిరందుల్, బచేలి టౌన్‌షిప్‌లు, ముంబయి లాంటి మహా నగరం సామ్రాజ్యవాద సంస్కృతి ముఖం మీద పూసుకున్నట్లుగా షాపింగ్ కాంప్లెక్సులు పక్కా రోడ్లు, కాలవలు కళకళలాడుతాయి.

---

చేసిన కాలం నుండి, వలస నేర్పరచుకునే పద్దతులు మారాయి కూడా. ప్రపంచీకరణ మధ్యభారతాన్ని తన స్వంత ప్రజల్ని వలసలుగా మార్చుకోమని బలవంత పెడుతోంది. ఇందులో కొత్తదనమేమీ లేదు. అలాంటిది బ్రిటీష్ పాలనలో కూడా జరిగింది. సిరాజ్ ఉద్ - దౌలా కాలం నాటి నుండి వివిధ నవాబులు, రాజులు, కొంతమంది కులీనులు సామ్రాజ్యవాదులతో చేతులు కలిపి వారు సామ్రాజ్యాన్ని నిరాటంకంగా పాలించేందుకు సహాయం చేశారు. అందుకుగాను, తాము లబ్దిపొందారు. 'భారతదేశం యూరోప్‌కు గొప్ప ప్రయోగశాల' అని జె.ఎస్.మిల్ అన్నాడు. సామ్రాజ్యవాదుల అదృష్టం దెబ్బతిన్నపుడు మధ్య భారతం ఒక వైఖరి నవలంభించక తప్పదు. నేడు జరుగుతున్నదదే. జాతి రాజ్యపు నిర్మాణం. రాజ్యాంగం ఇవి మధ్య భారతం తన ప్రజల్ని వలసలుగా మార్చుకొనేదాన్ని సమర్థించుకొనే ప్రయత్నానికి అడ్డుపడుతుంది. అలాంటప్పుడు మధ్య భారతం ఏం చేయాలి? మరొక స్వాతంత్ర్య పోరాటం ప్రారంభించాలా? కొత్త సామాజిక ఒడంబడికను ఏర్పాటు చేసుకోవాలా? ఇవి క్లిష్టమైన ప్రశ్నలు? వీటికి జవాబివ్వడం కన్నా సామ్రాజ్యవాదుల పదజాలం 'టెర్రరిస్టులపై యుద్ధం' అని, మావోయిస్టులను నిందించడం ఎంత సులువు. ఆ విధంగా దేశానికి కొత్త రూపునివ్వలేని తమ అశక్తతను మరుగుపరుచుకోవచ్చు. అహింసా అనే నైతిక ప్రవాహంపై 'ప్రపంచీకరణను' కొనసాగించడం ఎంత సులువు? మధ్య భారతం ఊహల్లో జీవిస్తున్నది. ఆధునిక భారతదేశానికి పునాదియైన తప్పుడు అవగాహన మాయమైతే? ఆదివాసీలు తమ డిమాండ్లు నీరు, అడవి, భూమిలను వదులుకుంటే?

ప్రజలపై శారీరక, నైతిక, మేధోపరమైన అనేక దాడులు జరుగుతున్నా కూడా, మధ్య భారతంలోని చాలా మంది ప్రచారం చేస్తున్నా, భారతీయులు "అడకత్తెరలో పోకచెక్క సిద్ధాంతాన్ని" అనుమానాస్పదంగా చూడటం, ఆ ప్రజల గొప్పతనమే.

- రాధ డిసౌజ - వెస్ట్ మినిష్టర్ విశ్వవిద్యాలయంలో న్యాయ శాస్త్ర విభాగంలో లీడర్‌గా పనిచేస్తున్నారు. ఈశాన్యం మొదట 'సన్వత'కు 15 డిసెంబర్ 2009లో ప్రచురింపబడ్డది.

బైలడిల్లా గనుల తవ్వకం మూలంగా చుట్టుపక్కల గ్రామాలలో ఆదివాసుల ఆర్థిక, సామాజిక, సాంస్కృతిక జీవనం ధ్వంసమైంది. ప్రతి రోజు కిరందుల్ మెయిల్ మార్కెట్‌లో కూలి కోసం బార్లు తీరి కనబడే యువతీ యువకులు నిత్యం వంటచెరకు, వెదురు, చీపుర్లు టౌన్‌కు మోస్తున్నవారు ఇప్పకల్లు, జీలుగు కల్లు (గోర్గకల్లు) టౌన్‌లో అమ్మడానికి తీసుకెళ్తున్న ఆదివాసులు మనకు రోజూ దర్శనమిస్తారు.

హిరోలి, గుమియపాల్‌ కుట్రేం, పేర్స, ఓడుం, జమల్‌వార్‌, టీకెన్‌పాల్‌, సొంగ్లే, దుగ్గాల్‌, కామ్మేలి, భాంసీ, కడేనార్‌, మద్దాడి గ్రామాల రైతాంగం - ముఖ్యంగా యువతీ యువకులు వ్యవసాయ పనుల కన్నా - కిరందుల్‌, బచేలిలో రోజు కూలి చేయడం లేక కల్లు అమ్మడం చూస్తాం. కిరందుల్‌ దగ్గరి గ్రామాల్లో పంట భూములతో గనుల నుండి ఎర్రమట్టి చేరి భూమి సారం దెబ్బతిన్నది. చుట్టుపక్కల ఇళ్ళ నిర్మాణాలకు, వంటచెరకుకు, భవన నిర్మాణానికి క్వారీలు తవ్వకొని చెట్లు నరకడం మూలంగా కొండలన్నీ బోడిపోయాయి. ఇళ్లలో పలంగులకు, ఫర్నీచర్‌కు- కర్రలు నరికి దొంగ కర్ర అమ్మే మాఫియా కూడా పుట్టుకొచ్చింది.ఆదివాసి యువత పట్టణంలో ఉన్న సామ్రాజ్యవాద సంస్కృతికి బలియై తాగుడుకు అలవాటు కావడం, దొంగతనాలు చేయడం. కొందరు యువతులు నైతికంగా దిగజారడం లాంటి లంపెన్‌ లక్షణాలు అలవర్చుకున్నారు. . ఇప్పటికి కిరందుల్‌, బచ్చేలి పట్టణాలలో ఆదివాసి యువతులను గైర్‌ ఆదివాసులు 'ఓ పీకి' (ఓ పిల్లా) అంటూ జేఇజ్జత్‌గా సంబోధించడం, చదువుకున్న ఆదివాసులు కూడా తలవంచుకొని మౌనంగా చూడటం గమనించవచ్చు. నిజంగా పట్టణ అభివృద్ధి, అక్షరాస్యత పెరిగి ఆదివాసుల ఆత్మగౌరవం కోసం చైతన్యం పెరగడం జరగవలసి ఉండే. కాని, గత 40 సంవత్సరాలుగా బైలడిల్లా గనుల కార్మికుల్లో పనిచేస్తున్న రివిజనిస్టు సిపిఐ ప్రజాస్వామిక చైతన్యం పెంచినది చాలా కొద్దిగా మాత్రమే అని కిరందుల్‌లో ఆదివాసి జీవితాలను గమనిస్తే మనకు కనపడుతుంది.

1970 దశకంలో బైలడిల్లా గనుల్లో క్యాజువల్‌ లేబర్‌ను తొలగించినందుకు వ్యతిరేకంగా ఆదివాసులు, కూలీలు పెద్దయెత్తున తిరుగుబాటు చేశారు. ఆనాటి కాంగ్రెస్‌ ప్రభుత్వం నిరాయుధులైన కూలీలపై నిర్దాక్షిణ్యంగా కాల్పులు జరిపి అనేకమందిని పొట్టన బెట్టుకున్నది. చరిత్రలో 'బైలడిల్లా గోలికాండ్‌గా' (బైలడిల్లా కాల్పులు) ప్రసిద్ధి చెందింది. ఈ సమయంలో బైలడిల్లా గనుల తవ్వకం పనుల నిర్మాణం కోసం అంటే ఎన్‌ఎండిసి (జాతీయ ఖనిజ అభివృద్ధి కార్పొరేషన్‌) పెద్దయెత్తున ఛత్తీస్‌గఢ్‌, ఒడిస్సా, ఆంధ్ర నుండి, స్థానికంగా చుట్టుపక్కల గ్రామాల ఆదివాసులను క్యాజువల్‌ లేబర్‌గా నియమించి, రోడ్లు, గనుల ప్లాంటు నిర్మాణం, అధికారుల నివాసాలు, ఆఫీసు భవనాలు నిర్మించింది. ఈ నిర్మాణ పనులు పూర్తయ్యి ఆ గనుల తవ్వకం- ఉత్పత్తి ప్రారంభమైన పిదప పెద్దయెత్తున క్యాజువల్‌ లేబర్‌ను తొలగించడం వీరికి ఏమాత్రం ఆల్టర్‌నేట్‌గా పని, వసతి కల్పించక 'హైర్‌ అండ్‌ ఫైర్‌' పద్ధతుల్లో కూలీలను తొలగించింది. దీనిలో పెద్దయెత్తున కూలీలు పోలీసులతో తలపడ్డారు.

ఈగనుల తవ్వకం పునాదుల్లో ఆదివాసి మహిళల - దగాపడ్డ చెల్లెండ్ల - మానప్రాణాలు, ఆత్మగౌరవం అహుతి అయ్యాయి. అనాటి మధ్యప్రదేశ్‌ రాష్ట్రంలో అవి భక్త బస్తర్‌ జిల్లా కలెక్టర్‌గా బిడి శర్మ ఉన్నాడు. ఈ గనుల తవ్వకంలో కూలీలుగా వచ్చిన చాలా మంది ఆదివాసి యువతులు, వాళ్లు కోరుకోని, వారి సంపదను దోచుకునే ఈ గనుల తవ్వకం బుల్‌డోజర్లు- అభివృద్ధి తమ జీవితాలనే వినాశనం చేస్తుందని ఊహించలేదు. డజన్ల కొలది యువతులు పెళ్లికాక ముందు తల్లులు కావడం, కొందరిని పెళ్ళి చేసుకుంటామని నమ్మించి గర్భవతులను చేసి వదలిపెట్టిన దగాపడ్డ చెల్లెండ్లుగా - డజన్ల కొలది యువతులు మిగిలిపోయారు. వీరి జీవితాలు వాస్తవంగా సంతాల్‌ పరగణా (నేటి ఝార్ఖండ్‌) జిల్లాలమీదుగా హౌరా-ముంబయి రైల్వే లైన్‌ నిర్మాణం, సాక్చీలో టాటా స్టీల్‌ ప్లాంట్‌ నిర్మాణం తర్వాత ఈ అభివృద్ధి సంతాల్‌ ఆదివాసుల జీవితాలను ఎలా చిన్నాభిన్నం చేసిందీ - కలకత్తా నగరంలో ఆకాశాన్నంటే అంతస్తుల మేడల నిర్మాణంలో ఇటుకల బట్టీలతో తమ నెత్తురు, చెమటల చుక్కలు ఆత్మగౌరవం ఎలా ఆహుతి అయ్యాయి, ఎలా ఛిద్రం చేశాయో- ప్రఖ్యాత రచయిత్రి మహాశ్వేతాదేవి రచించిన 'ఈంటకే ఊపర్‌ ఈంట్‌' (ఇటుకపై ఇటుక) కథల సంకలనం - మనకళ్ల ముందు కదలాడుతుంది. సామ్రాజ్యవాద, దళారి పాలకవర్గాల భూస్వామ్య వర్గాల ప్రభుత్వం-అభివృద్ధి, సంక్షేమ పథకాలు - ఎంత బూటకమో - సాధారణ పీడిత ప్రజల, ముఖ్యంగా ఆదివాసులు తమ ఇళ్లు, భూములు సంపదను కోల్పోయి తమ ఏరియాలోనే నిర్వాసితులుగా, జీవితమంత ధ్వంసమైన వైనాన్ని చూడవచ్చు.

బైలడిల్లాలో దగాపడ్డ చెల్లెండ్ల కోసం - దంతెవాడలో-'నారీ నికేతన్‌' పేరుతో ఆశ్రయం కల్పించారు. ఓ దశాబ్దం గడిచిన పిదప- అది మూసివేయబడ్డది. చాలామంది మహిళలు తమ పిల్లలను తీసుకొని బస్తీలో గుడిసెలు వేసుకొని కూలిచేస్తూ జీవితం గడుపుతున్నారు. మరికొందరు అనారోగ్యంతో చనిపోయారు. వారే కాకుండా బైలడిల్లా చుట్టుపక్క గ్రామాల యువతులు కూలీచేస్తూ, కల్లు అమ్ముతూ వారాల తరబడి గ్రామాలను కుటుంబాలను వదలి కిరందుల్‌, బచేలి టౌన్‌లో ఉండటం, నైతికంగా దిగజారి పెళ్లికాక ముందే తల్లులు కావడం గైర్‌ ఆదివాసులతో వెళ్లిపోతుండడం,వారు ఆ యువతులను ఉపయోగించుకొని వదిలివేయడం మూలంగా ఆదివాసుల సామాజిక సాంస్కృతిక జీవనంపై దుష్ప్రభావం పడింది.

చుట్టుపక్కల ఆదివాసులు తమ వ్యవసాయం పనులు విడిచి కూలీలు చేయడం, వెదురు లేక వంట కొరకు కర్రలు మోయడం, కల్లు అమ్మడమే రోజు పనిగా స్వీకరించారు. ప్రభుత్వం, దోపిడి పాలకవర్గాలు ఆదివాసులు రైతాంగ జీవితంకంటే నిర్వాశితుల్లాగా మార్చి వారిలో మానవ విలువలను మంట గలపడానికి అభివృద్ధి పేరున కుట్రపూరితమైన ప్రయత్నాలు చేస్తున్నది.

ఎన్‌ఎండిసి, ఎస్సార్‌, టాటా ఆదివాసులను అభివృద్ధి చేయడం కల్ల!

వారి సంపదను దోచుకొని వారి జీవితాలను నాశనం చేయడం నిజం!!

ప్రతి రోజు 8 కోట్ల విలువ చేసే ఇనుప ఖనిజాన్ని సంవత్సరానికి 30 మిలియన్‌ టన్నులు త్రవ్వి దోచుకెళుతున్న దళారి బూర్జువా భూస్వామ్య ప్రభుత్వపు ఎన్‌ఎండిసి గత సంవత్సరం (2008లో) వంద కోట్ల నికర లాభం గడించింది. నక్సలైట్లు బార్‌ బార్‌ ఇచ్చే బంద్‌లు, రైల్వే ట్రాక్‌ ధ్వంసం మూలంగా ఉత్పత్తి దెబ్బతిన్నది. అంటున్న ప్రభుత్వం, ఎన్‌ఎండిసి ఆశ్చర్యకరంగా వందకోట్ల లాభం గడించినట్లు ప్రకటించింది. దేశంలో నవరత్న కంపెనీ (లాభాలు గడిస్తున్న) పిఎస్‌యులో ఒకటిగా పేరుపొందిన ఎన్‌ఎండిసి ఈ 2008లో కార్మికులకు - నక్సలైట్లు విధ్వంసానికి పాల్పడినప్పటికి ఉత్పత్తి దెబ్బతినకుండా పనిచేసి లాభాలు పండించినందుకు పరిహారంగా 25 గ్రాముల 'బంగారపు బిళ్లలు' (సోనా కా శిక్కా) అప్పటి ఉక్కు మంత్రి రామ్‌విలాస్‌ పాశ్వాన్‌ అక్టోబర్‌ 2008లో కార్మికులకు అందజేసి వెళ్లాడు.

గత సంవత్సరం క్షేత్రీయ వికాస్‌ నిధి (ప్రాంతీయ అభివృద్ధి నిధి) పేరుతో ఎన్‌ఎండిసి మూడు కోట్ల నిధులను (ఒక రోజు ఇనుప ఖనిజం విలువలో మూడవ వంతు డబ్బులు) మంజూరు చేసింది. అలాగే జగ్దల్‌పూర్‌ మెడికల్‌ కాలేజీకి కొన్ని భవన నిర్మాణాలు కట్టడానికి ముఖ్యంగా చుట్టుపక్కల 38 గ్రామాలను దత్తత తీసుకొని మౌలిక వసతులను అభివృద్ధి చేస్తామని ప్రకటించింది. బైలడిల్లా పడమరలో ఉన్న గంగలూరు నుండి బీజాపూర్‌ మధ్యన ఉన్న 23 కిలోమీటర్ల సిసి రోడ్డు నిర్మాణానికి 15 కోట్లు, కిరందుల్‌ నుండి ఆరన్‌పూర్‌ జేగుర్‌గుండా రోడ్డు నిర్మాణానికి నాలుగున్నర కోట్ల రూపాయలు ఎన్‌ఎండిసి ఖర్చు చేస్తున్నది.

స్థానిక యువకులకు ఎన్‌ఎండిసిలో నౌకరి కల్పిస్తామంటూ కౌశల్‌ వికాస్‌ (స్కిల్‌ అభివృద్ధి) శిక్షణ ఇస్తుంది. రైతుల సంక్షేమం పట్టించుకున్నామనే నెపంతో గ్రామాల్లో రైతులకు తూములు ఇవ్వడం, బోరింగ్‌లు వేయడం,

బాలబాలికలకు స్కూల్ డ్రెస్సులు, ఆశ్రమ బాలికలకు సైకిళ్లు, స్కూళ్లలో టీవీలు ఇవ్వడం, కమ్యూనిటి హాళ్లు, షాపింగ్ కాంప్లెక్సులు, ఆటలకోసం ఖేల్ పరిసర్ నిర్మాణం, సల్వాజుడుం రహత్ శిబిరలలో షెడ్‌ల (ఇళ్ల నిర్మాణం) చేపట్టింది.

పశ్చిమ బెంగాల్‌లోని పురులియా జిల్లా కేంద్రంగా పనిచేస్తున్న 'షామిత్‌మత్' అనే ఎన్‌జిఒకు కూడా తన క్షేత్రియ వికాస్ నిధుల్లో కొంత డబ్బు ఇచ్చి గ్రామాల్లో అభివృద్ధి కార్యక్రమాలు కొనసాగించడానికి కృషి చేస్తున్నది. అలాగే, బస్తీలో ఉన్న ఆదివాసీ బాలబాలికలను స్కూలుకెళ్లడానికి ప్రోత్సహించడానికి 'సూర్యా ఫౌండేషన్' పనిచేస్తున్నది. ఇందులో సామాజిక కార్యకర్తలుగా ప్రధానంగా చదువుకున్న నిరుద్యోగ కోయ ఆదివాసి యువకులను ఎన్నుకుంటున్నారు.

అలాగే దళారి నిరంకుశ బూర్జువా (సిబిబి) అయిన ఎస్సార్ కూడా ఎన్‌ఎండిసి కన్నా వెనుకబడి లేనంటూ, రైతులకు ఖాద్-బీజ్ (ఎరువులు -విత్తనాలు) ఇస్తాం. పంపు సెట్లతో కూరగాయల పంటలు వేయడానికి సహాయం చేస్తాం అంటూ కమ్యూనిటి హాల్స్, పాల్‌నార్‌లో షాపింగ్ కాంప్లెక్స్ నిర్మాణం చేపట్టింది. సల్వాజుడుం రహత్ శిబిరాల్లో మౌలిక సదుపాయాల అభివృద్ధికి కోట్లాదిగా ఖర్చు చేస్తున్నది.అలాగే ఫిబ్రవరి 2009లో దంతెవాడ విధాయక్ భీమా మండలి నాయకత్వంలో 'కన్యాధన్‌యోజన'లో సామూహిక పెళ్లిళ్లు చేశారు. దంతెవాడ జిల్లాలో ఉన్న ఏడు బ్లాకుల్లోకి అంగన్‌బాడి కార్యకర్తలకు, పంచాయితీ సచివ్‌లకు - పెళ్లిల కోసం జంటలు తీసుకరావాలని, తీసుకొచ్చిన వారికి ప్రోత్సాహకాలు ఇస్తామని చెప్పి, వెయ్యి జంటల పెళ్లిళ్లు చేశారు. జంటకు కొత్త బట్టలు, అయిదువేల రూపాయలనగదు-ఎస్సార్ ఇచ్చింది.

అలాగే రాష్ట్ర ప్రభుత్వం బస్తర్ వికాస్ ప్రాదీకరణ్ (బస్తర్ అభివృద్ధి అధారిటి) పేరుతో కొన్ని బస్తర్ అభివృద్ధికి ప్రత్యేకమైన నిధులు, పైలెట్ ప్రాజెక్టు యోజన నిధులు ఖర్చు చేస్తున్నది. తన జిల్లా యంత్రాంగంతో బాతుల, మేకల, కోళ్ల పెంపకం, గ్రామాలలో సిసి రోడ్లు, ప్రధానమంత్రి సడక్ యోజన, అటల్ చబూతర్, ఫలియాల నిర్మాణాల్లాంటి పనులే గాక మాత శిశు సంరక్షణ, కుపోషణ్ పీడిత పిల్లలకు పౌష్టిక ఆహారం, మహిళలకు సాధికారిత పేరిట 'స్వయం సమూహ్' (సెల్ఫ్ హెల్ప్ గ్రూపు ధనలక్ష్మి యోజన, 'నరేగా' (గ్రామీణ రోజ్‌గార్ గ్యారెంటి యోజన) అమలు చేయడానికి తీవ్ర ప్రయత్నాలు చేస్తున్నది. బిపిఎల్ కుటుంబాలకు రూపాయికి కిలో బియ్యం, 2 రూ.ల కిలో బియ్యం పథకం పిడిఎస్ పద్ధతిలో అమలు కొనసాగుతున్నది.

బైలడిల్లా గనుల తవ్వకం మూలంగా భూమి వికాసీకరణ, అడవి విధ్వంసం కావడం, నీరు కలుషితం కావడం, ఒక అధ్యయనం ప్రకారం నీటిలో ఐరన్ ఎక్కువ ఉండటం , అడవులు విపరీతంగా నరకడం, భూమిపై పొర కోసుకుపోవడం మూలంగా భూమిలో సారం దెబ్బతిన్నది. పండిన పంటలోనే అయోడిన్ శాతం తగ్గిపోవడంతో మానసిక అభివృద్ధి మందగించడం, చెవిటివాళ్లు కావడం కూడా ఎక్కువగానే జరుగుతున్నది. ప్రతి సంవత్సరం వర్షాకాలం వాగుల్లో, తోగుల్లో, నదుల్లో చెలిమ తవ్వుకున్న భూమి, ఇసుకంతా కలుషితం కావడం మూలంగా తేట నీళ్లు కాకుండా, కలుషితమైన నీరు వస్తుంది. ఈ కలుషిత నీరు తాగడం మూలంగా ఉల్టీ-దస్త్(డయేరియా)కుగురై, మలేరియా రోగం, విష జ్వరాల భారినపడి డజన్ల కొలది మహిళలు, పిల్లలు, వృద్ధులు చనిపోతున్నారు. శంకిని నది పూర్తిగా కలుషితమై, ప్రతి రోజు తవ్విన ఇనుప ఖనిజాన్ని కడిగిన మురుగు నీరు పారడం మూలంగా ప్రజలు దీన్నే లాల్‌నది (ఎర్రనీటి నది) అని పిలుస్తున్నారు. కిరందుల్ నుండి దంతెవాడ వరకు ఉన్న 50 కి.మీ పరిధిలో ఈ నదిపై ఆధారపడి జీవిస్తున్న ప్రజలు కలుషితమైన నీరు తాగడం మూలంగా వివిధ రకాల జబ్బుల పాలవుతున్నారు. స్వచ్ఛమైన తాగునీరు, ప్రజా ఆరోగ్యం పట్టించుకునే చికిత్స సౌకర్యం ప్రభుత్వం, చాలా నామమాత్రంగా పట్టించుకుంటున్నది. ఎన్‌ఎండిసి, తన హాస్పిటల్‌లో లేక అపోలో ఆసుపత్రిలో కాంట్రాక్టు పద్ధతిలో గని కార్మికుల సౌకర్యం కోసం ఓ శాఖను బచేలిలో ప్రారంభించినా, ఇందులో స్థానిక ఆదివాసులకు చికిత్స చేయకుండా హాస్పిటల్ యాజమాన్యం వెళ్లగొట్టిన ఘటనలు కోకొల్లలు. కాని, ప్రభుత్వం, ఎన్‌ఎండిసి, ప్రైవేట్ ఎస్సార్ కంపెనీ, ప్రజల అభివృద్ధికి కట్టుబడి ఉన్నాము అంటూ ఊదరగొడుతూ ప్రచారం చేస్తున్నాయి.

'షామిత్ మత్' లాంటి ఎన్‌జిఒ సంస్థ ఒక అంబులెన్స్ కొందరు ఆరోగ్య కార్యకర్తలను తిప్పుతూ, మందులు ఇవ్వడం, అలాగే బైలడిల్లా చుట్టుపక్కల గల 32 గ్రామాలను దత్తత తీసుకొని వ్యవసాయ అభివృద్ధి, చేపల పెంపకం, కూరగాయల పెంపకం, గ్రామాల్లో పారిశుధ్యం చేస్తామంటూ అటు ప్రభుత్వంతో, ఇటు ఎన్‌ఎండిసితో, విదేశీ సంస్థలతో ఫండ్స్ తీసుకొని గ్రామాల్లోకి చొచ్చుకొని వచ్చి పని చేయడానికి తీవ్ర ప్రయత్నాలు చేస్తుంది.

ప్రభుత్వం, ఎన్‌ఎండిసీ, ఎస్సార్, ఎన్‌జిఓ ద్వారా ప్రజల సంక్షేమ కార్యక్రమాలు, అభివృద్ధి యోజనలు అమలు చేస్తూ దోపిడి పాలవర్గాలు ఎల్‌ఐసి యోజనలో భాగంగా దళారి దోపిడి పాలకవర్గాలు కొనసాగిస్తున్న వినాశకరమైన, క్రూరమైన నిర్బంధకాండను, రాజ్యం చేసే పౌరహక్కుల కాలరాచివేతను మరుగుపరిచేందుకు, అటవి, ఖనిజ సంపదను దోచుకోవడానికి, ప్రజల జీవనాధారమైన భూమిని ఆక్రమించి, నీటిని కాలుష్యం చేస్తున్న పాలకవర్గాల కుట్రలకు సాధికారిత కల్పించటానికి ఈ అభివృద్ధి సంస్కరణ కార్యక్రమాల లక్ష్యం. నేడు బైలాడిల్లాలోని డిపాజిట్ 5వద్ద, హిల్‌టాప్ (ఆకాశ్ నగర్) వద్ద సిఆర్‌పిఎఫ్‌కి చెందిన బెటాలియన్ బలగాలు మైన్స్‌ను పహారా కాస్తున్నాయి. ఇవి సిఐఎస్‌ఎఫ్‌కు చెందిన బెటాలియన్, డిఏఎఫ్, సిఏఎఫ్‌కు చెందిన బలగాలకు అదనంగా ఉన్నాయి. నిరంతరం విప్లవోద్యమాన్ని అణచడం కోసం సిఆర్‌పిఎఫ్, డిఏఎఫ్,ఎస్‌పిఒ, కోయ కమాండోల కూంబింగ్, బూటకపు ఎన్‌కౌంటర్లు, అరెస్టులు కొనసాగుతున్నాయి. ప్రజలపై క్రూర నిర్బంధం, గనుల తవ్వకం మూలంగా ఆదివాసుల జీవితాలు ఛిద్రమై పోయాయి. అందుకని దోపిడి పాలకవర్గాలు కాలిన శరీరపు గాయానికి మలం పూసే (హీలింగ్ టచ్) కార్యక్రమాలే ఈ అభివృద్ధి సంక్షేమ యోజనల వెనుక దాగి ఉన్న వాస్తవం. నిజమైన లక్ష్యం మాత్రం - పెంపొందుతున్న విప్లవోద్యమాన్ని సమూలంగా నిర్మూలించడమే.

కిరందుల్ చుట్టుపక్కల మన ప్రజాసంఘాలు బలోపేతం కావడం, ప్రజలకు విప్లవ రాజకీయాలు బోధిస్తూ జల్, జంగల్, జమీన్‌పై ఆదివాసులకే అధికారం ఉండాలి. 'ఎస్సార్, టాటాలను తన్ని తరమండి' అనే నినాదం దండకారణ్యాన్ని విముక్తి చేయాలనే లక్ష్యంతో విప్లవోద్యమం పురోగమిస్తున్నది. ప్రజలు, పిఎల్‌జిఏ గెరిల్లాలు దళారి బూర్జువా అయిన ఎస్సార్‌కు వ్యతిరేకంగా పోరాటం, దాడుల మూలంగా రోజుకు 4 కోట్ల రూపాయల విలువ చేసే ఇనుప ఖనిజపు చూర్ణం కిరందుల్ నుండి విశాఖపట్నం వరకు 265 కి.మీ పైపులైను ద్వారా తీసుకెళుతున్నది. మే 20,2009న విధ్వంసం చేయడం, అలాగే జూన్ మొదటి వారంలో ఒరిస్సాలోని మల్కన్‌గిరి జిల్లాలోని చిత్రకొండ వద్ద కూడా ధ్వంసం చేయడం మూలంగా గత నాలుగు నెలల కాలంనుండి ఎస్సార్ పైపులైను బంద్ అయ్యింది. దళారి బూర్జువాకు వందలాది కోట్ల రూపాయల నష్టం వాటిల్లడం మూలంగా దుర్గిలో స్థాపించ తలపెట్టిన స్టీల్ ప్లాంట్ ఏర్పాటును పునారాలోచించుకొని ఇప్పటివరకు నిర్మాణం పనులు ప్రారంభించలేదు. పైపులైనులో మాల్‌డులాయి(చూర్ణం తీసుకెళ్లడం) ఆగిపోవడంతో కిరందుల్ పైపులైన్ ప్లాంట్ పనులు తాత్కాలికంగా ఆగాయి. వాస్తవంగా ఇది ఎస్సార్‌కు వ్యతిరేకంగా ప్రజా పోరాటం విజయంగా చెప్పుకోవచ్చు.

అలాగే ఎన్‌ఎండిసి, ఎస్సార్, శామిత్ మత్ లాంటి ఎన్‌జిఒ చేసే అభివృద్ధి కార్యక్రమాలను ప్రజలు, ప్రజాసంగాలు అడ్డుకుంటున్నాయి. మా సంక్షేమం, అభివృద్ధి పేరుతో మా జీవనాధారమైన భూమి, అడవి, నీళ్లు, మీ నుండి

**వ్యాసం**

◆ వరవరరావు

# గ్రీన్‌హంట్ ఆపరేషన్ - గ్రీన్‌రూంలో చర్చల రిహార్సల్

గత ముప్పై సంవత్సరాలుగా కలకత్తాకు ఎన్నోసార్లు వెళ్లాను. 1985-86లో కలకత్తాలోను, బెంగాల్‌లోను అఖిల భారత విప్లవ సాంస్కృతిక సమితి కార్యక్రమాల్లో భాగంగా పశ్చిమ బెంగాల్‌లో చాల జిల్లాలు తిరిగాను. 1981లో ఎఐఎల్‌ఆర్‌సి ఇక్కడే ఏర్పడింది. అప్పుడు ఇక్కడి విప్లవ రచయితల, బుద్ధిజీవుల, కళాకారుల సంఘం మహాసభల్లో పాల్గొనడానికి కె.వి.ఆర్. తోపాటు సుందరబన్స్‌కు కూడా వెళ్లాను. 1992లోనయితే ఆలిండియా పీపుల్స్ రెసిస్టెన్స్ ఫోరం ఏర్పడిన సందర్భంగా కలకత్తాలో గోరుమాధవరావు గారితోపాటు మూడు నాలుగు నెలలున్నాను.

ఈ ముప్పై సంవత్సరాలు గానూ ఇక్కడ వామపక్ష ప్రభుత్వమే ఉన్నది. కాని ఈసారి మూడురోజుల్లో అర్థమయినంత లోతుగా నాకు వామపక్ష ప్రభుత్వ స్వభావం ఇదివరకెన్నడూ అర్థం కాలేదని ఒప్పుకోవాలి. నందిగ్రామ్ మారణకాండ - ప్రతిఘటన సందర్భంగా వెళ్లాను. స్వయంగా వెళ్లి అక్కడి బాధితులను కలిసాను. అప్పటికిప్పటికీ ఈ మధ్యకాలంలో మళ్లీ గెలిపించిన 'ప్రజాస్వామ్య' ఎన్నికల వలన వచ్చిన అధికారం ఈ ప్రభుత్వం ఎంతగా దుర్వినియోగం చేస్తున్నదోననిపించింది.

జాదవ్‌పూర్ యూనివర్సిటీ తులనాత్మక సాహిత్యాల శాఖ, మార్క్సిస్ట్ అధ్యయన కేంద్రం కలిసి సాహిత్యం - కళలు - సంస్కృతిపై జాతీయ సదస్సు నిర్వహిస్తూ నన్ను తెలుగు సాహిత్యంపై నక్సల్బరీ ప్రభావం గురించి మాట్లాడడానికి పిలిచారు. సదస్సు ఫిబ్రవరి 25, 26 తేదీల్లో జరిగింది. ఫిబ్రవరి 25న జాదవ్‌పూర్ యూనివర్సిటీ టీచర్స్ యూనియన్ ఎన్నికల్లో సిపిఎం బలపరచిన అధ్యాపకులే గెలిచారు. ఫిబ్రవరి 26న యూనివర్సిటీ ఆవరణ అంతా విద్యార్థుల హోలీ-కోలాహలంతో ఎంతో సందడిగా ఉంది.

కాని 24న ఈ క్యాంపస్‌లో అడుగుపెట్టిన నాడే నా చేతికి ఒక విద్యార్థి ఇచ్చిన పిటిషన్ కాపీ నా వెన్నులో చలి పుట్టించింది. అది ఆయన రాష్ట్ర మానవ హక్కుల సంఘానికి చేసిన ఫిర్యాదు. అభిజ్ఞాన్ సర్కార్ అనే ఆ విద్యార్థి ఈ యూనివర్సిటీలో మెటలర్జికల్ అండ్ మెటీరియల్ ఇంజనీరింగ్‌లో పిహెచ్‌డి చేస్తున్నాడు. సిఎస్ఐఆర్ (కౌన్సిల్ ఫర్ సైంటిఫిక్ అండ్ ఇండస్ట్రియల్ రీసెర్చ్) వాళ్ల పూసా (ఢిల్లీ) లో నిర్వహిస్తున్న ఇంటర్వ్యూకి వెళ్లే రోజు (ఫిబ్రవరి 2, 2010) న ఆయనను, మరో ఇంజనీరింగ్ విద్యార్థితో పాటు అసన్‌సోల్ రైల్వేస్టేషన్‌లో స్లీపర్ కోచ్ నుంచి దొంగలు అనే నెపం పెట్టి ఎవరో మఫ్టీలో ఉన్న వ్యక్తులు బోగీ నుంచి దించి ఎత్తుకుపోయారు. వ్యాన్‌లో వేసుకున్న దగ్గర నుంచీ కళ్లకు గంతలు కట్టి, లాఠీలతోనూ రైఫిల్ బట్స్‌తోనూ, బూట్ల కింద హింసిస్తూ వాళ్లు తమను తాము బీహార్ పోలీసులుగా పరిచయం చేసుకున్నప్పటికీ 3వ తేదీ రాత్రి తిరిగి ఆ ఇద్దరినీ విమానం టికెట్లతోపాటు కలకత్తా విమానాశ్రయంలో వదిలినపుడు సుస్పష్టమైన విషయం వాళ్లు కలకత్తా పోలీసులేననేది. ఈ ఇరవై నాలుగు గంటలూ ఈ ఇద్దరినీ మానసికంగా భయభీతావహుల్ని చేసారు. జార్ఖండ్ అడవుల్లో ఎన్‌కౌంటర్ చేస్తామన్నారు. ఇదంతా ఏ అనుమానంతోనంటే అభిజ్ఞాన్ సర్కార్ 'టువర్డ్స్ న్యూ డాన్' అనే పత్రికకు ప్రచురణకర్త, సంపాదకుడు. ఇది రెండు సంవత్సరాలుగా ద్వై మాసిక పత్రికగా వస్తున్నది. ఇందులో యూనివర్సిటీ అధ్యాపకులు, విద్యార్థులు కూడ రాస్తూ ఉంటారు. ఆ పత్రిక చెప్పుకున్నట్లుగా అది ప్రజల మరో గొంతు. అదీ అతడు చేసిన నేరం. రెండో విద్యార్థి (అభిజ్ఞాన్ సర్కార్ మానవ హక్కుల సంఘానికి కూడ అతని పేరు చెప్పలేదు. అతడు సిఎస్ఐఆర్ ఫెలోషిప్‌కు ఎన్నికయ్యాడు కూడ) ఇతనితో పాటు ప్రయాణం చేసాడు గనుక ఈ అరెస్టు, మానసిక క్షోభ అంతా అనుభవించవలసి వచ్చింది. అభిజ్ఞాన్ సర్కార్ అతనితోపాటు ప్రయాణం చేసాడు గనుక బతికిపోయాడు. రైలు ప్రయాణం తప్పినా ఇద్దరూ విమానంలో ఢిల్లీకి వెళ్లి ఇంటర్వ్యూకి హాజరయ్యారు.

ఇది సుఖాంతం అనుకుందామా? ఆంధ్రప్రదేశ్‌లో గులాం రసూల్, విజయప్రసాద్‌ల వలె 'ఎన్‌కౌంటర్' కానందుకు బెంగాల్‌లో ఆలస్యంగానైనా న్యాయం లభించిందనుకుందామా? ఆంధ్రప్రదేశ్‌లో

---

గుంజుకోవడమే మా లక్ష్యమని, మీ వికాస్ పనులు, తూములు, టివి సెట్లు, పంపు సెట్లు, కమ్యూనిటి హాళ్లు మాకొద్దని వ్యతిరేకిస్తూ గ్రామాలకు రానివ్వడం లేదు.

బైలడిల్లా ఇనుప గనుల తవ్వకం చుట్టుపక్కల ఆదివాసుల జీవితాలను నాశనం చేసినది. ముఖ్యంగా ఆదివాసి మహిళల జీవితాలను ఛిద్రం చేసింది. సామాజికంగా, సాంస్కృతికంగా మానవ విలువలను దెబ్బతీసింది. భూమిని, అడవి సంపదను, జీవనాధారాన్ని కోల్పోయి, తమ కాళ్లపై ఆధారపడి వ్యవసాయం చేస్తూ జీవించకుండా కూలీలుగా మార్చింది. జీవితాల్లో చిచ్చు రేపి నాశనం చేసింది. బైలడిల్లా ఇనుప గనుల తవ్వకం నిజంగా ఆదివాసుల గుండెల్లో గునపాలను దించింది. జీవితాలను ఛిద్రంచేసింది. దోపిడి పాలకవర్గాల సామ్రాజ్యవాద, బహుళజాతి సంస్థలైన టాటా, ఎస్సార్,జిందాల్ లాంటి దళారి బూర్జువాల ప్రయోజనాలకై ప్రకృతి సంపదను, మానవ వనరులను దోచుకునే అభివృద్ధి మా కొద్దు దీర్ఘకాలిక ప్రజాయుద్ధ పంథాల్లో గ్రామ గ్రామాన జనతన సర్కార్‌లను (విప్లవ ప్రజా ప్రభుత్వాలను) ఏర్పరచుకుంటూ మా అభివృద్ధిని మేమే చూసుకుంటాము. ప్రజా స్వావలంబన ఆర్థిక వ్యవస్థను ఏర్పరచుకుంటాం, అభివృద్ధి పరచుకుంటామని రైతాంగం క్రూరమైన నిర్బంధకాండను ఎదుర్కొంటూ పోరాడుతున్నారు.

బస్తర్‌ను దోచే టాటా ఎస్సార్‌ను పారదోలండి!
పేద ప్రజల కన్నీళ్లు తాగే మైనింగ్ మాఫియాను
శంకిని నది తేట నీళ్లని
మురికి గుంటగా - ఎర్రవాగుగా మార్చిన
మన జీవితాలను నాశనం చేసిన
మన అక్కా చెల్లెండ్ల జీవితాలను
ఛిద్రం చేసిన దోపిడి తోడేళ్లను
బస్తర్ హద్దుల నుండి గెదమండి!
మన జీవితాలను హరించే-
కోబ్రా,కోయ కమాండోలను ఎదిరించండి,మట్టికరిపించండి!
ప్రజాయుద్ధ పథంలో పయనించండి
దండకారణ్య విముక్తి బావుటాన్ని ఎగురవేయండి
అనే గీతం బైలడిల్లా శిఖరాన ఉన్న నందరాజ్ మెట్టనుండి-
లక్షలాది పీడిత గొంతులు గొంతెత్తి పాడుతున్నాయి.
దేశ విముక్తికి స్ఫూర్తి అవుతున్నాయి.!

*

జర్నలిస్టుతో దొరికినందుకు మరొక అమాయకుడు ఎన్‌కౌంటర్ అయినట్లుగా కాకుండా బెంగాల్‌లో అమాయకునితో దొరికినందుకు ఎడిటర్ ఎన్‌కౌంటర్ కాలేదు కదా అని సమర్థిద్దామా?

ఈ విద్యార్థుల ఇరవై నాలుగు గంటల పీడకలల పర్యవసానం ఏం కాబోతున్నది?

అదే 24 సాయంత్రం కలకత్తా యూనివర్సిటీ హాల్‌లో స్వపన్‌దాస్ గుప్తా సంస్మరణ సభ జరిగింది. స్వపన్ దాస్ గుప్తా బెంగాలీ పీపుల్స్ మార్చ్ సంపాదకుడు. 59 సంవత్సరాల వయస్సు. బెంగాలీ పీపుల్స్ మార్చ్ రిజిస్టర్డ్ పత్రిక. ఎన్నడూ నిషేధానికి గురికాలేదు. అయినా స్వపన్‌దాస్ గుప్తాను అక్టోబర్‌లో యుఎపిఎ కింద అరెస్ట్ చేసే నాటికి గోవిందన్ కుట్టీ (కేరళ) విడుదలయి ఇంగ్లిష్ పీపుల్స్ మార్చ్‌పై కూడా నిషేధం తొలిగిపోయింది. ఇపుడు మళ్లీ ఆ పత్రిక వెలువడుతున్నది. బెంగాలీ పీపుల్స్ మార్చ్ సంపాదకుడు అయినందుకు అరెస్ట్ చేయడం మాత్రమే కాకుండా స్వపన్‌దాస్ గుప్తాపై టెరరిస్టు సంస్థలకు సహకరిస్తున్నాడని కుట్రకేసు పెట్టి యుఎపిఎ కింద జైల్లో పెట్టారు. అరెస్ట్ చేసినపుడు పెట్టిన చిత్రహింసల వల్ల ఆయన చాల రక్తం కోల్పోయాడు. అట్టడుగు పేదవర్గం నుంచి వచ్చిన స్వపన్ చాల బలహీనంగా ఉంటాడు. జైల్లో ఆయనకు ఆరోగ్య పరీక్షలు కానీ, చికిత్స కానీ చేయించలేదు. ఎపిడిఆర్ నాయకుడు సుజాతభద్రో 'అతనికి ఆరోగ్యం క్షీణించింది. ఆసుపత్రికి తీసుకవెళ్లి బ్లడ్‌ప్లేట్‌లెట్స్ ఇప్పించాల'ని మానవ హక్కుల సంఘంకు ఫిర్యాదు చేసినట్లు చెప్పాడు. డిసెంబర్ 28న ఆయనను ఆస్మా, శ్వాసకోశ సంబంధ చికిత్స కోసం ఆసుపత్రికి తరలించారు. అక్కడ కూడ ఆయనకు సరియైన చికిత్స లభించలేదు. ఫిబ్రవరి 2న ఆయన రక్తం కక్కుకొని మరణించాడు. ఆయనను అరెస్ట్ చేసినపుడు అక్టోబర్‌లో 28 రోజుల పోలీసు కస్టడీలో చిత్రహింసలకు గురిచేయడమే ఈ మరణానికి కారణం. సుజాతభద్రో ఆరోపించినట్లు ఇది హత్య.

స్వపన్‌దాస్ గుప్తా ఇపుడు దేశంలో మొట్టమొదటి యుఎపిఎ అమరుడయ్యాడు. అదీ వామపక్ష ప్రభుత్వ సంస్కరణల నిలయమైన కారాగారంలో. దేశంలో జైల్లో అమరులైన పత్రికా సంపాదకులెవరైనా ఉన్నారా? లేకపోతే ఈ అన్ని ప్రథమ స్థానాల క్రెడిట్ బెంగాల్ వామపక్ష ప్రభుత్వానికివ్వాల్సి ఉంటుంది.

యుఎపిఎ ప్రభావం ఎట్లా ఉండబోతుందో స్వపన్‌దాస్ గుప్తా మరణం ఒక సంకేతం మాత్రమే. గతంలో యుఎపిఎ కింద రెండు సంవత్సరాలు జైల్లో మగ్గిన డాక్టర్ వినాయక్ సేన్ ఆరోగ్యం ఎంత క్షీణించిందో, రెండు సంవత్సరాల నిరీక్షణ, ఆందోళన, ఒత్తిడిలతో ఆయన భార్య ఎలీనాసేన్ ఆరోగ్యం కూడా ఎంత దెబ్బతిన్నదో మనకు తెలుసు. యుఎపిఎ అంటే టాడా, పోటాల స్థానంలో వచ్చిన దుర్మార్గమైన చట్టం. ఎవరినైనా ఏ విచారణ లేకుండా ఆరు నెలలపాటు జైల్లో పెట్టవచ్చు. ఈ ఆరు నెలల కాలంలో ఎన్నిసార్లయినా పోలీసు కస్టడీకి తీసుకోవచ్చు. బెయిల్ రావడం ఎంత కష్టమో డా. వినాయక్ సేన్ విషయంలో చూడనే చూసాం. టాడా, పోటాల వలె ముద్దాయిలే తమ నిర్దోషిత్వాన్ని రుజువు చేసుకోవాల్సి ఉంటుంది. యుఎపిఎ కింద వచ్చే నేరాలకు పాల్పడిన వారని పోలీసులు భావిస్తున్న వారి విషయంలో ప్రజలు, మీడియా కూడ 'ఇన్‌ఫార్మర్లు'గా వ్యవహరించాలి. లేకపోతే దోహదం (అబెటింగ్) చేసిన వారవుతారని ఈ చట్టం హెచ్చరిస్తుంది. ఈ చట్టం దృష్టిలో ఎవరైనా టెరరిస్టులు కావచ్చు. ఈ చట్టం ప్రకారం పోలీసులే పై అధికారుల ఆదేశాలతో ఎపుడయినా, ఎవరి ఇల్లయినా సోదా చేయవచ్చు. దాడి చేయవచ్చు. ఎవరినైనా వారంటు లేకుండా అరెస్టు చేయవచ్చు. ఈ చట్టం ప్రకారం 'టెర్రరిజాన్ని ప్రోత్సహిస్తున్నదనే సాకుతో ఏ రచననయినా, డాక్యుమెంటరీ ఫిల్మ్‌నయినా, రిపోర్ట్‌నయినా, వ్యాసాన్నయినా నిషేధించవచ్చు. రచయితలను, కళాకారులను, మీడియా వ్యక్తులను కూడా అరెస్ట్ చేయవచ్చు. యుఎపిఎ నిందితుల విచారణ పబ్లిక్‌గా జరుగదు. 'ఇన్ కెమెరా' జరుగుతుంది. సాక్షుల పేర్లు చెప్పరు. ఈ కేసులు విచారించే స్పెషల్ కోర్ట్ పరిపాలనా విభాగం అధికారం కింద ఉంటుంది. ఒక్క మాటలో ప్రాథమిక హక్కులన్నిటినీ హరించే ఈ చట్టం జీవించే హక్కును పరోక్షంగా హరిస్తుందనడానికి స్వపన్‌దాస్ గుప్తా మరణమే దాఖలా. సహజంగానే ఈ చట్టాన్ని రాజకీయ విశ్వాసాలు గలవారికి వ్యతిరేకంగా ప్రభుత్వాలు ప్రయోగిస్తాయి. రాజకీయ, ప్రజా సంఘ కార్యకర్తలు కార్యమగ్నతలో వేళకు తిండీ, నిద్రాలేక, ఒత్తిడి వల్ల పోలీసుల చేతుల్లో పడేవరకే ఏదో అనారోగ్య ఫిర్యాదుతోనే ఉంటారు. రెండేళ్లు జైల్లో గడిపి అన్ని కేసులు కొట్టివేయబడి విడుదలయిన తుషార్‌కాంత్ భట్టాచార్యను జైలు ముందు గ్రీన్‌హంట్ ఆపరేషన్‌ను వ్యతిరేకిస్తూ మీడియాతో మాట్లాడినందుకు మళ్లా అరెస్ట్ చేసి యుఎపిఎ కింద జైల్లో పెట్టడమే కాకుండా ఆయన అడ్వొకేట్ రామస్వామిని, విడుదలయిన సహచరుణ్ని తీసుకరావడానికి వెళ్లిన జనశక్తి నాయకుడు అమర్‌ను, బాల్య స్నేహితుడు రంగారెడ్డి (కాంగ్రెస్ నాయకుడు) ని కూడా కేసులో పెట్టడమైనా చూస్తే బెంగాల్‌లో వలె దేశవ్యాప్తంగా యుఎపిఎని రద్దు చేయాలని టాడా, పోటాల విషయంలో జరిగినట్లుగా ఒక ప్రత్యేక కృషి, ఉద్యమం జరగాల్సి ఉన్నది, అది తక్షణ కర్తవ్యమని అనిపిస్తుంది.

నెల రోజులు తిరగకుండానే తుషార్‌కాంత్ భట్టాచార్యకు వరంగల్ పోలీస్ స్టేషన్‌లో వారానికి రెండుసార్లు సంతకం చేయాలనే షరతులతో కూడిందే అయినా జిల్లా సెషన్స్ కోర్ట్ బెయిల్ మంజూరు చేసింది. తుషార్ ఆరోగ్యం క్షీణించి తరచుగా నిమ్స్‌లో చికిత్స చేయించుకుంటున్నాడని, అజ్ఞాత జీవితానికి ఆయన ఆరోగ్యం ఇంకెంత మాత్రం సహకరించదని తెలిసి కూడ పోలీసులు ఆయన కెవరూ జమానత్ ఇవ్వకుండా అడ్డుపడుతున్నారు. ఆయనింకా జైల్లోనే ఉన్నాడు. ఆయనపైన రాష్ట్రంలో గానీ, దేశంలో గానీ మరెక్కడైనా గానీ ఏమైనా కేసులు ఉన్నాయా, పెట్టే అవకాశం ఉందా క్షుణ్ణంగా పరిశీలించవలసిందిగా రాష్ట్ర ముఖ్యమంత్రితో కేంద్ర హోం మంత్రి ప్రస్తావించినట్లుగా ఒక పత్రిక సంచలన వార్త ప్రకటించింది. ఇందులో నిజానిజాలు ఎలా ఉన్నా యుఎపిఎ ఖైదీల విషయంలో ప్రభుత్వాల వైఖరినర్థం చేసుకోవడానికి ఒక సూచన. యుఎపిఎ ఖైదీలంటే రాజకీయ ఖైదీలు. ముఖ్యంగా సామ్రాజ్యవాద ప్రపంచీకరణను వ్యతిరేకిస్తున్న విప్లవకారులు, ప్రజాస్వామ్యవాదులు, ఆదివాసులు, ముస్లింలు. యుఎపిఎ నే పోలిన మహారాష్ట్ర చట్టం మోకాకు వ్యతిరేకంగా పోరాడుతున్న బొంబాయి న్యాయవాది, సిపిడిఆర్ కార్యకర్త షాహిద్‌ను పోలీసులు ఏకంగా కాల్చివేసిన నేపథ్యంలో ఈ దేశంలో ఏ అన్యాయమూ అసాధ్యం కాదనిపిస్తున్నది.

స్వపన్‌దాస్ గుప్తా మరణించి ఇరవై రెండు రోజులయింది. ఈ సంస్మరణ సభ నాటికే లాల్‌మోహన్ టుడును పోలీసులు 'ఎన్‌కౌంటర్' చేసినందుకు బెంగాల్ అంతా అట్టుడికి పోతున్నది. ఫిబ్రవరి 22న పోలీసు అత్యాచారాల వ్యతిరేక ప్రజా కమిటీ అధ్యక్షుడు లాల్‌మోహన్ టుడును పోలీసులు ఆయన ఇంట్లో ప్రవేశించి చంపేసారు. ఛత్రధర్ మహతో అరెస్ట్ తర్వాత ప్రజలు ఆయనను పిసిపిఎ కు అధ్యక్షునిగా ఎన్నుకున్నారు. ప్రజల్లో ఆయనంటే అపారమైన గౌరవం ఉన్నది. లాల్‌ఘడ్ ప్రాంతాన్ని సందర్శించిన రాష్ట్ర మానవహక్కుల సంఘం ప్రతినిధులకు ఆయన తన కమిటీ సహచరులతో కలిసి పిసిపిఎ తరఫున బంకూరా, పురూలియా, మేదినీపూర్ జిల్లాల్లో ఆదివాసుల పట్ల, ప్రజల పట్ల పోలీసుల అత్యాచారాల గురించి, తాము కోరుకుంటున్న అభివృద్ధి గురించి సమగ్రమైన నివేదిక ఇచ్చి ఉన్నాడు. ఈ కారణంగా పోలీసులు తనను వేధించవచ్చునని ఆయన తన ఇంట్లో ఉండడం లేదు. కూతురు మాధ్యమిక పరీక్ష కోసం

సర్టిఫికెట్ అవసరమై 22వ తేదీ రాత్రి మరో ఇద్దరు సహచరులతో తన గ్రామమైన నార్చాకు వచ్చాడు. వెంటనే పోలీసులు హర్మద్ వాహిని కార్యకర్తల సమాచారంతో వచ్చి ఇంట్లో దూరి ముగ్గురినీ పట్టుకవెళ్లి దగ్గర్లో అడవిలో చంపేసి 'ఎన్‌కౌంటర్' అని ప్రకటించారు.

సిల్దాలో సిఆర్‌పిఎఫ్ క్యాంపుపై దాడిచేసి మావోయిస్టులు 24 మంది జవాన్లను చంపినందుకు ఇది ప్రతీకార చర్య అని ప్రతి ఒక్కరు భావిస్తున్నారు.

ఈ సంస్మరణ సభ లాల్‌మోహన్, అతని ఇద్దరి సహచరుల సంస్మరణ సభగా కూడా మారింది. ప్రతి ఒక్కరూ బెంగాల్‌లో మళ్లీ సిద్దార్థ శంకర్ రే రోజులు, ఎమర్జెన్సీ రోజులు వచ్చాయని అనుకుంటున్నారు. ఆంధ్రప్రదేశ్ పోలీసుల ప్రతీకార చర్యలు ఇక్కడ ప్రారంభమయ్యాయి అని కూడా నాతో చాలామంది అన్నారు. ఆంధ్రప్రదేశ్‌లో పీపుల్స్‌వార్ ఎస్.ఐ. యాదగిరి రెడ్డిని, డి.ఎస్.పి. బుచ్చిరెడ్డిని చంపితే పోలీసులు ఎపిసిఎల్‌సి డాక్టర్ రామనాథాన్ని, జాపా లక్ష్మారెడ్డిలను చంపినట్లుగా బెంగాల్‌లో ఇప్పుడీ ముగ్గురు పిసిపిఎ నాయకులను చంపారని చెప్పుకుంటున్నారు.

కథ ఇక్కడ ముగియ లేదు. ఐదు రోజులుగా బ్లాకు కేంద్రం ఝూర్‌గ్రాంలో ఈ ముగ్గురి మృతదేహాలు పోలీసు స్టేషన్ ముందు పడి ఉన్నాయి. ఈ మృతదేహాలను తీసుకుపోవడానికి నార్చా గ్రామం నుంచి తన వాళ్లతోపాటు బయల్దేరిన లాల్‌మోహన్ టుడు భార్య లక్ష్మీ మోనీ టుడును పోలీసులు రానివ్వడం లేదు. మృతదేహాలను రక్త బంధువులకు ఇప్పించడానికి ఫిబ్రవరి 25న వెళ్లిన ఎపిడిఆర్ నాయకులను మేదినీపూర్‌లోనే ఆపేసారు. వాళ్లను ఝూర్‌గ్రాం వెళ్లడానికి అనుమతించలేదు. ఝూర్‌గ్రాం బ్లాకు అంతా 144వ సెక్షన్ విధించారు. ఈ వ్యాసం రాస్తున్న సమయానికి గత ఐదు రోజులుగా తమ భర్తల మృతదేహాలను చూడడానికి కూడా ఆ ముగ్గురి భార్యలు నోచుకోలేదు. వాళ్ల రక్తబంధువులు నోచుకోలేదు. ఎపిడిఆర్ నాయకులకు జిల్లా పోలీసు అధికారులు 'బంధువులే రావడానికి ఇష్టపడడం లేదని చెప్తున్నారు. మీరు నార్చా గ్రామానికి వెళ్లి వాళ్లను రెచ్చగొట్టి, భయపెట్టి, బెదిరించి తీసుకువస్తారా' అని అడుగుతున్నారు. ఎపిడిఆర్ నాయకులు అసహాయంగా మేదినీపూర్‌లోనే ఉండిపోయారు. బంధువులు వస్తారనే ఆశతో లాల్‌మోహన్ టుడు భార్య లక్ష్మీమోనీ టుడు ఎపిడిఆర్ నాయకులతో ఎప్పటికప్పుడు సంప్రదిస్తూనే ఉంది. తాము ఝూర్‌గ్రాంకు బయల్దేరుతూ తమకు మృతదేహాలు ఇప్పించడంలో సహకరించడానికి ఎపిడిఆర్ వాళ్లను రమ్మని కోరింది. నార్చాలో గానీ, ఝూర్‌గ్రాం ప్రాంతంలో గానీ 144 సెక్షన్ ఉండడం మాత్రమే కాకుండా పరిస్థితి బీభత్సంగా ఉంది గనుక, లాల్‌మోహన్ టుడు అంటే కలకత్తాలో బుద్ధిజీవులు, ప్రజాస్వామికవాదుల్లో చాల గౌరవం ఉంది గనుక మృతదేహాలను కలకత్తా తీసుకపోయి గౌరవప్రదంగా అంత్యక్రియలు చేస్తే బాగుంటుందన్న పలువురి సూచనలను ఆమె కూడా ఆమోదించింది. అందుకే అటు నార్చా నుంచి ఆమె, ఆమెతోపాటు మృతుల బంధువులు, ఇటు కలకత్తా నుంచి ఎపిడిఆర్ వాళ్లు బయల్దేరితే అటు వాళ్లను నార్చానుంచి కదలనివ్వలేదు. ఇటు వీళ్లను మేదినీపూర్‌లోనే అడ్డగించారు. మృతదేహాలు 27వ తేదీ ఉదయం దాకా అంటే ఆరు రోజుల తర్వాత కూడా ఝూర్‌గ్రాం పోలీస్ స్టేషన్ ముందు పడి ఉన్నాయి. మేదినీపూర్ జిల్లాలో అప్పుడు ముదిరిన ఎండలకు సాక్షిగా, ఆకురాలు కాలానికి గుర్తుగా.

ఈ విషయంలో సుప్రసిద్ధ సంగీతకారుడు, గాయకుడు, ఎం.పి. కూడ అయిన కబీర్ సుమన్‌ను కలిసి ఆయన ఏమైనా సహకరించగలడా అని అడిగాను. ఆయన జంగల్ మహల్ పోలీసు అత్యాచారాల వ్యతిరేక ప్రజాసంఘం ఉద్యమానికి అండగా నిలిచాడు. గ్రీన్‌హంట్ ఆపరేషన్‌ను బాహాటంగా వ్యతిరేకిస్తున్నాడు. స్వపన్‌దాస్ గుప్తా అంత్యక్రియల్లో పాల్గొన్నాడు. ఛత్రధర్ మహతో అరెస్టును ఖండిస్తూ, ఆయన కోసం, ఆయన నాయకత్వంలోని పిసిపిఎ ఉద్యమం కోసం తాను రచించి, సంగీతం కూర్చిన పాటల సిడి ని విడుదల చేసి ఉన్నాడు. లాల్‌మోహన్ టుడు, అతని సహచరుల హత్య అయినా, స్వపన్‌దాస్ గుప్తా అనారోగ్యంతో జైల్లో చనిపోయేట్లు చూడడమైనా కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల గ్రీన్‌హంట్ ఆపరేషన్ వ్యూహంలో భాగమేనన్నాడు. తాను లాల్‌మోహన్ టుడు, అతని సహచరుల మృతదేహాలు కుటుంబ సభ్యులకిప్పించి కలకత్తాకు తీసుకరావడానికి ఝూర్‌గ్రాం వెళ్తానన్నాడు. ఏప్రిల్ మొదటివారంలో పార్లమెంట్ ముందు గ్రీన్‌హంట్ వ్యతిరేక ప్రదర్శన చేయడానికి సహ ఎం.పి.ల సహకారం కోసం ప్రయత్నిస్తున్నానన్నాడు.

జంగల్ మహల్‌లో ఈ ఆటవిక న్యాయం అమలవుతుంటే మరి కలకత్తా ఏమయినా కళాకాంతులు ప్రసరిస్తున్నదా? నాగరికంగా ఉన్నదా? లాల్‌మోహన్, అతని అనుచరుల హత్యలకు నిరసనగా వివిధ ప్రజాసంఘాలు కలకత్తా కాలేజీ స్క్వేర్ నుంచి ఒక ర్యాలీ, ఎస్ప్లనేడ్‌లో ఒక సభ తలపెట్టాయి. 26న మధ్యాహ్నం స్వచ్ఛందంగా బయల్దేరిన ఈ ఊరేగింపులో పోలీసులు మైకు ఉపయోగించ వద్దన్నారు. సభకయితే అనుమతించలేదు. ఎస్ప్లనేడ్ దగ్గరే ర్యాలీని చెదరగొట్టారు.

ప్రతీకార చర్యగా అమాయక ఆదివాసులను, వాళ్ల న్యాయమైన డిమాండ్ల కోసం పోరాడుతున్న నాయకులను చంపుతారు. ఆ మృతదేహాలను కనీసం వారి రక్త బంధువులకు కూడ ఇవ్వరు. కనీసం వాళ్ల ఆఖరి చూపుకు కూడ అవకాశం ఇవ్వరు. ఉన్న చోట కన్నీళ్లు పెట్టుకోవడానికి కూడా అనుమతించరు.

కన్నీళ్లు పెట్టుకొని గళం విప్పి నినదించాలనుకున్న స్థలాన్ని కలకత్తాలో ఏమని పిలుస్తారో తెలుసా -

'షహీద్ మినార్ మైదాన్'

ఇక్కడే 1972లో ఎందరినో ముసిముసి చీకటిలో ఇళ్లలో చంపి తెచ్చిపడేసేవాళ్లు సిద్దార్థుని పోలీసులు. సుప్రసిద్ధ రచయిత, జర్నలిస్ట్, మార్క్సిస్ట్ - లెనినిస్ట్ నాయకుడు సరోజ్‌దత్తాను తీసుకవచ్చి ఒక వేకువన ఇక్కడిట్లా చంపి పడేస్తూ ఉంటే మార్నింగ్ వాక్‌కు వచ్చిన సుప్రసిద్ధ సినిమా నటుడు ఉత్తమకుమార్ చూసి అవాక్కయ్యాడు. చూసినకళ్లు చెప్పకుండా ఉండడానికి కలకత్తా వదిలి బొంబాయి వెళ్లిపోయాడు. ఇటువంటివి ఎన్నో గగుర్పొడిచే భయంకర జ్ఞాపకాలేనా - కాదు - బుద్ధదేవుని కాలంలో కూడా అవే వాస్తవాలు.

ఎన్‌కౌంటర్ల పేరుతో చంపినా, ఇంటికి వాళ్ల బంధువులకు తెలియజేయడం, వాళ్లను పోలీసు వాహనాల్లోనే (వాళ్లకు అభ్యంతరం లేకపోతే) పోస్ట్‌మార్టమ్ జరిగిన ఆసుపత్రికి తీసుకవచ్చి మృతదేహాలను అప్పగించడం, మృతదేహాలను అమరుల రక్త బంధువులకిప్పించడానికి పౌరహక్కుల సంఘాలను, నాయకులను, అమరుల బంధుమిత్రుల సంఘాన్ని అనుమతించడం చేస్తున్న ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం అనే తలారి కన్నా హీనమైందా బెంగాల్ వామపక్ష తలారి ప్రభుత్వం?

తా.క. ఈ వ్యాసం ఫిబ్రవరి 27న కలకత్తాలో కబీర్ సుమన్‌ను కలిసాక హైదరాబాద్‌కు తిరిగి వచ్చే ముందు అక్కడే రాసాను. సంఘటనలు ఒక మౌలిక సంఘర్షణలో భాగమైనపుడు ముగింపు ఉండదనుకుంటాను. ఐనా ఆ ఝూర్‌గ్రాంలో పోలీస్ స్టేషన్ ముందు పడి ఉన్న ఆదివాసీ నాయకుల మృతదేహాలకేమయిందో - మేదినీపూర్ అడవుల నుంచి కలకత్తాలో ఆ వేడిగాలుల కుళ్లు వాసన నా ముక్కుపుటాలను వదల లేదు గనుక ఇక్కడికి వచ్చి కూడా తెలుసుకోకుండా ఉండలేకపోయాను. నేనిక్కడికి వచ్చిన మర్నాడే ఫిబ్రవరి 28న బెంగాల్ మావోయిస్ట్ పార్టీ కార్యదర్శి, కేంద్ర కమిటీ సభ్యుడయిన దీపక్ అరెస్టయ్యాడు. (విచిత్రంగా ఆయనకు మీడియా తెలుగు దీపక్ అని పేరు పెట్టింది) అరెస్ట్ వల్లనే

అతడు ప్రకాశం జిల్లాకు చెందిన వెంకటేశ్వర రెడ్డి అని తెలిసింది. అఖిల భారత విప్లవ విద్యార్థి సమాఖ్య (ఎఐఆర్‌ఎస్‌ఎఫ్) ఆర్గనైజర్ ప్రసాద్‌గా ఆయన 1985 నుంచి 92 దాకా విప్లవ విద్యార్థి ఉద్యమాలతో, నిర్మాణాలతో పరిచయమున్న వారందరికీ దేశవ్యాప్తంగా తెలుసు. గ్రీన్‌హంట్ ఆపరేషన్ నిలిపివేసి దీపక్‌ను, ఇతర రాజకీయ ఖైదీలను వదిలితే తాము చర్చలకు సిద్ధమని కిషన్‌జీ ప్రకటించాడు. వాస్తవానికి అంతకు ముందే కేంద్ర హోం మంత్రి చిదంబరం కలకత్తాలో ముఖ్యమంత్రుల సమావేశం తర్వాత చేసిన 'డెబ్బై రెండు గంటల హింస మానండి' అన్న విజ్ఞప్తికి, ప్రభుత్వం గ్రీన్‌హంట్ ఆపరేషన్‌ని నిలిపివేస్తే తాము 72 రోజుల కాల్పుల విరమణకు కూడా సిద్ధమేనని ప్రభుత్వం ప్రతిస్పందించాలని కిషన్‌జీ ప్రకటించి ఉన్నాడు. హోంమంత్రి తన ఫ్యాక్స్ నెంబర్ ఇవ్వడం, కిషన్‌జీ తన మొబైల్ నెంబర్ ఇవ్వడం - ఇదంతా ప్రజలందరికీ ఇప్పటికే తెలిసిన విషయాలు.

కేంద్ర ప్రభుత్వమైనా, మీడియా అయినా ఉద్దేశపూర్వకంగానే ప్రాధాన్యమివ్వకుండా, ప్రస్తావించకుండా ఉంటున్న ప్రధానమైన ప్రతిపాదన మావోయిస్ట్ పార్టీ ప్రధాన కార్యదర్శి గణపతి నుంచి వచ్చింది. ఇప్పటికి నెల రోజులకు పూర్వమే ఆయన తనను మధ్య భారతదేశంలో కలిసిన సుప్రసిద్ధ రచయిత, రాజకీయ విశ్లేషకుడు, యాన్ మిర్డాల్‌కు, ఆయనతో పాటు వెళ్లిన ఎకనమిక్ అండ్ పొలిటికల్ వీక్లీ ఢిల్లీ సంపాదకుడు గౌతమ్ నవ్‌లఖాకు ఒక సుదీర్ఘమైన ఇంటర్వ్యూ ఇచ్చి ఉన్నాడు. వాళ్లు అది టైపు చేసి ఆయనకు చూపి నెట్ మీద ఉంచారు. సన్హతి బ్లాగ్‌లోను, నెట్ మీద విస్తృతంగా ప్రచారం అయింది. టైమ్స్ ఆఫ్ ఇండియా, ఆంధ్రజ్యోతి వంటి పత్రికల్లో కొంత వెలుగు చూసింది. అందులో ఆయన 1987లో ఎన్టీఆర్ తెలుగుదేశం ప్రభుత్వం విజ్ఞప్తికి రాష్ట్ర పార్టీ కార్యదర్శిగా స్పందించినట్లుగానే 'సానుకూలమైన వాతావరణం కల్పిస్తే తాము చర్చలకు సిద్ధమే'నని చెప్పి ఉన్నాడు. సానుకూలమైన వాతావరణమంటే గ్రీన్‌హంట్ ఆపరేషన్ నిలిపివేసి పారా మిలిటరీ బలగాలను వెనక్కి పిలవడం. పార్టీపై నిషేధం ఎత్తివేయడం, రాజకీయ ఖైదీలను విడుదల చేయడం అని వివరించాడు. రాజకీయ ఖైదీలను విడుదల చేస్తే అందులో తమ కేంద్ర కమిటీ (పొలిట్ బ్యూరో కూడా) సభ్యులైన సుశీల్‌రాయ్, నారాయణ సన్యాల్, అమిత్ బాగ్చీ, కోబాడ్ గాంధీ కూడా ఉన్నారు గనుక వారితోనే ప్రభుత్వం చర్చించవచ్చునని స్పష్టం చేశాడు.

ఇది కేంద్ర ప్రభుత్వానికి, రాష్ట్ర ప్రభుత్వాలకు, కొందరు మేధావులకు కూడా పార్టీ పెట్టిన షరతులుగా కనిపించింది. 'సానుకూలమైన వాతావరణం' (కండ్యూసివ్ ఆర్ కంజీనియల్ అట్మాస్ఫియర్) పేరుతో పార్టీ షరతులు పెడుతున్నదని ప్రకాశ్‌సింగ్ వంటి మాజీ పోలీసు అధికారి అన్నాడు కూడ.

కాని మావోయిస్టులతో, నక్సలైట్లతో వ్యవహరించే విషయంలో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వాన్ని, ముఖ్యంగా వై.ఎస్. రాజశేఖర రెడ్డి కాంగ్రెస్ ప్రభుత్వాన్ని ఆదర్శంగానూ, నమూనాగానూ ప్రతి సందర్భంలోనూ పేర్కొంటున్న ప్రధానికి, హోం మంత్రికి - ఇవి షరతులు కావని, అదే వై.ఎస్.ఆర్. ప్రభుత్వం 2004లో పాటించిన విధి విధానాలేనని తెలియదా? వై.ఎస్.ఆర్. ప్రభుత్వం రెండు విప్లవ పార్టీలను రెండవ దఫా చర్చలకు ఎందుకు పిలవలేదు అనే అంశం అలా ఉంచి మొదటి దశ చర్చలకు పిలవడానికి అనుసరించిన విధి విధానాలేమిటో చూద్దాం. 2004 ఎన్నికల్లో నక్సలైట్లతో బేషరతు చర్చలకు సిద్ధమని ప్రజలకు వాగ్దానం చేసిన కాంగ్రెస్ పార్టీ అధికారంలోకి రాగానే హోంమంత్రి అయిన కె. జానారెడ్డి ప్రమాణం స్వీకారం చేసిన 2004 మే 14 సాయంత్రం అడవుల్లో గ్రేహౌండ్స్ గాలింపు చర్యలు నిలిపివేసి గ్రేహౌండ్స్‌ను వెనక్కి పిలుస్తున్నట్లు ప్రకటించాడు. ఎన్‌కౌంటర్లు ఉండవని చెప్పాడు. బేషరతు చర్చలకు అప్పటి పీపుల్స్‌వార్‌ను ఆహ్వానించాడు. జూన్ 8న పార్టీ ఆరు నెలల పాటు కాల్పుల విరమణ ప్రకటించి ప్రభుత్వాన్ని ప్రతిస్పందించమని డిమాండ్ చేసింది. ఆ సాయంత్రానికే ప్రభుత్వం కూడా ఆరు నెలల పాటు కాల్పుల విరమణ ప్రకటించింది. రెండు విప్లవ పార్టీలు తమ ప్రతినిధుల పేర్లు ప్రకటించాయి. ప్రభుత్వానికి మధ్యవర్తుల, పర్యవేక్షక కమిటీ పేర్లు సూచించాయి. ప్రభుత్వం ఆమోదించడమే కాకుండా ఎస్.ఆర్. శంకరన్ గారికి అధికారికంగా మధ్యవర్తి గుర్తింపునిస్తూ ఉత్తర్వులు జారీచేసింది. జూన్ 21న పీపుల్స్‌వార్ నిషేధం గడువు ముగియగానే మళ్లా నిషేధాన్ని కొనసాగించలేదు. రెండు విప్లవ పార్టీలు పంపించిన విధివిధానాలను - గ్రామాలలో తుపాకులు పట్టుకొని దళాలు తిరుగరాదు అని ఒక నియమం చేర్చి ఆమోదించింది. ఆ నియమం మీద జరిగిన చర్చల వల్ల ఏర్పడిన ప్రతిష్టంభన వల్ల చర్చలు ఆల్యమై, ఆ అంశం కూడ ప్రధాన అజెండాలో భాగంగా చర్చించవచ్చునని ఉభయులూ అంగీకారానికి వచ్చి చర్చలు అక్టోబర్ 15 నుంచి 18 వరకు సామరస్యపూర్వకంగా జరిగినవి. రెండు విప్లవ పార్టీల నాయకత్వం, ఎనిమిది మంది కేబినెట్ స్థాయి ప్రభుత్వ ప్రతినిధులు, రెండు విప్లవ పార్టీల ప్రతినిధులు చర్చల్లో పాల్గొన్నారు. చర్చలు ఎస్.ఆర్. శంకరన్ అధ్యక్షతన జరిగాయి. మధ్యవర్తులందరూ పాల్గొన్నారు. రెండవ రోజు నుంచి ప్రభుత్వం మినిట్స్ కూడా నమోదు చేసింది. ఈ విషయాలన్నీ కేంద్ర ప్రభుత్వానికి తెలియదా?

చర్చలలో ప్రతిపాదించిన ప్రజాస్వామిక హక్కుల పునరుద్ధరణ, భూసంస్కరణలు పాలకవర్గ స్వప్రయోజనాల వల్ల అసాధ్యమై- రెండో దఫా చర్చలకు ప్రభుత్వం ఆయుధాలు వదిలితేనే చర్చలు అని మెలిక పెట్టింది తప్ప నాలుగు రోజుల చర్చల్లో ప్రభుత్వ ప్రతినిధులు గానీ, మధ్యవర్తులు గానీ గ్రామాలలో దళాలు సాయుధులుగా తిరుగరాదనే విషయాన్ని చర్చకు ప్రస్తావించనే లేదు. కనుక చర్చల్లో ఎజెండాలోని డిమాండ్ల అమలు విషయమెలాగున్నా 2004 మే 14 నుంచి 2005 జనవరి 8 దాకా దాదాపు ఎనిమిది నెలలు రాష్ట్రంలో ఇరు వైపులా ప్రాణనష్టం లేని స్థితి నెలకొన్నది. పోలీసులు చేసిన కొన్ని కోవర్టు ప్రయత్నాలు, ఒకటి రెండు హత్యలు తప్ప ప్రజా వాగ్గేయకారుడు గోరటి ఎంకన్న రాసిన ప్రశాంత వాతావరణం ఆ ఎనిమిది నెలలు నెలకొన్నది. ఈ కాలమంతా పార్టీ రిక్రూట్‌మెంట్ చేసుకున్నది, ఆయుధ సేకరణ చేసింది, డబ్బు వసూళ్లు చేసింది అనే ఆరోపణ ప్రభుత్వం చేయవచ్చు. పోలీసులు అడవి జల్లెడ పట్టారు. నిఘా నెట్‌వర్క్ పెంచారు. కోవర్టులను, ఇన్‌ఫార్మర్‌లను పార్టీలో ప్రవేశపెట్టారు. 2005 జనవరి 8న చైతన్య మహిళా సమాఖ్య రాష్ట్ర కార్యవర్గ సభ్యురాలు లక్ష్మిని ఎన్‌కౌంటర్ చేయడంతో మళ్లీ ఎన్‌కౌంటర్లు, మారణకాండ ప్రారంభించారని విప్లవాభిమానులు అభిప్రాయపడవచ్చు. ఇప్పటికి అందరికీ తెలిసిన ఈ విషయాల ప్రస్తావన ఎందుకంటే సానుకూల వాతావరణమంటే - గాలింపు చర్యలు, ఎన్‌కౌంటర్లు నిలిచిపోవడం, కాల్పుల విరమణ, పార్టీలపై నిషేధం ఎత్తివేయడం - అని కాంగ్రెస్ ప్రభుత్వమే 2004లో అంగీకరించి అమలు చేసింది అని చెప్పడానికి. ఇది కేంద్ర-రాష్ట్ర ప్రభుత్వాలకు తెలియదని కాదు. ప్రజాస్వామ్యవాదులకు, మీడియాకు కూడా తెలియదని కాదు. మరచిపోయిన వారికి గుర్తు చేయడానికి మాత్రమే.

అయితే ఆంధ్రప్రదేశ్‌లో చర్చలకు 2004 ఎన్నికలు నేపథ్యం అయ్యాయి. ఎన్నికల ముందరి ప్రజాకాంక్ష, ప్రజాస్వామ్య వాదుల కృషి నేపథ్యమైంది. పియుసిఎల్, ఎపిసిఎల్‌సి కృషితో మొదలై 1997లోనే ఇదే ఎజెండాగా ఏర్పడిన కన్సర్న్‌డ్ సిటిజన్స్ కమిటీ అలుపు ఎరుగకుండా చేసిన ప్రయత్నాలు దోహదం చేసినవి. ముఖ్యంగా సిసిసి ఇటు ప్రభుత్వంతోనూ, అటు పీపుల్స్‌వార్ అగ్ర నాయకత్వంతోనూ కలిసి చర్చించి ఒక వాతావరణం కల్పించింది. 'వార్త' పత్రిక చర్చలపై ప్రజాభిప్రాయ సేకరణ

చేసింది. కనుక 2004 ఎన్నికలు అప్పటి ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడే స్వయంగా ఒప్పుకున్నట్లు ఈ విషయంలో 'రెఫరెండం'గా కెటాలిస్టు పాత్ర నిర్వహించినవి.

ఎవరితో మాట్లాడాలి? మధ్యవర్తులెవరు? వంటి న్యాయమైన సందేహాలకు, అన్యాయమైన సాకులకు అవకాశం లేకుండా పోయింది.

2004 ఎన్నికలకు 2009 ఎన్నికలకు మధ్యలోనే సెలయేళ్లు ప్రవహించే దేశమంతటా నెత్తురు ప్రవహించింది. అడవుల్లోని కొండలన్నీ నెత్తురుతో ఎరుపెక్కాయి. లోయలు ఖనిజాలతోనే కాదు, వాటిని కాపాడుకునే ఆదివాసుల, విప్లవకారుల బలిదానాలతో సూర్యరశ్మిని ప్రతిఫలించినవి. 2009 ఎన్నికలు కూడా అయిపోయాక మళ్లీ ఒకసారి కేంద్రంలో స్థిరపడిన కేంద్ర ప్రభుత్వం అన్ని రాష్ట్రాల ప్రభుత్వాలకు ఒక తాటి మీదికి తెచ్చి ప్రత్యేక ఆర్థిక మండలాల ఏర్పాటుకు ఆమోదం తీసుకున్నది. దేశంలోని అడవులను బహుళజాతి కంపెనీలకు, బడా కంపెనీలకు విలువైన ఖనిజ తవ్వకాల కోసం, భారీ పరిశ్రమల నిర్మాణం కోసం అప్పగించడానికి ఆమోదం పొందింది. అంటే దేశవ్యాప్తంగా అడవుల నుంచి ఆదివాసులను నిర్వాసితులను చేసే పథకానికి రూపకల్పన చేసింది. సాల్వాజుడుం (ఛత్తీస్‌ఘడ్) సేంద్రా (జార్ఖండ్) హర్మద్ వాహిని (పశ్చిమ బెంగాల్) లను పారా మిలిటరీ బలగాలకు తోడుగా దాడికి పురికొల్పింది.

2009 నవంబర్‌లో దీనికి 'గ్రీన్‌హంట్ ఆపరేషన్' అని పేరు పెట్టింది. అడవిలోని ఆకుపచ్చదనంపై విషపు కాటు వేయడానికి అడవుల్లోకి వేరు వేరు పేర్లతో రెండున్నర లక్షల కోబ్రాలను వదిలింది.

ఈ గ్రీన్‌హంట్ ఆపరేషన్‌కు లక్ష్యంగా అబూజ్‌మడ్‌ను ఎంచుకున్నది. అప్పటికి మహారాష్ట్ర ఎన్నికలు కూడా అయిపోయాయి. గడ్చిరోలీ, దంతెవాడ, నారాయణపూర్‌ల నుంచి మూడు వైపుల దిగ్బంధం ప్రారంభించింది. 2009 అక్టోబర్ 2010 జనవరి నెలల మధ్యన ఒక్క దంతెవాడ జిల్లాలోనే గ్రీన్‌హంట్ వలన నూట ఏడుగురు ఆదివాసులు మరణించారు.

ఈసారి ఈ గ్రీన్‌హంట్ ఆపరేషన్‌ను వ్యతిరేకిస్తూ ప్రజాస్వామ్యవాదులు శాంతి చర్చల ప్రతిపాదన తెచ్చారు. 2004లో ఆంధ్రప్రదేశ్‌లో శాంతి చర్చలకు భూ సంస్కరణలు ప్రాతిపదిక అయినట్లు గానే ఈసారి శాంతి చర్చలు సామాజిక న్యాయంతో కూడిన శాంతి చర్చలు కావాలని, బహుళజాతి కంపెనీల, బడా కంపెనీల ఒప్పందాలను స్థగితం చేయకుండా శాంతి సాధ్యం కాదని ప్రజాస్వామ్యవాదులు భావించారు. ఖాట్మండూ నుంచి కన్యాకుమారి వరకు మావోయిస్టు కారిడార్ బూచి చూపుతూ ప్రభుత్వం కంపెనీలతో ఎంఒయు కోస్టల్ కారిడార్ నిర్మిస్తున్నదని అరుంధతీ రాయ్ విస్పష్టంగా చెప్పింది.

ఈసారి చర్చల కృషి దేశస్థాయిలో ప్రజాస్వామ్యవాదులకు, కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలకు మధ్యన ఏ మేరకు జరుగుతున్నదో, అది ఎక్కువగా ఆధునిక సాంకేతిక, వైజ్ఞానిక సౌకర్యాల వల్ల ఇంటర్ నెట్‌లకు, బ్లాగ్‌లకు ఇంగ్లిష్ ఛానళ్లకు పరిమితమవుతున్నట్లుగా కనిపిస్తున్నది. లేదా చిదంబరం - కిషన్‌జీల మధ్యన మాటల యుద్ధంగా కూడ కనిపిస్తున్నది. అయితే ఇంక మాటల యుద్ధంలో కూడా ఎంత సేపూ కేంద్ర హోంమంత్రి 'మీరు హింస మానండి' అంటాడు తప్ప తాను డెబ్బై రెండు గంటలు కాదు గదా డెబ్బై రెండు నిమిషాలైనా గ్రీన్‌హంట్ మానుతాననడు. కిషన్‌జీ అయినా గ్రీన్‌హంట్ నిలిపివేసిన మరుక్షణం డెబ్బై రెండు రోజుల కాల్పుల విరమణ, దీపక్‌తో పాటు రాజకీయ ఖైదీలను విడుదల చేసి, గ్రీన్‌హంట్ నిలిపివేస్తే చర్చలకు సిద్ధం అంటున్నాడు గానీ చిదంబరం గ్రీన్‌హంట్ తాత్కాలికంగా నిలిపివేస్తాననే మాట కూడా అనడం లేదు.

కిషన్‌జీ చేసిన డెబ్బై రెండు రోజుల కాల్పుల విరమణ ప్రతిపాదనకు కేంద్రం స్పందించి గ్రీన్‌హంట్ నిలిపివేయాలని మావోయిస్ట్ పార్టీ అధికార ప్రతినిధి ఆజాద్ డిమాండ్ చేసాడు. కిషన్‌జీ ఒక అడుగు ముందుకు వేసి ముగ్గురు మధ్యవర్తుల పేర్లు కూడా సూచించాడు.

మహాశ్వేతాదేవి తాను స్వయంగా మధ్యవర్తిత్వం వహిస్తానని ముందుకు వచ్చింది.

చర్చలు కేంద్ర హోం కార్యదర్శి పిళ్లై జోక్యం చెప్తున్న 'ప్రజావిముక్తి' గురించి కాదని తెలియనంత అమాయకులు కాదు ప్రజలైనా - ప్రజాస్వామ్య వాదులైనా. ఫిబ్రవరి 20న చిదంబరం - మావోయిస్టులతో వ్యవహరించే విషయంలో బుద్ధిజీవులు కేంద్ర ప్రభుత్వానికి సమస్యగా మారారని చెప్తూ 'మావోయిస్ట్ పార్టీ కేవలం ఎంఒయుల గురించి కాదు, ప్రజావిముక్తి గురించి యుద్ధంలో ఉన్నదని వీళ్లకు తెలియడం లేద'ని హెచ్చరించాడు.

ప్రజల వైపు నుంచి చూస్తే గ్రీన్‌హంట్ ఎంఒయుల కోసమే, సామ్రాజ్యవాద ప్రపంచీకరణను అమలు చేయడం కోసమే తన ప్రజల మీద తానే ప్రభుత్వం యుద్ధం ప్రకటించిందని గ్రహించడం కష్టం కాదు.

అందుకే బెంగాల్‌లో నేను పైన పేర్కొన్న సంఘటనలు గ్రీన్‌హంట్‌లో భాగమేనన్న కబీర్ సుమన్ మాటలు రోజురోజుకూ రుజువవుతున్నాయి. దీపక్ అరెస్ట్ దీనికొక చేర్పు. పిళ్లై ప్రకటనలు అందుకు కవ్వింపు చర్యలు. అవన్నీ అలా ఉంచి లాల్‌మోహన్ టుడు, అతని సహచరుల శవాలకు ఏమైందో తెలుసుకునే ఆ నైతిక బాధ్యత నన్ను వెంటాడుతూనే ఉంది. ఎందుకంటే సర్వేశ్వర్ దయాల్ సక్సేనా చెప్పినట్లు - నా పక్క గదిలో శవం పొర్లుతుంటే - ఆ వాసన నా గదిని, మన వాడను ఆవరిస్తే అదింకెంత మాత్రం ఆ గదికి సంబంధించిన ప్రైవేట్ వ్యవహారం కాదు కదా'.

అందుకే మార్చ్ 6న మహాశ్వేతాదేవికి ఫోన్ చేసాను - ఆ శవాల సంగతి ఏమయింది? అని. 'ఎవరినైనా పోనిస్తే గద - అక్కడ 144 సెక్షన్ విధించారు. కుటుంబ సభ్యులు శవాలు స్వాధీనం చేసుకోవడానికి ఇష్టపడడం లేదని చెప్తున్నారు. నేను హోం కార్యదర్శితో మాట్లాడుతున్నాను' అన్నది. 'మీరు నేరుగా ముఖ్యమంత్రితోనే మాట్లాడి కనీసం ఆ మృతదేహాలను కుటుంబ సభ్యులకు అప్పగించేలా చూడండి' అని అన్నాను.

ఆ ప్రయత్నంలోనే ఉన్నానన్నది.

ఇంకో రెండు రోజులు గడిచిపోయినవి. ఇవ్వాళ మార్చ్ 9వ తేదీ ఉదయం కాంచన్ కుమార్‌కు ఫోన్ చేసాను. ఎందుకంటే మార్చ్ 6న మహాశ్వేతాదేవి ఫోన్ చేయడానికన్నా ముందు ఆమె దగ్గరికి స్వయంగా కాంచన్ కుమార్‌ను వెళ్లి ఉండమని చెప్పాను. ఆమె వయస్సు, అనారోగ్యం కారణంగా వివరంగా మాట్లాడడానికి వీలుండదని.

'లాల్‌మోహన్ టుడు, అతని సహచరుల మృతదేహాలను మేము తీసుకోము' అని వాళ్ల భార్యా పిల్లలతో పోలీసులు కాగితం రాయించుకొని కలకత్తా హైకోర్టుకిచ్చారు. వాళ్లీ మృతదేహాలను రక్తబంధువులకు అప్పగించి, కలకత్తాకు తీసుకవచ్చి గౌరవప్రదంగా అంత్యక్రియలు చేయడానికి అనుమతించవలసిందిగా హైకోర్టులో ఎపిడిఆర్ వేసిన రిట్ పిటిషన్ వెనక్కి తీసుకోవాల్సి వచ్చింది' అని చెప్పాడు.

'మరి శవాలు ఏమయ్యాయి? పోలీసులే దహనం చేసారా?' అని అడిగాను. 'ఏమో - ఎవరిని పోనిచ్చారని? మీడియాను కూడా పోనివ్వడం లేదు. ఝూర్‌గ్రాం బ్లాక్ అంతా 144 సెక్షన్ విధించారు. సమాచార హక్కు కూడా లేదు. బెంగాల్‌లో అంతా అప్రకటిత నిషేధమే' అన్నాడు.

గ్రీన్‌హంట్‌లో భాగంగా ఎన్‌కౌంటర్ అయిన ఆ పోలీసు అత్యాచారాల వ్యతిరేక కమిటీ నాయకులు పదిహేడు రోజుల తర్వాత నైనా తమ అడవిలోనే శవాలుగా మట్టిలో కలిసిపోయి ఉంటారు. జిందాల్ కంపెనీ వల్ల సజీవంగా నిర్వాసితులు కాలేదు అని సరిపెట్టుకుందామా? ❋

వ్యాసం

◆ పాణి

# గ్రీన్‌హంట్ ఆపరేషన్ -
## మావోయిస్టు సామాజిక ప్రయోగంపై దాడి

పాము తన పిల్లలను తానే తింటుందని అంటారు. స్వజన భక్షణకు అనేది ఎంత క్రూరమైందో చెప్పడానికి పల్లెల్లో ఈ మాట ఉపయోగిస్తారు. దానికి ఒక కారణాన్ని కూడా చెప్పుకుంటారు. ఆ సమయంలో పాము కళ్లకు పొర కమ్మి ఉంటుందని, విపరీతమైన ఆకలి ఉంటుందని, దాంతో స్వపర భేదం తెలియదని అంటారు. పాము తన పిల్లలనే తాను తినడం ప్రస్తుతం కాదిక్కడ. ఆ సామెతకు ప్రజలు చెప్పే అర్థమే ముఖ్యమైనది. స్వజన భక్షణలాంటి పనికి ఎవరైనా పూనుకుంటే ఈ అర్థం పలికించడానికే పై సామెత వాడుతారు. జానపదులు ఒక మనిషికో, ఒక చర్యకో పరిమితమై మాట్లాడరని మనందరికి తెలుసు. వాళ్లు దాన్నొక జీవిత విశేషంగా భావిస్తారు. ..అంటే మానవ జీవితంలో , సమాజంలో ఉండవలసిన లేదా ఉండకూడని వాటి గురించిన వ్యాఖ్యగా ఇలాంటి సామెతలు చెప్తుంటారు.

ఆపరేషన్ గ్రీన్‌హంట్ గురించి ఆలోచిస్తుంటే రాజ్య వ్యవస్థ స్వభావాన్ని వివరించడానికి ఈ జానపద, జీవన పరిశీలన బాగుంటుందనిపించింది. అయితే ఇలాంటి ప్రతీకాత్మక వ్యాఖ్యల్లో ఒక ఇబ్బంది కూడా ఉంటుంది. ఏదైనా బాగుండటం .. బాగలేకపోవడం గురించి ఆధునిక చింతనకూ, జానపదుల వివేచనకూ మధ్య పోలిక ఉండవచ్చుగాని దానితోనే సంతృప్తిపొందలేం. రాజ్యవ్యవస్థ పాము వంటిదని, దాని పడగ నీడన ఇతర వ్యవస్థలు ...మొత్తంగా సమాజమే బాగా లేదనే నిర్ధారణకు రావచ్చు. పాము తన పిల్లలను తానే తిన్నట్టు రాజ్యం తన ప్రజలను తానే సర్పంలాగా మింగేస్తున్నదనీ చెప్పగలం.

అయితే పాముకు అది ప్రాకృతిక లక్షణం. ఆధునిక రాజ్యం తన ప్రజలను తానే తుడిచేసే స్థితిలో ఎందుకు ఉన్నదో వివరించవలసి ఉంటుంది.

రాజకీయార్థిక పరిభాషలోనైతే రాజ్యం అణచివేత సాధనం . ఈ మాట అనగానే కొందరికి కోపం రావచ్చు. రాజ్యానికి సంక్షేమ స్వభావం కూడా ఉన్నదని గుర్తు చేయవచ్చు. రాజ్యం పాలకవర్గాల చేతిలో పనిముట్టని, అణచివేత సాధనమనే సూత్రీకరణ ఆధునిక పెట్టుబడిదారీయుగాన్ని ఉద్దేశించే ముందుకు వచ్చింది. ఆ రాజ్యానికి అణచివేత స్వభావంతోపాటు , సంక్షేమ లక్షణం కూడా ఉన్నమాట నిజమే. అందువల్లే పాత రాజ్యాల కంటే చాలా తీవ్రమైన, సంక్లిష్టమైన అణచివేత ప్రయోగించగలుగుతోంది. ఆధునిక సమాజం ఎంత క్లిష్టమైనదో ఆధునిక రాజ్యం అణచివేత అంత సంక్లిష్టమైనది. పాత రాజ్యం ప్రజల మీద చేసిన దాడులు, లేదా యుద్ధాల వెనుక ఆర్థిక ప్రయోజనాలున్నా సరళంగా ఉండేవి. ఇప్పుడట్లా కాదు. ఆంధ్రప్రదేశ్‌లో నలభై ఏళ్ల కింద విప్లవోద్యమం మీద మొదలైన అణచివేత గ్రీన్‌హంట్ రూపం తీసుకోవడమే దీనికి మంచి ఉదాహరణ.

గ్రీన్‌హంట్ రూపంలో రాజ్యం అణచివేత గుణాత్మక దశకు చేరుకున్నది. అణచివేత, హక్కుల ఉల్లంఘన , రాజ్యాంగ ధిక్కారం అనే పరిభాష ఇప్పుడు ఎంత మాత్రం సరిపోదు. ఆధునిక రాజ్యం తను ప్రకటించుకున్న ఉదారవాద చట్రాన్ని నిర్మొహమాటంగా కాలదన్నిన సన్నివేశమిది. అధికార మార్పిడి తర్వాత భారత ప్రభుత్వం అమలు చేస్తున్న అతి పెద్ద అణచివేత ప్రక్రియ గ్రీన్‌హంట్. నిజానికి దీన్ని అణచివేత అనడం ద్వారా దాని స్వభావాన్ని సొంతం వివరించలేం.

అధికార మార్పిడి తర్వాత దేశ సరిహద్దు రక్షణ పేరుతో చేసిన యుద్ధాల తర్వాత ప్రభుత్వం మళ్లీ అంత పెద్ద యుద్ధాన్ని దేశంలోపల గ్రీన్‌హంట్ రూపంలో సాగిస్తోంది. మన్మోహన్‌సింగ్, చిదంబరం ఇప్పటికే చాలా సార్లు దీని గురించి చెప్పారు. ఇవాళ దేశానికి బైటి నుంచి ఉన్న ప్రమాదానికంటే అంతర్గత అభద్రతే ప్రమాదమనడం ద్వారా ఈ యుద్ధ తీవ్రతను వాళ్లు నేరుగా చెప్తున్నారు. 'అంతర్గత అభద్రత 'అనే మాట పూర్తి నిజం.మావోయిస్టుల రాజకీయార్థిక, సైనిక వ్యూహం వల్ల పాలకులకు తలెత్తిన అభద్రత ఇది.

ఇది ఎంత తీవ్రమైనదంటే ఒకప్పుడు రాష్ట్రప్రభుత్వాలు, శాంతిభద్రతల పోలీసులు జక్యం చేసుకొని విప్లవోద్యమాన్ని అణచివేసే దశ నుంచి కేంద్ర ప్రభుత్వం నేరుగా వేల కోట్ల రూపాయలు, లక్షల పారా మిలటరీని మోహరించి యుద్ధానికి దిగే పరిస్థితి తలెత్తింది. ఇవాళ భారత పాలకులకు ఈ అంతర్గత అభద్రత తప్ప బైటి నుంచి ఏరకమైన ఒత్తిళ్లు లేవు. కాశ్మీర్, పాకిస్తాన్ బూచి తప్ప మరేమీ లేదు. ఎందుకంటే అన్ని దేశాల పాలకులూ ప్రపంచీకరణ అనే ప్రపంచ పెట్టుబడిదారీ చట్రంలో భాగమైనవే. సామ్రాజ్యవాద దేశాల రాజకీయార్థిక విధానాలకు లోబడినవే. ఇందులో భారత దేశం చాలా ముందున్నది. అందు వల్ల ఇవాళ భారత పాలకులకు బైట వప్పందాలు, వడంబడికలు, లొంగుబాట్లు తప్ప మరో విధానం లేదు. అందువల్లనే అంతర్గత అభద్రత ప్రధానమై కూచుంది. ఇది మావోయిస్టుల నుంచి పొంచి ఉన్నదని బహిరంగంగానే ప్రకటిస్తున్నారు. అభద్రత అంటే మామూలుగా సైనికపరమైన అర్థం వస్తుంది. అయితే దీన్ని సైనిక కలాపంగా, దాని వల్ల జరుగుతున్న అపారమైన మానవహననంగా, ముఖ్యంగా ఆదివాసీ స్థావరాల్లోని విధ్వంసంగా చూస్తూనే దాని రాజకీయార్థిక పునాదిని గురి చూడవలసి ఉన్నది. పార్లమెంటరీ వ్యవస్థ రాజకీయంగా, ఆర్థికంగా ప్రజలకు ఎంత గుదిబండగా మారిందీ, ఎంత అమానుష దోపిడీశక్తిగా తయారైందీ ,దాన్ని కప్పిపుచ్చుకోడానికి ఎలాంటి సైనికపద్ధతులకు పాల్పడేదీ గ్రీన్‌హంట్ ద్వారా తేటతెల్లమవుతోంది.

* * *

పార్లమెంటరీ ప్రజాస్వామ్యాన్ని పరీక్షకు పెడుతూ అనేక పరిణామాలు మన దేశంలో అధికార మార్పిడి నుండే మొదలయ్యాయి.. ప్రజాస్వామ్యం మీద విమర్శగా అనేక పోరాటాలు సాగుతూ వచ్చాయి. కాని దాని సారాన్ని విప్పి చెప్పిందీ- ప్రత్యామ్నాయంగా ముందుకు వచ్చిందీ నక్సలైట్ ఉద్యమం మాత్రమే. పార్లమెంటరీ ప్రజాస్వామ్యం చుట్టూ ఉన్న ఒక్కొక్క పొరనూ విప్పి దాని నిజ రూపాన్ని చూపింది.

ఉద్యమాలు మామూలుగా ఒక విమర్శ ఎదుర్కొంటుంటాయి. ఈ వ్యవస్థ బాగా లేదు, కొత్త వ్యవస్థ కావాలని అంటాయేగాని ఈ వ్యవస్థను విమర్శించినంత పదునుగా, తార్కికంగా కొత్త వ్యవస్థ రూపు రేఖలను వివరించలేవు, చెప్పి ఒప్పించలేవు..అని. ఈ ఆరోపణ మార్క్సిస్టు ఉద్యమాలను ఉద్దేశించి అంటున్నామని విమర్శకులకు బాగానే తెలుసు. మార్క్సిస్టు ఉద్యమాలంటే మన దగ్గర నక్సలైట్ ఉద్యమాలే.

ఈ వ్యవస్థ బాగా లేదని ఎవరైనా అనగలరేమోగాని దీన్ని పూర్తిగా తిరస్కరించి కొత్తది కావాలని కలగనడానికి చాలా ధైర్యం కావాలి. తను కంటున్నది కలే అయినా దాన్ని ఎప్పటికైనా నిజం చేయగల తన లోపలి శక్తి గురించి తెలియాలి. దాన్ని వెలికి తీయడంలోని సకల యాతనలతో సహా తన సంసిద్ధత ఏమిటో ముందు తెలిసి ఉండాలి. అట్లా తెలియడం వల్లనే కొత్త వ్యవస్థ గురించి ఊహలు బయలు దేరుతాయి. ఆధునిక స్పృహతో తాను చేయబోయే సాహసిక ప్రయోగంలో రేపటి వ్యవస్థ అంకురిస్తుంది.

నూతన వ్యవస్థ గురించి మాట్లాడే వాళ్లు కూడా నక్సలైట్ల మీద అనేక ప్రశ్నలు, సందేహాలు , అసంతృప్తులు సంధిస్తుంటారు. నలభై ఏళ్ల పాటు నడిపిన ఉద్యమం ఏం సాధించింది ? అనే ప్రశ్నతోఅవి ప్రారంభమవుతుంటాయి. ఇవి చాలా లోతైనవి. ఏవి జీవన తలాలో ఏ

ఫలితాలు వచ్చాయో చాలా సంయమనంగా వెతకాల్సి ఉంటుంది. ముందు మన కళ్లకు లోకం కట్టిన గంతలను విప్పుకోవాలి. మనకు మనమే కట్టుకున్న గంతలనూ తొలగించుకోవాలి. నిజంగా సమాజంలో ఏం జరిగిందో గుర్తించడానికి , గుర్తించిన దాన్ని విలువ కట్టడానికి ఇది చాలా అవసరం.

కేంద్ర ప్రభుత్వం చేస్తున్న ఆపరేషన్ గ్రీన్ హంట్ ఒక్కటి చాలు - మన పార్లమెంటరీ ప్రజాస్వామ్యం ఎలాంటిదో, ఎందుకు బాగా లేదో అర్థం చేసుకోడానికి. అబూజ్‌మాడ్‌ను పట్టుకోవాలని ప్రభుత్వం చేస్తున్న దాడిలో రెండు మూడు అంశాలున్నాయి. నలభైఏళ్ల కింద నాలుగు తాలూకాల్లో కూడా లేని ఒక రాజకీయ ఉద్యమం మీదికి ఇవ్వాళ అత్యంత శక్తివంతమైన కేంద్ర ప్రభుత్వం యుద్ధానికి దిగింది. గ్రీన్‌హంట్‌ను కేవలం ఒక సైనికచర్యగానే చూసేవాళ్లకు అందులో రెండు పక్షాలు మాత్రమే కనిపించవచ్చు. అట్లయినా సైనికలాపానికి కాలు దువ్వుతున్నదీ, అవతలి పక్షాన్ని మూడేళ్లలో, నాలుగేళ్లలో తుడిచిపెట్టేస్తానని ప్రకటిస్తున్నదీ ప్రభుత్వం మాత్రమే. ప్రభుత్వం చేస్తున్న ఈ ప్రకటన, ఈ వేట ఏం సూచిస్తున్నాయి? ప్రజాస్వామ్యం, ఆధునికత, నాగరికత, సంక్షేమం లాంటి తీయని మాటల వెనుక దాగి ఉన్న మన పాలకుల అసలు రంగు నక్సలైట్ల పోరాటం ద్వారానే బైటపడింది. భారత ప్రభుత్వం తన ప్రజల మీదికి లక్షల బలగాలను మోహరించగల యుద్ధోన్మాది అని బైటపెట్టడమే విప్లవోద్యమం సాధించిన విజయం. గ్రీన్‌హంట్ గత ఏడాది సెప్టెంబర్‌లో ఛత్తీస్‌ఘడ్ దంతెవాడలో మొదలైనప్పుడు 4000మంది సీఆర్‌పీఎఫ్, 600ల మంది కోబ్రాల కంమెండోలు పాల్గొన్నారు. నవంబర్ నాటికి 70 మంది ఆదివాసులను చంపేశారు. జనవరి కల్లా 107 మంది మావోయిస్టులను కాల్చేసినట్టు ఆ రాష్ట్ర ప్రభుత్వమే చెప్పుకుంది. బస్తర్‌లో 20 వేల పారామిలటరీ బలగాలను మావోయిస్టులపై యుద్ధానికి కేటాయించినట్లు సమాచారం.ఈ పోరాటంలో గెలుపోటములు ఏమైనా ఇప్పటికి నక్సలైట్లు భారత ప్రభుత్వ యుద్ధ స్వభావాన్ని ఎత్తి చూపడం వల్ల వాళ్లు సాధించిన విజయం చిన్నది కాదు. ఒక పక్క మా ప్రజలపై మేం యుద్ధం చేయమని అంటూనే, ఆఖరి అస్త్రంగానే సైన్యాన్ని ప్రయోగిస్తామని అంటూనే పరాయి దేశంపై యుద్ధం చేస్తున్న పాలక వ్యూహాన్ని ఏమనాలి? యుద్ధాలన్నీ రాజకీయాల కొనసాగింపే. గ్రీన్‌హంట్ అనేది అరవైఏళ్ల వలసానంతర రాజకీయాలకు కొనసాగింపు. నలభైఏళ్లుగా ఆ రాజకీయాల మీద గెలుపు ఓటముల మధ్య, అలుపెరగకుండా పోరుడుతున్న విప్లవరాజకీయాల పర్యవసానం. ఇట్లా గుర్తించకపోతే గ్రీన్‌హంట్ యుద్ధమని తెలియదు.

ఈ మాట అనకపోతే ప్రభుత్వం అమాయక ఆదివాసులను నక్సలైట్ల బూచి చూపి వేధిస్తున్నదనీ, చంపుతున్నదనీ, వారిని అడవులనుంచి తరిమేస్తున్నదనీ సరిపెట్టుకొన్నట్టవుతుంది. ఇది కూడా ఉన్నది. ఛత్తీస్‌ఘడ్‌లోనే గ్రీన్‌హంట్ మొదలయ్యాక ఆదివాసీ సమాజంలో ఎన్ని అకృత్యాలు జరిగిందీ, ఎంత విధ్వంసం జరిగిందీ చాలా నివేదికలు వచ్చాయి. అనేకమంది ఆదివాసీలు చనిపోయారు. ఇందులో మావోయిస్టు రాజకీయ, సైనిక నిర్మాణాల్లో ఉన్న ఆదివాసులేగాక సాధారణ ఆదివాసులు కూడా తప్పక ఉంటారు.

నక్సలైట్ల పేరుతో అమాయక ఆదివాసులను చంపేస్తున్నారనే ఉదారవాద వైఖరితో గ్రీన్‌హంట్‌ను సమగ్రంగా అర్థం చేసుకోవడం కష్టం. దాన్ని నిలువరించడం మరీ కష్టం. ఆదివాసులు ఒక పెద్ద సాయుధ పోరాటాన్ని నిర్వహిస్తున్నారని, అక్కడొక రాజకీయసామాజిక ప్రక్రియ నడుస్తున్నదనే వాస్తవం నుంచి బయల్దేరాలి . ఆదివాసులు దండకారణ్యాం కేంద్రంగా తెలంగాణ, ఒరిస్సా, బెంగాల్ అంతటా సుమారు రెండున్నర దశాబ్దాలుగా సాయుధపోరాటంలో ఉన్నారు. భారత ఉపఖండంలో వలస పాలన కాలం నుంచి సాగిన ఆదివాసీ సాయుధపోరాటాలకు ఇప్పుడు దండకారణ్యంలో గాని, ఆంధ్ర ఒరిస్సా సరిహద్దులో గాని, లాల్‌ఘడ్‌లోగాని సాగుతున్న ఆదివాసీ సాయుధపోరాటాలకు పరిమాణంలోనూ, స్వభావంలోనూ చాలా తేడా ఉన్నది. వెన్నెలకంటి రాఘవయ్య రాసిన ట్రైబల్ రివోల్ట్స్ అనే రచనలో 1778 బీహార్‌లో ఆదివాసులు బ్రిటీష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా చేసిన సాయుధపోరాటం నుంచి శ్రీకాకుళ ఆదివాసీ సాయుధపోరాటం దాకా సుమారు 80కి పైగా తిరుగుబాట్లను విశ్లేషించారు. ఆదివాసీ తిరుగుబాట్లన్నీ ఏదో ఒక దశలో సాయుధ రూపాన్ని తీసుకున్నవే. వీటిలో కొన్ని రోజులపాటే సాగి ఓడిపోయినవీ ఉన్నాయి. సాయుధరూపం, త్యాగం, ఓటమి అనే లక్షణాలు ఆదివాసీ ఉద్యమాల సాధారణాంశాలని చెప్పవచ్చు.

భారతదేశంలో ఆదివాసీ పోరాటాలను స్థూలంగా మూడు దశల్లో చూడవచ్చు. ఒకటి : రాజరికకాలంలో సామ్రాజ్యాల విస్తరణకు ఆదివాసీ ప్రాంతాల్లో జరిగిన చొరబాటు. దీనికి మంచి ఉదాహరణ సమ్మక్క సారలమ్మ తిరుగుబాటులాంటివి.

రెండు: వలసపాలనకాలంలో అటవీ చట్టాలరూపంలో జరిగిన చొరబాటు. వెన్నెలకంటి రాఘవయ్య రాసిన ఆదివాసీ తిరుగుబాట్లన్నీ దీనికిందికి వస్తాయి. ఆదివాసులు తమదైన సాంస్కృతిక, ఆర్థిక, రాజకీయ వ్యవస్థలను కాపాడుకోడానికి సాయుధ తిరుగాబాట్లు చేశారు. ఆదివాసీ సమాజాలకు తమదైన స్వయంపోషక ఆర్థిక వ్యవస్థ ఉన్నది. తమలో తాము ఇచ్చిపుచ్చుకోవడం, ప్రకృతి నుంచి తీసుకోవడమేగాని బైటి ప్రాంతాలతో ఇచ్చిపుచ్చుకొనే అవకాశంలేని వ్యవస్థ అది. ఒకరకంగా బంధవ్యవస్థని చెప్పవచ్చు. మొదటిసారిగా వలసపాలన వారి ఆర్థికవ్యవస్థలో జోక్యం చేసుకున్నది. దాని కోసం వారి రాజ్యవ్యవస్థపై దాడి చేసింది. ఆదివాసుల జీవనమూలమైన స్వయంపాలనకు చరిత్రలో తొలిసారి చాలా పెద్ద ఎత్తున, ఆధునిక రూపంలో విఘాతం కలిగింది వలసపాలనలోనే. దాన్ని కాపాడుకోడానికి తిరుగుబాట్లు చేసి అసాధారణమైన త్యాగాలు చేశారు. వాళ్ల పోరాటాలు వలసపాలన చేతిలో ఓడిపోయాయి. ఆ మేరకు రాజరిక కాలంలోని చొరబాట్ల కంటే వలసవాద చొరబాటు ఆదివాసీ సమాజంలో చాలా మార్పులు తెచ్చింది. ఆదివాసీ బంధవ్యవస్థకు విఘాతం కలిగింది. అయినా వారి స్వయంపాలన అనే జీవన మూలం అంతరించి పోలేదు.

మూడవది : వలసానంతర ఆధిపత్యశక్తుల జొరబాటు. దానికి వ్యతిరేకంగా సాగిన ఉద్యమాలకు శ్రీకాకుళ ఆదివాసీ సాయుధపోరాటం ఉజ్వల ఉదాహరణ. పైన చెప్పిన వాటికీ-శ్రీకాకుళపోరాటంతో ప్రారంభమై ఇవాళ గ్రీన్‌హంట్ అనే యుద్ధాన్ని ఎదుర్కొంటున్న ఆదివాసీ పోరాటాలకు ముఖ్యమైన తేడా ఉన్నది. ఈ సాయుధపోరాటం కార్మికవర్గ పార్టీ నాయకత్వంలో సాగుతున్నది. అందు వల్లనే దశాబ్దాలుగా ఈ పోరాటాలు నిలదొక్కుకొని విస్తరిస్తున్నాయి. బహుశా భారతదేశంలోని ఇతర ఆదివాసీ పోరాటాలేగాదు, మరే ఇతర పోరాటాలు కూడా ..అవి సాయుధ రూపంలో సాగినా, చట్టపరిధిలో సాగినా ఇంత సుదీర్ఘ కాలం నడవలేదు.. ఇప్పటి పోరాటాలకు కమ్యూనిస్టుపార్టీ నాయకత్వం వహించడం వల్లనే సుదీర్ఘ కొనసాగింపు సాధ్యమైంది. అట్లాగే పాత ఆదివాసీ సాయుధపోరాటాల్లో స్వయంపాలన అనే ఆకాంక్ష ఉంటే కమ్యూనిస్టుపార్టీ నాయకత్వం వల్ల ఈ పోరాటంలో దానితోపాటు సమాజ విముక్తి అనే ఆశయం కేంద్ర స్థానంలోకి వచ్చింది. అయితే ఆదివాసీల్లోని స్వయంపాలన అనే జీవనమూలం మీద ఆధారపడి సాగుతున్న వర్గపోరాటం ఇది. ఆదివాసులు విప్లవ పోరాటం నిర్వహిస్తున్నందు వల్ల వారి ఉద్యమానికి ఒక రాజకీయార్థిక వ్యూహం, ఒక సైనిక వ్యూహం రూపొందాయి. అందువల్లనే వలసపాలన కాలంలోగాని ఆ తర్వాత గాని ఎప్పుడూ ఆదివాసీలు ఎదుర్కోనంత భారీస్థాయిలో అధునాతన భారత సైన్యాన్ని ఇప్పటికి నెలల తరబడి ఈ యుద్ధంలోఎదుర్కొంటున్నారు. 'అంతర్గత అభద్రత' ఏ స్థాయిలో

పెరిగిపోయిందో అదే స్థాయిలో భారతపాలక వర్గం అంతర్గత యుద్ధానికి దిగిన సన్నివేశమిది.

పార్లమెంటరీ రాజకీయాలకు ప్రత్యామ్నాయంగా వచ్చిన విప్లవోద్యమం రాజకీయార్థిక రంగంలో నిజమైన ప్రత్యామ్నాయంగా , ఆచరణీయంగా ఎదగడంతో అంతర్గత అభద్రత పెరిగిపోయింది. విప్లవోద్యమం తొలి దశలో ప్రజా సమస్యల మీద చేపట్టిన పోరాటాలు ఒక క్రమంలో వ్యవస్థను సమూలంగా మార్చాలంటే దేనికే ప్రత్యామ్నాయాన్ని రచించాలి? అదెలాంటి ప్రత్యామ్నాయమై ఉండాలి? దాన్నెలా ఆచరణల నిజం చేయాలి? అనే వాస్తవిక, సిద్ధాంతపరమైన ప్రశ్నలకు ఆదివాసీ ప్రాంతాల్లో అద్భుతమైన సమాధానాలు కనుక్కోవడం ప్రారంభించాక ఆ 'అంతర్గత అభద్రత' పెరిగిపోయింది.

పెట్టుబడిదారీ అభివృద్ధికి..దాని ఉన్నత రూపమైన సామ్రాజ్యవాద విధ్వంసానికి ప్రజల ప్రత్యామ్నాయాన్ని అమలు చేయాలనుకోవడం వల్ల పాలకులకు అంతర్గత రాజకీయ అభద్రత పెరిగిపోయింది. భారతదేశంలో జాతీయ, ప్రాంతీయ రాజకీయ పార్టీలన్నీ ఈ సంఘర్షణలో ఒకవైపు ఉంటే ఒక్క మావోయిస్టు పార్టీయే మరో పక్క ఉన్నది.

భారత బూర్జువా వర్గం తన దోపిడీ కోసం, సామ్రాజ్యవాద దోపిడీ కోసం అమలు చేస్తున్న విధానాలను నిర్ద్వంద్వంగా వ్యతిరేకిస్తున్న బుద్ధిజీవులకు ఇవాళ ఒక రాజకీయశక్తిగా మావోయిస్టుల వైఖరి, అవగాహన, ఆచరణ వెలుగుచూపుతున్నదనడంలో సందేహం లేదు. ఇందులో వారి ఆలోచనా సంస్కారం, ప్రజాపక్షపాతం అమూల్యమైనవే అయినా దేశవ్యాప్తంగా అలాంటి వారి వాదన ప్రభావశీలంగా విస్తరించడానికి మావోయిస్టు ఉద్యమంలోని ప్రత్యామ్నాయశక్తి దోహదపడుతున్నది. అయితే మావోయిస్టుల ప్రత్యామ్నాయంపట్ల ఎవరికైనా అసంతృప్తి ఉండొచ్చు , సమ్మతి ఉండకపోవచ్చు గాని దాన్ని ప్రత్యామ్నాయమని, అది కేవలం రాతకోతల్లో మిగిలిపోలేదని అంగీకరించడానికి అభ్యంతరం ఉండదనుకుంటాను. ఈ పరిమితులతో సహా ఆదివాసీల జనతన సర్కార్ రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాలను నిజంగానే అంతర్గత అభద్రతకు గురి చేసింది.

సుదీర్ఘకాలం వలసవాదంతో పోట్లాడాక అధికారంలోకి వచ్చిన భారత బూర్జువావర్గం పాటించే ప్రజాస్వామ్యం ఆ వర్గ ఆవిర్భవం వలె, దాని విస్తరణ వలె పరమ వికృతమైనది. ఎప్పుడు ఎక్కడ ప్రజాస్వామ్యం ఉంటుందో, ఎక్కడినుంచి ఎట్లా నియంతృత్వం మొదలవుతుందో చెప్పడం కష్టమే. ప్రభుత్వాన్ని విమర్శించే హక్కు మన దేశంలో బాగానే ఉన్నట్టు కనిపించినా ప్రజలు ప్రేక్షకులుగా ఆ పని చేయాల్సిందే. పాలనా వ్యవహారాల జోలికి పోకూడదు. అట్లా పోతే రాజ్యానికి తీవ్రమైన ఆగ్రహం కలుగుతుంది.

ఆదివాసులు ఏకంగా తమ సంస్కృతిలోని స్వయంపాలనను విప్లవంలో భాగంగా విప్లవరాజ్యానికి బీజప్రాయమైన అంకురార్పణ చేశారు. అంటే ..సమాజమంతా బూర్జువా పాలనాయంత్రాంగం కింద , దానికి సంబంధించిన రాజకీయార్థిక విధానాల కింద అణగారి ఉంటే ఆదివాసులు వాటికి భిన్నంగా ఒక సామాజిక ప్రయోగాన్ని ప్రారంభించారు. పాలకుల అభివృద్ధి వ్యూహానికి భౌగోళికంగా, సాంస్కృతికంగా దూరంగా ఉన్నందు వల్ల, విప్లవపార్టీ దార్శనికత వల్ల ఆదివాసులకిది సాధ్యమైంది.

ఇది ఎట్లా ప్రత్యామ్నాయమో వివరించడం అవసరం. పైన చెప్పిన మూడు రకాల చొరబాట్లలో మూడోది చాలా విభిన్నమైనది. గనుల తవ్వకం, పరిశ్రమల స్థాపన, భారీ ఆనకట్టల నిర్మాణం అనే పేరుతో ఆదివాసేతర శక్తుల చొరబాటు ఇది. అంటే మైదాన ప్రాంతాల్లో సాగుతున్న పెట్టుబడిదారీ అభివృద్ధి నమూనా ఆదివాసీ ప్రాంతాలకు కూడా విస్తరించడం అన్నమాట. ఆదివాసీ సమాజం కాబట్టి స్థానిక భూస్వామ్య ఆధిపత్యం, ఆపక్కనే అనుకొని ఉండే ఆదివాసేతరుల ఆధిపత్యం, దోపిడీ వగైరా తప్పక ఉండేవే. వీటికి వ్యతిరేకంగా విప్లవోద్యమం అభివృద్ధి అనే భావనను ప్రజల వైపు నుంచి ( ఆదివాసుల వైపు నుంచి) చూసింది. ముఖ్యంగా 1994 నుంచి ఈ అవగాహన మొదలైంది. గ్రామరాజ్య కమిటీలు, గ్రామరక్షక దళాలు, సహకార సంస్థలు మొదలైన రూపాల ద్వారా వారు 1999 దాకా చాలా పెద్ద ఎత్తున విజయాలు సాధించారు. ఆ తర్వాత తీవ్ర నిర్బంధం మధ్య వేగం కుంటుబడ్డా ఆ నమూనా ఒక ప్రాంతం నుంచి మరో ప్రాంతానికి విస్తరిస్తున్నట్లు పార్టీ సాహిత్యం ఆధారంగానే చాలా చెప్పవచ్చు. మొత్తం మీద ఉద్యమ ప్రాంతమంతా జనతన సర్కార్ అనే విప్లవ రాజ్యాధికారం నెలకొన్నది.

ఈ ఆధారాల వల్లనే అది ప్రత్యామ్నాయమని చెప్పడం కొంచెం పాపులర్ వ్యవహారమవుతుంది. దీని వెనుక విప్లవోద్యమానికి ఉన్న అవగాహన చాలా ముఖ్యం. ఏడేళ్ల కింద వచ్చిన ' ఈ అడవి మాదే ' అనే పుస్తకంలో ఉద్యమ అవగాహన స్పష్టంగా ఉన్నది. ' దండకారణ్యంలో మానవ, ప్రకృతి వనరులను చిత్తానుసారం కొల్లగొడుతూ, దినదినం తమ జీవితాలను వినాశనంలోకి నెడుతున్న దోపిడీ పాలక వర్గాల పాలనను కూలదోయడానికి ప్రజలు పోరాడుతూనే , మరోపక్క ఎలాంటి విద్య, సాంకేతిక నైపుణ్యం, పెట్టుబడి , ఆర్థిక సహాయం లేని ప్రజలు , తమ అభివృద్ధి కొరకు ఒక కొత్త పోరాట రూపాన్ని ప్రారంభించారు.

ఇక్కడ కొనసాగుతున్న అభివృద్ధి , సహకార కార్యక్రమాల లక్ష్యం , కేవలం ఉత్పత్తిని పెంచడం, తాత్కాలికంగా ప్రజలకు ఉపయోగ పడటం ఎంత మాత్రం కాదు. ప్రజల అభివృద్ధి, సామాజిక అభివృద్ధి గురించి చర్చించేటప్పుడు దోపిడీ రాజ్యంలో ప్రజల అభివృద్ధా? దోపిడీ లేని రాజ్యంలో ప్రజ అభివృద్ధా? అనే సమస్యను కార్మిక వర్గ పార్టీ పరిశీలిస్తుంది. ..'

ఆ తర్వాత ఇంకో విలువైన మాట అన్నారు. 'ప్రజలు ఈ కార్యక్రమాలను ప్రధానంగా తమ శ్రమ సహకారంపై, స్థానిక పదార్థిక, ఆర్థిక వనరులపై స్వంత అనుభవంపై ఆధారపడి కొనసాగిస్తున్నారు. ప్రజల పరస్పర సహాయం. సహకారం ఈ ఉద్యమానికి పునాది అయితే , సమిష్టి తత్వం ఊపిరి లాంటిది...' . ప్రజా పంచాయితీలు, న్యాయవ్యవస్థలు , విద్యావ్యవస్థలు, సాంస్కృతిక వ్యవస్థల నిర్మాణం కూడా పైన చెప్పిన అవగాహన మీద ఆధారపడి చాలా జరిగాయి.

విప్లవోద్యమంలో భాగంగా ఆదివాసులు చేపట్టిన కార్యకలాపాలు, వాటి వెనుక ఉన్న అవగాహన కలిపి చూస్తే ఒక అభివృద్ధి నమూనాకు ఉండవలసిన చట్రం, దానికి సంబంధించిన ఆలోచనాపునాది ఉన్నట్టు అర్థమవుతుంది. అది - వలసపాలన కాలంలో, ఆ తర్వాతా రాజ్యం ఆదివాసీ ప్రాంతాల్లో చేపట్టిన ' అభివృద్ధి' నమూనాకు భిన్నమైనది. ఆదివాసులకు సంబంధించినంత వరకు పరాయిది. అయితే ఆదివాసులు చేపట్టిన ప్రత్యామ్నాయ అభివృద్ధి నమూనా గురించి రెండు ప్రశ్నలు ఎదురవుతాయి. ఒకటి: ఆ నమూనా సమాజమంతటికీ ప్రత్యామ్నాయమవుతుందా? ఆదివాసీల వరకైనా అదే పూర్తి ( అది రూపొందిన అవగాహన) సరైనా నమూనా అవుతుందా? ఈ ప్రశ్నల గురించి తర్వాత మరో చోట చర్చిచడం బాగుటుంది. గ్రీన్‌హంట్‌కు నేపథ్యం మావోయిస్టుల మందుపాతరలు, ఇన్‌ఫార్మర్ హత్యలు వగైరా కాదు. ఆదివాలసుల మధ్య చేపట్టిన అభివృద్ధి నమూనాయే కేంద్రాన్ని యుద్ధానికి పురికొలిపింది.

మావోయిస్టుల విప్లవ వ్యూహం వల్ల ఆదివాసీ ప్రాంతంలో ఇదంతా జరుగుతున్నదిగాని , ఈ ప్రత్యామ్నాయం ఇక్కడ కాకుండా వేరే ప్రాంతాల్లో అమలైనా అక్కడా ప్రభుత్వం గ్రీన్‌హంట్ తరహా యుద్ధం చేసేదే. కాకపోతే మావోయిస్టుల ప్రత్యామ్నాయ అభివృద్ధికి ఆదివాసీ ప్రాంతం అనుకూలించినట్టే; పెట్టుబడిదారీ, సామ్రాజ్యవాద అనుకూల దోపిడీ గత ఇరవై ఏళ్లుగా ఆదివాసీ ప్రాంతాల్లో ప్రారంభమైంది. అయితే మొత్తగా ఈ

వ్యవస్థలో జరుగుతున్న దోపిడీలో ఆదివాసీ ప్రాంతాల వనరుల దోపిడీ ఒక భాగం మాత్రమే. దోపిడీ వర్గాలు అదనపు విలువను భారీ స్థాయిలో కైవసం చేసుకుంటున్న ప్రాంతాలు వేరే ఉన్నాయి. అయితే ఆదివాసీ ప్రాంతాల్లోకి చొరబడి , అక్కడి నుండి వాళ్లను నిర్వాసితులను చేసి, వాళ్ల నూతన అభివృద్ధి నమూనాను ధ్వంసం చేయడం, దానికోసం యుద్ధానికి దిగడం అటవీ ప్రాంతాల్లో ముమ్మరంగా సాగుతోంది. ప్రపంచవ్యాప్తంగా సామ్రాజ్యవాదం స్వయంపోషక వ్యవస్థలను తన ఆధీనంలోకి తెచ్చుకొని, అక్కడికి పెట్టుబడిని తరలించి మార్కెట్ వ్యవస్థలుగా మార్చివేసే ప్రక్రియ పరమ విధ్వంస పూరితంగా నడుస్తున్నది. గత ఇరవై ఏళ్లుగా ఇది చాలా ముందుకు వెళ్లిపోయింది. బస్తర్‌లో, దండకారణ్యంలో, లాల్‌ఘడ్‌లో పాత బంధవ్యవస్థలు బలహీనడటం, ఆ వ్యవస్థల్లోని ప్రాచీన జీవనమూలాల మీద ఆధారపడి నూతన వ్యవస్థల నిర్మాణానికి ప్రయత్నించడం ఒకేసారి జరిగాయి . ఒక ప్రత్యామ్నాయ అభివృద్ధి నమూనా రూపొందుతున్నందు వల్ల 'అంతర్గత అభద్రతకు-శాంతిభద్రతల పరిరక్షణ'కు అటవీ ప్రాంతం వేదిక అయింది.

గ్రీన్‌హంట్ కంటే ముందు ఆదివాసీల మీద జరిగిన సాల్వాజుడుం దాడులను ఈ సందర్భంలో గుర్తు చేసుకోవాలి. సాల్వాజుడుం ఆదివాసులపై భయానకమైన విధ్వసాలకు పాల్పడింది. అయితే ఆదివాసులు గ్రామరాజ్య కమిటీల ద్వారా చేపట్టిన అభివృద్ధి కార్యకలాపాలను, అభివృద్ధి పథకాలను, ఫలాలను సాల్వాజుడుం లక్ష్యం చేసుకున్నదని మర్చిపోరాదు. ఆదివాసులు దాన్ని సవ్యంగా అర్థం చేసున్నారు. శక్తివంతంగా తిప్పికొట్టారు. ఆదివాసీ సమాజంలో వర్గ విభజన ప్రారంభమైందని విప్లవోద్యమం సకాలంలో మంచి విశ్లేషణ ఇవ్వడం వల్ల సాల్వాజుడుంను ఎదుర్కోవడం సాధ్యమైంది.

ఆ క్రమంలో యుద్ధబీభత్సంలోని అనుచిత చర్యలనిపించేవీ, నిజంగానే అలాంటివే కొన్ని జరిగి ఉండొచ్చు. దీన్నే మానవ హక్కుల ఉద్యమకారులు ఆదివాసీ ప్రాంతంలో అంతర్యుద్ధం అన్నారు. నిజానికి సాల్వాజుడుం నేపథ్యంలో ఆదివాసీల మధ్య అంతర్యుద్ధమనిపించవచ్చుగాని, ఇవ్వాళ మాత్రం కచ్చితంగా ఆదివాసులకు - కేంద్ర ప్రభుత్వానికి మధ్య అంతర్యుద్ధమే జరుగుతున్నది. సాల్వాజుడుం ద్వారా సాధ్యంకాని పాలక వర్గ ప్రయోజనాలు ఇప్పుడు దేశీ పెట్టుబడుదారుల, బహుళజాతి సంస్థల ప్రయోజనాల కోసం యుద్ధంగా పరిణమించింది.

విప్లవోద్యమం భూమిలేని రైతాంగానికి భూములు, మిగులు భూముల పంపిణీ, భూస్వాముల ఆధీనంలోని భూముల ఆక్రమణ అనే దున్నేవారికి భూమి అనే వ్యవసాయ విప్లవ కార్యక్రమాన్ని విస్తరించే క్రమంలో ఆదివాసీ ప్రాంతానికి చేరుకున్నది. అక్కడా ఆదివాసీ రోజువారీ అటవీ సమస్యలు, భూమి సమస్యలు, సాంస్కృతిక సమస్యల మీద పోరాడుతూ ఇవాళ మైనింగ్ రాజకీయార్థికంతో తలపడవలసి వచ్చింది. విప్లవోద్యమానికి ఇది కొత్త దశ. విప్లవం నూతన దశలోకి చేరుకున్నదని చెప్తే నమ్మని వారికి విప్లవమంటే తమ ఊహాత్మక వ్యూహమనే కళ్లజోడు ప్రతిబంధకం. ఆదివాసీ విప్లవవ్యూహంలో పరిమితులు ఉన్నమాట నిజం.

ఉదాహరణకు ఆదివాసీలతో కలిసి చేసే ఏ ప్రయత్నమైనా ప్రాచీన జీవన మూలాల మీద ఆధారపడక తప్పదు. అదే దాని గొప్ప బలం . దాన్ని దేశీయమని, స్థానిక విజ్ఞానమని కూడా పిలవవచ్చు. మార్కెట్‌ను, సరుకును, సామ్రాజ్యవాదాన్ని వ్యతిరేకించడానికి చప్పున స్ఫురించే ఒకానొక జీవన వ్యవస్థ ఆదివాసీ సామాజం. ఆదివాసీల మీద పెట్టుబడి, మార్కెట్, రాజ్యం చేసే ఏ దమనకాండనైనా వ్యతిరేకించడంలో ఈ వాదన చాలా శక్తివంతంగా నిలబడుతుంది. అసలు మనిషికి వచ్చే ఏ విపత్తునైనా మొదట అప్పటికి తనకు అనుభవంలో, జ్ఞానంలో పోగుబడి ఉన్న ఆస్త్ర శస్త్రాలతోనే పోరాడుతాడు.

)షిలో అడుగంటిపోకుండా మిగిలి ఉన్న ప్రాచీనత్వానికి నిదర్శనం.

ము వల్లే పైన ఉటంకించిన పుస్తకంలో విప్లవోద్యమ నాయకులు శ్రమపైనా, స్థానిక వనరులపైనా, పాత అనుభవ జ్ఞానంపైనా ఆధారపడి మేమీ ప్రయోగం చేస్తున్నాం అన్నారు. దానికి సమిష్టి రూపంలో ప్రజల భాగస్వామ్యం పునాది .అక్కడ తప్పక అదే ప్రాతిపదిక కావాలి. మరొకదాన్ని అమలు చేస్తే అదీ ఆదివాసులకు పరాయిదైపోతుంది. ఆ ప్రజల మధ్య ఆ నమూనా కొత్తగా నిర్మాణమవుతున్న ఒక సజీవ వ్యవస్థ. అందు వల్లనే మావోయిస్టులతో ఎన్ని విభేదాలున్న వాళ్లయినా వారి ప్రయోగం పట్ల గౌరవాన్ని ప్రకటించేది ఎందుకంటే - పెట్టుబడిదారీ నమూనాలో భాగంగా జరిగే ఏ ప్రయోగమైనా విఫలితాలనే ప్రసాదించిందని ఇప్పటికే రుజువైంది. కాబట్టి ఆశావాదులందరికీ ప్రత్యామ్నాయం పట్ల ఎదురుచూపు ఉంటుంది. దాన్ని అంగీకరించడానికి ఈ వాదన సరిపోతుంది. గ్రీన్‌హంట్‌ను వ్యతిరేకించడానికి కూడా సరిపోతుంది. కానీ ఆ ప్రత్యామ్నాయ నమూనాను పరిరక్షించడానికి ఇది మాత్రమే సరిపోదు.

ఎందుకేంటే - ఇందులో అభివృద్ధిని మనం ఏ దృష్టితో చూస్తున్నాం? అనే ప్రశ్న దాగిఉన్నది. ఆదివాసీ ప్రాంతాల్లో ప్రత్యామ్నాయ అభివృద్ధికి ఉపయోగపడ్డ స్థానిక, సంప్రదాయక, దేశీయ పద్ధతులు సంపూర్ణమైన, సమగ్రమైన , అన్ని ప్రాంతాలకు సరిపోయే పమూనాను అందివ్వలేవు. అంటే ఇక్కడ ఆధునికత అనే సమస్య మన అవగాహన విస్తరించడానికి అడ్డంపడుతుంది. విప్లవం లక్ష్యం సోషలిజం అనే ఆధునిక పారిశ్రామిక వ్యవస్థను నిర్మించడమే. ఉత్పత్తి శక్తులు అభివృద్ధి జరగకుండా ఇది సాధ్యం కాదు. మనుషుల జ్ఞానాన్ని పెంచే విజ్ఞానశాస్త్రం అంటే టెక్నాలజీ, అది అందించే రకరకాల పరికరాలు, వాటిని వినియోగించగలిగే నైపుణ్యాలు ఉత్పత్తి శక్తుల్లో ముఖ్యం. మనిషి జ్ఞానం, బుద్ధి అన్నమాట. వీటి అభివృద్ధి ద్వారా ఉత్పత్తి శక్తులను - ఉత్పాదకతను పెంచడం సోషలిస్టు అభివృద్ధిలో కీలకం. పంపిణీ అనేది రెండో ముఖ్యాంశం.

రెండో దాని గురించి ప్రస్తుతానికి అటుంచి మొదటి దాన్ని ఆలోచిస్తే - ప్రాచీన, స్థానిక పద్ధతులను ఎంత సమర్థవంతంగా వినియోగించినా ఉత్పత్తిశక్తుల అభివృద్ధి అనేదాన్ని సమగ్రంగా నిర్వచించినట్టు కాదు. సోషలిస్టు నిర్మాణ దృక్పథంతో అభివృద్ధికి నాంది పలికినట్టు కాదు. ఒకవేళ ఆదివాసీ ప్రాంతాలకు అది పూర్తిగా తగినదే అయినా మొత్తంగా అభివృద్ధి నమూనాల గురించి ఎప్పటికే చాలా చర్చ జరిగి ఉండాల్సింది.

ఇప్పుడు దీని అవసరం ఏమంటే - అధికార మార్పిడీ నుంచి పాలకవర్గం తపదైన ఆర్థిక నమూనాను చాలా వేగంగా, జాగ్రత్తగా విస్తరింపజేస్తోంది. సమాజమంతా అందులో భాగమైపోయింది. ఆ నమూనాలో భాగంగా 'అభివృద్ధి' అని చెప్పగల ప్రమాణాల ప్రకారం చాలా ఫలితాలు సమాజమంతా విస్తరించాయి. అది ఒక్కో సామాజిక ప్రాంతంలో ఒక్కో రకంగా పని చేస్తోంది. ఆదివాసీ ప్రాంతంలో గనుల తవ్వకాల రూపంలో, సహజ సంపదను కొల్లగొట్టే రూపంలో సాగుతోంది. దేశీయ , విదేశీ కంపెనీలు ఆయా రాష్ట్ర ప్రభుత్వాలతో ఒప్పందాలు కుదుర్చుకొని, కేంద్రం సాయంతో దోపిడీ చేస్తున్నాయి. అడవి సంపద కైవసం చేసుకోవడమంటే అడవిలో పెట్టుబడులు వెచ్చించడం, సహజంగానే అది లాభాల మీద ఆధారపడిన వ్యవస్థకాబట్టి తక్కువ పెట్టుబడి పెట్టి అపారమైన లాభాలు పొందడం దాని లక్షణం. ఈ కంపెనీలు ఆదివాసీ ప్రాంతాల్లోకి చొరబడటమంటే బైట పోగైన పెట్టుబడిలోంచి కొంతభాగం అడవిలోకి చేరడమే. అక్కడ కబ్జా చేసిన ముడిసరుకు తప్పనిసరిగా పెట్టుబడిగా మారుతుంది. ఇబ్బడి ముబ్బడిగా లాభాలు పోగేస్తుంది. అపారంగా అదనపువిలువ సృష్టిస్తుంది. అయితే ఇదంతా ఇక్కడే గనుల తవ్వకానికి అనుబంధంగా జరుగుతాయని చెప్పలేం. ప్రపంచంలో ఇక్కడైనా ఈ ప్రక్రియ జరగవచ్చు.

వేదాంత, జిందాల్ వంటి అనేక కంపెనీలు అటవీ ప్రాంతం విస్తారంగా ఉన్న ప్రాంతాల్లో, అలాంటి రాష్ట్రాలతోనే ఒప్పందాలు చేసుకుంటున్నాయి. అసలు రాష్ట్ర ప్రభుత్వాల పనితనానికి,' ప్రగతిదాయక ' లక్ష్యాలకూ పెట్టుబడుల

ఆహ్వానమే ఒక గీటురాయి.అందుకే రాష్ట్ర ముఖ్యమంత్రులందరూ మా రాష్ట్రంలో పెట్టుబడి పెట్టమంటే మా రాష్ట్రంలో పెట్టమని పెట్టుబడిదారీ సంస్థలను, బహుళజాతి సంస్థలను పదేపదే ఆహ్వానిస్తుంటారు. దానికి అనుకూల వాతావరణం ఏర్పరుస్తామని హామీలు ఇస్తుంటారు. జార్ఖండ్, ఛత్తీస్‌ఘడ్ వంటి రాష్ట్రాల్లో ఈ ఒప్పందాలు అటవీ ప్రాంతాల్లో మైనింగ్ సంబంధమైనవి. అక్కడ పెట్టుబళ్ల ఒప్పందాలకు ఏకైక స్థావరం ఆదివాసీ సహజ సంపదలే. అందుకే చత్తీస్‌ఘడ్‌లో, జార్ఖండ్ తదితర ప్రాంతాల్లో అటవీ సంపదల కేంద్రంగా ఒప్పందాలపై సంతకాలు జరిగాయి.

దీన్ని కేవలం వలసపాలన కాలంలో వలె మన సంపదను బైటి శక్తులు తరలించుకపోవడంగా చూస్తే వాస్తవ దృశ్యం కనిపించదు. అంతకంటే సంక్లిష్టమైన వ్యవస్థ ఇప్పుడు మన ముందున్నది. బైట అపారంగా పోగవుతున్న పెట్టుబడి మైదాన ప్రాంతంల్లోనైతే రియల్ ఎస్టేట్‌గా భూమిలోకి చేరుతున్నది. గ్రామీణ రైతులు, పట్టణ అసంఘటిత కార్మికులు, చేతివృత్తుల వాళ్లు, నీటిపారుదల సౌకర్యం ఉన్న ప్రాంతాలు, క్షామ ప్రాంతాలు ...ఇట్లా సమాజంలోని వైవిధ్యానికి అనుగుణంగా ఒక్కోచోట ఒక్కోలాగా పాలక వర్గ అభివృద్ధి నమూనా, పనిచేస్తోంది. ఆదివాసీ ప్రాంతాల్లో గనుల తవ్వకం రూపంలో అది పని చేస్తోంది.

అడవిలోకి పెట్టుబడి ప్రవహించి, అక్కడ గనులు తవ్వి, దానికి అవసరమైన మౌలిక కల్పనలు సమకూర్చుకొని , వీలైతే పరిశ్రమలు కూడా స్థాపించడం ద్వారా ( కేవలం ముడి సరుకు తవ్వుకొని పోవడమేగాక అనుబంధ పరిశ్రమలు పెట్టడం ద్వారానే మరింత లాభాలు వస్తాయి కాబట్టి ఈ కంపెనీలు ఆ పనికీ ప్రయత్నించవచ్చు) నిలదొక్కుకొనే అభివృద్ధి నమూనాకు ఎదురయ్యే చిక్కులు ఏమిటి? ఇవి గ్రీన్‌హంట్ సందర్భంలో ముందుకు వచ్చినా అంతటితో ఆగిపోయేవి కావు. సాల్వాజుడుంను ఎట్లాగైతే చాలా వరకు అదుపు చేయగలిగారో అట్లా ఈ గ్రీన్‌హంట్ యుద్ధాన్ని నిలువరించినా మిగిలి ఉండే ప్రశ్నలివి. ఒక కొత్త అభివృద్ధి నమూనా భారత ప్రభుత్వాన్ని యుద్ధానికి కవ్వించిన ఈ తరుణంలో దానికి.సంబంధించిన ప్రశ్నలు అనేకం సహజంగా ఎదురయ్యే మంచి సందర్భమిది. రాజకీయాల కొనసాగింపే యుద్ధమని చెప్పుకున్నా యుద్ధంలో సైనిక వ్యూహమే ఆ సమయంలో రాజకీయమవుంది. కాబట్టి గ్రీన్‌హంట్‌ను వ్యతిరేకించే సైనికపంథాను బలోపేతం చేస్తూనే యుద్ధకారకమైన అభివృద్ధి నమూనాల గురించీ ప్రత్యేకంగా చర్చించాలి. ఈ యుద్ధంలో పౌరసమాజం, ఆలోచనా ప్రపంచం ఆదివాసుల పక్షాన, విప్లవకారుల పక్షాన దృఢంగా నిలబడాలంటే ఆయా సామాజిక క్షేత్రాల్లో పాలక వర్గాల అభివృద్ధి నమూనాలు, వాటికి ప్రత్యామ్నాయ కల్పనలు అనేదాని మీద మనసు పెట్టి యావత్తు సమాజాన్ని కొత్త నమూనాల వైపు ఆలోచింపజేయాలి. ఆదివాసుల మధ్య సాధ్యమయ్యే, అవసరమయ్యే ప్రత్యామ్నాయం మీద ఇప్పుడు రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాలు కేంద్రీకరించి దాడి చేస్తున్నాయి. సైన్యాన్ని ప్రయోగించమని, వైమానిక దాడులు అవసరం లేదని ఒకసారి, ఆ అవకాశం వచ్చినప్పుడు వెనుకాడ్డబోమని మరోసారి పాలకులు అంటున్నారు. విప్లవ యుద్ధం తీవ్రమైనప్పుడు పాలకులు ఏ మాటకూ కట్టుబడి ఉండరని, తమ దగ్గర ఉన్న బలగాలన్నీ ఉపయోగిస్తారనీ మనకు తెలిసిందే. అంటే ఇవాళ పాలకశక్తులన్నీ కేంద్రీకరించి ధ్వంసం చేయాలనుకుంటున్న ఆదివాసీ ప్రత్యామ్నాయాన్ని కాపాడుకోవాలంటే మిగితా సమాజమంతమంతటా వేర్వేరు రూపాల్లో కొనసాగుతున్న అభివృద్ధి నమూనాలకు ప్రత్యామ్నాయాల గురించి ఆలోచించకుండా, వాటి నిర్మాణానికి పూనుకోకుండా, శత్రువు కేంద్రీకరణను దెబ్బదీయకుండా దండకారణ్యంలోని నమూనాను కాపాడుకోవడం సాధ్యం కాదు. కానీ ఇంత వరకు అలాంటి చర్చ కూడా మొదలు కాలేదు. అలాంటి సమస్య ఉన్నట్టు కూడా గ్రహింపు లేదు. గ్రీన్‌హంట్ కేవలమొక సైనిక కలాపం కాదు కాబట్టి ఇలాంటి విస్తృత చర్చకు తెరతీయవలసి ఉన్నది. నిజానికి భారత విప్లవోద్యమం చేరుకున్న ఈ కీలక ఘట్టం వినిపిస్తున్న అంతరార్థం ఇదే.



1994 నుంచి ఆదివాసీ ప్రాంతాల్లో విప్లవోద్యమ పురోగమనంలో భాగంగానే అభివృద్ధి ఎజెండా మీదికి వచ్చింది. విప్లవోద్యమం తన ప్రారంభ ప్రాతిపదిక నుంచి విస్తరించి నూతన శక్తులతో తలపడే కొత్త సన్నివేశంలోకి చేరుకుందనడానికి ఆదివాసీ ప్రాంతాల్లోని మైనింగ్ ఎకానమీ చేస్తున్న ఈ యుద్ధమే తార్కాణం. దీనికి కొంచెం నేపథ్యం ఉన్నది. నూతన ఆర్థిక విధానాలతో 'అభివృద్ధి', 'సంస్కరణల' యుగం దేశవ్యాప్తంగా 1992తో ప్రారంభమైనా విప్లవోద్యమ ఆదివాసీ ప్రాంతాల్లో మాత్రం 1980లలోనే 'సంస్కరణలు' మొదలయ్యాయి. గోబల్ ఆర్థిక పరిణామాల్లో ముందుకు వచ్చిన సంస్కరణలకు, అంతకంటే ముందే ఆదివాసీ ప్రాంతంలో రాజ్యం చేపట్టిన సంస్కరణలకు వేర్వేరు నేపథ్యాలున్నా పాలకుల దగ్గర సంస్కరణలు అనే విధానం ఆదివాసీ అనుభవం ద్వారా బాగా తెలుసుకోవచ్చు.

ఆంధ్రప్రదేశ్‌లో విప్లవోద్యమం 1980ల నుంచి భౌతిక నిర్బంధాన్ని ఎంత ఎదుర్కొన్నదో 'సంస్కరణ'లను అంతగా ఎదుర్కోవలసి వచ్చింది. . ఆదివాసీ సమాజం కావడం వల్ల అక్కడి నుంచి వచ్చిన వొత్తిడిని పాలకులు సంస్కరణల ద్వారా పరిష్కరించాలనుకున్నారు. దీన్ని ఎదుర్కొనే క్రమంలో విప్లవోద్యమం అభివృద్ధి గురించి అనేక ప్రశ్నలు ఎదుర్కోవసి వచ్చింది. 'అభివృద్ధి'కి సామాజిక అభివృద్ధి క్రమానికి మధ్య తేడా వల్ల తలెత్తిన సమస్య ఇది. ఈ రెంటికి అసలే సంబంధం లేదని చెప్పలేం గాని అసలు అభివృద్ధిని చూసే దృక్పథం వల్ల తలెత్తిన సమస్య ఇది.

దీనికి 1950 నుంచి చరిత్ర ఉన్నది. వలసపాలననుంచి బైటపడే క్రమంలో స్వాతంత్ర్యంతోపాటు సహజంగానే అభివృద్ధి అనే లక్ష్యం ప్రధానంగా ముందుకు వచ్చింది. అధికారాన్ని హస్తగతం చేసుకున్న వర్గానికి స్వాతంత్ర్యం అంటే అభివృద్ధి అనే స్పష్టత ఉన్నది. దానికి అనుగుణంగా దేశప్రజలను సంతృప్తిపరచడానికి మొదటి మూడు పంచవర్షప్రణాళికల్లో మౌలిక రంగాల అభివృద్ధికి ప్రయత్నించింది. కానీ ఇది సహజంగానే ఆదివాసులకు సంబంధం లేనిది. పైగా ఆదివాసీ ప్రాంతాలను డిస్ట్రబ్ చేసే , దోచుకొనే నమూనా. అందు వల్ల అక్కడ తీవ్రమైన అశాంతి బయల్దేరింది.

అట్లా ఓ ఇరవైఏళ్లు పాలన నడిచాక ఆదివాసులు సాయుధతిరుగుబాట్ల రూపంలో విప్లవకారుల పోరాటం ఆదివాసుల్లో పుట్టి అక్కడే నిలదొక్కుకో గలిగింది. నక్సలైట్ల చారిత్రక పోరాటాలన్నీ అభివృద్ధిలో భూములు దక్కని రైతు కూలీలవి. అంతకంటే ప్రధానంగా ఆదివాసులవి. ఆదివాసీ పోరాటాల్లో ప్రతిఘటన- అణచివేత-సంస్కరణలు- మళ్లీ ప్రతిఘటన అనే వలయాన్ని చూడవచ్చు. రాజరికంలో జరిగిన చౌరబాట్లను మినహాయిస్తే మిగతా అన్ని సందర్భాల్లో ఇది చూడవచ్చు. కొమరం భీంను చంపేశాకనే హెమిన్‌డార్ఫ్ అధ్యయనం, ప్రతిపాదనలు జరిగాయి. శ్రీకాకుళ పోరాటాన్ని అణచివేశాకనే ఐటీడీఏ ఏర్పాటయింది. మళ్లీ ఉత్తర తెలంగాణలో ఉద్యమం ప్రారంభమయ్యాక ఆదివాసీప్రతిఘటనతో సంస్కరణలు మొదలయ్యాయి.

ఈ మధ్య షంషేర్ అనే అజ్ఞాత విప్లవ రచయిత రాసిన 'యోధ' అనే కథలో ఆదిలాబాద్ జిల్లాలో ఈ క్రమం ఎట్లా సాగిందో కొంత చిత్రించారు. 1985 ఆగస్ట్ 15న ఆలంపల్లి ఆంబూష్‌లో గెరిల్లాలు పదిమంది సీఆర్‌పీఎఫ్ జవాన్లను చంపేశారు. విప్లవోద్యమ చరిత్రలో కీలక ఘటన అది. ఆ తర్వాతే ఆదివాసీ మనసులు దోచుకోడానికి ప్రభుత్వం 110 కోట్లతో సంస్కరణలు ప్రారంభించిందని రచయిత అంటారు. ఈ కథలో జిల్లా స్థాయి నాయకుడైన రఘు అనే ఆదివాసీ యువకుడు అరెస్టయి చిత్రహింసలు అనుభవిస్తాడు. లాకప్‌లో ఉన్నప్పుడు ధర్మరాజు అనే జవాన్ తారసపడతాడు. అతనూ ఆదివాసీ

. ఇద్దరికీ మాటలు కలుస్తాయి. ఆలంపల్లి ఘటన తర్వాత ప్రభుత్వం ఆదివాసులకు చిన్నచిన్న పోలీసు ఉద్యోగ అవకాశాలు కల్పించిందనీ, తానట్లా ఈ ఉద్యోగంలోకి వచ్చాననీ ధర్మరాజు అంటాడు.

విప్లవోద్యమం తీవ్ర ప్రతిఘటన చూపినప్పుడైనా, లేదా బైటి సమాజం నిందించే స్థాయిలో ఆదివాసీల మీద ప్రభుత్వం దమనకాండ ప్రయోగించినప్పుడైనా వాటి నుంచి పుట్టుకొచ్చే అసౌకర్యాన్నుంచి బైటపడటానికి సంస్కరణలు మొదలవుతాయి. దీని సారంశమేమంటే ఆదివాసీల మీద ఆధారపడ్డ విప్లవోద్యమం మన దగ్గర చాలా తొందర్లోనే అభివృద్ధి అనే పెట్టుబడిదారీ నమూనాను ఎదుర్కోవలసి వచ్చింది. అది చాలా త్వరగా సామ్రాజ్యవాద విధేయత ఉన్న పెట్టుబడిదారీ అభివృద్ధి చట్రాన్ని ఆదివాసీ ప్రాంతాల్లోని సంపదను కైవసం బూర్జువా ఆధునిక వ్యవస్థను అడవుల్లోకి తీసికెళ్లింది.

* * *

అభివృద్ధి అనే సర్వజనామోదమైన, అత్యవసరమైన, సామాజిక ప్రగతికి కొలమానమైన రాజకీయార్థిక ప్రక్రియ పెట్టుబడిదారీ చట్రంలో దోపిడీ అనే రూఢి అర్థాన్ని పొందింది. పెట్టుబడిదారీ అభివృద్ధి విచ్చలవిడిగా, నిరాటంకంగా సాగుతున్న ఈ సామ్రాజ్యవాద యుగంలో ప్రత్యామ్నాయం సాధ్యమే అని ఆదివాసులు నిరూపిస్తున్నందు వల్ల జరుగుతున్న యుద్ధమిది.

ఇంత వరకు పాలకులు ప్రజాపోరాటాల మీద ఏ స్థాయిలో అణచివేత ప్రయోగిస్తూ వచ్చారో అదే స్థాయిలో చట్టపరిభాషలో తీవ్ర విమర్శ సాగేది. బలప్రయోగాన్ని చట్టబద్ధం చేయకపోతే తాము రచించుకున్న దీర్ఘకాలిక యుద్ధాన్ని కొనసాగించడం కుదరదు. తన మౌలిక చట్రంలో ఇమడని ఈ అంతర్గత యుద్ధాన్ని సమర్థించుకోడానికే చిదంబరం బలప్రయోగం చట్టబద్ధమే అని వ్యాఖ్యానించారు. అణచివేతను, లక్షల పారా మిలటరీ సైన్యాన్ని దేశ ప్రజల మీద నెలల తరబడి ( వాళ్ల వ్యూహం ప్రకారమైతే కేంద్రంలో కాంగ్రెస్ పదవీ కాలం పూర్తయ్యేదాకా) ప్రయోగించడాన్ని రాజ్యాంగం ద్వారానే సమర్థించుకోచూస్తున్నారు. బూర్జువా రాజ్యాంగ యంత్రం ఇట్లా ప్రయత్నించడంలోనే గ్రీన్‌హంట్ తీవ్రత ఉన్నది.

నిజానికి బలప్రయోగానికి విప్లవంలో ముఖ్యమైన చోటు ఉటుంది. విప్లవంలో బలప్రయోగానికి మంత్రసాని పాత్ర అని స్పష్టంగా చెప్పవలసి వచ్చింది. దీని గురించి కమ్యూనిస్టులు చాలా తీక్షణంగా , ఉద్వేగంగా చెప్తారు. బూర్జువాప్రభుత్వ స్వభావంలో బలప్రయోగం ఉన్నా దానిపై ఆధారపడి పరిపాలన చేస్తాననైతే అది చెప్పలేదు. ఫలానా పని ( ఫలితం సాధించడానికి )చేయడానికి బలప్రయోగాన్ని ఆశ్రయిస్తానని బహిరంగంగా అనలేదు. కాని గ్రీన్‌హంట్ నేపథ్యం ఎంత తీవ్రమైనదంటే ఆ మాట కూడా నిస్సిగ్గుగా ప్రభుత్వం అనవలసి వచ్చింది. కేవలం అనడమే అయితే గతంలో కూడా అనే ఉంటారు. కానీ అది రాజ్యాంగబద్ధమే అని నమ్మపలకడంలోనే అసలు కత ఉన్నది.

ఆదివాసీ ప్రాంతాల్లోని సహజవనరులను బహుళజాతి సంస్థలు కొల్లగొట్టడానికి, దానికోసం అడవి నుంచి ఆదివాసులను నిర్వాసితులను చేయడానికి, ఆదివాసులకు అండగా ఉన్న మావోయిస్టులను నిర్మూలించడానికి గ్రీన్‌హంట్ నడుస్తున్నదడం పూర్తి వాస్తవమే. దాని గురించి సాధికారమైన విశ్లేషణలు చాలా వచ్చాయి. ఈ జాతిహననంతో పాటు మావోయిస్టు ఉద్యమం చేపట్టిన ఒక గొప్ప సామాజిక ప్రయోగాన్ని నిర్మూలించడం పాలకవర్గాల ప్రధాన లక్ష్యం. అపార సహజ సంపదలున్న మావోయిస్టు ప్రభావిత ఆదివాసీ ప్రాంతాల్లో పదిహేనేళ్లుగా ప్రత్యామ్నాయ అభివృద్ధి ప్రయత్నాలు సాగడం, దేశంలోని ఆర్థిక శక్తులు గనుల ఆర్థికం మీదికి తమ సహస్రబాహువులను విస్తరించడం సుమారుగా ఒకేసారి జరిగాయి. మైదాన ప్రాంతాల భూమి రియల్ ఎస్టేట్ వ్యాపార సరుకుగా, పెట్టుబడి స్థావరంగా మారిపోవడం , ఆదివాసీ ప్రాంతాల భూమి గనులు వ్యాపార సరుకుగా మారిపోవడం కూడా ఒకేసారి జరిగాయి. అందుకే భూ నిర్వాసితులు, అటవీ నిర్వాసితులు ఇవాళ దేశ వ్యాప్తంగా ఎక్కడబడితే అక్కడ కనిపిస్తున్నారు. విస్థాపన అనేది పెట్టుబడిదారీ అభివృద్ధిలోని సాధారణ లక్షణం. పెట్టుబడిదారీ, సామ్రాజ్యవాద అభివృద్ధి నమూనాకు పోటీగా మరే ప్రయోగం ఎదగకుండా చేయడమే అసలు రాజకీయ ఉద్దేశ్యం. వలసానంతరం భారత బూర్జువా వర్గం చేపట్టిన అభివృద్ధి ఇవాళ ఏ దాపరికం లేని నగ్నప్రదర్శన చేస్తున్నది. దాన్ని విమర్శించేందుకు నక్సలైట్ ఉద్యమం శక్తివంతమైన ఆలోచనలను సరఫరా చేస్తోంది. ఆ ఉద్యమ ప్రయోగాన్ని తుడిచిపెట్టకుండా అంతర్గత భద్రత సాధ్యం కాదని ప్రభుత్వాని తెలిసిపోయింది.

అందు వల్ల గ్రీన్‌హంట్‌ను సైనిక వ్యవహారంగా చూడటం ఎంత మాత్రం తగదు. రాజకీయాల కొనసాగింపు సైనిక రూపాన్ని తప్పక ధరిస్తుంది. ఇప్పుడదే జరిగింది. యుద్ధాన్ని సైనిక పరిభాషలో ( ఏ వైపు నుంచి ఎంత మోహరింపు జరిగింది? ఏ పక్షాన ఎందరు చనిపోయారు? తటస్థులు ఎంత నష్టపోతున్నారు? అని) చిత్రీకరించవచ్చుగాని అది పూర్తి విశ్లేషణ ఇవ్వలేదు.

సామాజిక ప్రయోగం అనే మాటకు భారతదేశంలో అర్థవమైనది మావోయిస్టుల ఉద్యమమే. వాళ్లలో ఎన్ని లోపాలైనా వెతక వచ్చుగాని వాళ్ల బలం ఇదే..ఉనికిలో ఉన్న వ్యవస్థను విమర్శించడానికి మావోయిస్టులే అక్కర్లేదు. యింకా చాలా మంది విమర్శిస్తున్నారు. కాని కొత్త వ్యవస్థ గురించి రూపురేఖలను ఎరిగి ఒక సామాజిక ప్రయోగానికి సిద్ధపడే రాజకీయశక్తి మావోయిస్టుల దగ్గరే ఉన్నదని నందిగ్రాం, సింగూరు, లాల్‌గఢ్ తాజాగా నిరూపించాయి. ఆ అర్థంలో నక్సలైట్ ఉద్యమం 1980ల కంటే ఇప్పుడు రాజకీయంగా బాగా ఎదిగిందని చెప్పవచ్చు. అది సైనికపంథా వల్లనే సాధ్యమైందని చెప్పినా, లేక దాని వల్లనే బలహీనపడిందని చెప్పినా నిజంకాదు. ఆ సమస్యను దానంతకు దాన్ని విడిగా చర్చిస్తే అందులో కొన్ని సత్యాలు లేకపోలేదు. అది పూర్తిగా వేరే విషయం.కానీ ఏదైనా ఒక వైపు నుంచి చూసినప్పుడు చాలా పరిమిత , ప్రత్యేక అర్థంలో సత్యమనిపించింది మొత్తం సత్యాన్ని దిగమింగే ప్రమాదం ఎప్పుడూ ఉంటుంది. ఈ పని మావోయిస్టు ఉద్యమ విశ్లేషణలో మావోయిస్టులే చేశారంటే ఆశ్చర్యం కలుగుతుంది . కానీ నిజం.

గ్రీన్ హంట్ విషయంలో కూడా ఆ ప్రమాదం ఉన్నదా? అనే సందేహం. ఈ యుద్ధాన్ని సైనిక పరిభాషలో మాత్రమే చూచే ధోరణి ఏమైనా ఉన్నదా? టీవీ చానళ్లు అట్లా చూడమని చాలా పెద్ద ఎత్తున ఊదరగొడుతున్నాయి.ఈ పని విప్లవానుకూలంగా చేస్తున్నట్లు నమ్మించగలుగుతాయి కూడా. అత్యంత విప్లవకరంగా వ్యవహరించడం ఇప్పుడు టీవీలకు , పత్రికలకు చేతనైనంత విప్లవకారులకు కూడా ( బూర్జువా నైచ్యాన్ని ప్రతి మాటలో, ప్రతి దృశ్యంలో, ప్రతి అక్షరంలో బైటపెట్టుకుంటూనే) చేతకాకపోవచ్చు. అందువల్ల వాటి కాలుష్యానికి ఉండే విలువ చిన్నది కాదు. సైనిక పరిభాషలో.. మావోయిస్టులకూ, ప్రభుత్వానికీ మధ్య అమాయక ఆదివాసులు నలిగిపోతున్నారనే అంతరార్థం సదా వినిపిస్తుంటుంది.

గ్రీన్‌హంట్ మీద వస్తున్న విశ్లేషణల్లో - ఆదివాసీ ప్రాంతాల్లోని సంపదను బహుళజాతి సంస్థలకు కట్టబెట్టడానికే ఈ యుద్ధం అనేది ప్రధానం. ఇది నిజం. దేశీయ పెట్టుబడుదారులు, సామ్రాజ్యవాద సంస్థలు ఆదివాసీ ప్రాంతాల్లోని సంపదను కైవసం చేసుకోడానికి, ఆదివాసులను అడవినుంచి తరిమివేయడానికి చేస్తున్న యుద్ధమిది. ఇంతకంటే ముఖ్యంగా మావోయిస్టుల సామాజిక ప్రయోగాన్ని తుడిచిపెట్టే ఉద్దేశ్యమే గ్రీన్‌హంట్ లక్ష్యం అని ఎంత బలంగా, ఎక్కువగా చెప్తే అంతగా ఈ యుద్ధసత్యాన్ని చెప్పినట్టవుతుంది.

*

## జగతి కవితలు నాలుగు

# ఇక కవిత్వమే...

కవిత్వంతో ఎందుకులే అనుకున్నా

అరణ్యాలపై కాలమేఘపు ఉరుమును
ఏ భాషలో వినాలో అంతుబట్టలేదు
నలుదిశలా యుద్ధపు కార్చీకటి అలుముకొస్తుంటే
ఏ పదాలతో గొంతెత్తాలో తోచలేదు
రెండు చేతులతో శత శరసంధానాన్ని
ఆదివాసీ ఆవాహన చేసుకుంటుంటే
ఏ గీతాలాపనతో జేజే ధ్వానాలు పలకాలో గొంతు పెగలలేదు

అంతర్బహిర్ ఆరాటానికి శ్రుతి కుదరని వేళ
మూల జగత్తు నుండి ఎగసే
జయకేతన రెపరెపలకెలా గొంతు కలపాలో తెలియలేదు

వినడానికి మాట్లాడటానికి
మాధ్యమం కుదరని లోతొక్కిసలాట
కవిత్వం కాక మరేమవుతుంది

# మనిషి పోలిక

చిన్నప్పటి కతలన్నీ
కాకులు దూరని కారడవులతో మొదలయ్యేవి

జగన్మండలంలో దాగిన నియమం
ఆధునికతగా ఒళ్ళు విరిచుకొన్న జనపదగాథ చెప్తున్న రహస్యమిది

మనుషి ఎక్కడ మొదలవుతాడు ?

చీకటడవిలోని
అడుగుల ఆనవాళ్లలో మనిషి పోలిక...
అగోచరానికి చూపులు గుచ్చి
వెతికి... వెతికి తను పోలిన మనిషిలో తన పోలిక...

మనిషి ఎక్కడ మనిషవుతాడు ?

చీమలు దూరని చోట
పారే నీటిని నదీ నదాలు చేసి
పంట కాలువలు చేసి
ఊళ్లను పొందించి
సహ జీవితాన్ని సృజించిన చోట
మనిషికి తనలో తన పోలిక...

మనిషి ఎక్కడ ఏమయ్యాడు ?

పల్లెలు పట్టణాలై
రాజ్యాలు సామ్రాజ్యాలై అవతరించిన చోట
చరిత్ర అంచుల్లోకి అడవి తోసివేయబడిన చోట
మనిషిలో కేవలమొక యుద్ధ పోలిక...

మనిషి ఇప్పుడేమయ్యాడు ?

భూస్థలి అంతా సంతగా
మనిషి సరుకుగా మారి
ఆదివాసీపై సైన్యమై విరుచుకపడుతున్న వేటగాడు.

# నేల పిలుపు

పురాస్మృతిలోకి మనిషిలోని ఓ భాగం
సదా తెరుచుకొనే ఉంటుంది

కాలంతో తెలిసి నడవడం
తెలియకనే కాలంతో కలిసి సాగడమొక నిత్యవర్తన...

తలపోత మనిషికి గత వర్తమానాల నిడివిగల ప్రక్రియ

బంధాల గురించిన తలపోత ఎప్పుడూ
తెగిన బంధాల వలపోత కావడం మనిషికొక తీరని శాపం

కరిగిపోయే బాల్యం గురించి
కూలిపోయే మట్టి కొంప గురించి
పూసిన గడియకే రాలిపోయే పువ్వుల గురించి
పొగిలి పొగిలే స్మృతివిచారం సరే....

స్వకీయమైన పొరల్లోనే
బంధాలు ఆవిరైపోతున్నా
మనిషికెన్నటికీ బంధాలు భారమూ, ఓదార్పూ
అనుబంధాలు నిత్యమనుకోవడం ఎడతెగని ఆరాటం
చెమ్మగిల్లే స్మృతి లోయ
000
స్మృతి జీవధాతువుగా
భవిష్య సూచికగా
తలపోత సమరోత్సాహంగా
స్వాభిమానమయ్యే గిరిజనానికి మాత్రం
భూమి మాటలు, అడవి చరితలు
భూంకాల్.... భూంకాల్

## అడవికి భయపడి....

ప్రాచీన మానవ స్పృహ పునర్జీవి
తెరలు తెరలుగా చరిత్రను విస్తరిస్తుంది
తానే చరిత్ర అవుతుంది
జీవితోల్లేఖన అవుతుంది
మనిషి లో ప్రపంచమై
దిగ్మండల కేంద్ర బిందువై ఆవాసాల తొలి రూపమైనందుకు
అడవి భయపెడుతోంది

కాళ్లేతులూ మేథా కలిసేచోట
మాయాజాలాలన్నీ తుత్తినియలై
మహా మానవావిష్కారమవుతుంది
చరిత్ర వొళ్లు విరుచుకొని
నిర్మాణమై
పునర్నిర్మాణమై
ధిక్కార జేజే ధ్వానమైనప్పుడు చిగురేసిన
అడవి భయపెడుతోంది

అడివంటే చెట్లూ చేమలా ?
వెలుగును నిబిడీకరించుకున్న పెంజీకటా ?
భయద మహోగ్ర జంతు సామ్రాజ్యమా ?
అయితే భయం లేదు....

తొలి వివేకం జ్ఞానమై
స్వస్థాన కాంక్షారవమై
స్వావలంబన మాతృ గర్భమైనందుకే
అడవి భయపెడుతోంది

సరుకుల దాహార్తిని
సమూహ ప్రతీక అని చెప్పినందుకు
నిర్మానుష్య చరిత్రకు
రక్తమాంసాలద్ది ప్రాణ స్పందనలిచ్చినందుకు
మనిషి
మనిషే.... మనిషే అని నిజం చేస్తున్నందుకు
అడవి భయపెడుతోంది

అడివంటే చెట్ల కూడిక కాదు
మనుషుల గుంపుకాదు
నిర్మాణం.... ప్రయోగం
సంవాదం.... కల్లోలం
మనుషులంతా కలిస్తే ఏమవుతుందో అదే....

సాకార సృజన అవుతుంది
సమరోత్సాహమవుతుంది
మహా సైన్యార్ణవమవుతుంది
గతిస్తున్న కాలంలోనే ప్రత్యామ్నాయమవుతుంది
నిజ చరిత్ర అవుతుంది
అడవి అల్లే వ్యూహం
నూతన శిశువుకు మంత్రసాని
అదే భయ హేతువవుతోంది
అడవి భయపెడుతోంది
అడవిపై యుద్ధమవుతోంది
ప్రతి యుద్ధ వ్యూహమవుతోంది.

**కె క్యాబ్ వర్మ కవితలు రెండు**

## ముఖం ఏదైనా

అవును ముఖం ఏదైనా
ముసుగు తొలగించి చూస్తే
దాని వికృత కర్కశ కోరలు
బయటపడుతూనే ఉన్నాయి.

దాని శ్వాసలోనే దాగివుంది
కుళ్ళిన విషపు వాయువు
ప్రకృతిలో నడయాడే చిరుగాలిని
హరించే రసాయనాల సమ్మేళనం..
స్వేచ్ఛ ఓ కలగా మిగిలినవాడు
దానికోసం ఈ ఉత్తచేతులతో పోరాడే
రూపాలకు దాని కోరలమాటున
చిక్కే ప్రమాదం పొంచి వుంటూనే వుంటూంది....

జరుగుతున్న యుద్ధంలో అభిమన్యులు
నేలకొరగడం సాధారణమౌతున్న కాలం.
శ్వాస నిశ్వాసలనే బంధించ జూస్తున్న
రాకాసి మూకలు....

చీమలు తమ శక్తిని గ్రహించనంతవరకే
ఈ పాముల బుసబుసలు.
(పచ్చదనంపై వేట కొనసాగింపునకు వ్యతిరేకంగా)

## మరోమారు సిద్ధార్థుడి హత్య

తాను రాజభవనం వీడి రాలేదు....
దుఃఖం ఎరుగక ఇల్లువదలలేదు
అన్నార్తులు, అభాగ్యులు, విధివంచితులు,
పీడితులు, తాడితులు,
తనకు సుపరిచితులే....

తన చుట్టూ వున్న వాతావరణం

నిలబడనీయక,
కాలికింద మట్టి పెల్లగింపబట్టి
తన పయనాన్ని వేగవంతం చేయగా
జనం తలలో నాలుకలా
పొద్దుగుంకని, బడలికలేని తనంతో
నలుదిక్కులా సాగిందీ సూరీడి పయనం...

సామాజిక రుగ్మతల కార్యకారణ సంబంధాల
నిజరూపాన్ని అనేక బోధి వృక్షాల కింద
అధ్యయనం చేసి ఔపోసన పట్టి
నేటి బుద్ధుడయ్యాడు.

నాటి సిద్దార్థుడు కత్తిని విడిచి
శిరోముండనం చేసుకొని విరాగికాగా
నేటి సిద్దార్థుడు చేత మరతుపాకీ పట్టి
పచ్చని చొక్కాల్లో పంటచేల మధ్య కలుపును
పెరికే పనిలో పడ్డాడు!

దుఃఖానికి మూలం కోరికలే కాదు
అపరిమిత స్వార్థంకూడా తోడయిన వాడు
ప్రవచనాల పల్లింపుతో ఏదీ సాధ్యపడదన్న
జ్ఞానోదయమై శత్రువు పక్కలో బల్లెమైనాడు

కుళ్ళి కృశించి నశించే కంటే
ఉల్కలా మారి బూడిదకావాలని ఆశించినవాడు
నేలతల్లి విముక్తి పోరులో
మరో మారు సిద్దార్థుడు హత్యకావింపబడ్డాడు...
(సురాజ్యాంగం ఉన్నా సుజనుల హత్యలు అన్న కన్నాభిరాన్ వ్యాసం
(తేది 21.3.10దీ ఆంధ్రజ్యోతి) చదివి....)

రాజ్యం చేసే పని....

సీమ దొరల నోరు మూయించి
అవకాశవాద రాజకీయాల తోలుతీసి
నోరులేని ముఖ్యమంత్రికి
క్యాంపు ఆఫీసు నిప్పించి
ఆంధ్ర ఖల్ నాయకుల
కూహకాల్ని బయటపెట్టి
తెలంగాణ(వి) నాయకులకు చూపునిచ్చి
జైబోలో తెలంగాణ అంటూ
సాగుతోందిక్కడ ప్రజా ఉద్యమం...

న్యాయంగా ఆలోచించడానికి
చూసే దృష్టి, కాస్త వివేకం చాలవూ...
ఇక్కడి కన్నీళ్లు చూసిన వాణ్ని
పారిన రక్తం కన్న కలలూ
బతుకుల వెతలూ తెలుసునాకు
అందుకే అడుగుతున్నా తెలంగాణ....

మరేం బాధలేదు
మరేం నష్టం లేదు
విడిపోయి నీళ్లా
మళ్లీ కలిసినప్పుడు
కన్నీళ్లో కవిత్వమో
చక్కనైన, చిక్కనైన
తెలుగు మాటనో
బతుకు పాటనో
పంచుకుందాం...పాడుకుందాం....

నాప్రియ సోదరులారా!
ఐదు దశాబ్దాల అపనమ్మకం
నిజమయ్యాకే ఈ పోరాటం
ముక్కలైన హృదయం
'సమైక్యత' కోరుకోదు
ప్రజాస్వామిక ఆంధ్ర
రాయలసీమలకోసం
ప్రజాస్వామిక ఆకాంక్షల కోసం
మీరూ నినదించండిక....

తెలంగాణ పొత్తిళ్లలో
దాగి ఉంది బడబాగ్ని
అది వెలుగును తనకే కాదు
పంచి ఇస్తుందందరికీ
ఇది న్యాయమైన లెక్క
నేడైనా రేపైనా తేలాల్సిన లెక్క...

**ఠాంకీ కవిత**

## ఛలో ఉస్మానియా ఆర్ట్స్ కాలేజ్

ఉస్మానియా విద్యార్థుల ప్రశ్నలు
లోకానికి వినబడకుండా చేయాలని
జరుగుతోంది అడుగడుగున కుట్ర.
వేలాదిగ లక్షలుగ తరలి రండి
రగిలిన ఆర్ట్స్ కాలేజ్ నిప్పును రాజేద్దాం
కంచెలన్నింటినీ పీకేసి
గోడలన్నింటిని కూల్చేసి
ప్రశ్నల్నీ పోరాటాల్నీ బతికించుకుందాం...
ప్రశ్నలకు కంచెలు కట్టడం
మనుషుల మధ్య
గోడలు నిలపడం

ప్రాంతేతర దోపిడినే కాదు
ప్రాంతం లోపలి దోపిడిని
ప్రశ్నించే తెలంగాణ చైతన్యాన్ని
నిక్కమైన బతుకుకు దారులు
చూప గలిగే తెలంగాణను
మనసారా ఆహ్వానిద్దాం.....
(తెలంగాణ విద్యార్థుల ప్రజల న్యాయమైన పోరాటంపై అమలవుతున్న నిర్బంధానికి నిరసనగా....)

**సంస్మరణ కవిత**

## అతడు

ఒక మనిషి గురించి మాట్లాడుకుందాం
మనుషుల్ని అమితంగా ప్రేమించి
మమకారాలు దాచుకుని
పోరుదారి పట్టిన మనిషి

తనకేనా చదువులు సంపదలు
తనచుట్టూ ఉన్న
బరిబాతల పిల్లలకు కావాలనుకున్నవాడు
మెతుకులేని పల్లెల్ని తిరుగుతూ
చితుకు చితుకు పోగేసి పోరాట
చైతన్యం రగిలించిన వాడు

చిరునవ్వునొక సమ్మోహనాస్త్రంగా ధరించి
పలకరింపునొక బాహువులు
సాచిన పరిష్వంగమై ఆవహించి
ప్రజల్ని కూడగట్టి
తెలంగాణ నుంచి నల్లమల దాకా
విప్లవమాగాణం ఎగిలి చేసినవాడు

స్వేచ్ఛాపిపాసిగా చిరకాలం బందీయై
బందిఖానా ప్రాణాంతక తంత్రుల నుంచి
వసంతగానం ప్రసారం చేసినవాడు

భారత విప్లవానికి కులమూ పార్లమెంటు
పాతకొత్త సవాళ్లని సూచించినవాడు
తన విప్లవాచరణతో
నక్సలిజం సమస్యకాదు
పరిష్కారమని

అంధ దేవతకు కనువిప్పు కలిగించినవాడు
ఇరవై రాజ్యాల భద్రతా నిఘాల
చారు చక్షువుల నుంచి
ఎరడాలు మాటున రవి కిరణం వలె
కొండల్లోకి అదృశ్యమైనవాడు

కృష్ణపట్టి చెంచుల సిగపువ్వై
సర్కారు తుమ్మల్లో మొగలిపొదల
పరిమళాలు చర్చకు పెట్టినవాడు

అతడు మనిషి
మనుషుల్ని భేషజాలు లేకుండా
నమ్మినవాడు
మనుషుల్ని మనుషులుగా బతికించుకోవాలని
మథనపడినవాడు

అనుబంధం సంకెల కాగూడదనుకున్నపుడు
ప్రేమకోసం
అందుకున్న చెయివదిలేసి
ముందుకే సాగమన్నవాడు

కంట్లో నలుసు
కన్నీళ్లతో రాలిపోయినట్లుగా
పీడిత మానవాళి పట్ల ప్రేమలో
ఆయన పులుకడిగిన ముత్యమయ్యాడు

అతనిలాంటి వాళ్ళది
మనకలవాటయిన
రాజమార్గ సంస్కృతో మార్కెట్ సంస్కృతోకాదు
ఆది జనపదాల సంస్కృతి, ప్రజాపథం సంస్కృతి

అణువు గర్భం ఛేదించికాదు
చీకటయిన అడవి దారిలో
మిణుగురు రెక్కల వెలుగు పుంతలో
మిహిరథనుర్ద్యుతి చేదుకునే సంస్కృతి
జీవితం మీద ప్రేమతో
అతడు ఎంచుకున్న జీవితం
పులినోట్లో తలదూర్చిన మనిషి
సాహసయానంగా సాగింది
అతడొక మానవజ్వాల
ఆదివాసుల ఆకుపచ్చని బతుకులపై
కంపెనీల చిచ్చును
సెలఏరుల జలపాతమై
ఎదుర్కొన్నవాడు
పత్రహరితాన్ని కాటేసిన కోబ్రా
ఎన్‌కౌంటర్‌లో ఒరిగిన
ఆకుపచ్చ చందమామ అతడు

ఆయన కంట్లోని సూర్యునిపై
శత్రువు బుల్లెటు గురిపెట్టాడు
చూసారు కదూ

గ్రీన్‌హంట్ నెదుర్కొనే
ఆయుధం ఎత్తిన భుజంలోంచి
గుండు దూసుకుపోయి కదా
అతడు నేలకొరిగాడు

రాజ్యం అతని తల మీద వెల ప్రకటించకముందే
అతడు నుదుటి మీద మరణశాసనం
రాసుకుని మరీ
వర్గయుద్ధంలో దూకాడు
అతడు భగత్‌సింగ్ వారసుడు
చిరునవ్వును పలకరింపును
ప్రేమను ప్రజాయుద్ధాన్ని
మనకు జెండాగా
అందించిపోయాడు

[illegible]

## పక్షి బంధం

మా పెరట్లో ఆడే

పక్షుల ఆటపాటలు చూసి
రాజ్యం రాకాసి గద్దొకటి
ఓ పక్షిని వేలెత్తిచూపి
తొలిజామునే
మాకన్న ముందలే
మేల్కొలుపు పాటెత్తుకున్న పక్షి పేరుచెప్పి
అది నీకేమవుతుందని కారుకూతలు కూసింది
పాపం తనకేమి తెలియని పక్షి
వెన్నెలాంటి ఆ పక్షి గురించి చల్లని మాటలు తెలుసుకుంది

రెండవసారి అదేగద్ద ఎదురొచ్చి
వెన్నెల పంచెపక్షి
మీ జాతేనంటూ ముక్కుతో పొడవసాగింది
రక్తమేకాదు
వర్గమూ ఆరాతీస్తూపోతే
ఇప్పుడా పక్షి మాజాతేనని తెలిసింది
ప్రజల ఆటపాటల కూతల కోరసని తెలిసింది
గద్ద

మూర్ఖంగా మూడవసారి ఎదురెచ్చి
ఆటతీరు
పాటతీరు పరికించి చూసి
వెన్నెల పిట్ట మీ చుట్టమే అంటూ
బంధుత్వాలు బంధాలు తొవ్విపోసింది
అవున్నీజమే
ఆ వెలుతురిపిట్ట
బాటలో బంధువని తెలిసింది
బందూకుల వనమని తెలిసింది

ఇప్పుడు
నా అడగులది
పక్షి పాధముద్రల వెతుకులాట
నా పాటలు పక్షిపాటలకు కోరస్
నెత్తికొండ మీద

కాళ్ళకు కత్తులు కట్టుకొని
పుల్లెల చెరువులో
వెన్నెల పక్షి ఓడిపోయిందని
పాతకూతల రోత పాటలె పాడింది పాలకగద్ద

పాపం!!
ఇది వరకు ఈ శాఖమూరి పక్షి
ఎన్ని పిల్లలీనిందో
గద్దెమీది గద్దలకేం తెలుసు!

## అవ్వ జెప్పిన తొవ్వ

వెలిశాల ధూం ధాంలో
ఎదురొచ్చిన లచ్చవ్వ
నే నిద్రలోకి జారుతుండగా
మా పాప ప్రశ్నించే తీరుగా
ఎన్ని ప్రశ్నలేసిందో..!
బిడ్డా...!
అందమైన పువ్వును
పిసికేసిన వాడెవ్వడొ తెల్వదా
వత్తదా...!
వచ్చే తెలంగాణలో
దొర దోచుకపోయిన
నాకూతురు శీలం
తిరిగొత్తదా...!

దొరకెదురు కైగట్టినందుకే
భూసాములందరు పొగై
కాడెడ్లను పొడిసినట్లు
నా కొడుకును సావడిలో

చిత్రహింసలతో
వాన్ని చెరసాలలో పెట్టలేదా!

జైలునుండే
జంగుసైరనై
దొరల తెలంగాణ
దోచుకునే తెలంగాణేనని
జగిత్యాల జైత్రయాత్రలో
"ఇంద్రవెల్లి కొండల్లో
దండూ పుట్టింది
పాట పాడినందుకే
వాన్ని నక్సలైటును చెయ్యలేదా...!

అంటరాని తనం
నన్నాతిడ దూరం చేసి
ఊరి చివర నెట్టితె
అడవి కెల్లిన కొడుకు
ఏకువ జామున వత్తాండని
పగలొచ్చిన పోలీస్ పటేల్
నా ఇల్లు కూల్చలేదా...!
వత్తదా...!
వచ్చే తెలంగాణలో
ఉంటదా...!
ఊరిమధ్యలో నా ఇల్లు...!

శీలం పోయి
చీపురోలె ఇంట్లో కూర్చుంటే
అడవికెల్లిన అన్న
ఆయుధం దాచిండని
ఆరా....పేరున రాలేదా..!
అత్యాచారం చేయలేదా...!
వత్తదా..!
వచ్చే తెలంగాణలో
ఈఅత్యాచారాలుండవా..?

తరాల చరిత్రలో
తెలంగాణ ఆడబిడ్డలకందిన ఫలం
అర్ధనగ్నబతుకమ్మలు
అత్యాచారాలేనని
సమసమాజ నిర్మాణ
సమరం చేయబోయిన
మన సారలమ్మ
ఏడుగురు బిడ్డలను
తాడిచర్లలో ఏం చేసింగ్రో తెలువదా...?

కొడుకు దూరమైన
కొరతెవరు తీరుత్తరని
కూతురిక
ఓ అయ్యకోడలెల్లైతదని
నా గుండె పగిలితే
బండరాయైన అయ్య
కూటికోసం
ఏటిపక్క....
ఎండిన కట్టెలు కొడుతాంటె
ఏరుదాటిన కొడుకు కోసం
కాపుగాసిన ముఠావాల్లు
ఆకలైన అడవి మృగాళ్లై
బక్కచిక్కిన బాలయ్యను
మాయం చేయలేదా...!
వత్తదా...!
వచ్చే తెలంగాణలో
ఈ ముఠా అరాచకాలుండవా...?

కొడుకుతోపాటే
కొలువొదిలిపోయిన
మన కనుకవ్వ కొడుకును
ఎరుగుదువా..!
నక్సల్‌బరి తల్లి
నాట్లేసి పెంచిన మొక్కలు
సీకాకులంలో చిరువిత్తనాలై
జగిత్యాల జైత్రయాత్రలో జల్లి
ఇంద్రవెల్లిలో ఎగరేసిన ఎర్ర జెండై
జన తెలంగాణ జంగు నడిపితె
సూటిగా పట్టుకోలేనోడు
యుద్ధనీతి నొదిలి
"ఎన్‌కౌంటర్" చేయలేదా..!
వత్తదా...!
వచ్చేతెలంగాణలో
ఈ బూటకపు ఎన్‌కౌంటర్లుండవా..?

కొడుకుతో సోపతైనందుకె
మన రాజవ్వ కొడుకుపై
దొరల జంప
కుట్రచేసిండని
రాజ్యమే కుట్రజేసి
కుటిల కేసుల పెట్టి
వాని జాగలో
వాన్నుండకుండా చేయలేదా...!

వత్తదా...!
వచ్చే తెలంగాణలో
వాని జాగలో
వాన్ని ఉండనిత్తరా..?

బిడ్డా...!
చూసినవా
ఇదే వెలిశాల బడి
పాలపిట్టలు పావురాలు
తయారైన
ప్రపంచ ప్రజల
తెలుగు వెలుగు ప్రయోగశాల
అర్ధాంతరంగా వచ్చిన
ఆంగ్ల మాధ్యమ పిశాచి
మన మస్తిష్కాలను మొద్దుబారించి
పాఠశాల పంతులును పద్యాక్షి గుట్టలో
పాలపిట్టను పావురాల గుట్టలో హంట్
చేయలేదా....!
వత్తదా...!
వచ్చే తెలంగాణలో
మన బడి మనకుంటదా...?

ఇలా..
కడుపుకోతలను
అనుభవించిన
తెలంగాణా తల్లి
పర్యావరణ పరాగ సంపర్కంలో
నల్లబంగారపు కొడుకుని
పొత్తిళ్ళలో దాచుకుంటే
ఓపెన్ కాస్ట్ వచ్చి
బొంద్రలగడ్డగా మార్చలేదా..!
వత్తదా..!
వచ్చే తెలంగాణలో
ఈ ఓపెన్ కాస్ట్ లుండవా.....?

పోయిన కొడుకే
పోరాట సముద్రమై
అలలు అలలుగా
ఉరకలేస్తున్నానని
అమ్మకు రాసిన లేఖ చదివి
సంబర పడితి

పేగు తెంచుకున్న కొడుకే
నా ప్రేమకు దూరమై

కూడు పెడతాడనుకునే వయసులో
గూటికి దూరమై
రెక్కలొచ్చిన పక్షోలె
ఎక్కడెక్కడో ఎగిరి
ఆగిపోయిన వలస పక్షులకు
ఓ.......ఆదివాసీల అభూజిమడ్
ఆయుషు పోసిందని
మురిసి పోయిన వేళ....

ఏ గ్రీన్‌హంట్ ఆపరేషన్
వాన్ని ఎగదన్నుక పోతుందోనని
నాపేగులు గిరికీలు పెట్టబట్టె
వత్తదా...!
వచ్చే తెలంగాణలో
ఈ ఆపరేషన్ హంట్‌లుండవా...?
భద్రం కొడుకో జర భద్రం
తరతరాల పోరాట
త్యాగాల పునాదులపై
అల్లీన ప్రజా తెలంగాణా పాటను
పాడే కోయిలను
ముక్కలుగా చేసిన పాలకులే
పాటకు పల్లవందుకొని
పాపం తల్లుల పేగులు తెంపుతాంద్రు

సోయి మరిచినమో...
ఏరుదాటినంక తెప్ప తగిలేసినట్లు
ఎక్కడైనా పాటకు తూట్లు పొడవొచ్చు
అందుకే పాడే కోయిలవై ప్రశ్నించి
రాబోయె తెలంగాణలో
రాజకీయ ఊసరవెల్లులను
ఈకోయిల ప్రశ్నల
ఉత్పన్నం ఉండదని
మనం ముందే రాసివ్వమనాలే...!

బిడ్డా...
పైన పాట పాడే పాపుందంటివి
ఆత్మహత్యలు బలిదానాలు
తెగబలిసి టేకు వనాలై
మలబలిసి మర్రి ఊడలై
పార్లమెంటు పందికొక్కుల
మనసు మార్చలేమని
మలిదశ పోరాటంలో
అన్నలాగ
కొట్లాట జేయమని
పాట పాడమన్నావా....?

ఇలా..
అవ్వనోట పాలాలను
గద్దల్లా తన్నుకపోయిన
ఓ పోలెపల్లి సెజ్‌నుండి
పోలవరం ప్రాజెక్ట్ దాకా
జాలు వారిన జవాబులేని ప్రశ్నలెన్నో....

ఏం చెప్పను....
ఎలా చెప్పను....
జరుగుతున్న సమ్మక్క జాతరలో
అడిగిన ఐస్ క్రీం కొనివ్వలేదని
ఏడ్చిన
నా చిట్టి తల్లిని బుజ్జగించాలా...
ఆలోచించే లోపే...

కొడుకు రాజేసిన కొలిమే
రూపాంతరమై
ప్రజలనోట రేలాపాటై
అప్పై ధూలా ఆటై
జనం జాతరై
రాజ్యంపై రాజపుండైందటూ....

గుండెల్లో దుఖం
గుడ్లల్లో ఎగదన్ని
కారే కన్నీటి వరదలను
దాచుకొని
జరుగుతున్న చైతన్య సదస్సు
జాగర్తగా చూస్తూ
జై తెలంగాణ
జై జై తెలంగాణ
అంటూ పిడికిలెత్తింది

[illegible]

## బతుకు చింపిన సింగరేణి

అన్నన్న రాజన్న అన్న రాజన్నా రాజన్నా
సింగరేణి బతుకు చీకటయ్యిందే రాజన్నా
॥అన్నన్న॥

ఓపెన్ కాస్ట్ మైనింగ్ ఒర్రంగ వచ్చే రాజన్నా
తెలంగాణ బతుకుల్ని తెర్లుజేసిందే రాజన్నా
దోపిడి దొంగల దుర్బుద్ధి వల్లా రాజన్నా
సింగరేణి బతుకు సిన్నబోయిందే రాజన్నా ॥అన్నన్న॥

కొలువులూ, నెలవూలు అన్ని కోల్పోయి
ఉన్న ఊర్లన్నీ మాయమైతాయే రాజన్నా
రైతన్న కండ్లల్ల కారము గొట్టీ రాజన్నా
కూలోల్ల కడుపుల్ల మన్నుబోసిందే రాజన్నా ॥అన్నన్న॥

కల్లుగీత కార్మికుల చెట్లన్ని బీకీ రాజన్నా
వల్లకాడుల్జేసి వలసబట్టిచ్చే రాజన్నా
చేను చెలకాలన్నీ బొందాలు జేసే రాజన్నా
బొందిలో ప్రాణాలు గుంజిపారేసే రాజన్నా ॥అన్నన్న॥

చెట్టు చేమాలన్నీ లేకుంట జేసే రాజన్నా
మట్టిగుట్టల్లాగ మార్చి పారేసే రాజన్నా
గాలి, నీరు, దుమ్ము, ధూళితో నింపీ రాజన్నా
పర్యావరణమంత పాడుజేస్తాందే రాజన్నా ॥అన్నన్న॥

యంత్రభూతాల సప్పుల్లతోటీ రాజన్నా

చెవులన్ని చిల్లులూ పడిపోతయన్నో రాజన్నా
ఇండ్ల గోడలన్నీ బీటలుగ మారే రాజన్నా
పొమ్మనకుండానె పొగబెడత ఉంటే రాజన్నా ॥అన్నన్న॥

నీళ్ళు లేక భూమి నిప్పు గుండంగ మారే రాజన్నా
ఉన్నఫలంగానే ఊపిరి తీత్తాండే రాజన్నా
మన ఊర్లనన్నింటిని కాపాడుకుందాం రాజన్నా
ఈ విధ్వంసకాండను అడ్డుకుందామే రాజన్నా
అందుకే మనమంత దండు కట్టాలే రాజన్నా
ఓపెన్‌కాస్టోనర్ల తన్ని తరుమాలే రాజన్నా ఓపెన్

('ఓపెన్' కాస్ట్ మైనింగ్ ప్రాజెక్టును మాకు సమీపంలోని భూపాలపల్లిలో సింగరేణి యాజమాన్యం ప్రారంభించే సమయంలో బాలగోపాల్‌తో కల్సి అడ్డుకున్న రెస్టయిన సందర్భంగా రాసినది. నవంబర్ 2008లో)

## బతుకు వెతలు

ఉరుకు పరుగులాపి జర నిలువరో మాయన్నా
ఇవి కథలు కావు బతుకులా వెతలురో వినరన్నా ॥ఉరుకు॥

రైతు వేషమేసుకోని రైతురాజ్యం తెస్తనంటె
సంతోషంతో అంతా స్వాగతం పలికిరీ
అధికారం అందినంక అహంకార రూపానికి
ముసుగు తీసి పారేసి నిండా ముంచబట్టిరీ ॥ఉరుకు॥

బహుళజాతి కంపినీలకు బానిసలుగ పారిపొయ్యి
సామ్రాజ్యవాదులా సంకలల్ల పిల్లలయ్యి
స్వతంత్ర భారతంలో వలసల స్థాపించనీకి
సెజ్‌ల చట్టం తెచ్చి చేటు చెయ్యబట్టిరీ ॥ఉరుకు॥

బక్కరైతు బతుకుల్ని కుప్పకూల్చుడానికి
మాయమాటలెన్నో జెప్పి మన్నూ బుక్కిచ్చుకుంట
పంటభూములల్లో పరిశ్రమలను బెట్టించి
పచ్చపచ్చని బతుకుల్ని పాడుజెయ్యబట్టిరీ
॥ఉరుకు॥

పొలాలు పోయినగాని పనులిప్పిస్తమనిరి
ఇంటికొక్క ఉద్యోగం ఇగో అగో ఇస్తమనిరి
ఇదేదో నిజమేనని నిజంగానే నమ్మితే
పనిగిని లేదనిరి పాట్లకు గురిజేసిరి ॥ఉరుకు॥

మాకింత బువ్వబెట్టె అవ్వసొంటి భూముల్ని
మా బొందిల ప్రాణం బోయినా అసలే మేమివ్వమనీ
అడ్డుకుంటె ఆమడదూరం తరిమికొట్టిరీ
ఆయుధాల పహారాతో ఆక్రమించిరీ ॥ఉరుకు॥

కాళ్ళకింది భూమీ కదిలీ పోతుంటేను
జీర్ణించుకోలేక దిగులుపడ్డ రైతన్నలు
కన్నతల్లి భూమాతను కండ్లనిండ అద్దుకొని
తమలో తామె కుమిలి కుమిలి కుప్పకూలిరీ ॥ఉరుకు॥

పీనుగలను బొందబెట్ట ఆరడుగుల జాగలేక
ఆగమైన బాధితులు అందరూ ఒక్కటయ్యి
కోల్పోయిన భూముల్ని తిరిగి పొందడానికి
కొన ఊపిరితోనైనా కొట్లాడుచున్నారు
కొట్లాడే జనాలకు అండగ మనముండాలె కొట్లాడే

(గత రెండేండ్ల నుండి సెజ్‌ల కారణంగా పోలేపల్లిలో నలభై మంది రైతన్నలు గుండెలు పగిలి చనిపోయిన వాస్తవ సంఘటనలకు




## నీవు మృత్యుంజయుడవు

శూరుడా! సుధాకరా లేదు...లేదు మృత్యువు నీకు
అజరామరుడవు, మృత్యుంజయుడవు
పాలమూరు పోరుబిడ్డా
ఆకలి జిల్లాలో బడుగు బతుకులు చూసి
పేదోళ్ల పెన్నిధిలో తొలి పొద్దువై నిలిచావు
చిరస్మరణీయుడవు చిరంజీవా!!
ఈ కాలేజీ చదువులు కడుపు నింపవని
విద్యార్థులను ఏకం చేసి రాడికల్ బాటలో నడిపించినవాడా!
ఓరుగల్లు రైతన్నలనేకం చేసి
కదన రంగంలో కత్తుల కోలాటం నేర్పినవాడా!
దండకారణ్య గడ్‌చిరోలి మాడియా గోండన్నల
గూడెం (గుండె)లో గూడు కట్టుకున్నవాడా!
వర్గపోరాటం తీవ్రం చేయాలంటే
ఆయుధాలు అవసరం అని
ఆ బాధ్యతలు స్వీకరించినదే తడువు
పట్టులేని పట్టణాల్లో సైతం
శత్రువు కోటలోనే దీట వేసి
బెంగళూరు కేంద్రంగా బందూకులు పోగు చేసి
గెరిల్లా జోన్స్‌కు ఆయుధాలు అందించినవాడా!
మోసపు ఎత్తుల్లో శత్రువు చేత చిక్కినా
నా ప్రాణం కన్నా మిన్న పార్టీ, నాయకత్వం అంటూ
అందుకే అంజన్నను అలర్ట్ చేసి వెళ్లిపొమ్మన్నావు
అది సహించని శత్రువు
నీ కీళ్లు విరిచి చిత్తడి ముద్ద చేసినా
యమయాతనల కొలిమిలో ఆరితేరి
విప్లవమే నా ధ్యేయమని నినదించినవాడా!
నిన్ను నాలుగు గోడల మధ్య బంధించితే
వాడికి బాధ తప్పుతుందని భ్రమించాడు

'కాల్ కోఠరీ' (సెల్) కఠోర యాతనలు పెట్టినా
చెరసాలలను సహితం విప్లవ కళాశాలలు చేసి
ఖైదీలనేకం చేసి, సమస్యలకు పరిష్కారం పోరాటం అన్నావు
నగరం నడిబొడ్డున చంచల్‌గూడ, చెర్లపల్లి జైలులో
మీరేసిన పోరుకేకకు ఆంధ్రా అసెంబ్లీ వణికింది
పోరుజనం మీకు అండగుండి, అడుగు ముందుకేయమన్నారు
అందుకే మీ పోరు చరిత్ర పుటల్లో నిలిచింది
అంతే కాదు, బందిఖానాలో సైతం
మావి 'బందీ కాని గొంతుకల'ని
ప్రజాసాహిత్యం సృష్టించ కవులనేకం చేసినవాడా!
మాకు ఎల్లలు లేవని మహారాష్ట్ర, మధ్యప్రదేశ్‌లోని
నాగపూర్, అమరావతి - భోపాల్, బాలాఘాట్ జైళ్లలో
సహచరులకు (బందీలకు) రాజకీయాలు అందించినవాడా!
జైలు బంధనాలు తెంచుకుని జనంలో కలిసినవాడా!
ఆంధ్ర ప్రజలకు సూర్యంవై మార్గదర్శకత్వం అందించినవాడా!
పార్టీ అప్పగించిన ఏ పని అయినా
నిర్మాణ, మిలటరీ, టెక్కు పనులన్నీ సులువే అని నిజం నిరూపించిన
కామ్రేడా!
నీ మేధస్సు, సిద్ధాంతం ఎల్లవేళలా మాకాదర్శం
మలిసారి నిన్ను పసిగట్టి నిన్ను పట్టుకున్న శత్రువు
బూటకపు ఎన్‌కౌంటర్‌లో నీ ప్రాణం తీశాడు
రాజశేఖరుడి బొంకు పోలీసుల కట్టుకథలను
నమ్మని తెలంగాణ పల్లెలన్నీ భోరుమన్నాయి
శూరుడా! వీరుడా! సుధాకరుడా!
మీరాశించిన దోపిడీరహిత రాజ్యం కోసం
మీ ఆశయాలు నెరవేర్చ
నూతన ప్రజాస్వామిక విప్లవం సాధించాలని
పేదప్రజలు పిఎల్‌జిఏలో కదంతాల్‌తో కదులుతున్నారు
ఉన్నత ఫార్మేషన్స్ పెంచుతున్నారు
(కేంద్ర కమిటీ సభ్యుడు కా. పటేల్ సుధాకర్ రెడ్డి (రామన్న), కా.కోమటి వెంకటయ్యలను వరంగల్ జిల్లాలోని లవ్వాల అడవుల్లో 24/05/09 న బూటకపు ఎన్‌కౌంటర్‌లో కాల్చి చంపిన వార్త విని).

## దు:ఖం అలీనం కాదు

జీవితమే యుద్ధమైనప్పుడు
మరణం సాధారణ దృశ్యమౌతుంది

లక్షల కన్నీటి ప్రవాహాలు ఏకమై
దు:ఖం విశ్వ జనీనమౌతుంది

వాడి అకృత్యాలకు గడ్డకడుతున్న హృదయాలు
ఒక కఠినమైన పొరను కప్పుకుంటాయి

అట్టడుగు సమాజం గొంతులో అడ్డంపడే దు:ఖం ముద్దను
ఓపిగ్గా అసంఖ్యాకమైన అణువులుగా విడగొడితే
ఒరిగిన ఒకో చందమామ చుట్టూ
ఎన్నెన్ని జ్ఞాపకాల వెన్నెలలు
అల్లుకున్న ఎన్నెన్ని అనుబంధాల ముడులు!

వాళ్లంతా కలల్ని కన్నవాళ్లే
అంతేనా?!
ఉద్యమమో మేమో వారికోసం కన్న కలలూ వున్నాయి

అర్థాంతరంగా వారి కలలు చిదిమి వేయబడినప్పుడు
అమాంతంగా ఆ కలలు అంతర్థానమైపోతాయి

ఇకనుండీ
ఎవరి చుట్టూ తాము అల్లుకోవాలా అని అల్లాడిపోతాయి
ఒరిగిపోయిన ఆ విప్లవకారులకేసి ఒకసారి చూడండి
వారి దేహాల చుట్టూ
దిక్కుతోచని దెయ్యాల్లా తిరుగాడే మా కలలు కన్పిస్తాయి

వాడూ అంటాడు
'అయ్యయ్యో!' మావోడి కిప్పుడే పెళ్లయిందనో
'ఎంతఘోరం!' భార్యా యిద్దరు పిల్లలనో

అవునుమరి
మనిషంటేనే కొన్ని అనుబంధాల అల్లిక కదా
మనిషంటేనే కొన్ని కలలకు కేంద్రం కదా

కానీ!
జీవితమే యుద్ధమైనప్పుడు
విశ్వజనీనమైన దు:ఖం
వర్గప్రయోజనాల ప్రత్యేకతనే తొడుక్కుంటుంది

కుటుంబ అనుబంధాలూ
కుటుంబం కోసం కనే కలలూ
వసుధైక మానవ అనుబంధాలతో
సకల మానవాళికై కనే కలలతో
పోటీ పడడమే విచిత్రం!

నిస్వార్థుల దేహాలపై
స్వార్థపు విజయ కేతనాన్నెగరేమాలని
విఫలయత్నం!

మేమంటామూ
స్వంతాస్తుల దు:ఖం లేని సమాజంకై
ఒరిగి ఎదిగిన ఆ హిమాలయాల ముందు
స్వార్థపు ఈకలు తలవంచాల్సిందే
కుటుంబ స్వార్థాల్ని చీల్చుకుని
వారికై పొంగిపొరలే జీవనదుల్లో
సంకుచిత స్వార్థాల కన్నీటి ధారలు
ఇంకి పోవాల్సిందే

*

పరిచయం ◆ ఆర్. శశికళ

# తొలి సోవియట్ మహిళా విద్యావేత్త

ఎన్. కె. కృపస్కయా
(1869-1939)

సెయింట్ పీటర్స్‌బర్గ్‌లో ఫిబ్రవరి 14వ తేదీ 1869 న కాన్‌స్టాంటిన్ క్రూప్‌స్కి దంపతులకు ఎన్.కె.కృపస్కయా జన్మించారు. తల్లి ధనికుల ఇండ్లల్లో తాత్కాలిక ఉపాధ్యాయినిగా పనిచేసేది. తండ్రి మిలటరీ ఆఫీసర్. ఆయన పశ్చిమ దేశాల్లోని సోషలిస్టు ఉద్యమాలను గురించి ఎన్నో విషయాలు చదివాడు. రాజరిక పాలన పట్ల అసంతృప్తితో రగిలిపోయే ఆఫీసర్లలో ఆయన కూడా ఒకరు. మిలటరీ జుడీషియల్ అకాడమిలో శిక్షణ పూర్తికాగానే 'డిస్ట్రిక్ట్ అడ్మినిస్ట్రేటర్'గా అతన్ని పోలెండుకు పంపించారు. ఇతర జారిస్టు ఆఫీసర్లు స్థానిక ప్రజలపై దుర్మార్గమైన అణిచివేతను అమలు చేసేవారు. కృపస్కయా తండ్రి అటువంటి విషయాలను వ్యతిరేకించేవాడు. కృపస్కయా 14 ఏళ్ళ వయసులో ఆయన మరణించాడు. తండ్రి ఆలోచనలు తనను ఎంతగానో ప్రభావితం చేశాయని కృపస్కయా తన రచనల్లో ఉదహరించారు.

1886లో సెకండరీ విద్యను అభ్యసించి, తర్వాత ఉపాధ్యాయ శిక్షణ పూర్తి చేసిన తర్వాత "వర్కర్స్ సండే ఈవినింగ్ స్కూల్"లో పనిచేశారు కృపస్కయా. తల్లితో పాటు చిన్నతనం నుండే విప్లవ కార్యాచరణలో భాగమయ్యారు. 1891నుండి 1896వరకూ కార్మికుల్లో పనిచేస్తూ వారితో కలిసి రాజకీయ విద్యావిషయాలను అధ్యయనం చేశారు. చురుకైన రాజకీయ కార్యకర్త కావటం వలన 1896లో అరెస్టు చేశారు.

1893లో లెనిన్ సెయింట్ పీటర్స్‌బర్గ్‌కు వచ్చారు. అప్పటికే వారివురూ పూర్తిస్థాయి మార్క్సిస్టు విప్లవకారులు వారిని కార్యాచరణ దగ్గరికి చేర్చింది. అప్పటికే ఆమె పూర్తిగా పోలీసుల నిఘాలో పనిచేయాల్సి వచ్చేది. వాళ్ళ రిపోర్టుల్లో "ఆమె మేధావులకు, కార్మికులకు సంధానకర్తగా పార్టీవ్యవహారాలను కార్మికులకు చేరవేస్తోంది" అని వ్రాసుకొన్నారు.

ఆమె సాహసోపేతమైన విప్లవకారిణి, లెనిన్‌కు ఆప్తమిత్రురాలేకాదు. జీవిత సహచరి. మొట్టమొదటి మార్క్సిస్టు ఉపాధ్యాయురాలు. సోషలిస్ట్ విద్యావ్యవస్థ నిర్వహణ, నిర్మాణంలో ఆమె అద్వితీయమైన స్థానం పొందినది.

లెనిన్, కృపస్కయా లాంటి దంపతులు ప్రజల సుఖసంతోషాలకోసం ఎన్నెన్నో త్యాగాలు చేసిన వాళ్ళు. అటువంటి అరుదైన వ్యక్తుల జీవితం అధ్యయనం చేయటం ఓ సామాజిక అవసరం.

'ఇస్క్రా'న్యూస్ పేపర్ ఎడిటర్‌గా, సెక్రటరీగా, బోల్షివిక్ పార్టీ కార్యకర్తగా ఆమె ఎంతో చురుకైన కీలకమైన పాత్ర పోషించారు. 'సమర స్కయ గెజిటా'లో శిశు విద్యకు సంబంధించిన ఎన్నో విషయాలపై వ్యాసాలు వ్రాశారు. లెనిన్ పలు సందర్భాలలో ఇచ్చిన విలువైన ఉపన్యాసాలు, వ్యాసాలు, ప్రకటనలు ముఖ్యంగా కళలు, సంస్కృతి, విద్యా విషయాలపై ఆమె సేకరించి కూర్చారు. అందరికంటే చాలా దగ్గరి వ్యక్తిగా ఆయన కృషిని, శక్తియుక్తులను మహత్తర సోషలిస్టు విప్లవం విజయవంతం కావడానికి ఆయన పడ్డ తపనను, ఆయన జీవిత విశేషాలను వ్రాసిన మొట్టమొదటి సోవియట్ విద్యావేత్త, రచయిత్రి కృపస్కయా. "ది రోడ్ బిహైండ్ అజ్" 10 వాల్యూంలలో కృపస్కయా ఎన్నో విద్యా శిక్షణలకు సంబంధించిన అంశాలు పొందుపరిచారు.

1896లో ఆమెను అరెస్టు చేసి 'ఊఫా'కు పంపారు. అప్పటికే సైబీరియాలోని సుషెన్‌స్కోయ్ అనే గ్రామంలో లెనిన్ ప్రవాసంలో ఉన్నాడు. అధికారుల పర్మిషన్‌తో ఆమె లెనిన్ దగ్గరకు వెళ్ళింది. అప్పటికి ఆయన వ్రాస్తున్న "డెవలప్‌మెంట్ ఆఫ్ క్యాపిటలిజమ్ ఇన్ రష్యా" వ్రాత ప్రతిని కాపీ చేసింది. బ్రిటీష్ మేధావులైన బీట్రిస్ మరియు సిడ్నీ వెబ్‌ల పుస్తకాలు 'థియరీ అండ్ ప్రాక్టీస్ ఆఫ్ బ్రిటీష్ ట్రేడ్ యూనియనిజమ్' పుస్తకాన్ని అనువాదం చేయటంలో తన తోడ్పాటు నందించింది.

లెనిన్ సలహాతో ఆ సమయంలోనే ఆమె తన మొట్టమొదటి పుస్తకం "ది ఉమెన్ వర్కర్" పూర్తి చేశారు. అందులో కార్మిక స్త్రీల దుర్భరమైన జీవిత స్థితిగతులను వారి పిల్లల విద్యను గురించి ఆందోళన, ఆవేదన వ్యక్తం చేశారు.

ప్రవాసానంతరం ఆమె 'మూనిచ్' లో లెనిన్‌ను కలుసుకుంది. పార్టీ రహస్య పత్రిక "ఇస్క్రా"లో వందలాది ఉత్తరాలను ఆమె 'ఎన్‌కోడ్' చేసేది. నిరంతరాయంగా రష్యన్ సోషల్ డెమోక్రాటిక్ సంస్థలన్నింటితో సమాచారం నెరుపుతూ ఉండేది. 1903, 1905 లల్లో జరిగిన రష్యన్ సోషల్ డెమాక్రాటిక్ పార్టీ రెండవ, మూడవ కాంగ్రెస్ ఏర్పాటులో చురుకైన పాత్ర పోషించారు. 1905-1907లో జెనీవాలో ఉన్నపుడు అనేక ఇతర దేశ భాషలు నేర్చుకొని అక్కడి పాఠశాలలు సందర్శించారు. 1910-12లో పారిస్ దగ్గర్లో లాంగ్ జమేయులో లెనిన్ పార్టీ స్కూల్ స్థాపించాడు. ఆ సమయంలో కృపస్కయా పార్టీ స్కూల్‌లో బోధిస్తూ ఉండేది.

1914లో లెనిన్ చొరవతో 'రాబోట్ నిట్సా' (ఉమెన్ వర్కర్) పత్రిక స్థాపించి ఎన్నో విలువైన వ్యాసాలు వ్రాశారు.

1915లో బెర్నెలో జరిగిన ఇంటర్నేషనల్ ఉమెన్ కాన్ఫరెన్స్‌లో రష్యా తరపున పాల్గొన్న ఏకైక బోల్షివిక్ మహిళా ప్రతినిధి కృపస్కయా.

1913లో 'పబ్లిక్ ఎడ్యుకేషన్' పై ఆల్ రష్యా కాంగ్రెస్ సమావేశంలో స్కూల్ విద్య, ఉపాధ్యాయ శిక్ష, బోల్షివిక్ దృక్పథంలాంటి అంశాలపై లెనిన్‌తో కలిసి ఎనిమిది వ్యాసాలను ప్రావ్దాలో ప్రచురించారు.

విద్యా విషయాలపై ఎంతో విస్తృతంగా అధ్యయనం చేసిన కృపస్కయా 1915లో "పబ్లిక్ ఎడ్యుకేషన్ మరియు డెమోక్రసీ" అనే పుస్తకం వ్రాసి 1917లో ప్రచురించారు. నూతన విద్యా వ్యవస్థ కోసం విలువైన విషయాలు ఆమె అందులో చర్చించారు.

యువ కార్మికుల కోసం 'సోషలిస్ట్ లీగ్స్' స్థాపనలో ఆమె ఎంతో కృషి చేశారు. 'పయనీర్ ఆఫ్ ద యూత్ మూవ్‌మెంట్' అని అంటారు. యువకులకు స్నేహితురాలు, ఉపాధ్యాయిని, విప్లవ కార్యకర్త. గ్రేట్ అక్టోబర్ సోషలిస్ట్, విప్లవానంతరం ఆమె రాజకీయ విద్యావ్యవహారాలలో కొత్త శకం ప్రారంభమైంది. నూతన విద్యా వ్యవస్థను ఎలా ఏర్పాటు చేసుకోవాలో ఎవరికీ ఏమీ తెలియని స్థితి. ఇటువంటి స్థితిలో కృపస్కయా జ్ఞానం, అనుభవం సోషలిస్ట్ విద్యావ్యవస్థ నిర్మాణంలో ముఖ్యమైన భూమిక పోషించాయి.

అనటోన్ ల్యూనాచార్ స్కీ, సుహామ్లిన్ స్కీ, మకరెంకో లాంటి ఎందరో విద్యావేత్తలు ఆమె జ్ఞానం నుండి స్ఫూర్తి వంతమైన ప్రయోగాలు చేశారు. అప్పటికి రష్యాలో 75% మంది నిరక్షరాస్యులు. 47జాతులకు లిపిలేదు. 1917లో పెట్రోగ్రాడ్ వ్యోబోర్గ్ డిస్ట్రిక్టు డ్యూమా మెంబర్‌గా సాంస్కృతిక, విద్యా విషయాల విభాగం అధిపతిగా పనిచేశారు. 1929 వరకు రష్యన్ సోవియట్ ఫెడరేటివ్ సోషలిస్ట్ రిపబ్లిక్ ప్రజల కమిస్సార్‌గా, 1939 వరకూ విద్యాశాఖ డిప్యూటి పీపుల్స్ కమిస్సార్‌గా కృపస్కయా పనిచేశారు.

ఆమె యునైటెడ్ స్టేట్స్ ఆఫ్ అమెరికా, యు.కె., జర్మనీ, ఫ్రాన్స్, ఇతర పశ్చిమ దేశాల్లో అమలులో ఉన్న విద్యా విధానాన్ని పరిశీలించారు. ప్రఖ్యాత విద్యావేత్తలైన రూసో, పెస్టాలజీ, కొమినియస్, టాల్‌స్టాయ్, డోవీ లాంటి వారి రచనలతో పాటు కారల్ మార్క్స్ ఆలోచనలు, లెనిన్ ఆలోచనా విధానం కలగలిపి అనేక నూతన ప్రయోగాలు చేశారు కృపస్కయా.

ఆమె అత్యద్భుతమైన 'పాలిటెక్నిక్ లేబర్ ఓరియెంటెడ్ విద్యావిధానం'

నివేదిక

◆ వేపలపర్తి సుభాషిణి

# గుంటూరులో 'మనలో మనం' రచయిత్రుల ఉమ్మడి వేదిక రాష్ట్రస్థాయి సదస్సుపై నివేదిక

నవంబర్ 15,16 తేదీలలో ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయం డైక్‌మన్ ఆడిటోరియంలో 'మనలో మనం' రాష్ట్రస్థాయి రచయిత్రుల ఉమ్మడి వేదిక సమావేశాలు జరిగాయి. 2009 జనవరిలో తొలుత సమావేశమైన ఈ వేదిక నాలుగవ సారి సమావేశాలు గుంటూరులో నిర్వహించారు.

తొలిరోజు సమావేశానికి రాజ్యలక్ష్మి తొలి పలుకులు పలుకగా, విష్ణుప్రియ గీతాలాపనతో ఆరంభమైంది. రత్నమాల సదస్సు లక్ష్యాలు తెలిపారు. వాకపల్లి బాధిత మహిళ సిత్తాయి నుండి రచయిత్రులు నేర్చుకోవాల్సి ఉందని ఆమె అన్నారు. ఘర్షణ లేని ఐక్యత అనారోగ్య ఐక్యతకు దారి తీస్తుందన్నారు. సమావేశానికి అధ్యక్షత వహించిన మహిళా అధ్యయన కేంద్రం నిర్దేశకురాలు ఆచార్య టి. సత్యవతి మాట్లాడుతూ స్త్రీ తన సమస్యను అర్థం చేసుకుని ఆ సమస్య నుండి బయటపడాలన్నారు. 80వ దశకం తరువాత లైంగిక జీవితాలు, గ్లోబలైజేషన్ గురించి యివాళ స్త్రీలు ఆలోచిస్తున్నారు. 90వ దశకంలో స్త్రీ స్వేచ్ఛ, హక్కులు గురించి స్పందన మొదలైంది. స్త్రీల పట్ల సాగుతున్న వివక్షను ఎత్తిచూపడం జరిగింది. స్త్రీ సాంస్కృతికంగా సమానత్వం కోసం చేసే పోరాటమే స్త్రీవాదమని ఆమె అన్నారు.డా. హేమా పరిమి నిరంతరం ప్రశ్నించటం ద్వారా ఉపాయాన్ని కనుగొనాలన్నారు. స్త్రీల సమస్యలు తెలిసినా ప్రపంచం గడుసుగా ఉపేక్షిస్తుందని వాడ్రేవు వీరలక్ష్మీదేవి అభిప్రాయపడ్డారు. ముఖ్యఅతిథిగా విచ్చేసిన డా. చల్లపల్లి స్వరూపరాణి "మగ రచయితలు ఒళ్ళు దగ్గరపెట్టుకుని రాసేలా స్త్రీవాద రచనలు చేశాయి. మానసిక దాడి, దాడుల స్వరూపం పెరిగిపోతుంది. స్త్రీవాద రచనలను పాఠ్యాంశాలుగా పెట్టినా నిచ్చెనమెట్ల సమాజంలో యింకా దాడులు జరుగుతున్నాయి. యుద్ధం యుద్ధం కోసం కాదు శాంతి కోసమని "తమ ప్రసంగంలో పేర్కొన్నారు.

మొదటి సెషన్

బి.సి. స్త్రీల సాహిత్య సదస్సు జరిగింది. కె. వరలక్ష్మి అధ్యక్షత వహించారు. అని శెట్టి రజిత బి.సి. రచయిత్రుల నవలల గురించి పత్రం సమర్పించారు. 1960,70 దశకాల నుండీ 1980వ దశకం దాకా బి.సి. రచయిత్రులు నవలలు రాశారు. 2000 సంవత్సరంలో భార్గవీరావు సంపాదకత్వంలో వచ్చిన 'నూరేళ్ళ పంట' కథా సంకలనంలో ఒక్క బి.సి. రచయిత కనిపించకపోవడం విచారకరమన్నారు. పి. సరళాదేవి

---

విలువైన రచన. 1917 నాటికి అనేక విద్యా విషయాలలో 40 విలువైన రచనలు ప్రచురించారు. ఈ రచనలు మార్క్సిస్టు విద్యా తాత్విక అభివృద్ధికి సహాయకరమైనవి. రాజకీయ విద్యా విషయాల నిర్వహణలో ప్రధాన భూమిక పోషిస్తూ 3000 కరపత్రాలు, ఆర్టికల్స్, సమీక్షలు, పుస్తకాలు ప్రచురించారు.

ధనికుల విద్యా విధానాన్ని నిరసిస్తూ, కార్మిక విద్యా విధానం అభివృద్ధి చేయుటంలో ఎనలేని కృషి చేశారు కృపస్కయా. నూతన విధానంలో ఉపాధ్యాయుల పాత్ర చాలా ప్రధానమైనది.

"ఈ నిరక్షరాస్యత అనే చీకటిని పారద్రోలకుండా ఆర్థిక, సాంస్కృతిక పురోగమనం సాధ్యమెలా అవుతుంది" అన్నారు. 1920లో ఆల్ రష్యన్ ఎక్స్‌ట్రార్డినరీ కమీషన్ ఫార్ ఎరాడికాషన్ ఆఫ్ ఇల్లిటరసీ", 1923లో డౌన్ విత్ ఇల్లిటరసీ అనే వాలంటరీ సంస్థ ఏర్పాటు చేశారు.

"వర్గ స్వభావం అంతర్గతంగా ఉన్న విద్యా వ్యవస్థను రద్దు చేయకపోతే, సోషలిస్ట్ విద్యా వ్యవస్థ నిర్మాణం అసాధ్యం" అన్నారు కృపస్కయా. "ఎంతకాలమైతే పాఠశాలల నిర్వహణ బూర్జువా వర్గం చేతుల్లో ఉంటుందో అంతకాలం వృత్తి విద్యా పాఠశాలలు మాత్రమే కార్మిక వర్గ ప్రయోజనాల కోసం, సమాజం మార్పువైపు నిర్దేశించే పనిముట్టుగా, ఆయుధంగా పని చేయాల్సి ఉంటుంది" అన్నారు కృపస్కయా.

ఆమెలోని విద్యా తాత్వికత సోవియట్ విద్యా పాలసీలోని అన్ని అంశాలపై ప్రభావం చూపింది. మౌలిక సూత్రాల నుండి పాఠశాలల నిర్వహణ, యాజమాన్యం, విద్యా ప్రణాళిక, ఉపాధ్యాయుల శిక్షణ, వయోజన విద్య. నిరక్షరాస్యత నిర్మూలన లేబర్ - ఓరియెంటెడ్ విద్యా విధానం, పాలిటెక్నిక్ విద్యా విధానం లాంటి అంశాలకు ఆమె రచనలు దోహదం చేశాయి.

విద్యపై ఆమె ఉపన్యాసాలు, రచనల్లో ప్రధానంగా ప్రతిఫలించే అంశాలు:-

యువకులను సంఘటితం చేయటం, యూత్ లీగ్‌ల నిర్మాణం యువ కార్మికుల కోసం రాజకీయ విద్యా శిక్షణలు, యువతపై లెనిన్ ఆలోచనలు, ఆచరణ, అవగాహన లాంటి అంశాలు ఉన్నాయి. స్వతంత్రంగా అధ్యయనం చేయటం ఎలా? స్వతంత్రంగా అధ్యయనం చేసే వాళ్ళు తమంతట తాము గుర్తుంచుకోవాల్సిన అంశాలు, పాఠశాల విద్య, పాలిటెక్నిక్ విద్య - వృత్తి విద్యల్లో లెనిన్ పాత్ర, పిల్లలకేం బోధించాలి ? లెనినిజమ్ పాఠ్యాంశాల్లో లేదా పాఠ్య ప్రణాళికల్లో అధ్యయన ఆవశ్యకత లాంటి అంశాలే కాక విద్యా శిక్షణలు, చిన్నపిల్లల సంస్థలు, అంతర్జాతీయ వాదులుగా పిల్లలు మారేందుకు అవసరమైన పుస్తకాలు, అన్ని విధాలుగా పిల్లలను అభివృద్ధి చేసే పద్ధతుల గురించి నిరంతర అధ్యయనం - లెనిన్ మార్క్స్‌నెలా అధ్యయనం చేశారు? ఆయన ఉపయోగించిన శాస్త్రీయ విధానం ఎటువంటిది లాంటి ఇంకా విషయాలపై ఆమె విస్తృతంగా వ్రాశారు.

కార్మికుల కోసం - శ్రమతో కలగలసిన విద్యా విధానం - శిక్షణపై యువకుల కోసం ఉపాధ్యాయుల కోసం ఎన్నో వ్యాసాలు వ్రాశారు కృపస్కయా. ముఖ్యమైన రచన "ఆన్ లేబర్ - ఓరియంటెడ్ ఎడ్యుకేషన్ అండ్ ఇన్‌స్ట్రక్షన్" ప్రపంచ విద్యావేత్తల మన్ననలను అందుకొన్నది. రష్యా ప్రభుత్వం విలువైన ఆమె విద్యారంగ కృషిని గుర్తిస్తూ 1929లో ఆర్డర్ ఆఫ్ రెడ్ బానర్ ఆఫ్ లేబర్, అలాగే ఆర్డర్ ఆఫ్ లెనిన్ 1933లో బహుకరించి గౌరవించింది. యు.ఎస్.ఎస్.ఆర్ అకాడమీ ఆఫ్ సైన్సెస్‌లో గౌరవ అకడమీషియన్‌గా 1931లో ఎన్నుకోబడ్డారు. అనేక దేశాల్లో ఆమె రచనలు అధ్యయనం చేస్తున్నారు. విద్యా వ్యాప్తికి కృషి చేస్తున్న వ్యక్తులకు, సంస్థలకు యునెస్కో 1969 నుండి - ఎన్.కె. కృపస్కయా పేరుతో బహుమతి ప్రదానం చేస్తోంది. శిక్షణ, బోధనల్లో శ్రమ అనేది ఒక ప్రధానమైన అంశంగా ఉండాలి. పిల్లలకు నేర్పాలి. అత్యుత్తమమైన వ్యక్తులుగా విద్యార్థులు రూపుదిద్దుకోవాలి. ఒక నూతన అంతర్జాతీయ సోషలిస్ట్ మానవుడు ఆవిష్కరింపబడాలనేది ఎన్.కె. కృపస్కయా ప్రగాఢమైన ఆశయం. అర్థవంతమైన వ్యక్తిత్వ అభివృద్ధి అనే అంశానికి కమ్యూనిస్టు భావాలను సృజనాత్మకంగా, శాస్త్రీయంగా విద్యా విధానానికి అన్వయింపజేయాలని ఎన్.కె.కృపస్కయా అంటారు. ఈ ప్రపంచం ఆమె భావాలతో ప్రభావం అవుతుంది. ప్రపంచ విద్యావేత్తల్లోనే అత్యుత్తమమైన ఈ సోవియట్ మహిళా విద్యావేత్త స్ఫూర్తిని, రచనలను అధ్యయనం చేయాల్సిన అవసరం ఉంది.

*

'చిగురు' నవలలో అస్వాతంత్రపు స్త్రీల చిత్రీకరణ కనిపిస్తుంది. పెళ్ళి అనే ఉత్సవ కార్యక్రమంలో పితృస్వామ్య వ్యవస్థ చట్రంలో పురుషుడు కూడా ఒక చెడిపోయిన యంత్రంగా మారడం జరుగుతుంది. మూడవసారి పెళ్ళికి సిద్ధమైన వాడితో విమలకు పెళ్ళవుతుంది. దరిద్రులకు ఆశలేమిటి? మొగుడనేవాడొక దిక్కు అని విమల పాత్ర అంటుంది. ఆధిక్య స్థానంలో ఉన్న మగవాడికి ఏ లక్షణాలున్నా పెళ్ళి జరిగిపోతుంది. గోదావరి జిల్లాకు చెందిన రచయిత్రి కె. వరలక్ష్మి నవలా రచనలో నైపుణ్యం కనిపిస్తుంది. 'ప్రశాంతి', 'ఉషోదయం', 'కిడ్నాప్', నవలలు రాశారు. దగాపడిన తల్లులు, మోసపోయిన చెల్లెళ్ళు, అభ్యుదయ భావాలు ఈమె రచనల్లో కనిపిస్తాయి.

బి.సి. స్త్రీల కథాసాహిత్యం గురించి త్రివేణి పత్రం సమర్పించారు. 1980లో సామాజిక పరివర్తన ద్వారా బి.సి. స్త్రీలు కథారచన చేయడం మొదలుపెట్టారు. వారి రచనల్లో వాస్తవికత, సహేతుకత, పరిశీలన కనిపిస్తుంది. కులవృత్తుల ప్రాధాన్యం కూడా వారి రచనల్లో కనిపిస్తుంది. బొమ్మాహేమాదేవి 1950ల నుండీ కథారచనలోకి అడుగుపెట్టింది. అయితే ఆ రచనలన్నీ పుస్తకాలుగా రాలేదు. 'నవతరం', 'అన్నపూర్ణ', 'కమ్లీ', 'ఛోటీ ఛోటీ బాతే' ఆమె రాసిన కథలు పి. సరళాదేవి 1960ల నుండీ రచనలు చేస్తున్నారు. 'కుంకుమ రేఖలు' రచించారు. కథాకల్పన రచయిత్రుల్లో అగ్రగణ్యులు. కథను ఉత్తమ ఆత్మసాధనగా చేసుకున్నారు. పాత - కొత్తల మధ్య నల్గుతున్న యువతుల భావాలను తమ రచనల్లోకి చొప్పించింది. కె.వరలక్ష్మి వందకు పైగా కథలు రాశారు. ఆమె రచనల్లో సామాజిక అభ్యుదయం, వర్గభేదాలు లేని సమసమాజం కోసం ఆకాంక్ష కనిపిస్తాయి.'జీవరాగం' కథలో ఏడెనిమిది సంవత్సరాల పాప బాలిగాడికి దొరుకుతుంది. ఆ పాపను పొందాక అతడు మానవత స్పర్శను పొందుతాడు. పాప అమ్మ బాలిగాడికి అమ్మకు పర్యాయపదంలా అనిపిస్తుంది. 'మట్టిబంగారం' కథలో గొల్లకులం వారి జీవనచిత్రణ కనిపిస్తుంది. కులవృత్తులు మానేసిన వారి జీవన భృతి ఎలా ఉంటుందోనని 'తూర్పున మేకపాలు ఒలకబోసినట్లుందని' పదప్రయోగంతో చిత్రిస్తారు. 'అతడు - నేను' కథలో మనకున్న ఈ జీవితం ఏడ్వడానికి కాదు నిస్సహాయులను ప్రేమించడానికంటారు. శీలా సుభద్రరాజు 'దేవుడి బండ' కథలో రోడ్డు పక్కన చెత్త ఏరుకునే వారి జీవితం, రోలు చెక్కేవారి జీవితం కనిపిస్తాయి. చాలా వివాహాలు లాటరీల్లా ముగుస్తాయని తమ రచనలో వ్యక్తం చేస్తారు. ఆర్థిక స్వేచ్ఛ లేని జీవితాలు, కురూపి ముందు ఎంతటి సౌందర్యవతి అయినా పరాజితులు కావడం ఈమె రచనల్లో కనిపిస్తాయి. అనిశెట్టి రజిత కవయిత్రిగా పరిచితురాలు, ప్రతిఘటన, వాస్తవ దృక్పథంతో రచనలు చేశారు. 'మట్టిబంధం' కవితలో పల్లె జీవితం ప్రతిబింబిస్తుంది. పల్లెలో చాకలి, మంగలి, గౌండ్ల, మాల, మాదిగ.....యిలా కులం పట్టింపులున్నా ప్రేమాభిమానాలతో సమిష్టి జీవన సంస్కృతిని కలిగి ఉంటారని తమ రచనలో చూపుతారు. 'గాజులు', 'రాజవ్వ', 'సజిత' కథలు రాశారు. 'కొత్తపాట'లో చేనేత వారి యిబ్బందులు కవిత్వీకరిస్తారు. కథా వస్తువుకే ఈమె ప్రాధాన్యతనిస్తారు.

తాయమ్మ కరుణ అసలు పేరు పద్మ. నల్గొండ తాటికల్లు నివాసి. 'ఛాత్రిబాబుకు ముత్యాలమ్మ నివాళి' అనే రచన చేశారు. గత జీవిత అనుభవాల వెలుగుల నుండి నూతన జీవన సృష్టి చేయవచ్చని ఆమె రచనల్లో తెలుపుతారు. ఆమె కథలను సమాజ ఆచార, వ్యవహారాలకు సంబంధించిన కథలుగా కె.శివారెడ్డి పేర్కొంటున్నారు. ఒకానొక కొత్త చూపుతో, కొత్త దృక్పథంతో ఆమె రాసిన రచనలను చూడవచ్చు. కుటుంబహింసను ఎలా ఎదుర్కోవాలో ఈమె కథల్లో చూడవచ్చు. మాతృత్వానికి ప్రాధాన్యతనిచ్చే అంశం పి. రాజ్యలక్ష్మి 'క్షమించు' కథలో కనిపిస్తుంది. అనువాద రచయిత్రి కొక్కుల పద్మావతి మెట్టినిల్లు జగిత్యాల. మరాఠీ కథలు తెలుగులోకి రాశారు. 'అరుందాతావలే' కథను 'అతని కథ'గా అనువదించారు. ఇందులో దళితుడు కథానాయకుడు. తాను కుండలో నీళ్ళు గ్లాసుతో ముట్టుకుంటే ఎవరూ ముట్టుకోరు. మరి తను తాకుతున్న భూమిని అందరూ తాకుతున్నారు కదా. అని ప్రశ్నిస్తాడు. జి. విజయలక్ష్మి, నాగమ్మ పూలే, లలిత కథలు రాశారు.

మందరపు హైమవతి కవయిత్రిగా సుపరిచితురాలు. కె.గీత నెలసరి బాధలను కవిత్వీకరిస్తారు. ఆడపిల్ల అనగానే అట్లపెనం గుర్తొచ్చే సంస్కృతి మానాలంటారు. శీలా సుభద్ర 'యుద్ధం ఒక గుండె కోత' దీర్ఘకవితా సంకలనం వెలువరించారు. చేనేత బాధితులను గురించి చెబుతూ అగ్గిపెట్టెలో ఆరు గజాల చీరను దాచినట్టుగా అవమానాలను దాచిపెట్టమంటారు ఓ కవితలో, ఎన్. అరుణ విత్తనంలో నిద్రిస్తున్న మొలకలాగా 'మౌనమూ మాట్లాడుతుందంటారు. అని శెట్టి రజిత 'ఉసురు', 'గులాబీలు జ్వలిస్తున్నాయి', 'దస్తఖత్' (హైకూల సంపుటి) రచనలు వెలువరించారు. దళితులు, పీడితులు ఆమె కవితా వస్తువులు. డాలర్ల వ్యామోహంతో వృద్ధాశ్రమాలు పెరిగి పోవటంతో ఎంత నకిలీలు ఈ మదర్స్‌డేలు అని నిరసన వ్యక్తం చేస్తారు. మందరపు హైమవతి 'నిషిద్ధాక్షరి' కవితా సంకలనం వెలువరించారు. ఆడపిల్ల అని లింగనిర్ధారణ పరీక్షలో తెలిసాక వారికి జన్మనివ్వకుండా చేస్తే వారే నిషిద్ధాక్షరి అవుతారని, కన్యాశుల్కం పునరావృతమవుతుందని కవిత్వీకరిస్తారు. ఈ దేశంలో కొన్ని కులాలవారికి యిళ్ళు అద్దెకు దొరక్కపోవడం గురించి ఆమె కవిత్వీకరించారు. దుర్గాబాయి 'చూపు' కావ్యం, పి. సుజనారామం 'మౌనభాష్పం' కావ్యం వెలువరించారు.కె. వరలక్ష్మి, జ్వలిత, హిమజ, జి. విజయలక్ష్మి, కొలిపాక శోభారాణిల కవిత్వాన్ని ఉదహరించారు.

బి.సి. స్త్రీల వ్యాసం గురించి పి. సుజనారామం పత్రం సమర్పించారు. ఆమె ప్రసంగిస్తూ గతంలో సామాజిక అవసరాలన్నీ స్త్రీల వల్లనే తీరుతుండేవి. మాతృస్వామ్య వ్యవస్థ అయిపోయాక పితృస్వామ్య వ్యవస్థ మొదలైంది. వివాహం పురుషులకు ఒక చక్కని పనిమనిషిని కల్పించిందన్నారు. జీవితం లేని సంఘ బానిస- స్త్రీ అన్న చలం మాటలను ఉటంకించారు. శీలా సుభద్రాదేవి, వంగర త్రివేణి, పి. శర్వాణి, అనిశెట్టి రజిత, మందరపు హైమవతి, జ్వలిత వ్యాసాలు రాశారు.

**రెండవ సెషన్**

రెండవ సెషన్‌లో కోస్తాంధ్ర స్త్రీల సాహిత్యంపై సదస్సు జరిగింది. శిలాలోలిత అధ్యక్షత వహించారు. మాధవి, నల్లూరి రుక్మిణి, శ్రీదేవి వక్తలుగా పాల్గొన్నారు. కోస్తాంధ్ర కథా రచయిత్రుల గురించి శ్రీదేవి ప్రసంగించారు.

పితృస్వామిక వ్యవస్థలో వివక్ష చూపే మొదటి అంశం చదువు అని పేర్కొన్నారు. ఈ నేపథ్యంలో వచ్చిన కథలను క్లుప్తంగా పరిచయం చేశారు. వాసిరెడ్డి సీతాదేవి 'మరీచిక' నవలను మాధవి విశ్లేషించారు. యువత హిప్పీయిజం లేదా నక్సలిజాన్ని ఎంచుకునే స్థితిగల పరిస్థితుల్లో వాసిరెడ్డి సీతాదేవి రచనలు చేశారు. శబరి, జ్యోతి స్నేహితులు, శబరి హిప్పీయిజంలోకి, జ్యోతి నక్సలిజంలోకి చేరుతారు. జాన్ అనే హిప్పీకోసం శబరి వెళుతుంది. సత్యం పట్ల అభిమానం పెంచుకోవటంతో అతని ఆజ్ఞమేరకే జ్యోతి నడుచుకుంటుంది. అక్కడా అవే ప్రేమలు, మోసాలు వారు చూస్తారు. ఆకర్షణలు వదులుకుంటేనే వారికి సరైన మార్గం దొరుకుతుందని రచయిత్రి తెలుపుతారని వక్త మాధవి అన్నారు. కోస్తాంధ్ర నవలా సాహిత్యం గురించి నల్లూరి రుక్మిణి ప్రసంగించారు. ఒట్టికొండ

విశాలాక్షి, కోడూరి కౌసల్యాదేవి, శ్రీదేవి, రంగనాయకమ్మ, కృష్ణవేణి, లత, కె. రామలక్ష్మి, మాలతీచందూర్ తదితరుల నవలలను పరిచయం చేస్తూ 1947 నాటి ముందు ఆంధ్ర దేశంలో సాహిత్య నేపథ్యాన్ని వివరించారు. మల్లాది వసుంధరాదేవి 'తంజావూరు పతనం' చారిత్రాత్మక నవల రచించారు. మానసిక, భావ విప్లవానికి నేపథ్యంగా ఉన్న సమయంలో చాలామందిని ఆలోచింపచేసిన రచయిత్రి లత అని శిలాలోలిత అభిప్రాయపడ్డారు. మనకు యిష్టం లేని దాన్ని చాలా పకడ్బందీగా స్త్రీల పేర్లతో రచనలు చేయడం వ్యాపారాత్మక సాహిత్యంలో భాగమైందన్నారు. 1980లలో మొట్టమొదటి స్త్రీవాద కవయిత్రి రేవతీదేవిగా పేర్కొన్నారు. 1992లో 'నీలి మేఘాలు' స్త్రీవాద కవితా సంకలనం వెలువడింది.

కోస్తాంధ్ర స్త్రీల సాహిత్యం (1986-2009) సదస్సుకు నల్లూరి రుక్మిణి అధ్యక్షత వహించారు. డా. కె. సుభాషిణి, అత్తలూరి విజయలక్ష్మి, రంగనాయకి, కాత్యాయని వక్తలుగా పాల్గొన్నారు. కె. సుభాషిణి కోస్తాంధ్ర స్త్రీల కథా సాహిత్యం (1986-2009) గురించి క్లుప్తంగా వివరించారు. కోస్తాంధ్రలోఅభ్యుదయ సాహిత్యం వచ్చింది. రంగనాయకమ్మ సాహిత్యం చదవకుండా ఎవరూ స్త్రీవాద సాహిత్య కారులు కాలేరు. శ్రీశ్రీ తరువాత అంతటి ప్రభావాన్ని చూపించిన రచయిత్రిగా రంగనాయకమ్మను పేర్కొన్నారు. కుటుంబ జీవితంలో భార్యాభర్తల సంబంధం ఎలా ఉండాలనే విషయం రంగనాయకమ్మ రచనల్లో కనిపిస్తుందన్నారు.

కథ, కవిత, వ్యాసం.... సాహితీ ప్రక్రియ ఏదైనా వ్యంగ్యాన్ని ఆశ్రయించి ఆమె రచనలు చేశారని అభిప్రాయపడ్డారు. 'పెళ్ళానికి ప్రేమలేఖ' కథలో ఉత్తరాల ద్వారా కథ నడుస్తుంది. భార్యంటే పాలుతోడుపెట్టేది కాదని విమల పాత్ర చేత తెలియజేస్తారు రచయిత్రి. నెల్లూరు జిల్లాకు చెందిన ప్రతిమ, చంద్రలత, జయప్రద కథలు రాస్తున్నారు. వండి పెట్టడానికి తను, సంపాదనకు తన చెల్లి అని బాధపడే ఓ అక్క కథగా ప్రతిమ 'అక్కయ్యగా' కథను ఉదహరించారు. పి. సత్యవతి ఇల్లలకగానే... 'సూపర్‌మామ్ సిండ్రోమ్' కథలలో అద్భుతమైన శిల్పం ఉందన్నారు. రంగనాయకమ్మకీ, సత్యవతికీ కథారచనలో పోలికలు కనిపిస్తాయని అభిప్రాయపడ్డారు. చలం 'మైదానం' కథకు విరుగుడుగా నల్లూరి రుక్మిణి 'గీతల కావల' కథను పేర్కొన్నారు. సెజ్‌ల నేపథ్యంలో రుక్మిణి రాసిన 'క్వీన్ విక్టోరియా మళ్ళీ నవ్వింది' కథను పరిచయం చేశారు. పి. విజయలక్ష్మి, రాజ్యలక్ష్మి, ఓల్గా కథలను ఉదహరించారు. రాయలసీమకు చెందిన ఆర్. వసుంధరాదేవి 'తాత్విక కథల'ను ప్రత్యేకంగా పేర్కొన్నారు. కారణాలేవైనా వసుంధరాదేవికి రావలసినంత పేరు రాలేదని ఆమె అభిప్రాయ పడ్డారు.

'చూపు' కాత్యాయని కోస్తాంధ్ర స్త్రీల నవలా సాహిత్యం (1989-2009) పై విశ్లేషించారు. రంగనాయకమ్మ, ఓల్గా, పద్మజ, అరుణల నవలలను పేర్కొన్నారు. ఓల్గా 'ఆకాశంలో సగం' నవల గురించి మాట్లాడుతూ ఆమె దళిత మహిళ నాయకత్వంలో భూస్వామ్య స్త్రీలందరూ ఒక్కటై, వారికోసం ఉమ్మడి అవసరమైన పబ్లిక్ లావెటరీ కోసం పోరాడటమనేది అసంబద్ధమైనదిగా అనిపిస్తుందన్నారు. చంద్రలత 'రేగడి విత్తులు' నవలకు తెలంగాణా వాదుల నుండి వ్యతిరేకత వచ్చిందన్నారు. ఎగువమధ్యతరగతి కుటుంబంలో తల్లిదండ్రులకు, పిల్లలకు మధ్య పెరుగుతున్న తారతమ్యాలను ఎలాంటి సంకోచాలుగా తాత్వికంగా లేకుండా వ్రాస్తున్నారు. కుప్పిలి పద్మ వీటి గురించి చర్చించాల్సి ఉందన్నారు. వనజ 'అడవి పుత్రిక', నల్లూరి రుక్మిణి 'నర్రెంక చెట్టుకింద నవలలు వెలువడిన నేపథ్యం గురించి తెలిపారు. సమకాలీన సాహిత్యంలో కోస్తాంధ్ర కవయిత్రుల గురించి అత్తలూరి విజయలక్ష్మి పత్రం సమర్పించారు. రంగనాయకి ఓల్గా 'ప్రయోగం' పై వ్యాసం సమర్పించారు. కాత్యాయని విద్మహే వందన సమర్పణతో సమావేశం ముగిసింది.

16వ తేదీ ఉదయం 10 గంటలకు 1947కు పూర్వం కోస్తాంధ్ర సాహిత్యంపై సదస్సు జరిగింది. కాత్యాయని విద్మహే, కె. శోభారాణి, వైదేహి వక్తలుగా పాల్గొన్నారు. కె. రామలక్ష్మి అధ్యక్షోపన్యాసం చేస్తూ పితృస్వామ్య భావజాలానికి కట్టుబడి ఉన్న వారందరినీ ఒకవర్గంగా, దానిని ఉల్లంఘించిన చేసినవారిని ప్రత్యేకంగా చూశారు. మధ్యయుగాలకాలంలో మొల్ల అనంతర కాలంలో కందుకూరి రాజ్యలక్ష్మి, కొటికలపూడి సీతమ్మ రచనలు చేశారు. పిఠాపురం రాణి చిన్నమాంబగారు కవితాగోష్ఠులు నిర్వహించేవారు. అందులో కొటికలపూడి సీతమ్మ పాల్గొనేవారు. ఆమె రచయిత్రి (ఉపన్యాసకురాలు) 'ఉపన్యాసమంజరి'గా ఆమె ఉపన్యాసాలు వెలువడ్డాయి. బుర్రాసూరమాంబ, వేమూరి శారదాంబ ఆధ్యాత్మిక గ్రంథాలు రాశారు.బాలాంత్రపు శేషమ్మ 'హిందూసుందరి' పత్రిక నడిపారు. 19మంది స్త్రీలు మాత్రమే నిర్వహించిన పత్రిక అది. సాంఘిక దురాచారాలకు వ్యతిరేకంగా, స్త్రీ విద్యకోసం పాటుపడింది. 'గృహలక్ష్మి', 'హిందూ సుందరి' పత్రికలు స్త్రీల ఉన్నతికి కృషి చేశాయి. వాటి ద్వారా స్త్రీ రచయితలు, వ్యాసకర్తలు, విమర్శకులు వచ్చారు. వాటి ద్వారా స్త్రీ రచయితలు, వ్యాసకర్తలు, విమర్శకులు వచ్చారు. కనపర్తి వరలక్ష్మమ్మ జాతీయవాద, లేఖా సాహిత్య రచనలు చేశారు. 'చెట్టునీడ ముచ్చట్లు' రచించారు. ఆత్మూరి అన్నపూర్ణమ్మ 'కుమార శతకం'లో భార్యపట్ల ఉండాల్సిన ప్రవర్తన గురించి కుమారునికి హితబోధ చేస్తుంది.సంఘ సంస్కరణ భావాలు పద్యకవితలో చెబుతారు. భావకవితలు మాని భారతీయులను స్వాతంత్ర్య సమరములోకి రావోయంటారు ఒట్టికొండ విశాలాక్షి. కనపర్తి వరలక్ష్మమ్మ 'లక్ష్మీశతకం' రాశారు. సంఘ సంస్కరణ, స్వాతంత్ర్యోద్యమం గురించి స్త్రీలు రచనలు చేశారని 1947కు ముందున్న చారిత్రక నేపథ్యాన్ని వివరించారు.

స్వాతంత్ర్యానికి పూర్వం కథా సాహిత్యం గురించి కాత్యాయని విద్మహే మాట్లాడుతూ "స్త్రీలు తమ అభిప్రాయాలు వ్యక్తం చేసుకునే నేపథ్యంలోంచి రచయితలుగా అయ్యారు.ఊటుకూరు లక్ష్మీకాంతమ్మ కవయిత్రుల గురించి పుస్తకం రాశారు. కథ విషయంలో కొంత వెనుకబాటు కనిపిస్తుంది. 'భారతి' పత్రికలో స్త్రీ రచనలు అసలు లేవు. 1944లో వచ్చిన 12 సంచికల్లో కేవలం 3 స్త్రీ రచనలున్నాయి. కథలలో సాధారణంగా వివాహానికి సంబంధించిన సమస్యలు, వితంతుసమస్యలు, రజస్వలకు పూర్వ వివాహం, అత్తాకోడళ్ళ సంబంధాలు, పాతివ్రత్యం యిత్యాది అంశాలు కనిపిస్తాయి.

1925 నుంచి వచ్చిన కథల్లో జాతీయోద్యమ ప్రభావం తీవ్రంగా ఉంది. 1902లో బండారు అచ్చమాంబ కథ రాశారు. ఆదుర్తి భాస్కరమ్మ-1926లో 'ప్రభావతి' కథ రాశారు. పదేళ్ళకే వితంతువైన అమ్మాయికి కేశఖండన జరుగుతుంది. చదువుకుంటుంది. వితంతువుగా జీవించటం కంటే మరణించటం మేలని ఆత్మహత్య చేసుకుంటుంది. జాతీయోద్యమంలో పనిచేసే అవకాశం తమకు లేదా అని ఆలోచిస్తుందామె. స్త్రీల ఆలోచనలోని మార్పు గమనించాలి. స్త్రీల శక్తులు వృధాకారాదు. సామాజికాభివృద్ధికి వినియోగం కావాలి. కనపర్తి వరలక్ష్మమ్మ '5 మాసములు-20 దినములు' కథ రాశారు. దుర్గాబాయి 'నే ధన్యనయితిని', 'సుందరి' కథలు రాశారు. పునర్వివాహం చేసుకోవటానికి స్త్రీలకు కూడా చైతన్యం కావాలంటారు సుసర్ల లక్ష్మాంబ. 1930ల తరువాత బాలాంత్రపు త్రిపుర సుందరి స్త్రీలకు స్త్రీలు శత్రువులు కారని చూపించే ప్రయత్నం కూడా చేశారు. నండూరి సుబ్బలక్ష్మీదేవి 'స్త్రీతత్వము' పునర్వివాహానికి సంబంధించిన కథ రాశారు. 1934 మార్చి 13 'గృహలక్ష్మి' పత్రికలో ఆ కథ ప్రచురితమైంది. కూతురు వయసున్న అమ్మాయి తండ్రిని వివాహం

చేసుకుంటుంది. కథలో మగవాడిని మార్చడానికి ఆడవారికి గృహలక్ష్మి అనే పేరుంది. కానీ మగవారికి అలా బిరుదులేవీ లేవు ఎందుకంటే మగవాడికి ఆ సామర్థ్యం లేదంటారు. 1940లో కె. సీతాదేవి 'ఒకరికి సనాతనమూ ఒకరికి సంస్కారమూనా' కథ రాశారు.

1930లలో స్త్రీకోణం నుంచి సాహిత్యాన్ని పరిశీలించాలని కనపర్తి వరలక్ష్మమ్మ, కందాళం కమలమ్మ. బాలాంత్రపు సుందరి వీరు ముగ్గురూ ఒక తీర్మానం చేశారు "స్త్రీలను యిష్టం వచ్చినట్టు చిత్రించకూడదు. అలాంటి పత్రికలను యింటికి రానివ్వకూడదు. వచ్చినా వాటిని చించెయ్యాలి. ఆచించిన వాటితో పిల్లల అశుద్ధాన్ని ఎత్తివేయాలి". ఇందులో స్త్రీల ఆత్మగౌరవం కనిపిస్తుంది.

1947కు పూర్వం కోస్తాంధ్ర నవల గురించి రామలక్ష్మి క్లుప్తంగా వివరించారు. అట్లూరి వెంకట సీతమ్మ, జ్ఞానాంబ, కనకమ్మ, పులవర్తి కమలాదేవి, సుభద్రాంబ, పులగుర్తి లక్ష్మి నరసాంబ తదితరులు నవలారచనలు చేశారు. స్వాతంత్ర్యానికి పూర్వం స్త్రీలు డిటెక్టివ్ నవలలు, అనువాద నవలలు కూడా రాశారు.

1947కు పూర్వం కోస్తాంధ్ర వ్యాస సాహిత్యం గురించి పరిశోధక విద్యార్థిని కె.శోభారాణిపత్రం సమర్పించారు. ఆమె మాట్లాడుతూ 210 వ్యాసాల సమాచారం దొరికింది. 50 వ్యాసాలు లభ్యమయ్యాయి. 180మంది రచయిత్రులు ఉన్నారన్నారు. కనపర్తి వరలక్ష్మమ్మ, జ్ఞానాంబ వ్యాసాలు రాశారు. హిందీ నుంచి తెలుగులోకి అనువదించిన వ్యాసాలు ఉన్నాయి. స్త్రీలు స్త్రీజాతి అభ్యుదయం కోసం ఉపన్యాసాలివ్వడం జరిగింది. అవే వ్యాసాలుగా రావడం జరిగిందన్నారు. 1931, 41లలో వచ్చిన వ్యాసాల్లో జాతీయోద్యమ ప్రభావం ఎక్కువగా ఉందన్నారు. ఇష్టంలేని వైవాహిక స్థితినుంచి ఎలా వైదొలగాలని వ్యాసాలు వచ్చాయి.

డా.కె. శ్రీదేవి కోస్తాంధ్ర వ్యాస సాహిత్యం గురించి పత్రం సమర్పించారు. ఆమె మాట్లాడుతూ "1940ల నాటికి స్త్రీ రచయితలు భావ వ్యక్తీకరణకు వ్యాసాన్ని సాధనంగా చేసుకున్నారు. పురుషులు కోరుకున్న విధంగా స్త్రీలు ఉండేలా రాసిన వ్యాసాలు మొదటిరకం. పురుషులు ప్రోత్సహించిన భావాలు స్వీకరిస్తూనే అభ్యుదయ భావాలున్న వ్యాసాలు రెండవ రకం. స్త్రీవాద ఉద్యమం వరకూ పాశ్చాత్యదేశాల నుండి దిగుమతి చేసుకున్నది స్త్రీవాదమని భావించడం జరిగింది. పురుష కేంద్రక భావజాలం నుండి స్వాతంత్ర్యానికి ముందే స్త్రీలు రాయటం మొదలైంది. స్వాతంత్ర్యానంతర దేశ ఆర్థిక మార్పులు స్త్రీలను ప్రభావితం చేశాయి. స్త్రీ మేధోపథం విస్తృతమైంది. ఊటుకూరు లక్ష్మీకాంతమ్మ, దొప్పలపూడి అనసూయ, కామాక్షి హైమవతి వంటివారు వ్యాసరచన చేశారు. తరువాత తరంలో లత, రంగనాయకమ్మ, మాలతీచందూర్ వ్యాస ప్రక్రియ చేపట్టారు. లత వ్యాసాల సంకలనానికి దేవులపల్లి కృష్ణశాస్త్రి కితాబునిచ్చారు. 1970వ దశకంలో తెలుగు స్త్రీల రచనల్లో విమర్శ కీలకాంశం. ఒక రచనను ఎన్ని రకాలుగా పరిశీలించవచ్చో, విశ్లేషించవచ్చో తెలుస్తుంది. చాలా స్పష్టమైన లక్ష్యనిర్ణయంతో ఈ విమర్శ చేశారు. స్త్రీవాద విశ్లేషణాపద్ధతి యింకా సరిగ్గా రూపొందలేదు. సాదా - సీదా రచనలతో మొదలైన స్త్రీల వ్యాసాలు ఆర్థిక, రాజకీయ రంగంలో పరిణామాలను ఆకళింపు చేసుకొని 4 దశాబ్దాలలో విస్తరిస్తున్న మేధోశక్తియుక్తుల్ని కూడా కోస్తాంధ్ర స్త్రీల వ్యాసాలో చూడవచ్చం"టారు.

డా. వైదేహి అబ్బూరి ఛాయాదేవి రచనలను విశ్లేషించారు. డా. వి. నాగరాజ లక్ష్మి పాటిబండ్ల రజని 'ఎర్రజాబిళ్ళ ఎరీనా' గురించి విశ్లేషించారు.

### క్రైస్తవ స్త్రీల సాహిత్యం

క్రైస్తవ స్త్రీల సాహిత్య సదస్సుకు హేమలత అధ్యక్షత వహించారు. పుట్ల హేమలత, ఝాన్సీ కె.వి. కుమారి, బండారు స్వరూప, కొలకలూరు శివజ్యోతి, లావణ్య వక్తలుగా పాల్గొన్నారు. క్రైస్తవ సాహిత్య నేపథ్యం గురించి హేమలత తెలిపారు. క్రైస్తవ కథ, నవల గురించి పుట్ల హేమలత ఉపన్యసించారు. రచనా ప్రక్రియ చేపట్టిన పలువురు క్రైస్తవ రచయిత్రులు, వారి రచనలనూ పరిచయం చేశారు. సెటీనా సరోజిని వచనకవిత్వం, పాటలు రాశారు. 'మంజుల' ప్రథమ క్రైస్తవ నవలగా పేర్కొన్నారు. మద్రాస్‌కు చెందిన పి. లలిత, వైజాగ్‌కు చెందిన మంజులా జోయెల్, శకుంతలా సంజీవరావు, పిల్లి విజయ ఛార్లెస్, సరళాఫ్రాన్సిస్, కొలుకలూరి స్వరూపరాణి, విజయకుమార్, విజయజ్యోతి, మాధురీ చందూర్ తదితరులు కథారచనలు చేశారు. రాయలసీమకు చెందిన యాదా కమలమ్మ కథలు అలభ్యం. 1974లో ఝాన్సీ కె.వి. కుమారితొలికథ రాశారు. పుట్ల హేమలత 1975లో తొలికథ రాశారు. ఈమె 'గూడు చేరిన గువ్వ'నవల రాశారు. హేమా వెంకట్రావు 'మాదిగ బతుకు' రాశారు. సారా విజయకుమార్ 'మిస్‌పవిత్ర' నవల 1999లో రాశారు. కొలుకలూరి మధుజ్యోతి, కొలుకలూరి ఆశాజ్యోతి, డా. వినోదిని, దళిత్ క్రిస్టియన్ ఫెమినిస్ట్ జెల్లి ఇందిర రచనలు చేస్తున్నారు.

క్రైస్తవ కవిత గురించి బండారు జ్యోతి స్వరూపరాణి మాట్లాడుతూ "క్రైస్తవమతం'తోమా' రాకతో మనదేశంలో మొదలైంది. కొమ్ముకృప, అందె భాగ్యశ్రీ, జీసస్‌మీద, మేరీ మాత మీద గీతాలు రాసింది. విజయ ఛార్లెస్, పుట్ల హేమలత, హేమావెంకట్రావ్, క్రైస్తవ గీతాలు రాశార"న్నారు.

కొలుకలూరి స్వరూపరాణి క్రైస్తవ వ్యాసం గురించి ప్రసంగించారు. ఇంటూరి మరియాంబ, ఈపూరి శిరోమణి, ఎం. లీలావతి, రూత్‌కుమారి, అరుణకుమారి వ్యాసాలు, వ్యాస సంపుటాలు వెలువరించారన్నారు. క్రైస్తవ రచనలు, ఆవశ్యకత అంశంపై ఝాన్సీ కె.వి. కుమారి ఉపన్యసించారు.

క్రైస్తవ మైనారిటీల పైన దాడులు జరుగుతున్న నేపథ్యంలో శాంతికోసం వెలువరచిన 'విశ్వశాంతి - క్రీస్తుశాంతి' పుస్తక పరిచయం చేశారు. క్రైస్తవ నాటకం గురించి పరిశోధక విద్యార్థిని లావణ్య క్లుప్తంగా వివరించారు. మతపరమైన నాటకాలే ఎక్కువగా లభ్యమయ్యాయన్నారు. విజయభాను వందన సమర్పణతో క్రైస్తవ స్త్రీల సాహిత్య సదస్సు ముగిసింది.

అనంతరం'మనలో మనం' ముగింపు సమావేశం జరిగింది. ఈ కార్యక్రమానికి ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయ ఉపకులపతి హరగోపాల్ రెడ్డి ముఖ్య అతిథిగా విచ్చేశారు. పి. సత్యవతి అధ్యక్షత వహించారు. డా.పి. సంజీవమ్మ, డా. కాత్యాయని విద్మహే, జాజులగౌరి, ఆచార్య టి. సత్యవతి సమావేశంలో పాల్గొన్నారు. ఈ కార్యక్రమంలో మహిళా అధ్యయన కేంద్రం ప్రచురించిన విమెన్ అండ్ హర్ విజన్ పుస్తకాన్ని హరగోపాల్‌రెడ్డి ఆవిష్కరించారు. ఆయన మాట్లాడుతూ స్త్రీల హక్కులన్నీ మానవ హక్కులుగా గుర్తించాలంటున్న నేపథ్యంలో గ్రామణ ప్రాంతాలకు వెళ్ళి అధ్యయనం చేసి, వారి సమస్యలకు పరిష్కారాలు కనుక్కోవాలంటారు. పి. సత్యవతి మాట్లాడుతూ రచయిత నుంచి యాక్టివ్‌గా ఎదగడంలో కూడా రచయిత కృషి ఉంటుందన్నారు. రెండు రోజుల సదస్సు గురించి జాజుల గౌరి సమీక్షించారు. అనంతరం 'మనలో మనం' భవిష్యత్ కార్యాచరణపై చర్చించుకున్న రచయిత్రులు వారి వారి గమ్యస్థానాలకు పయనమయ్యారు.

**గమనిక :**
ఈ సంచికలో గుమ్మెటమోత నవల సీరియల్ అనివార్య కారణాల వల్ల అందించలేకపోతున్నాం. - సం.



మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KLVA101M148 |
| పుస్తకం పేరు | అరుణతార |
| తారీఖు | 08 February 2025 |
| ముందు అట్ట | [illegible] |
| వెనుక అట్ట | [illegible] |
| మొత్తం పేజీలు | 109 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | nazma |
| పేజీలు విడదీసినది | Bhanu |
| స్కాన్ చేసినది | shaimila |
| పరీక్ష చేసినది | HASEEMA |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |